# ఘంటసాల చరిత్ర

గొర్రెపాటి వెంకటసుబ్బయ్య

కన్నతల్లికి సాటి,
అన్నపూర్ణకు మేటి,
ఎన్ని తరముల నాటిదో,
మా వూరు
ఎన్ని వరముల తోటిదో !

నార్ల వెంకటేశ్వరరావు

ప్రథమ ముద్రణము
ఆగస్టు — 1947
విపులమైన
ద్వితీయ ముద్రణము
సెప్టెంబరు — 1963

వెల: పది రూపాయలు

ప్రతులకు:
దేశీబుక్ డిస్ట్రిబ్యూటర్సు
శరత్‌బిల్డింగ్సు, విజయవాడ-2

ముద్రణ:
దేశిప్రెస్, విజయవాడ-2





# అంకితము



ఘంటసాల గ్రామ ప్రయోజనానికి,
ప్రతిష్ఠకి పాటుపడిన, పడుచున్న,
పడనున్న వారందరికి సాదరముతో
సమర్పితము.

# విన్నపం

దేశ చరిత్రయొక్క ఆవశ్యకత అధికంగా ఉన్నది. ఏ దేశపు ప్రజలకైనా జాతీయతాజ్ఞాన మేర్పడుటకు, వారికి అనాదినుండి వచ్చిన నాగరికత యొక్క వ్యక్తిత్వమే కారణము. తన దేశముయొక్క పురాతన చరిత్ర, నాగరికతయొక్క జ్ఞానమువల్లనే మానవునకు తన యందును, తన దేశమునందును విశ్వాసము, ఆత్మగౌరవము కలుగును.

మనకు చరిత్రలంటూ లేనేలేవు. చరిత్రాంశములుగల గ్రంథాలు మాత్రము లేకపోలేదు. ఆంగ్లేయులే చరిత్ర రచనకు మనకు మార్గదర్శులయ్యారు.ఆరువేల మైళ్ళనుండి వచ్చిన ఆంగ్లేయుడు అధికారరీత్యా తనకు బాధ్యత లేకపోయినా, మనచరిత్ర సంగ్రహణకు పూనుకొనుట, మన ప్రశంసకు, కృతజ్ఞతకు పాత్రుడు. 1816 లో సర్వే జనరలుగా ఉన్న కర్నలు కాలిన్ మెకంజిగారు మనదేశంలో గ్రామ చరిత్రలు వ్రాయించ పూనుకొనెను. ఆయన ఏలూరు కాపురస్థుడగు కావలి వెంకట బొర్రయ్య గారిని ఈ పనికి నియమించెను. బొర్రయ్యగారు మరి నలుగురను తన చేతిక్రింద వేసుకొని,ఆయా గ్రామస్థులనుండి కైఫీయతులను తీసుకొనెను. వారు కొండపల్లి కాగితములమీద వ్రాసిన గ్రామ చరిత్రలకే, మెకంజి గారు వ్రాయించుటచే మెకంజి మాన్యుస్క్రిప్ట్సు అని పేరువచ్చింది.వీటిని స్థానిక చరిత్రలు అనికూడ అంటారు.

బందరు మొదలగు ప్రాంతాల్లో జిల్లా జడ్జిగా పనిచేసిన సి. పి. బ్రౌనుగారు ఆంధ్ర సాహిత్యానికి చేసినసేవ అధికం. ఆయన పండితులను నియమించి అనేక సంస్కృతాంధ్ర గ్రంధములకు ప్రతులను వ్రాయించి,వాటిని మద్రాసులోని ప్రాచ్యలిఖిత పుస్తక భాండాగారమునకు చేర్చెను. ఇటుల సాహిత్యసేవ చేయుటేగాక, మెకంజిగారు తయారు చేయించిన కైఫీయతులు శిధిలమగుచుండుట గాంచి, వాటిని తిరిగి యెత్తి వ్రాయించి చరిత్రకుకూడ ఆయన అపారసేవ చేసెను. ఈ విధంగా ఆంగ్లేయు లిరువురుచేసిన సేవకు మనమెంతో ఋణపడి యున్నాము. ఆ లేఖలు రికార్డులు చరిత్ర రచనకు అధిక సహాయకారులు.

పూజ్యులకు వారిని స్మరించి, వారి అడుగుజాడలలో పనిచేయు మనసు ప్రతిన పూనాలి.

ఈ విధంగా భరతఖండంలో ఆంధ్రదేశంలోనే ప్రథమంగా చారిత్రక పరిశోధన ప్రారంభమైనది. ఆంధ్రులే ఇందులో ఆదిపురుషులు. 18.8లో శాసనాలన్నీ సంపాదించుటేగాక, తెలుగు కన్నడ లిపిని సాధించి,మనకు మార్గదర్శులయ్యారు వెంకట బొర్రయ్యగారు. బుక్కపట్టణ రాఘవాచార్యులుగారు 1851లో ఆంధ్రదేశ చరిత్ర రచించి ఆదర్శులయ్యారు.

ఘంటసాల చరిత్ర వ్రాయించాలనే సంకల్పంనాకు 1917లో కలిగింది.దేనివల్ల కలిగిందో నేను నేడు చెప్పలేను.అనాడు నేను బొత్తిగా అశక్తుడను అగుటచే, మా గ్రామ ప్రముఖుల్లో ఒకరును,విద్యావంతులును అగు వేమూరి రత్నయ్యగారి చేత ఆ సంవత్సరమే వ్రాయించితిని. ఆ ప్రతిని ఆయన పోగొట్టెను. తిరిగి వ్రాయించుటకు పూనుకొనగా ఆయన కొంతవరకే వ్రాసెను. కాని పూర్తిచేయ పూనిక బహుకార్య నిమగ్నుడగు ఆయనకు లేకపోవుటచే అది అసంపూర్తిగానే నిలిచిపోయెను.

1920 మార్చి 29 తారీఖున మల్లెల శివరామకృష్ణయ్యగారు అమృతలూరు ఉభయభాషా సంజీవినీ సంఘపు వార్షికోత్సవమునకు అగ్రాసనాధిపత్యము వహించి యిచ్చిన ఉపన్యాసములో•, ప్రతి గ్రంథాలయము వారు గ్రామ చరిత్ర రచన చేయించి ఉంచవలెనని వారుచేసిన ప్రబోధము నన్ను గ్రామచరిత్ర రచనకు పురికొల్పెను.

1937 లో గ్రామ చరిత్ర రచనకు ఘంటసాల గ్రామ సంఘంవారు రు 200-ల విరాళమిచ్చి నన్ను ప్రోత్సాహ పరచిరి. అంతట గ్రామములోని ప్రాచీనశిల్పాలన్నీ ఫొటో తీయించితిని (ఈ పుస్తకములోని పటములన్నియు ఇక్కడివే.) అనంతరము మద్రాసు రెండుసార్లు వెళ్ళి,అక్కడ కొంతకాలము ఉండి, గ్రంథాలయములలోను, పురాతన కట్టడ సంరక్షక శాఖవారి ఆఫీసులోను కావలసిన విషయాలను సేకరించితిని. ఆ సమయంలో మద్రాసులోవున్న శ్రీయుత వేటూరి ప్రభాకర శాస్త్రి

• గ్రంథాలయ సర్వస్వము 4 సంపుటం 4 సంచిక చూడుడు.

గారు నాకు అధిక సహాయము చేసిరి. వారిది మా గ్రామముదగ్గరనేఉన్న కళ్ళేపల్లి అగుటచేతను, మా గ్రామమువారి మాతామహ స్థానము, అత్త వారి ఊరుకూడ అగుటచేతను మా గ్రామ ప్రాచీన చరిత్రయందు ఆది వరకే వారికి అధిక అభిమానముండుటచే నా కెక్కువ ప్రయోజనకారి అయ్యెను. వారి సహాయము. మద్రాసులోని నా గ్రంధ పరిశోధన, రత్నయ్యగారి రచన, నాకు ప్రాచీనచరిత్ర రచనకు అధికంగా వుపయోగ పడెను.

1937 లోనే పూర్తి చేసితిని 1941లో ఆంధ్ర చారిత్రక పరిశోధక సంఘ కార్యదర్శి అగు శ్రీయుత భావరాజు కృష్ణరావు గారికి రాజమహేంద్ర వరములో వినిపించి, వారి ఆశీర్వాద ఆమోదములు పొందితిని.

1946 ప్రాచీన భాగము 132 పుటలవరకు అచ్చు పూర్తిచేసితిని. ఆధునిక చరిత్ర వ్రాయుటా, మానుటా అనునది నాకు పది సంవత్సరాల నుంచి క్లిష్ట సమస్యగానే వున్నది. చివరకు 1947లో వ్రాయుటకే నిర్ణయించుకొని పూర్తి చేసితిని. ఈ భాగములో గొర్రెపాటి వెంకయ్యగారు అధికంగా సాయపడిరి. ఇంకను అనేకులు సలహాలు ఫోటోలు ఇచ్చి తోడ్పడిరి.

ఘంటసాలలో ఇటీవల ఇక్ష్వాకుల నాటి రెండు ప్రాకృత శాసనాలు దొరికినవి. శ్రీయుత మల్లంపల్లి సోమశేఖర శర్మగారికి వ్రాయగా వారు వచ్చి శాసనముల ప్రతి బింబములు రెండుసంవత్సరాల క్రితమే తీసుకొని వెళ్ళిరి అనంతరం ఆర్కిలాజికల్ డిపార్టుమెంటువారుకూడా తీసుకొని వెళ్ళిరి. కాని వా రుభయులలో ఎవరును ఇంతవరకు ప్రకటించ లేదు, పెక్కు పరిశోధకులను ప్రార్ధించినా, అవి ప్రకటితము అయ్యే యోగ్యత కలుగలేదు. ఆ శాసనముల కొరకే 76-80 వరకు నాలుగు పుటలు కాళీ వుంచితిని. శర్మగారు పంపెదమని ఉత్తరము వ్రాసియు పంపజాలరైరి. వారు బహు కార్యనిమగ్నులగుటే గాక, కషాలంకషంగా పరిశోధించిగాని వారు ప్రచురించరు. అందుచే వారి కింకను సంశయచ్ఛేదము కాలేదని తలుస్తున్నాను.

ఘంటసాల చరిత్ర ద్వారా ప్రాచీనాంధ్ర దేశ ప్రాముఖ్య ప్రాభవములు చెప్పుట ప్రధానంగా పెట్టుకున్నందున చరిత్ర కొంతవరకు పెరిగినది. అట్లాచేయుట అవసరమనే భావించాను. ఆ నాటి చరిత్ర కొంత వరకు ఘంటసాల చరిత్రద్వారా చెప్పుటకు నేను ఉత్సాహ పడితిని. బౌద్ధ యుగము ఆంధ్రులకు స్వర్ణ యుగము. ఆ స్వర్ణ యుగము నా స్మృతిపథమున అధికపని చేసెను. The past is there to inspire the present for the future అనే సిద్ధాంతాన్ని శిరసావహించే వాళ్ళల్లో నేనొకడును.

ఆధునిక చరిత్రలో సమకాలిక సంగతులనేకం కలవు. అవి అన్నీ నా శక్తి కొలది ఆలోచించే, చెడును వదలి, మంచిని మాత్రమే పేర్కొంటిని. వ్యక్తుల విషయాలలోను అంతే. ఒక వ్యక్తికిగాని, కులమునకు గాని, జాతికి గాని, వర్గమునకు గాని, అవమానము కష్టము కలగకుండా ఎంత వరకు వీలుంటుందో, అంతవరకు ఆలోచించి, చరిత్రకారునకుండు నిష్పక్షపాత బుద్ధితోనే నే నీ చరిత్ర రచనకు పూనుకొంటిని. భ్రమ ప్రమాదములేమైన వుంటే. క్షమించ వేడెద. నాకు తెలిపిన, దీనికే పునర్ముద్రణ భాగ్యం కలిగిన, దోషరహితంగా ఆంధ్రదేశానికి అందించ గలను.

నేనీ చరిత్రరచనలో పాతపంథాను ఘటనలను మాత్రమే పేర్కొనుటతో తృప్తి నొందక. అవసరమైన చోట్ల నా అభి ప్రాయాలుకూడ తెలియపరుస్తూ వచ్చితిని. నా నూతన పోకడ, రచన, ఆంధ్రదేశ మెంత వరకు ఆదరించునో! అది ప్రజల కెంతవరకు ప్రయోజనకారి అగునో!

ఏ కార్యమైన పూర్తి చేయుటకు అభిరుచి అర్హత అవసరము. ఓర్పు నేర్పు వుండాలి, దీక్ష దక్షత కలగాలి. వీటిలో నాకు ప్రథమగుణమే కలదు. అందుచే నా రచనలో లోటుండును. పాఠకలోకము మన్నించి పెంపు కలిగించాలి.

నా యందు వాత్సల్యంభావంతో తమ అమూల్యకాలమును వినియోగించి మున్నుడి, తొలినుడి. వ్రాసిన పెద్దలకు పెక్కు వందనము లర్పిస్తున్నాను. ఆచార్యుల వారి నామము అన్ని విధాల అన్వర్థనామమయి ఆల

కారుచున్న సంగతి ఆంధ్ర దేశ మెరుగును. ఆచార్య రంగాగారు అన్నట్లు హరిసర్వోత్తమరావు గారు ప్రధమ విప్లవ వీరుడు, విజ్ఞాన చంద్రికా విరాట్ స్వరూపుడు. ప్రజల పండితుడు. సర్వోత్తనామము సార్ధకము. అట్టి పెద్ద నా రచనను ప్రశంసించుట దానిలోని యోగ్యత కంటె వారి సౌహార్దమే అధికను. అయా విషయాలలో ఆరి తేరినవారు రచించిన గ్రంథాలలో దోషనిరూపణ, పిన్నల రచనలలో గుణప్రశంస చేయుట పెద్దలపని కనుక పెద్దల సౌహార్ధం పిన్నలయెడల వుండుట సముచితమే :

ఈ చరిత్ర రచనలో అధికంగా సహాయపడిన సుప్రసిద్ధ పరిశోధకులగు శ్రీయుత వేటూరి ప్రభాకర శాస్త్రి గారికిని, మిగిలిన పెద్దలకు, కొంతవరకు ఆర్థిక సహాయము చేసి ముద్రణకు తోడ్పడిన మిత్రులకు కృతజ్ఞతా పూర్వక వందనము లర్పిస్తున్నాను.

మువ్వది సంవత్సరాల నాడు నాకు కలిగిన సంకల్పము నేటికి. అనేక వుదార చరితులద్వారా నెరవేరుటచే, నా బాధ, భారము తగ్గినా మాతృ భూమి ఋణము కొద్దిగానైనను తీర్చుకున్నందుకు కృతార్థుడ నైతి నని భావిస్తున్నాను.

ఈ పుస్తకము అందరకు అన్ని విధాలా అందుబాటులోను ఆకర్ష వంతంగాను వుండుటకు ప్రయత్నించాను. అచ్చుతప్పులు నా ప్రయత్నానికి కొంత కొరతతెచ్చినవి. కానసవరణ పట్టికనుబట్టి సరిచేసుకో గలందులకు సహృదయుల ప్రార్థిస్తున్నా.

ఘంటసాల
28-8-1947

గొర్రెపాటి వెంకటసుబ్బయ్య

ప్రధమ ముద్రణమునకు శ్రీ పుట్టపర్తి నారాయణాచార్యులు. శ్రీ హరిసర్వోత్తమరావుగారలు పరిచయము వ్రాసిరి. పెంచి వ్రాసిన ఈ ద్వితీయ ముద్రణమునకు అవి అప్రస్తుతమని విడిచితిని.

గొ. వెం. సు.

# పరిచయం

ఘంటసాల శ్రీ గొర్రెపాటి వెంకటసుబ్బయ్యగారికి ఋణపడి వున్నదా? లేక, వెంకటసుబ్బయ్యగారే ఘంటసాలకు ఋణపడివున్నారా? ఇందుకు సమాధానం చెప్పడం కష్టమే. మరుగున పడిఉన్న ఘంటసాల చరిత్రను ఆయన వెలుగులోకి తీసుకురాగా, చరిత్రకారుడుగా ఘంటసాల ఆయనకు ఘనకీర్తిని కూర్చింది.

తమ జన్మస్థానమైన ఘంటసాల చరిత్రను వ్రాయాలన్న తలంపు శ్రీ వెంకటసుబ్బయ్యగారికి 1917లో కలిగిందట. అది వేరు తన్నడానికి, తీగ సాగడానికి, చిలవలు పలవలు వేయడానికి, మొగ్గతొడిగి,పూవుపూసి, కాపుకు రావడానికి ముప్ఫై సంవత్సరాలు పట్టింది. ఇంత ఆలస్యమైతే మాత్రమేమి? చివరికి పండినట్టిది పసిడిపంట. ఇతరులు కొందరు తమ తమ గ్రామచరిత్రలు వ్రాయడానికి శ్రీ వెంకటసుబ్బయ్యగారి రచన ప్రేరణ కూర్చింది. ఇంతేకాదు, వారి రచనలకు ఇది చక్కని వరవడి పెట్టింది.

సాధించిన విజయంతో సంతృప్తిచెందే వ్యక్తులు మరి పెరగలేరు. వీరీ కోవకు చెందరు కాబట్టి శ్రీ వెంకటసుబ్బయ్యగారు ఘంటసాల ప్రాచీన చరిత్రను గురించి, యుగయుగాలలో దాని పరివర్తనాలను గురించి అనేక నూతన విషయాలను సేకరించి, మరింత సమగ్రమైన రూపంలో ఈ ద్వితీయ ముద్రణను వెలువరించ గలుగుతున్నారు.

తామేది వ్రాసినా ప్రామాణికంగా వ్రాయడానికే శ్రీ వెంకట సుబ్బయ్యగారు ప్రయత్నిస్తారు. షష్టిపూర్తి జరిగినా, ఆయన జ్ఞాపకశక్తి

మొక్క పోలేదుగాని. దాన్నే పూర్తిగా నమ్ముకుంటే కొన్ని కొన్ని సందర్భాలలో అది మోసం చేయగల ప్రమాదం వున్నట్టు ఆయనకు తెలుసు. జ్ఞాపకశక్తి చేసే మోసాలు అన్యసాహిత్య రంగాలలో క్షంతవ్యాలైనా చరిత్ర విషయంలో ఎంతమాత్రం కావనికూడా ఆయనకు తెలుసు. అందువల్లనే చారిత్రక పరిశోధన సందర్భంలో తాము తెలుసుకున్న ప్రతి విషయాన్ని శ్రీ వెంకటసుబ్బయ్యగారు "రికార్డు" చేసి పెట్టుకుంటారు. తాము చదివిన పత్రికలనుంచి "కటింగ్స్"తోపాటు పుస్తకాలనుంచి "నోట్స్"కూడా కరణంగారి యింటిలో కవిలె కట్టలవలె దొంతర దొంతరలుగా ఆయనవద్ద ఉంటాయి. వీటి తోడ్పాటుతో వ్రాస్తారు కాబట్టే శ్రీ వెంకటసుబ్బయ్యగారి గ్రంథాలలో "ఈ తారీఖు తప్పు. ఆ తఖ్సీలు తప్పు" అని వేలెత్తి చూపడానికైనా వీలుండదు.

శ్రీ వెంకటసుబ్బయ్యగారిని మించిపోగల పండితులు అనేకులున్నారు; ఆయనకంటె ప్రామాణికంగా రచనలు చేయగలవారుకూడా వున్నారు. కాని, స్నేహంలో, సౌహార్దంలో, సౌశీల్యంలో ఆయనను మించగలవారు నిశ్చయంగా లేరు. అసూయా విద్వేషాలు రచయితల విషయంలో "అక్యుపేషనల్ డిసీజ్" అని చెప్పవచ్చు. దీనికి శ్రీ వెంకటసుబ్బయ్యగారు అపరిచితులు. ఏ సాహిత్య విభాగంలో ఎవరు ఏ విజయాన్ని సాధించినా, దాన్ని తమ విజయంగానే ఆయన భావిస్తారు. తమ లక్ష్యాలకు, విశ్వాసాలకు వ్యతిరేకమైన వాటిని ప్రచారం చేస్తున్న వారి రచనలను సయితం వాటిశైలి చక్కగావున్నా, విషయ వివరణలో ప్రతిభవున్నా, ఆ మేరకు వాటిని మెచ్చుకుంటారు. ఆయన ఈ సరళ ప్రవృత్తే, ఈ సహృదయతే ఆయన రచన లన్నింటిలో ప్రతిబింబిస్తూ వుంటుంది.

* * *

శ్రీ వెంకటసుబ్బయ్యగారు ఘంటసాలవారికే, లేదా, దాని పరిసర ప్రాంతాలవారికే, ఆసక్తిదాయకమైన విశేషాలను పెక్కింటిని ఈ

గ్రంథంలో అనవసరంగా చేర్చినారని దీని పాఠకుల్లో కొందరు ఆక్షేపించవచ్చు. ఇట్టివారు ఇదిఒక దేశచరిత్రకాదని, కనీసం ఒక పరగణా చరిత్ర నయితం కాదని, కేవలం ఒక గ్రామచరిత్ర మాత్రమే అని జ్ఞాపకం పెట్టుకోవాలి. ఒక దేశచరిత్రను, లేదా పరగణా చరిత్రను తాము వ్రాస్తుంటే ఆయన "టెలిస్కోప్"నే వాడి వుండేవారు. కేవలం ఒక గ్రామ చరిత్రను రచించడమే తమ లక్ష్యమైనందున ఇందుకు ఆయన "టెలిస్కోప్"ను కాక, "మైక్రాస్కోప్"ను వాడవలసి వచ్చింది. ఈ రెండవ సాధనాన్ని వినియోగించినప్పుడు అతి సూక్ష్మ విషయాలుకూడా దృష్టిపథంలోకి రావడం సహజమే కాదా?

ఒక గ్రామచరిత్రను వ్రాస్తున్నప్పుడు, దానికి సమగ్రత చేకూరాలంటే స్థానిక ప్రాధాన్యంవున్న ప్రత్యంశాన్నీ దానిలో చేర్చితీరాలి. అంత మాత్రంచేత ఆ గ్రంథ ప్రయోజనం పరిమితం కాబోదు. అది ఘంటసాల కానివ్వండి, మరొక గ్రామం కానివ్వండి; దాని చరిత్రకు తక్కిన గ్రామాల చరిత్రతో పెక్కు సామ్యాలతోపాటు అనేక వైరుధ్యాలుకూడా వుంటాయి. ఆ సామ్యాలతోపాటు వైరుధ్యాలనుకూడా సమానంగా గుర్తించినప్పుడు మనకు పొడగట్టేది కేవలం ఒక గ్రామచరిత్రకాదు; మొత్తంగ్రామీణజీవితచరిత్ర. శ్రీ వెంకటసుబ్బయ్యగారు ఘంటసాలచరిత్ర ద్వారా మనకు సాక్షాత్కరింప జేస్తున్నది, మన గ్రామీణ జీవితచరిత్రనే!

ఇది బౌద్ధయుగంనుంచి ఆధునిక యుగంవరకు విస్తరిస్తున్న చరిత్ర. మత, సాంఘిక రంగాలలోని పరివర్తనలను సమీక్షచేస్తున్న చరిత్ర. ఆర్థిక, సాంఘిక, రాజకీయ పరిణామాలను వివరిస్తున్న చరిత్ర. సాహిత్య సాంస్కృతికాది విషయాలకు సముచిత ప్రాధాన్యమిస్తున్న చరిత్ర. ఒక్కమాటలో, ఇది రెండున్నరవేల సంవత్సరాలను విస్తరిస్తున్న ఆంధ్ర గ్రామీణ జీవిత చరిత్ర.

  

శ్రీ వెంకటసుబ్బయ్యగారి "ఘంటసాల చరిత్ర" ప్రథమ ముద్రణను చదివిన తర్వాతనే ఆ గ్రామానికి యాత్ర చేయాలన్న ప్రబల కాంక్ష నాలో రేకెత్తించింది. అక్కడికివెళ్ళి చూడలేకపోయిన బౌద్ధ శిల్పాలను చూడ్డానికి పారిస్‌లోని "ముస్సీ జిమే"కు నన్ను తీసుకెళ్ళిందికూడా దీని ప్రథమముద్రణే!

నావలె పెక్కుమందిని ఈ ద్వితీయముద్రణ ఘంటసాల యాత్రికులను చేయగలదని, వారిలో కొందరి చేతనైనా పారిస్ వరకు ఇది ప్రయాణం కట్టించగలదని నమ్ముతున్నాను.

"ఆంధ్రజ్యోతి"
విజయవాడ
19 డిసెంబర్ 1966

నార్ల వెంకటేశ్వర రావు

# మనవి

ఘంటసాల చరిత్ర ప్రథమ ముద్రణలో దీని పుట్టుపూర్వోత్తరాలను గురించి చెప్పితిని. ఇప్పటికి ఇరవై యేళ్ళైనది. వెయ్యిప్రతులు వేయించితిని. నేడు ఒకటిన్నీలేదు. ఇంతేగాక, ప్రాకృత శాసనాలసంగతి తెలిసింది. సాంఘిక చరిత్రకూడా వ్రాయవలసి వచ్చింది. ఈ కారణాలన్నిటిని పురస్కరించుకొని ద్వితీయముద్రణ రెట్టింపు పైన అయినది. ఈసారి రెండువేల ప్రతులేగాక, ఇంకా గ్రామ చరిత్రకు సంబంధించిన బ్లాకులనేకం గలవు.

ఘంటసాల చరిత్రకు పూర్వం వ్రాసె రామచరిత్ర, రాజమహేంద్రవరచరిత్ర, బందరుచరిత్ర లేకపోలేదు. ఆ చరిత్రలన్నీ ప్రాచీనములు

ప్రాచీన అర్వాచీనముల సంతరించుకొన్నది ఘంటసాల చరిత్ర.

ఆయుష్మన్మూర్తి అవతరించింది కపుతరం చరిత్ర.

నేటి ఘంటసాలచరిత్రకు అనేక గ్రంథాలు పకరించినా, కపుతరం చరిత్ర అధికంగా తోడ్పడింది. ఈ చరిత్ర కారులగు తాళ్ళూరి మంగపతి రావుగారికి కృతజ్ఞతాపూర్వక వందనము లర్పిస్తున్నాను.

సాంఘిక చరిత్ర రచనకు గొర్రెపాటి లక్ష్మీనారాయణగారి భార్య శేషమ్మగారు, పూర్వకాలపు సంగతు లనేకం చెప్పింది 1928 ప్రాంతాల.

దిగవల్లి వేంకట శివరావుగారి మన ఆంధ్రత్వము.సాంఘిక చరిత్ర రచనకు తోడ్పడింది. వీరియువురకు వందనము లర్పిస్తున్నాను.

సాంఘిక చరిత్రలో మన సంఘములోగల లోపాలను అధికంగా విమర్శించటం జరిగింది.

కారణం లేకపోలేదు. మనలో అనేకులు తాతలనాటి గొప్పచెప్పడం తప్ప, పరిశోధించి చెప్పినవారు తక్కువ.

సంసారంగుట్టు, రోగంరట్టు అనిగదా సామెత. కనుక మనలో వున్న వ్యాధిని వెల్లడి చేస్తేగాని నివారణకు అవకాశం ఉండదు.

వర్ణముఅంటే కులంగాదు. రంగు. తెలుపు నలుపులమధ్య జరిగిన మర్యాద తేడా. బ్రాహ్మణులు తెలుపు. బాపనెల్లదనే మాట పల్లెటూరి వారికి తెలుసు. క్షత్రియుడు ఎరుపు. వైశ్యుడు పసుపు, శూద్రుడు నలుపు. మాలమాదిగలు అంతే. శూద్రులు మనుస్మృతి కాలంలో బానిసలు. పరాయి జాతివారు.

పూర్వ నాగరికతలన్నీ బానిసత్వంమీద బ్రతికి బలిసినవే. బానిస విధానం లేకపోతే గ్రీకుల విజ్ఞానం వుండేదికాదు. శూద్రులు లేకపోతే బ్రాహ్మణుల విజ్ఞానం వుండేదికాదు.

The hells are being made for such as not serve Rome.

"రోమనులకు దాస్యముచేయని వారి కొరకు నరకములు సృష్టింపబడు చున్నవి" అని రోమనులు వ్రాసుకొన్నారు. అలాగే భారతవర్షములో బ్రాహ్మణులును.

శూద్రంతు కారయే ద్దాస్యంక్రీత మక్రీత మేవవా ।
దాస్యాయైవహి స్రష్టోసో బ్రాహ్మణస్య స్వయం భువాః".

బ్రాహ్మణుడు జీత మిచ్చినా, యివ్వక పోయినా, శూద్రుని చేత దాస్యము చేయించు కోవలెను. బ్రాహ్మణ దాస్యముకొరకే బ్రహ్మ శూద్రుని సృజించెను.

ఇట్లాచెప్పిన మనువు, ఇక్కడ పప్పులో కాలేశాడు.

శక్తే నా పిహి శూద్రేణ నకార్యోధన సంచయః,
శూద్రోహి ధనమాపాద్య బ్రాహ్మణా నేవబాధతే"

శూద్రుడు శక్తిగలిగి నవ్వటికీ ధనం సంపాదించరాదు. ధనం సంపాదిస్తే బ్రాహ్మణుని బాధిస్తాడు.

'రాజు సర్వ వర్ణములకు ప్రభువు. బ్రాహ్మణులకుమాత్రముకాదు' అన్నాడు గౌతముడు ధర్మ సూత్రాలలో.

మన దేశంలోనేగాదు ప్రపంచమంతటా ఈ పురోహితజాతి (Priests) శాసన బద్ధంకాదు. వారు శాసకులు. వారే న్యాయవిచారణ కర్తలు. అందుచేతనే అనవలసి వచ్చింది. నేతి బీరకాయిలో నెయ్యి యెంతున్నదో, మన ధర్మశాస్త్రిలలో అంత ధర్మమున్నదని.

కనుకనే అంటున్నారు సంఘ శ్రేయోభిలాషులు. "యీ ప్రాచీన వ్యామోహాన్ని పటాపంచలు చెయ్యి. ఇది మనకు ప్రబల శత్రువు".

గతాన్ని ప్రతి చరిత్రకారుడు స్వీయదృష్టితో చూస్తాడు. కనుక భిన్నాభిప్రాయా లుండటం సహజం.

కొందరి జీవితాలు వడ్డించిన విస్తరి, వెనక్కు ఇంకా వెనక్కంటారు వారు. ముందుకు ఇంకాముందుకు అంటారు మరికొందరు.

ఈనాడు మనకు కావలసింది ప్రమాణ బుద్ధికాదు, పరిశోధన, స్వతంత్రాలోచన.

చదవండి, ఆలోచించండి అని పాఠకులను ప్రార్థిస్తున్నాను.

ఈ ఘంటసాలచరిత్ర, ఘంటసాల వాసులకే పరిమిత మైనదికాదు.

ఘంటసాల చరిత్ర పేరుకున్నా, ఇది కొంతవరకు దేశచరిత్ర, ప్రజలచరిత్ర, గ్రామీణచరిత్ర.

ఈ ధోరణితో ప్రతి గ్రామంవారు చరిత్రలు వ్రాయించ వలసిందని నా విన్నపం. వారు అచ్చు వేయించకపోయినా, అవూరి గ్రంథాలయంలో నైనా వుంచటం మంచిది.

దీనిలో అనేక లోపాలుండవచ్చు. అయినప్పటికీ, నా జన్మభూమి

ఋణం తీర్చుకోవలెననే తలంపుతో వ్రాశానుగాని, నేనొక పరిశోధకుడన నే దృష్టితో వ్రాయలేదని మనవి.

ఈ గ్రంథానికి తమ అమూల్యకాలాన్ని వెచ్చించి పరిచయం వ్రాసిన శ్రీ నార్ల వెంకటేశ్వరరావు గారికి నమోవాకము లర్పిస్తున్నా.

ఈ గ్రంథ రచనలో అనేక సూచనలు, సలహాలు యిస్తూ ప్రోత్సహించిన మిత్రుడు వేమూరి వెంకట రామయ్యగారిని, శ్రద్ధతో సాపు ప్రతి వ్రాసిన చిరంజీవి కొండపల్లి రంగారావుని, ఈ గ్రంథ ముద్రణకు తోడ్పడిన మిత్రులను, ఇందులో విశేషించి కృషిచేసిన చిరంజీవి గొట్టిపాటి రాఘవేంద్రరావును స్మరించకుండా యెలా వుండగలను ?

ఈ గ్రంథం నా ద్వారా వెలువడినదిగాని, నాది కాదని మనవిచేసు కొంటున్నాను.

సోదరులారా! చొచ్చుకపొండు
ముందుకు మునుముందుకు
వెనుక బడితిరా వృథాజీవితం వృథా వృథా
మృతప్రాయముగ బ్రతికిన ఫలితం మృగ్యం మృగ్యం!

—విశ్వకవి, రవి.

ఘంటసాల
19-12-66

గొర్రెపాటి వెంకటసుబ్బయ్య

ఈ దిగువ పట్టిక ననుసరించి, సరిచేసుకొన కోరెదను.

# తప్పొప్పుల పట్టిక

| పుట. | పంక్తి. | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 7 | 19 | తాగ్యం | త్యాగం |
| 45 | 3 | గృహస్ధు | గృహస్థు |
| 71 | 22 | కట్టడిము | కట్టడము |
| 93 | 17 | కాయగూరకు | కాయగూరలకు |
| 98 | 3 | బ్రాహ్మసుండిరని | బ్రాహ్మణులుండిరని |
| 118 | 14 | నిష్ణ | విష్ణ |
| 121 | 20 | సోమనన | సోమన |
| 145 | 5 | కష్ణ | కృష్ణ |
| 153 | 12 | సముద్రా | సముద్రాల |
| 180 | 16 | మూత్తి | మూర్తి |
| 185 | 4 | వలసినాపు | వలసినవారు |
| 197 | 12 | చరిత్రయ | చరిత్ర |
| 203 | 12 | కామూరి | కానూరి |
| 205 | 10 | బార్వాను | ద్వారాను |
| 234 | 17 | వైభలోపేతుడైన | వైభవోపేతుడైన |
| 252 | 1 | అంతరాన్ని | అంతరాని |

| | | | |
|---|---|---|---|
| 297 | 23 | కుటుంబయ్య | సుబ్బయ్య.పరమేశ్వరుడు |
| 314 | 2 | దొడ్డపాటి | దోడపాటి |
| 340 | 15 | మంచియున్నది | మంచియన్నది |
| 370 | 10 | వల్లూర | వల్లూరి |
| 379 | 5 | ముద్ధార | ముద్దార |
| " | 15 | హరివిద్వాలంకారి | హరివిద్యాలంకారి |
| 384 | 2 | గ్రుడ్డున | గ్రుడ్డును |
| 416 | 19 | భూగస్వామి | భాగస్వామి |
| 433 | 13 | కోఱ | కోట |
| 435 | 1 | గోడలు, లోపల | గోడలులోపల |
| " | 13 | రెక్కల-తలుపులు | రెక్కల తలుపులు |
| 441 | 3 | రాగిపాత్రలు | పాత్రలు |
| 445 | 12 | స్త్రీలు | స్త్రీల |
| 471 | 21 | చతుర్మాసం | చాతుర్మాసం |
| 473 | 19 | ఆ సంఘ | ఆ సంఘం |
| 477 | 4 | Orgamsed | Organised |
| 493 | 12 | that | the |
| 497 | 1 | ఆరుదండాలో | అరదండములో |
| 498 | 1 | ధర్మం | అధర్మం |
| 505 | 12 | చితా | చిత్తా |
| 515 | 9 | ఘంటసాలపాలెం | ఘంటసాల, పాలెం |
| 517 | 3 | చేసిన | చేసినసేవ |
| 528 | 1 | మనిషిలో | మనిషిలోని |
| 529 | 16 | ఆంధ్రసాహిత్య ఎకాడమి | ఆంధ్రప్రదేశ సాహిత్య అకాడమి |

| | | | |
|---|---|---|---|
| 539 | 13 | హిరణ్యకశ్యపుడు | హిరణ్యకశిపుడు |
| 536 | 17 | వేరు | వీరు |
| 546 | 10 | హిరణ్యకశ్యపుడు | హిరణ్యకశిపుడు |
| 551 | 14 | 1953 డిశంబరు | 1953 మే |
| 555 | 22 | ఎన్నిగళ్ళు | యనిగళ్ళు |



# విషయ సూచిక

## బౌద్ధ యుగము

## చాళుక్య యుగము

## జ మీం దా రీ యు గ ము

## గాంధీయుగము

## సప్త సంతానములు

## సంస్థలు - సంఘములు

## సాంఘిక చరిత్ర

# బౌద్ధయుగం

## స్వర్ణయుగం

ఆర్యులలో రెండు తెగలున్నట్లు కనిపిస్తుంది.

తూర్పుదేశపు ఆర్యులు అధికభావ ప్రియులు, ఆధ్యాత్మిక వాదులు, సంప్రదాయాన్ని పాటించనివారు.

పశ్చిమార్యులు లేక, మధ్య ప్రదేశార్యులు, సంప్రదాయ బద్ధులు, మార్పులు కోరనివారు, శాస్త్రప్రియులు.

పూర్వార్యులలో ఉపనిషత్తులు; బౌద్ధజైన ఆచార్యులు, సంప్రదాయముపై తిరుగుబాటు, సహజమతము, యోగమార్గ ప్రచారము, ఆధ్యాత్మిక సంబంధమైన రసోచిత గీతకావ్యాలు అభివృద్ధి జరిగినవి. ఇవన్నీ, అయోధ్య మొదలు అస్సాం వరకు.

మధ్యదేశీయ ఆర్యులలో పౌరాణిక భావములు, ధర్మ శాస్త్రములు, వ్రతములు, కర్మకాండ ప్రచారము, స్వర్గనరకములందు విశ్వాసము లధికములు.

భారతీయ సాహిత్యము రెండు జాతుల సాహిత్యము.

ఉపనిషత్తులు, బౌద్ధజైన గ్రంథాలు, దర్శనాలు మొదలగునవి నవ్యభావోదయం కలిగించేవి.

సంప్రదాయాన్ని పోషించేవి, అనగా కర్మకాండకు ఆధిక్యతగల బ్రాహ్మణ గ్రంథాలు, శ్రౌత, గుహ్యసూత్రాలు, స్మృతులు ఇతిహాసాలు మొదలగునవి రెండవ కోవకు చెందినవి.

మొట్టమొదటివి, అయోధ్య, కాశీ, మగధాదిదేశాల్లో.

రెండవవి కన్యాకుబ్జాది మధ్యదేశాలలో. వైదిక కర్మ కాండకు మృదు విరోధులు జనకుడు, యాజ్ఞవల్క్యుడు.

ఉగ్రవిరోధులు బుద్ధుడు, మహావీరుడు మొదలగువారు పూర్వప్రదేశములలోనే ఉద్భవించారు.

క్షత్రియు లధికంగా స్వతంత్రాలోచనా పరులు, మార్పుకోరేవారు.

బ్రాహ్మణు లెక్కువగా సంప్రదాయానుబద్ధులు, కర్మిష్ఠులు.

ఆంధ్రదేశము సాక్షాత్తు బుద్ధభగవానుని పాదరేణువులచే, పునీతం గాకపోయినా, బౌద్ధమత స్వీకరణంతో అందరికంటే ముందంజ వేసి 'బుద్ధం శరణం గచ్ఛామి' అన్నది.

ఉత్తరదేశాన ఉద్భవించిన బౌద్ధానికి నవ్యతనిచ్చి, వివిధదేశాల్లో, అశోకుని అనంతరం వ్యాప్తిగావించినది ఆంధ్రులే.

'ఆంధ్రుల బౌద్ధ స్వీకరణం అశోకుని పూర్వకాలం నాటిదని నిస్సందేహంగా చెప్పవచ్చును' అని ప్రొఫెసరు కె. ఆర్. సుబ్రహ్మణ్యంగారు ఆంధ్రలో బౌద్ధశిథిలాలు అన్న గ్రంథంలో పేర్కొన్నారు.

ఆంధ్రులు నిత్యనూతనసత్యాన్ని కోరేవారు, అతి ఉద్రేకులు, స్వాతంత్ర్యప్రియులు.

అందుచేతనే ఏ నూతన భావమైనా. నవ్యాదర్శమైనా, వారిని అతి స్వాభావికంగా ఆకర్షిస్తుంది.

అటువంటి వారగుటచేతనే, విశ్వమానవ సౌభ్రాతృ

త్వాన్ని జీవకారుణ్యాన్ని, విశ్వప్రేమను, మూఢాచార నిరసనాన్ని, మానవ పరమోత్కృష్ట స్వభావాన్ని ప్రేరేపించే ప్రచార ప్రబోధాలుగల బౌద్ధధర్మాన్ని చూడగానే ఆకర్షితులయ్యారు.

కృష్ణాతీరస్థమైన ఆంధ్రభూమిలో అధికంగా కన్పించే బౌద్ధస్తూపాలే ఇందుకు నిదర్శనం.

మన తెలుగువారిలో కూడా రెండు తెగలు లేకపోలేదు.

సహజంగా సాగరాంధ్రులు, సంస్కారప్రియులు. ఉత్తరాదినుండి వచ్చినదేకాదు, ప్రపంచంలో యెక్కడ నవ్యభావం కల్గినా సాదరంతో స్వీకరిస్తారు.

పార్వతాంధ్రులు అధికంగా సంప్రదాయ పోషకులు.

కరుణ, జ్ఞానము, యివిరెండే బుద్ధుని ప్రధానలక్ష్యాలు. కనుక బుద్ధప్రవచనమేదైనా ఈ రెంటిపైన ఆధారపడినదే.

ప్రపంచముపై కరుణపూని, వారి సంక్షేమంకోసం వారి మేలుకై నల్దిక్కులా పర్యటించడం, ధర్మం బోధించడం, ప్రధాన ధర్మం.

బౌద్ధమునకు కళశరీరము, వాఙ్మయము ప్రాణము, తత్త్వము హృదయము.

బుద్ధుని బోధకంటే, ఆయన త్యాగం కంటె, ఆ మత శిల్పాలే, ఆ మతాభివృద్ధికి అధికంగా ఆధారమైనవి. నిరక్షరాస్యులైన ప్రజలకు అవి మాట్లాడే బొమ్మలు.

వివిధ దేశాల కరిగినప్పుడు వారి భాష తెలియనప్పుడు శిల్పంద్వారా అందరిని ఆకర్షించి, ఆ మతంలో కలుపుకున్నారు బౌద్ధులు.

తమ హృదయములోని భక్తిని చిత్రరూపం ద్వారా ప్రదర్శించి, కళద్వారా ప్రచారమొనర్చిన వారిలో బౌద్ధులు ప్రధమలు ప్రముఖులు.

అటువంటి బౌద్ధశిల్పం బౌద్ధ చిత్రకథలు మహోన్నత స్థాయి అందుకున్న దేశం మన ఆంధ్రదేశం.

శిల్పంలో "అమరావతీ శైలి" అను ఆంధ్రశైలి విశ్వవిఖ్యాతమైనది.

దీనినే ఫర్గూసన్ పండితుడు సాధికారంగా "అమరావతీ శిల్పాలు-భారతీయ శిల్ప పరమావధిని సూచిస్తాయి" అని పేర్కొన్నాడు.

ఆంధ్రదేశ మంతటా విలసిల్లిన స్తూపాలు ముప్పది మూడు.

ఉత్తరాన శాలిహుండంనుంచి, దక్షిణాన చినగంజాం వరకు; తూర్పున ఘంటసాల నుండి పడమట గుత్తి వరకుగలవు.

స్తూపాలు విశేషంగా ప్రకృతి రామణీయకమైన నదీ తీరములలోను పర్వత ప్రాంతములలోను నిర్మించిరి. రాకపోకలకు అనుకూలంగా వుండుటకు నదీ తీరాలనే విశేషంగా ఈ నిర్మాణం జరిగినది.

ఘంటసాల, భట్టిప్రోలు, అమరావతి నాగార్జునకొండ అంతర్జాతీయఖ్యాతి వహించిన బౌద్ధ తీర్థయాత్రా కేంద్రాలుగా విరాజిల్లినవి.

ఆంధ్రదేశంలోని బౌద్ధస్తూపములలో అమరావతి, నాగార్జునకొండ ప్రపంచపు ఖ్యాతిగాంచినవి. సుప్రసిద్ధ ప్రాచీన

డక్కన్ చరిత్రకారుడగు డూబ్రియల్ ఇట్లా అంటున్నాడు. "ఈ ఆంధ్రులన్నవారు ఒక మహత్తరమైన జాతిగా గోచరిస్తున్నారు. అమరావతి శిల్ప సాంప్రదాయము వీరుపెట్టిన భిక్షే. నాగార్జునాచార్యుని తాత్త్విక సిద్ధాంతము వారిచ్చిన వరమే."

"నిజానికి, అమరావతీ నాగార్జున కొండలకాలము ఒక సాంస్కృతిక యుగం, భారతీయ కళలకు ఒక స్వర్ణయుగం. దానిప్రభ, ఏ ఒక్క కుడ్యశిల్ప శకలము మిగిలివున్నా, అది కులమతవర్ణ విచక్షణల దురాగతాలు, క్రౌర్యాలు లేక భేదసంఘర్షణ కతీతమైన ఒక పరమాదర్శయుతమైన సంఘ నిర్మాణానికి మనను ప్రేరేపిస్తూ ప్రబోధకరంగా మిగిలివుంటుంది" అంటారు నార్లవారు.

ఆంధ్రదేశంలో వెయ్యేండ్లు అవిచ్ఛిన్నంగా బౌద్ధమతం వర్ధిల్లినది. శాతవాహనులు, ఇక్ష్వాకులు ఆ మతాన్ని ఆదరించి పోషించారు. ఆనాడు ఆంధ్రులు పాటలీపుత్రము వరకు పాలించారు. సమస్త కళలను పోషించారు, దశదిశలను ఖ్యాతినింపారు. వస్త్ర నిర్మాణములో, వర్తక వాణిజ్యములో, నౌకావ్యాపారములో, బౌద్ధమత ప్రచారములో వారికి సాటివారు లేరు.

క్రీస్తుకు పూర్వం 575 మొదలు ఆరవ శతాబ్దము వరకు భారతవర్షమునకు, ఆంధ్రదేశమునకు కూడ బౌద్ధయుగం ఒక స్వర్ణయుగము.

# ఘంటసాల ప్రశంస

"ఇది ప్రసిద్ధపట్న మేయంట కిచ్చట
నిరతంబుదొరకు నాణెములె సాక్షి
ఇది ప్రసిద్ధపట్న మేయంట కిచ్చట
వరలెడి బుద్ధస్తూపములె సాక్షి
ఇది ప్రసిద్ధపట్న మేయంట కిచ్చట
లభియింపఁగల కట్టడములె సాక్షి
ఇది ప్రసిద్ధపట్న మేయంట కిచ్చట
నమరు శిలాశాసనములె సాక్షి
ఆంధ్రదేశ పూర్వగాథలందు గలుగు
సందియంబు లడంచుశక్తి యున్న
ఘంటసాలయె తగిన సాక్ష్యం బొసంగు
జూచితీరంగవలె నిట్టి చోద్యములను,"

ఘంటసాల కృష్ణాజిల్లా దివితాలూకాలోని పురాతన ప్రసిద్ధగ్రామము. ఇది బందరునకు పడమర 15 మైళ్ళ దూరమున వున్నది. ఆంధ్రరాజులకు ప్రథమరాజధానియైన శ్రీకాకుళము నదీపాతమైన కతమున కృష్ణానదీతీరమున నిర్మింపబడి ఆంధ్రసామ్రాజ్య స్థాపకుడగు ఆంధ్రవిష్ణుని పూజార్చనలతో అలరారుతున్న పుణ్యక్షేత్రమగు శ్రీకాకుళము దీనికితూర్పుగా 6 మైళ్ళదూరమున కలదు. ఇది పురాతన పట్టణమనుటకనేక నిదర్శనములు గలవు. ప్రస్తుత గ్రామప్రదేశమంతా పాటినేలయై వుండుటేగాక, రెండుమైళ్ళ పొడవున ఒక మైలు వెడల్పున ప్రాచీననిర్మాణపు పునాదులు కనపడును.

విశ్వేశ్వర ప్రతిష్ఠాపన— పుట 8

## ఘంటసాల - ఓడరేవు

ప్రాచీనకాలమందు ఆంధ్రులు సాహసిక జీవనాభిలాష కలవారై యుండిరి. ఆంధ్రదేశము కృష్ణా, గోదావరి మొదలగు జీవనదులచే అలరారుచు నదీముఖద్వారములలో సహజముగ ఏర్పడిన రేవులచే శోభిల్లుచుండెను. దీనివల్ల వారికి వివిధదేశములకు వర్తకవ్యాపారమునకై అరుగుటకు అనువుగ ఉండెను.

బౌద్ధవాఙ్మయమువలనఆంధ్రదేశము క్రీస్తుకుపూర్వము నాలుగవ శతాబ్దమునాటికే నాగరికత కాలవాలమై నౌకావ్యాపారం చేస్తున్నట్లు తెలుస్తున్నది. గ్రీసు, రోము, ఈజిప్టు చీనా, బర్మా మొదలగు దేశములతో వ్యాపార మొనర్చినది. ఆంధ్రచక్రవర్తులుకూడ దీనికి చేదోడు వాదోడుగా వుండిరి. ఇలా ఆంధ్రదేశమునకు విదేశవ్యాపారముచే అఖండైశ్వర్యమును లభింపజేసిన ప్రాచీన రేవులు మోటుపల్లి, (గుంటూరుజిల్లా, బాపట్లతాలూకా) ఘంటసాల, గూడూరు (బందరు సమీపమున) మొదలగునవి కలవు.

అటువంటి ప్రాచీనవైభవ మనుభవించిన ఘంటసాల ప్రదేశము నేడీ తీరున ఉండుటచూచి ఇది ఓడరేవగునా అనే సందేహం కలుగవచ్చును. కనుక ఇది ఓడరేవే యని యీ దిగువ ప్రమాణములచే విదితం కాగలదు.

ఘంటసాల రెండుమైళ్ళ విస్తీర్ణముగల పట్టణమైనట్లు శిథిలములగు కట్టడములు మొదలగు గుర్తు లనేకము లున్నవి.

ఆధారపడి వుండుటచే సముద్రముపై తమకెట్టి నష్టము కలుగకుండుటకు తమ ఆరాధ్యదేవతకు జలధీశ్వరనామ మిడియుందురు. శైవమత మతిప్రాచీన మగుటయు, జలధీశ్వరనామమున నిచటిజనులు శివుని నారాధించుటను, ఇది ఓడరేవై యుండెననుటలో నెట్టి అసామంజస్యమును లేదు.

ఈ గ్రామమున బౌద్ధస్తూపములును, కట్టడములును జాలగలవు. సాధారణముగా స్తూపములు కొండలమీదగాని, నదీప్రాంతములగాని కట్టబడుచుండెడివి. ఇది పర్వతప్రాంతము కాదుగనుక నదీప్రాంతమై వుండు ననుటలో అసందర్భం లేదు.

"బౌద్ధులు తరచుగా స్తూపములను, సంఘారామములను (సన్యాసులుండు మఠములు) సహజసుందర ప్రదేశములందును, సహజముగా విస్తారజలమయము లగు ప్రదేశములందును నిర్మించిరి."

"కృష్ణా, గుంటూరు మండలములలో గనిపెట్టబడిన స్థూపములు ముఖ్యముగా కృష్ణానదీ తీరమునగాని, దాని శాఖలమీదగాని గట్టబడినవి."

పూర్వకాలమునందలి నదీప్రవాహములు మారిపోయినవి. కనుకనే నాగార్జునకొండ, భట్టిప్రోలు, ఘంటసాలలకు సమీపముగా నదీప్రవాహము లుండెనని తలచవచ్చు.

"కొన్ని రేవుపట్టణముల సమీపమున సముద్రము ఇసుకతిప్పలు వేయుచుండుటయు, మరికొన్ని తావులందు మహానదుల ముఖద్వారములు ఇసుకదిబ్బలతో పూడిపోవు

చుండుటయు, మరికొన్ని నౌకాశ్రయములందు సముద్రము దూరముగా వెనుకకుపోవుచుండుటయు తటస్థించుచుండెను. ఈ కారణమున ముఖ్యముగా కూడూరు, కాల్పట్టణ రేవులును ఘంటసాలయు నోడల రాకపోకలకు వీలుగా నుండకపోవుటచే గణనకు రాకయుండెను." 1

"ఆంధ్ర దేశము ధరణికోట రాజధానిగా నున్న కాలము 100 సంవత్సరములు_అంతకుముందు మోటుపల్లి, కూడూరు (గూడూరు) ఘంటసాలలందు అమరావతీ ప్రభువుల ప్రాపకమున నౌకావాణిజ్యము విరివిగా కొనసాగుచుండుటచే ఆంధ్ర దేశమున పరిశ్రమలు అందు ముఖ్యతమముగా వస్త్రనిర్మాణము అభివృద్ధిచెంది లాభకారిగా నుండెను." 2

"ఘంటసాల మహోద్భుతాతి
చిత్ర బౌద్ధకలా శిల్పకల్ప
నావిరాజితయది యాంధ్రనగరములను
వన్నెగన్నది కృష్ణాస్రవంతి జలధి
గూడుచోట నున్నయది యోడరేవు." 3
"ఉదధితీరంబునన్ గొప్ప యోడరేవు
పట్టణమయి కృష్ణా ముఖద్వారమునను

---

1 ప్రాచీనాంధ్ర నౌకాజీవన చరిత్రము, ౧౧౧
2 నేతపరిశ్రమ, ౭౪
3 శ్రీమంతు, ౪ పద్యము పుట ౪౧

వర్తకంబున కిరవయి వసుధ తొల్లి
వాసిగాంచెను గజరాజ పట్నమనగ." 1

ఘంటసాలకు గజరాజ పట్టణ మను నామాంతర ముండెను.

## మైసాలియా - మచిలీపట్నం కాదు

ఘంటసాల చరిత్రకు కొంటకొశ్శైలశబ్దము ఆధారం. గ్రీకు భూగోళశాస్త్రజ్ఞుడగు టోలమీ (క్రీ. శ. 140) హిందూ దేశములోని రేవులన్నిటిని పేర్కొనెను. అతడు చోళమండల తీరమున దిగువనుంచి క్రమముగా కృష్ణానదీ సమీపమున "మైసోలియాను, కృష్ణానదీ ముఖద్వారమున వర్తక కేంద్ర మగు కొంటకొశ్శైల" తరువాత "కొడ్డూరు"ను పేర్కొనెను.

ఈ పేర్లాంధ్రదేశమందలి యేయే గ్రామముల కిపుడు చెందునోయని పరిశోధకులు విచారించి పరిపరివిధముల తమ అభిప్రాయముల తెల్పియుండుటచే ఇట్టి వివాదగ్రస్తమగు విషయమును విడనాడి ఒక్క "కొంటకశ్శైల"ను గురించి సిద్ధాంతీకరించుట అంత సవ్యంగా వుండదు. ఘంటసాలతో పాటు దాని పరిసరప్రదేశములుగూడ ఎటుల మార్పుజెందెనో తెలుసుకొనడం అవసరం.

"కృష్ణా గోదావరీ మధ్య ప్రదేశమునకును, పాలేరు పరిసరప్రాంతమునకు "మైసోలియా" యను పేరుగలదు.

1 విశ్వేశ్వర పుట ౩

సన్నని వస్త్రములకు ప్రసిద్ధి కెక్కినటుల "పెరిప్లిస్"లో చెప్పబడిన సముద్రపు రేవిదియే. ఈ "మైసాలియా" శబ్దము "మసులిపటము"లో నిమిడియేయున్నది. "మచిలీపట్నము" "చేపలపట్నము" అను పేరునకు సరియైన యర్థము రాగ లందులకు దీనినిట్లు "మసులిపటాం" అని యపభ్రంశమొనర్చి నను దీని పేరిందిమిడియే యున్నది." 1

టాలమీ పేర్కొనిన మైసోలియాను బందరుగా నిర్ణయించిన వీరే "కొడ్డూరును" గూడూరుగా నిర్ణయించిరి. ఇది చాల అసంభవమైనవిషయం. ఏల నన ఏకకాలమున ప్రఖ్యాతి గాంచిన ఈ ఓడరేవులు రెండు నాలుగు మైళ్ళలో వుండుట అసందర్భం. ఇంతేగాక వారు తలచినట్లది అపభ్రంశంకాదు. మచిలిపట్నమునే "మసులిపటం" అని పాశ్చాత్యులు సరిగా ఉచ్ఛరించలేక "మసులిపటా"మనిరి. మచిలీబందరు రాకాల మున లేనేలేదు.

"బందరు పదునాల్గవ శతాబ్దమున అరబ్బీ దేశస్థులచే గనిపెట్టబడెను. కృష్ణానది యుత్తర ముఖద్వారమునకు గొంచెము ఉత్తరముగా మహమ్మదీయులు నరబ్బులును, పారశీకులును నీ వలసదేశమును స్థాపించిరి. ఇది యించు మించుగా 15 వ శతాబ్దమున జరిగియుండవచ్చును.

"తొలుత నరబ్బులకు వలసగానుండిన మచిలీబందరు కుతుబుశాహీల యాదరణమున గొప్ప రేవుపట్టణ మగుట తట స్థించెను." దీని ప్రథమనామము బందరు. పిమ్మట నిచట

1 Ancient India described by Pyolemy M. C. Trindel. P. 68

చేపలు విశేషముగా నుండుటచేగాని, మొట్టమొదట నీటి విస్తారముగా చేపలెగుమతి చేయబడుచుండుటచేగాని మచిలీ బందరని యియ్యది పేరొందెను. మచిలీయన – చేప. ఇది హిందీ శబ్దము." 1

ఇది 16. 17 శతాబ్దాలలో మిక్కిలి అభివృద్ధి గాంచి ప్రపంచ ప్రఖ్యాతి చెందినది. ఇది మహమ్మదీయులచే ప్రథమముగా కనిపెట్టబడి తరువాత మనదేశంలోని మహమ్మదీయ ప్రభువుల ప్రాపకపోషణములక్రింద అభివృద్ధి చెందినందులకు సాదృశ్యముగనే దీని పేరును, పేటలపేర్లును కనుపిస్తున్నవి.

మచిలీ బందరు అభివృద్ధి జెందినపిమ్మట మచిలీపట్టణము అయినది. సంస్కృతపండితులు "చల్లపల్లికి", తక్రపురి యనియు "కళ్ళేపల్లికి" రంభాపురమని ఎట్లా నామకరణం చేశారో అలానే ఈ మచిలీపట్టణమునకుగూడ మత్స్యపురి అని పేరొసంగిరి. బృందావనమను పేరును వారు సృజించినదే కాని, ప్రాచీనముకాదు. ఈ రెండు పేర్లును చరిత్రయందుగాని శాసనములందు గాని కాన్పింపవు. కాని బందరు చాల పురాతనమైన బస్తీగా, అనాలోచితంగా విదేశచరిత్రకారులచే పేర్కొనబడి అంధప్రాయంగా మనవారిచే అనుసరింపబడినదే గాని, అన్యంగాదు. పాశ్చాత్త్యులు వచ్చునాటి కిది మిగుల అభివృద్ధిలోనుండి, మోటుపల్లి రేవప్పటికి నశించుట చేత "మసులిపటా మనునది మైసోలియాతో గొంచెము శబ్ద సామ్యము కలిగి ఉండుటచేతను మైసోలియా యనుదానిని

1 ప్రాచీనాంధ్ర నౌకాజీవనము. పుట 170

మసులిపటాంగా సిద్ధాంతీకరించిరి. ఇటుల వారు పొరబడి వ్రాసిన వ్రాతలే తరువాతవారికి వేద ప్రమాణములైనవి.” 1

ఇది పురాతన పట్టణమైనచో దీని ప్రాచీననామమేది? బందరే మైసోలియా యైనయెడల మైసోలియా నామమునకు మాతృక యేది? బందరు, బృందావనము, మత్స్యపురి యను పేర్లతో బందరులోగాని మరియొకచోటగాని బహుపురాతన మైన శిలాశాసనములుగాని, అన్యాధారములుగాని కానరావు. 12, 13 శతాబ్దములలోని అనేక శాసనములు ఘంటసాల, పెదకళ్ళేపల్లి లనుగురించి పేర్కొనుచున్నవిధమున బందరులో కానవచ్చుచున్నవి. ఇది యే కారణమున ఇవి ఎలా ఎప్పుడు వచ్చెనో యెరుగజాలము. ఇట్లితరప్రదేశములను గురించి శాసన శిలలున్న ఈ ప్రదేశమున ఈ పట్టణమునుగురించి ఒకటియును లేకపోవుటచేత ఇది ప్రాచీనపట్టణముకాదని చెప్పుటకు నిదర్శన మింకేమి కావలెను?

## మైసోలియా - మోసలపురము

గ్రీకు నావికుడగు హిప్పాలస్ (క్రీ. శ. 1 శతాబ్దము) కూడ “మసోలియా” యను ఓడరేవు తూర్పుతీరమున కల దనెను. దీనినే టోలమీ మైసోలియా అనెను. కృష్ణానదికి గ్రీకు నావికులు ‘మైసలెస్’ అని పేరిడిరి. మోసలపురమునకు సమీపమున నుండుటచే దీనినిట్లు పిలిచియుందురు. “టోలమీ పేర్కొనిన మైసోలియాయును, హిప్పాలస్ స్వయముగజూచి యుండిన మసాలియా రేవును ఒక్కటియే యైయుండునని

1 ప్రాచీనాంధ్ర నౌకాజీవనచరిత్రము: పుట 179

నిశ్చయముగా జెప్పవచ్చును "......ఈ మసాలియా యను నది మోసలపురమను మోటుపల్లికి వికృతనామము. మోటుపల్లికి మోసల పురమనియు, ముకుళీ పురమనియు నామాంతరము లున్నట్లు మనదేశములో లభించిన శాసనముల వలన దెలియుచున్నది." 1

టోలమీ "కొట్టిస్ వరుసగా మైసోలియాను, కొంటకశైలను, కొడ్డూరును బేర్కొనెను. టోలమీ బేర్కొనిన విధముననే క్రమముగా కృష్ణానదీ సమీపమున మోటుపల్లియు, కృష్ణానదీ ముఖద్వారమున ఘంటసాలయు, గూడూరు నుండుటచే మైసోలియా మోటుపల్లి యనబడుట సక్రమముగనే యున్నది." 2

"రోమకులు మోటుపల్లిని మైసాలియా యని పిలచుచుండిరి." 3

"క్రీ. శ. 1269 సంవత్సరమున నాంధ్రదేశమునకు వచ్చిన మార్కోపోలో యను నతడు మోసలమను దేశమున్నదనియు నందు 'ముటఫిలి' యని రేవుపట్టణము కలదనియు నయ్యది సాలిపట్టునుబోలు మిక్కిలి సన్నని వస్త్రములకును, వజ్రములకును బ్రసిద్ధి కెక్కె ననియు వ్రాసియున్నాడు. 1వ శతాబ్దంలో వ్రాయబడిన పెరిప్లిస్‌లోగూడ మైసోలియాసన్నని వస్త్రములకును, వజ్రములకును బ్రసిద్ధిబడసినట్లుపేర్కొన

1 ప్రాచీనాంధ్ర నౌకాజీవన చరిత్రము పుటలు 69-70

2 ప్రాచీనాంధ్ర నౌకాజీవన చరిత్రము పుటలు 39-70

3 ప్రాచీనాంధ్రదేశము, పుటలు 116.

బడెను. అయ్యాది ఈ మోసలపురమును గూర్చియే గాని బందరుగురించి గాదు.” 1

“ముటుఫిలి ఈ కాలమున మోటుపల్లికి సరిపోవు చుండుటచే నతడు పేర్కొనిన రేవునగరము మోటుపల్లియే యని నిస్సంశయముగ జెప్పవచ్చును” 2

“ముటఫిలిని మార్కోపోలో మోసల్ యనికూడ పేర్కొని యున్నాడు. పాశ్చాత్య పండితులు మోసల్ లేక మోసలపురము నవిచారముగ నుచ్చారణసామ్యమునుబట్టి ప్రసిద్ధమైన మచిలీపట్టణముతో ముడిపెట్టిరి” 3

ఇంక ననేక ప్రమాణముల జూపవచ్చును గాని గ్రంథ విస్తరభీతిచే మైసోలియా మోటుపల్లి యనుటకు పైన నుదహరింపబడిన ప్రమాణములు చాలునని భావించి ఇంతట విరమించుచున్నాను.

## కొడ్డూర - గుడివాడ కాదు

గుడివాడలో స్తూపములుండుటచేతను, ప్రాచీననాణెములు మొదలగునవి దొరకుటచేతను “గుద్రహారవిషయ” గుడివాడ శబ్దమును బోలియుండుటచేతను కొందరు దానిని గుడివాడగా నిర్ణయించిరి.

---

1 Yarles Markapolo. Volume II Page 346,

2 ప్రాచీనాంధ్రదేశ నౌకాజీవనము, పుట 137.

3 ప్రాచీనాంధ్రదేశము పుట 111

"దానము చేయబడిన సంతగ్రామము గుద్రహారవిషయ (జిల్లా)లో నున్నదని చెప్పబడెను. గుద్రిహార యనునది ప్రస్తుత గుడివాడపట్టణమే." 1

## గుద్రహారవిషయము - గుడివాడ

"గుద్రిహార, గుద్రివార, కొడ్డూర, కూడూర అనునవి గూడూరునకే చెందునుగాని గుడివాడకు జెందవు. ఏలనన పల్లవులకాలములో వేంగిదేశము రెండుజిల్లాలుగ విభజింపబడెను." 2

"ఈరాజ్యము గుద్రహార, వేంగియను రెండుజిల్లాలుగా (విషయః) విభజింపబడెను. ఏలూరు, యర్నగూడెం, భీమవరం తాలూకాలు వేంగిలోను, దివి, బందరు, గుడివాడ, కైకలూరు తాలూకాలు గుద్రహారములోను నుండెను." 3

"మొట్టమొదట వేంగిదేశము కృష్ణా, గోదావరీనదీ ముఖద్వారములకు నడుమనుండు దేశమైయుండెను ...... మొట్టమొదట నీ దేశమునకు కూడూరహారవిషయమను పేరు కలదు. అప్పుడు కూడూరు లేక గూడూరను పట్టణము రాజధానిగానుండెను." 4

కూడూరు గూడూరును బోలియుండగా నాంధ్రచరిత్ర కారులు సంశయించు టెందుకు? బహుశః గుడివాడ ప్రాచీన పట్నమై ఉన్నదని, కూడూరను గ్రామ మూ కాలమున

1 Juhras, Volume V Part II Page 109.
2 ఆంధ్రదేశ కథాసంగ్రహము పూర్వయుగపు పుట ౨౦౬
3 Juhars 29
4 ఆంధ్రదేశకథా సంగ్రహము పూర్వయుగము ౨౨౨

వుండుటచేతను గూడూరుతో సరిపోయివుండుటవల్ల గుడివాడ టోలమీ చెప్పినట్లు కృష్ణానదీ ముఖద్వారమున లేకపోవుట వల్లను కొడ్డూరను దానిని కూడూరనుటలో అసందర్భం లేదు.

## కొడ్డూర - గూడూరు

ఈ గూడూరు బందరునకు నాల్గుమైళ్ళదూరమునయున్న పురాతన పట్టణము. ఇది మూడవశతాబ్దిలో "బృహత్ఫాలాయను లను పల్లవులకు రాజధానిగా నుండెను"[1] కనుక టోలమీకాలమున ఈపట్టణముండెను. ఇది నాయభిప్రాయమే గాక అనేకులగు పరిశోధకు లంగీకరించిన విషయము. దివిసీమయందలి కోడూరుగూడ ఈగూడూరుతో శబ్దసామ్యమును పొందివున్నదిగాని ఆ కాలమున ఆ ప్రదేశమంతా సముద్ర ప్రాంతమైవుండెను. చూచినను ఆ ప్రదేశ మట్లే కాన్పించును. ఇంతేగాక దివిసీమలోని యే గ్రామవిషయమును ఆంధ్రదేశములో లభించిన శాసనముల వలన తెలియరాదు.

కృష్ణానదీ ముఖద్వారము పూర్వమునుంచి యిప్పటి వలెనే అలరారుచుండెడిది కాదు. దివిసీమ నాడు జనసంకీర్ణమై వుండినచో ఆంధ్రదేశమున తామరతంపరగానున్న స్తూపశిధిలము లిచ్చట గూడ కానవచ్చెడివే. ఇంతేగాక ఇప్పుడు కృష్ణానదీ ముఖద్వారమున నున్న కళ్ళేపల్లికి కడలు పల్లి ప్రాచీననామం. (సముద్రప్రాంతమున నున్న పల్లె.)

---

1 ప్రాచీనాంధ్రనౌకాజీవనము పుట ౬౨

ఇందుచే టోలమీకాలమున ఆ ప్రదేశమంతయు జలమయముగా వుండెననుటలో ఆశ్చర్యంలేదు. కొడ్డూరు గూడురుగా నిర్ణయించిన పరిశోధకుల ప్రమాణముల ఈ దిగువ నుదహరించుచున్నాను.

"కొడ్డూర బందరునకుసమీపముననున్న గూడూరు"[1]

"కూడూరు బందరునకు సమీపమున నున్నయది"[2]

"కుద్రహారవిషయకు(జిల్లా) ముఖ్యపట్టణముకూడూరు. ఈ కూడూరు బందరునకు నాల్గుమైళ్ళదూరములో నున్న యిప్పటి గూడేరే టోలమీ పేర్కొనిన కూడూరయు నీ గూడూరే"[3]

సుప్రసిద్ధ దక్కన్ చరిత్రకారుడగు డూబ్రయేల్ పండితుడు దీనిని గురించి యిట్లు వ్రాయుచున్నాడు.

"కృష్ణానదీ ముఖద్వారము దగ్గర ఆధునిక పట్టణమగు మచిలీపట్టణముండుటచే మైసలస్ కృష్ణానదితప్ప మరియొకటి కాదనుట తృప్తికరముగాలేదు.కర్నల్ యూలుగారు టోలమీ పేర్కొనిన కొడ్డూర మచిలీపట్టణమువద్దనున్న గూడేరే యని స్థిరపరచిరి. ఈ నిర్ధారణ చాలాసందేహములతో గూడుకొని యున్నది. ఆ సందేహములు పొందినవారు యూలుగారి కిట్లు సమాధాన మిస్తున్నారు.

"కొడ్డూర శబ్దము, గూడూరు శబ్దముతో పూర్తిగా సరిపోవటలేదు.

---

1 Indian Antiquary Volume 13 Page 334

2 History of Andhras, Page, 156.

3 Juhras Volume I Part 1, 2, 4 Page 140

"టోలమీకాలమున గూడూరున్నదనిగాని యది 18 శతాబ్దమునుండి యీ పేరుతో వున్నదనిగాని ఋజువుచేయ బడియుండలేదు.

"ఈ రోజువరకుఁగూడ అది అలాగే వుండిపోయెను. మేము దక్కను పూర్వచరిత్ర వ్రాయుసందర్భమున కొండ ముదితామ్రశాసనమును జదువుటచే దిగువ పేర్కొనఁబడిన ముఖ్యవిషయములఁ గనుఁగొంటిమి.

"కర్నల్ యూలుగారిచే పేర్కొనబడిన గూడూ రొకప్పుడు కూడూ రని పిలువబడెను."

"గూడూరు టోలమీ కాలమునఁ గలదు.

"కనుక టోలమీ చెప్పినకొడ్డూరకొండముది శాసనములోని కూడూరని మేము నిర్ధారించుట కవకాశము కలదు."1

## కొంటకొశ్శైల కంచకచర్లగాదు

టోలమీపేర్కొనిన రేవుప్రదేశములగు మైసాలియాను మచిలీపట్టణముగను, కొడ్డూరను గూడూరుగను, కొంటకొశ్శైలను కంచకచర్లగను నిర్ణయించిన మెక్‌క్రిండిల్‌గారు కంచకచర్లను ఈ విధంగా నిర్ధారణచేసిరి.

"కొంటకొశ్శైల సంస్కృతమున కంటకస్థల మనుట సరిగాదు. యూలుగారి మ్యాపులో నీ ప్రదేశము కృష్ణానదీ సమీపమునగల మెట్టప్రదేశమున కొండపల్లికి బరిసర ప్రాంత

---

1 Ancient History of Deccan Page 87

మున నుంచబడెను, దీనిపేరు కొంతభాగ మిందులో నిమిడి యున్నట్లు తోచును."[1]

కొంటకొశ్శ్యల కంటకస్థలముగాదని వారే ఒప్పి కొనిరిగదా? ఇక కంచకచర్ల శబ్ద మెటుల దానిలో నిమిడి యున్నదో యెరిగింపజాలక పోయిరి.

ఈ నిర్ణయమును బలపరచుచు సూయల్ గారిట్లు వ్రాసిరి.

"కంచకచర్ల బెజవాడకు పశ్చిమోత్తరమున ౨౦మైళ్ళ దూరములో వున్నది. ఈ గ్రామము కర్నల్ యూలుగారు స్మిత్ గారి పురాతనమగు అట్లాసులో (Atlas) (పుట, 32) కృష్ణానదీతీరమున టోలమీ వర్తక కేంద్రముగా పేర్కొనిన కొంటకొశ్శ్యలగా గుర్తించుచున్నారు. ఈప్రదేశము పరిటాల వజ్రపుగనులకు మిక్కిలి సమీపమున వుండుటవల్ల ఈ నిర్ణయం సమంజసంగా వున్నది "[2]

యూలుగారి నిర్ణయము వీరి సమర్ధన మిక్కిలి అస మంజసముగా వున్నవి. ఏలనన టోలమీ కృష్ణానదీ ముఖ ద్వారమున (కృష్ణ సముద్రములో కలియుచోట) కొంట కొశ్శ్యల వున్నదనెను. కంచకచర్ల పై ప్రదేశమున లేక కృష్ణానదీతీరమునందలి మెట్టయందున్నది. టోలమీ పేర్కొనిన స్థలమున లేదు. కనుక కంచకచర్ల కాజాలదు. ఇంతే గాక టోలమీ వర్తక కేంద్ర మనెను గాని వజ్రము లెగుమతి చేయు

---

1 Ancient Ind a described by Ptolomy Mec Crindel, Page, 60.

Topo Graphical lists of Antiquiries Vol- I Page 44

స్థలముని చెప్పియుండలేదు. కనుక పరిటాల వజ్రపుగనులు కంచికచర్లకు దగ్గరగానుండుటచే దానిని వాణిజ్యకేంద్రముగా పేర్కొనుటకు వీలులేదు. అయినను పరిటాల వజ్రములసంగతి 17 వ శతాబ్దిలో టావర్నియర్ చూచి వ్రాసినదానినిబట్టి మనము తెలిసికొనుచున్నాము గాని రెండవ శతాబ్దములో పరిటాల ప్రాంతమున వజ్రపుగనులుండెననిగాని, కంచికచర్ల వుండెననిగాని చూపబడియుండలేదు. కొంటకొశ్శైల శబ్దమునకును కంచికచర్లకును సామ్యమున్నాలేదు. ఈ కారణాలచే కంచికచర్ల కొంటకొశ్శైల కాజాలదు.

## కొంటకొశ్శైల – ఘంటసాల

కొంటకొశ్శైల, కొడ్డూర కృష్ణానదీ ముఖద్వారమున కలవని టోలమీ వ్రాసెనుగదా! కొడ్డూరగూడూరని తెలిసికొంటిరిగదా! ఇక కొంటకొశ్శైలను గుర్తించవలసి వున్నది. ఘంటసాల ఓడరేవని నిరూపించితిమి. గూడూరునుంచి శ్రీకాకుళమువరకు గల ప్రాంతమున పురాతనగ్రామము ఒక ఘంటసాల తప్ప తదితర గ్రామము లేమియు లేవు గనుక కొంటకొశ్శైలకును, ఘంటసాలకును శబ్దసామ్యముండుటచేతను టోలమీ చెప్పిన ప్రదేశమున అతడు చెప్పిన కాలమున వుండుటచేతను ఆప్రదేశమును ఘంటసాలగా నిర్ణయించుట యుక్తియుక్తముగా వున్నది. ఇది నాస్వాభిప్రాయమేగాదు. అనేక చరిత్రకారు లంగీకరించిన విషయము. ఈ దిగువ ఉదహరింపబడిన ప్రమాణములీ వాదమును బలపరచుచున్నవి.

"ఇప్పుడు ఘంటసాల యనబడు దానికి టోలమీకాల మున కొంటకోశ్శిలయను పేరుండెను. అయ్యది వాణిజ్య స్థానము!"[1]

"కటకసాల 'ఘంటసాల' అమరావతీ శాసనములో కటకసోలయని యున్నది. ఆ కటకసోల శబ్దమును జమువుటలో బొరపాటు గ్రహించి తరవాత కంటికసేలగా నిర్ణయించిరి"[2]

"ఈకాలమున కార్యావర్తము రమణీయములగు బట్టణములతో గలకలలాడినది. అప్పటి పట్టణసందర్భమును జూచి పాహియాన్ తన్మయత్వము బొందెను......తక్షశిల, మధురానగరము, కాశి, గయ, పాటలీపుత్రము, రాజగృహము కంటకశిల (ఘంటసాల) మోటుపల్లి మున్నగునవి యా కాలమున ప్రఖ్యాతిజెందిన పట్టణరాజములు"[3]

"టోలమీ మైసోలసునదీ ముఖద్వారముననున్న ఘంటసాలా నగరమును కొంటకశైల (kontakasila)వర్తకస్థానమనియు,.....ప్రశంసించియుండెను."[4]

"ప్రాచీనపు దక్కనుయొక్క మాజ్ఞానము మరియొక నూతన నిరూపణమునకు సహాయపడుచున్నది. గూడూరు, కృష్ణానదీ ముఖద్వారములమధ్య ఘంటసాలనగరముకలదు. అలెగ్జాండర్ రే యుచట (south Indian Budhist Antiquities Madras 1894 Page 3) క్రీ. శ. ౧ వ శతాబ్దియందున్న

1 ఆంధ్రసాహిత్య పరిషత్పత్రిక సంపుటము 1 సంచిక 2,3 పుట ౧౨౩
2 ఆంధ్రదేశ కథాసంగ్రహము పూర్వయుగము పుట ౧౬౨
3 బౌద్ధమహాయుగ పుట ౩౧౦
4 ప్రాచీనాంధ్ర నౌకాజీవనము పుట 72.

ఒక బౌద్ధస్తూపము కనుగొనెను. కనుక ఘంటసాలలో టోలమీకాలమున వుండవలసిన స్థలమున (Required spot) సముద్రమునమీప (Seasidc) మందున్నది. కొడ్డూర కృష్ణానదీ ముఖద్వారములకు మధ్య టోలమీ వర్తక కేంద్రమగు కొంట కొశ్శైల నుంచెను."[1]

సుప్రసిద్ధ చారిత్రకపరిశోధకు లగు శ్రీయుత మల్లంపల్లి సోమశేఖరశర్మగారిట్లు వ్రాయుచున్నారు.

"టోలమీ యను భూగోళశాస్త్రజ్ఞుడు తెలిపిన కంటకశైల ఘంటసాలయే."[2]

కొంటకశైల ఘంటసాలయే. ఇంకను సుప్రసిద్ధ పరిశోధకులగు వేటూరి ప్రభాకరశాస్త్రిగారు, విజ్ఞానచంద్రికను నెలకొల్పి విజ్ఞానతేజమును వెదజల్లి ఇతిహాస బిక్షపెట్టిన ఇలవేల్పగు కొమర్రాజు లక్ష్మణరావుపంతులుగారు మున్నగు ప్రసిద్ధచరిత్రకారు లెందరో కొంటకశ్శైలను ఘంటసాలగా నిర్ణయించిరి.

## కొంటకొశ్శైల - కంటకసేల

కొంటకొశ్శైల అని టోలమీ పేర్కొనినదానిని అపభ్రంశముగా తలచి కొందరు వ్యాఖ్యాతలు కంటకము అగునేమోనని భావించుకొనిరి. కొంటకొశబ్ద మపభ్రంశము కానే కనిపిస్తున్నది. దీని సహజరూపము కంటక; కనుక

---

1 Ancient History of Deccan.

2 భారతి రక్తాక్షి సంవత్సర శ్రావణము పుట 116.

కొంటకొశ్శైల కంటకసేలయొక్క అపభ్రంశము. కంటకసేల ప్రాకృతము. అది సంస్కృతమున కంటకశైల అగును.

ఈ కొంటకొశ్శైలను కొందరు కటకశాలని కటకసోలని, కంటకసేలి, కంటికోస్యలని వివిధరీతుల చదివిరి. ఇటీవల నాగార్జునకొండలోని శాసనములలో కంటకసేల శబ్దము కానగుటచే టోలమీ పేర్కొనిన కొంటకొశ్శైల కంటకసేలయొక్క అపభ్రంశమని తలచుటలో అసామంజస్యంలేదు.

నాగార్జునకొండ శిలాశాసనమునుగురించి వ్రాయబడిన దానిలోనుండి ప్రస్తుతాంశమునకు సంబంధించిన యీదిగువ విషయము గమనార్హము.

"ఈ జాబితాలో కంటకసేల మహాచేతియకు తూర్పు ద్వారమున నున్న శిలామంటపము" అని యుండుట చాల ప్రాముఖ్యమైన విషయము. ఈ కంటసేల మైసలన్ ముఖ ద్వార సమీపమున వర్తక కేంద్రముగ టోలమీ పేర్కొనిన కొంటికశైలయే.

## కంటకసేలే - ఘంటసాల

### కంటకసేల నామోత్పత్తి:—

ఇక ఈనామమెట్లు వచ్చెనను విషయమునుగూర్చివిచారించుదము. కంటకశైల అను శబ్దమున కర్థము ముండ్లపర్వతము. ఘంటశాలలో ముండ్లపర్వతముండుటచే దీనికీ పేరు వచ్చెనాయని అడుగవచ్చును. ఘంటసాలలో లేదు. బౌద్ధ

యుగంలో కంటకశైల. వలెనే శైలశబ్దముగల నామములు చాల గలవు. పూర్వశైల, అపరశైల, రాజశైల, హిరణ్యశైల, ఘంటాశైల, మహావనశైల, మొదలగునవి మనకు బౌద్ధవాఙ్మయమున కనపడును.

కర్నూలు మండలములోని శైవక్షేత్రమగు శ్రీశైలమందరు ఎరిగినదేగదా! ఆ ప్రదేశమునవున్న పర్వతనామమే శ్రీ శైలమని పిలువబడెను. అట్లైనచో ఘంటసాల కంటక శైలఅని పిలువబడుటకు ఇచ్చటముండ్ల పర్వతములేదు గనుక కంటకసేల ఎట్లయ్యెనని అడుగవచ్చును. అందుకు మా సమాధానము_శైల శబ్దార్థముపర్వతమేకాని శైలశబ్దాంతములన్నియు ఆకాలమున కొండలుకావు. స్తూపములు కొండరాళ్ళచే కట్టబడుటచేతను, అవి విశేషసౌలభ్యము కొరకు తరచుగా కొండలమీదనే నిర్మింపబడుట చేతను స్తూపములు పర్వతమువలె వుండుటచేతను వాటికి శైలఅను పేరుపెట్టి వుంటారు. ఆ యాస్తూపములను వారికిష్టమువచ్చిన శైలశబ్దాంతములగు నామముతో పిలచిరి. స్తూపములు శైలాకృతిని నిర్మింపబడుటచేత శైల మనుటలో అసందర్భంలేదు.

అప్పటికాలములో స్తూపములా విధముగా పిలువబడి వుండవచ్చు. దానిని కేవలం శబ్దార్థదృష్టితో విచారించ కూడదు. ఏలనన సాధారణముగా మనమునేడు మాలమాదిగలుండు ప్రదేశములను గూడెములని పిలుచుచున్నాము కాని మొర్నగూడెము, గంపలగూడెము, తాడేపల్లిగూడెము, బ్రాహ్మణగూడెముకూడ అంటువంటివా? కాదని అందరకు



మహాభి నిష్క్రమణము—నాగార్జున కొండ. బుద్ధుడు కంటకమనే గుర్రము నెక్కి ఇల్లువిడిచి వెళుట.

తెలియును. కనుక మనము ప్రతిశబ్దమును శబ్దార్ధదృష్టిచే పరిశీలింప కూడదు.

కంటకమను శుభకరమైన శబ్దము. మనసాంప్రదాయము ననుసరించి గ్రామమునకు సాధారణముగా ఏదోఒక మత సాంఘికాచారానుకూలమగు పేరేయుండును. ఆచారవిరుద్ధముగా ఎందుకున్నదని ఆలోచింపగా బౌద్ధవాఙ్మయమున చరిత్రప్రసిద్ధమైన యీ కంటకశబ్దము కానవచ్చెను.

ఆజన్మసుఖభోగియై సకలసంపత్పరిపూర్ణమగు రాజమందిరమును వీడి అర్ధరాత్రివేళ తనరాజ్యమును భార్యాపుత్రాదులను సమస్తమును విడనాడి దుఃఖనివారణకొరకార్యార్థుడై బయలుదేరి వచ్చిన ఆ బుద్ధభగవానుని ప్రియమైన అశ్వముపేరు కంటకము.

"ఆ దివ్యసుందరధవళతురంగము సిద్ధార్థునిచే విడనాడబడి దుఃఖముచే శుష్కించినదై విచారభరమున జీవములబాసినది. ఈ హయమునకు కంటకమని పేరు."[1]

పుణ్యమూర్తియగు బుద్ధభగవానుడు లోకకళ్యాణార్ధమెక్కివచ్చినట్టియు, పవిత్రమైనట్టియు, విశ్వసనీయమైనట్టియు, ఆత్మార్పణ బుద్ధిగలిగినట్టి గుఱ్ఱముపేరుతో కంకటశైలయని యొక చైత్యము (స్తూపము) కట్టబడి వుండవచ్చును. అదే గ్రామముపేరై ప్రసిద్ధజెంది వుండవచ్చును.

స్తూపముపేరుతో గ్రామము పిలువబడునా అనే సందేహంకూడ కొందరకు కలుగవచ్చును. అందుకు

1 పాహియాన్ భారతయాత్ర పుట ౭౩

మా సమాధానమిది. ఈ మాదిరిసాదృశ్యము లనేకము కలవు. 'అపరశైల అమరావతిగా నిర్ణయింపబడెను.

ఇంతేగాక మన ఆంధ్రదేశమున ప్రస్తుత గ్రామము లెన్నో దేవాలయనామములతో విలసిల్లుచున్నవి. భీమేశ్వరము, యేలేశ్వరము, మల్లేశ్వరము, గణపేశ్వరము, సంగమేశ్వరము మున్నగునవి తార్కాణములు. కనుక శుభకరమైన నామముతో ఆచారానుకూలముగను, చరిత్రాత్మకముగను, సత్ప్రమాణముగను కంటక శైలనామోత్పత్తికల రూపుకాన నయ్యెనుగదా!

## ఘంటసాల ప్రాకృత శాసనములు

ఘంటసాల ప్రాచీన చరిత్రకు కంటకసోల నామము ఆధారము. ఇది కృష్ణానదీ ముఖద్వారమునఉన్నదని టోలమీ అనుభూగోళశాస్త్రజ్ఞుడు తన భూగోళ శాస్త్రములో పేర్కొనెను. కృష్ణానదీ ముఖద్వారమున ఘంటసాల ఉండుటచేతను, ఘంటసాలలో ప్రాచీన స్తూపములుండుటచేతను కంటక సోలను ఘంటసాలగా ఇదివరకు చరిత్రకారులు నిర్ణయించిరి. కాని 1944వ సంవత్సరంలో ఘంటసాలలో ఐదు ప్రాకృత శాసనములు దొరుకుట ముదావహము. ఈ శాసనములు దొరకిన సంగతి సుప్రసిద్ధ పరిశోధకులగు మల్లంపల్లి సోమశేఖరశర్మగారికి, పురాతత్వశాఖవారికి ఈ రచయిత తెలిపెను. పురాతత్వశాఖ డైరెక్టరు డాక్టరు బి. సి. హెచ్. చాబ్రాగారు 1945 వ సంవత్సరము జనవరి ఒకటవ తారీఖున ఘంటసాల వచ్చి ఇక్కడ దొరికిన ఐదు శాసనములను కాపీ చేసుకొని వెళ్ళిరి. ఆ కాపీలను శాసన

పరిశోధనకులగు జె పి. హెచ్. ఓగెల్ లెయిడన్‌గారు పరిశోధించి ప్రకటించిరి. వాటి నకళ్ళను డాక్టరు చాబ్రాగారు ఈ రచయితకు 1950_11_24 న పంపిరి. వాటిని పురస్కరించుకొని ఆ శాసనములసంగతి దిగువ నుదహరిస్తున్నాను.

"ఈ ఐదు శాసనములలో రాజులవంశములుగాని, పేర్లుగాని, తేదీలుగాని ఏమీ లేక పోయినప్పటికీ చరిత్రకు అధిక ప్రయోజనం కలిగించగలవు. వాటి ప్రథమ ప్రయోజన మేదన క్రీస్తుశకారంభమున కృష్ణానదీ తీరమున బౌద్ధము విస్తరిల్లి అమరావతి, జగ్గయ్యపేట, నాగార్జునకొండ స్తూపముల ప్రాముఖ్యమును విశదీకరించును. భట్టిప్రోలులోని స్తూపము క్రీస్తుకు పూర్వం రెండవశతాబ్దమునదని Buhler (బూలర్) వ్రేర్కొనెను.

ఇంతేగాక ఈ ఘంటసాల శాసనములుదక్షిణహిందూ దేశప్రాచీన భూగోళమును గురించి కొంత భోగట్టా చెప్పును.వాటిలో రెండు 'A & B' శిల్పములుగల శిలలమీద చెక్కబడిన శాసనములు.అవి కంకటకసోల నివాసి యగు బుద్ధిసిరి ఇచ్చిన దానశాసనములు. ఇచ్చటి ఉపాసకుడగు (అనగా గృహస్థుడగు) ఉత్తర అనే అతను అమరావతిలో దానం చేసినట్లు కానవచ్చును. ఈ కంటకసోల నామము నాగార్జునకొండ లోని చేతియ ఘర దేవాలయమువద్దగల దీర్ఘశాసనములో కలదు. పరమభక్తురాలగు ఆ ఉపాసిక బోధిసిరి దానములలో

"కంటకసోలె మహాచేతియస పువుద్వారె సేలమండవో" అనే శాసనము కలదు. దీనికర్ధమేమన కంటకసోల మహా చైత్యం తూర్పుద్వారమునగల ఒక శిలా మండపము. కృష్ణా నదీ ముఖద్వారమున టోలమీ వాణిజ్య కేంద్రముగా పేర్కొ నిన కంటకశైలే ఈ కంటకసోల. ఈ కంటకసోలలోని రెండు శిలాశాసనములలోను ఉఖాసిరి. వర్ధనే నామముకలదు.కంటక సోలలో ఇది ఒకభాగం కావచ్చును. మరొక విధముగా ఆలోచించి నట్లయితే ఈ ఉఖాసిరి వర్ధననునది ఘంటసాల ప్రాచీననామము కావచ్చు. వర్ధమాన అను నామము ప్రాచీన హిందూదేశములో ఒకస్థలంపేరు. ఉదాహరణా ర్ధము, బెంగాలులోని బరద్వాన్, పశ్చిమోత్తర కతియవారు లోని ప్రధానపట్టణమగు వర్ధవాన్‌లను చూపవచ్చును. టోలమీ తన భూగోళంలో కృష్ణానదీ సమీపమున బర్ధ మాన్ కలదని పేర్కొనెను. అతడు గ్రీకులో చెప్పిన బర్ధ మానే ఈ వర్ధమాన కావచ్చును. ఆగ్రీకు భూగోళశాస్త్ర జ్ఞుడు బర్ధమాన 136° 15' E 15° 15' N, డిగ్రీలలోను, కంటకశైల 134° 30' E 11° 30' N డిగ్రీలలోను ఉన్నట్లు గుర్తించెను. కాబట్టి ఈ బర్ధమాన, కంటకశైలలు ఒకటని అనుటకు వీలులేదు.

డాక్టరు చాబ్రాగారు సంపాదించిన మరొక శాసన మునుబట్టి ('E') కుతూహలము కలిగించు మరియొక విష

యము కానగును. ఆ శాసనములో శివక అను ఒక మహానావికుని పేరు కానగును.

ఈ కోరమండలతీర ప్రాంతమంతా బౌద్ధయుగమున నౌకావ్యాపారమునకు నిలయమైనట్లు తెలియనగును. 'A—B' శాసనములు రెండూ జగ్గయ్యపేట, నాగార్జున కొండలలోని ఇక్ష్వాకు వంశములకు సంబంధించిన శాసనముల మాదిరి చాలా సుందరమైన లిపిలో వ్రాయబడినవి. జగ్గయ్యపేట శాసనములు క్రీస్తుశ. మూడవ శతాబ్దమునకు చెందినవని బూలర్ గారు నిర్ణయించిరి. ఈ శాసన శిలల యందు చెక్కబడిన సింహములు నాగార్జునకొండ శిల్పశిలలు మాదిరిగానే కలవు. కనుక వీటిని క్రీస్తుశ. మూడవ శతాబ్దమునకు చెందినవని నిర్ణయించవచ్చును. ఈ సింహము (శాసనము C) మీదగల శాసనము అంత అందముగా లేదు. నాల్గవ శాసనము 'డి' ఇదికూడ ఒక రాతి స్తంభమై యుండవచ్చును. కాని ఇది విరిగిపోయినది. ఇది సరిగా చదువుటకు అవకాశము తక్కువ. ఐదవశాసనము 'E' ఒక శిలాఫలకము మీద మూడు పంక్తులు మాత్రమే వ్రాయబడినవి. ఈ శాసన లిపి ననుసరించి పూర్వ శాసనములకంటె ఇది ప్రాచీనమైనదిగా గ్రహించనగును. ఈ శిలా శాసనముల మూలమును, అనువాదమును ఉదహరించుచున్నాను.

## మూలము 'A'

1. సిద్ధం ఉఖాసిరి వధ (మానె)
కంటకసోల-వధ (లేనా)
2. ధమ్మావానియ - పుతేన బుధ
సిరి-గహపటినా ఇమామ్
3. సేల-మండపో సగంధకుడి-
వేటికా-తోరణో కారిటోటి

## అనువాదము 'A'

కంటకసోల వాసియు ధమ్మావానియు కుమారుడును, గృహస్థుడగు బుద్ధిసిరి,ఉఖాసిరి వర్ధమానమందు ఈ శిలామండపము గంధకుటి, వేదిక తోరణములతో నిర్మింపబడినది. ఇది ఆచంద్రార్కము వర్ధిల్లుగాక!

## 'B'

1. సిద్ధం-ఉఖాసిరి వధ (మానె)
కంటకసోల-వధ (లేనా)
2. ధమ్మాశానియ - పుతేన బుధి
సిరి-గహపటినా (ఇమామ్)
3. సేల-వండపో సగంధకుడి-
వేటికా టోరణో (కారిటోటి)

## 'B'

—డిటో—

ఈ రెండు శిలాశాసనములు ధర్మగోటకములో మట్టి త్రవ్వుతూండగా దొరికినవి. ఈ శిలాశాసనములు రెండునూ ఒకేమాదిరివి. 5 అడుగుల పొడవు 1 అడుగు వెడల్పు 1 అడుగు మందము కలిగియున్నవి.



ప్రాకృత శాసనము (౧)

## మరొక శిలా శాసనము

ఇది 1956 లో తుమ్మల వెంకట్రామయ్య (కొండ తాత)గారికి స్తూపమునకు గ 100 ల తూర్పున మట్టి త్రవ్వు చుండగా దొరకినది. ఇది ఒకచిన్న రాతి స్తంభము. ఈ విష యమును పురాతత్వ శాఖవారికి తెలియజేయగా వారు వచ్చి దీన్ని పరిశోధించి 1956 జూన్ 13 వ తారీఖున దాని నకలును ఈ రచయితకు పంపించిరి.

| మూలము | అనువాదము |
| --- | --- |
| 1. ఉవాసికాయ ధహనమటుయ సివల ుు దాన | ధహన తల్లియు, ఉపాసిక యగు సివలయ దానశాసనము. |

ఈ దాన శాసనము క్రీస్తుశకము ఒకటవ శతాబ్దము నకు సంబంధించినదిగా గుర్తింపబడినది.

## ఆంధ్రుల నాణెములు

"ఆంధ్రచక్రవర్తుల నాణెములు సీసముతోను, రాగి తోను, వెండితోను చేయబడేవి. "అవి బౌద్ధమతచిహ్న సూచ కములతో ముద్రింపబడుచుండెను. ముందువైపున రాజుపేరు గాని, సింహానిదిగాని, గుఱ్ఱానిదిగాని ప్రతిమ వుండెడిదికాని, రాజురూప మెన్నడును లేదు. వెనుకవైపునబౌద్ధమతచిహ్నము స్వస్తిక లేక చక్రము వుండెను. దీనినే ఒక్కొక్కప్పుడు, ఉజ్జయినీసంజ్ఞ యనికూడ పిలుతురు."[1]

[1] Andhra Coins of S. I. Elliat.

ఈ ఆంధ్రనాణెములు విశేషముగా అమరావతి, గుడివాడ, భట్టిప్రోలు, చినగంజాం, ఘంటసాలలో దొరికెను. ఇటీవల నాసికలో యీ నాణెములు విశేషముగా దొరికినవి.

"పైన పేర్కొనబడిన నాణెములేగాక, రాబర్టు సూయల్ గారికి గుడివాడలో, రోమనుల యొక్కయు, యవనుల యొక్కయు, ఓడలనుబోలిన ఓడయొకటి అర్ధచంద్రాకృతిగల టాపుతోడను, రెండు తెఱచాపలతోడను, తెడ్లవలెనుండు నొక పెద్దలంగరు(చుక్కాను)తోడనుజిత్రింపబడినవి దొరికినవి."1

పైన పేర్కొనిన విషయములనుబట్టిఆంధ్రచక్రవర్తులు బౌద్ధమతస్థులని, ఆ మతాభివృద్ధికై పాటుపడుటకంటె, తమ పేరు ప్రఖ్యాతులకు పెనగులాడెడివారు కారని, సముద్రయానమునందు వారి కుత్సాహప్రోత్సాహములు కలవని, ఆ కాలమునందలి ఆంధ్రుల కధికంగా, ఓడలను గూర్చి, ప్రయాణమును గూర్చి బాగుగా తెలియుటయేకాక, నౌకావ్యాపారము వారికి లాభకారియైవుండి, విశేషముగా జరుగుచుండెనని తెలియగలదు.

## ఘంటసాలలో దొరికిన నాణెములు

ఇక్కడ వర్షాకాలములో అప్పుడప్పుడు ప్రాచీన నాణెములు దొరుకుచుండును. కాని వాటియందు ప్రజలకు శ్రద్ధ లేకపోవుటచే దొరికినను వాటిని జాగ్రత్తగానుంచరు. ఇటీ

1 ఆంధ్రదేశ కథాసంగ్రహ పూర్వయుగము 185

వల కొందరిదగ్గర నే స్వగ్రామమున సంపాదించిన నాణెముల సంగతి వ్రాసి యీ విషయము ముగించెదను.

లోగడ సూయల్‌గారికి దొరికిన నాణెములేగాకమరి కొన్ని నూతన నాణెములుకూడ ఇక్కడలభించినవి. కంచుతో చేయబడిన నాణెమొకటి దొరికినది. అది పురాతననాణెము. దానినిగురించి పరిశోధన చేయవలసివున్నది. మిగిలినవాటిలో కొన్ని రాగితోను, మిగిలినవి సత్తుతోను చేయబడినవి. ఈ సత్తునాణెములన్నీ ఆంధ్రులవే. ఇందులో పెద్దది అర్ధరూపాయిఅంత వెడల్పుగలది. కొన్ని పావలావెడల్పుగలవి. మరికొన్ని బేడ వెడల్పుగలవి. మిగిలినవి అంతకంటె అతి చిన్నవిగావుండి వివిధ ఆకారాలతో వున్నవి.

పెద్దనాణెముల సంగతి ప్రథమమున పేర్కొనెదను. మరీ చిన్ననాణెముల సంగతి తెలుపుటకవకాశములేదు. వాటి వెనుక ఉజ్జయినీ సంజ్ఞమాత్రము కాన్పించును.

1. చైత్యనాణెము. సీసపుది చంద్రంగావుండి 15చిన్నముల ఎత్తుసరికలదు.

ముందువైపు మూడు స్తూపములు, వాటిక్రింద ఒక సర్పము, నాణెముచుట్టు రాజుపేరు కలదు. "రానోవశిథిపుతస" వెనుకవైపు ఉజ్జయినీ సంజ్ఞకలదు.

2. రెండు తెరచాపలుగలది. సీసపుది. యజ్ఞశ్రీశాతకర్ణిది. ఈ నాణెము ముందువైపు రెండు తెరచాపలున్నవి. అక్షరములున్నవి గాని బాగా కన్పించటంలేదు. ఇది చాలా పెద్దనాణెము. ఈ ఓడలు బర్మా, మలయా, జావా, ఇండోచైనా, మొదలగు ప్రదేశాలకేగాక పర్షియా, ఈజిప్టు, రోము



రోమను నాణెములు




ఆంధ్రుల నాణెములు



రోమను నాణెములు — వెనుకప్రక్క. ప్రాచీన ఆభరణములు.

మొదలగు పాశ్చాత్య దేశాలకుకూడ పోయెడివి. ఈ ఓడ ప్రతిమభావము, ఆ రాజు అధికారము సముద్రముమీదను, ఉత్తరదేశమునను వ్యాపించివుండెనని, ఆ కాలమున జరుగు చుండెడి సముద్రవ్యాపారమునకు నిదర్శనముగ వున్నదంటు న్నాడు విన్సెంట్ స్మిత్తు.[1]

3. ముందువైపు అర్ధచంద్రాకృతికలిగి తెరచాపత్తో నున్న ఓడ. చాల తేలికగాను బేడంత చిన్నదిగాను వున్నది. 7 చిన్నముల తూకం. వెనుకవైపు పడమరవైపునకు ముఖము త్రిప్పివున్న సింహముద్రగలదు.

ఈ చిన్నఓడలు కృష్ణా గోదావరీ ముఖద్వారముల బయలుదేరి, గంగా ముఖద్వారమువరకున్న సింహళము వరకున్న ప్రయాణముచేస్తూ, మధ్యగలరేవుల్లో ఎగుమతి దిగుమతులు చేస్తూ తిరిగేవి.

4. గుఱ్ఱము—ముందువైపు గుఱ్ఱము. సీసపుది. అక్షర ములు స్పష్టంగాలేవు. చాలా తేలికగావున్నది. $10\frac{1}{2}$ చిన్న ములు. వెనుకవైపు నున్నగావున్నది. బహుశా దీని వెనుక వైపువుండు ఉజ్జయినీసంజ్ఞ పోయివుండును.

## రోమను నాణెములు

రోమనులు—వీరు ఐరోపా ఖండమునందలి ఇటలీదేశ స్థులు. మంచి నాగరికత, బాహుపరాక్రమముకలిగి క్రీస్తు శకమునకు ముందే ఐరోపాఖండమునంతను జయించి,ఆ ఖండ మునకంతకును నాగరికతను నేర్పిరి. వీరి ముఖ్యపట్టణము

1 See Early History of India. Page 202

రోము. ఇది టైబరు నదీతీరమున క్రీ.పూ. 753 సంవత్సరమున కట్టబడెను. వర్తకవ్యాపారమునకు అనువుగా వుండుటచేతను, రాజధానియై వుండుటవల్ల, నగరములోని ప్రజలకే సర్వ హక్కులు వుండుటచేత వీరుపేరు ప్రఖ్యాతులుగాంచిరి.

రోముతో పశ్చిమోత్తరమున గుసానులును, దక్షిణమున కేరళులు, చోళులు, ఆంధ్రులు విశేషముగా వర్తకము చేసిరి. రోమనులు హిందూదేశ వస్త్రముల సౌందర్యముయొక్క వ్యామోహమునకు లోబడి, యెంత వెలకయినను, మజ్లినులను, బంగారు సరిగంచు వస్త్రములను, కొని కోట్ల కొలది ధనమును, హిందూదేశీయులకు బంపుచుండుటచే 'ఎల్డర్ ప్లైని' అను చరిత్రకారుడు తన దేశమునకు కలుగుచున్న ఆర్థిక నష్టమునకు చింతిలుచు, తనదేశమునుండిసంవత్సరమునకు 10 కోట్ల సెస్టరులు పోవుచుండెనని వ్రాసెను.

ఇలా రోమునుండి దక్షిణదేశమునకు వచ్చిన ధన ప్రవాహము వచ్చిన కాలము నాణెములనుబట్టి, భండార్కరుగారు. అగస్టస్ (క్రీ. పూ. 44-14) కాలమునుండి, నీరో మరణమువరకు అనగా క్రీ. పూ. 27 నుండి క్రీ. శ. 68 వరకు విశేషముగా దొరికెనని, ఇందుకు కారణము ఆకాలమున యీప్రాంతముతో విశేషముగా వర్తకము జరిగియుండవచ్చునని, దానికి సాదృశ్యముగానే, ప్లైని (క్రీ. శ. 70) చరిత్రకారు డాకాలమున తన దేశీయులు విదేశవస్తువులకై అపరిమిత ధనము ఖర్చుచేయుచున్నారని వ్రాసియుండుటబలపరుచు

చున్నదని, వర్తకము అగస్టస్‌కు ముందే ఆరంభము కావచ్చునని వ్రాసిరి.[1]

కాని ఆంధ్ర చరిత్రకారులు నెల్లూరులో విశేషముగా రోమను నాణెములు రెండవ శతాబ్దములోనివి దొరికెననియు (Hadrion) (క్రీ శ. 117_138) అడ్రియాను పౌష్టినాయను, ట్రాజన్ (క్రీ. శ. 107) నాణెములు పేర్కొనుచు, అందులో ట్రాజన్ నాణెములు శ్రేష్ఠమైనవని వ్రాసిరి.[2]

ఘంటసాలలోను రెండవశతాబ్దపు నాణెములుదొరుకు చుండుటచే ఆంధ్రదేశము రోముతో రెండవశతాబ్దమువరకు అధికముగా వ్యాపారము చేయుచుండెనని స్పష్టపడుచున్నది.

రోమనునాణెములువిస్తారముగా దొరకుటకు కారణము "మనదేశములోని ప్రాచీన బంగారపునాణెములు బొత్తిగా దొరకకపోవుటకు, మేముచెప్పు సమాధానము బహుసులభమైనది. 1,2 క్రీస్తుశతాబ్దములలో హిందూదేశమునకు రోమునకు విస్తార వ్యాపారము జరిగి, ఆమొత్తము అయిదులక్షల నవరసులవరకు హెచ్చెను. ఈ మొత్తమంతయు వెండిబంగారు రూపమున వచ్చుచుండెను........................ దక్షిణదేశమున రోమను నాణెములు విస్తారముగా నేటివరకు దొరకుటకు, ఆ నాణెములు యీప్రాంతమున రోములోవలె చలామణి అగుటయే, ఈ ప్రాంతములలో యేవిధమైన ప్రాచీన నాణెములు దొరకకపోవుటకు కారణము.'[3] అని కన్నింగుహాంగా రంటున్నారు.

1 Ancient Indian Numismatics P. 201, 202.
2 ఆంధ్రదేశ కథాసంగ్రహము పూర్వయుగము పుట 190.
3 The Coins of Anicicnt India Cunningham.

రోమను నాణెములు—ఇవి మేలిమి బంగారముతో షుమారు నవరసు తూకముతో పోతపోయబడినవి. ఒకవైపున రాజు విగ్రహము పేరు, మరొకవైపున, ఏదైన దేవతయొక్క గాని, దేవాలయంయొక్క గాని విగ్రహమున్నూ, దాని పేరున్ను కలిగి రెండువైపులా వాటిచుట్టూ నగిషీ కలిగివున్నవి. పురాతనమైన నాణెములపైన అక్షరములు మోటుగావుండెను కాని, రెండవ శతాబ్దపు వాటిపై అక్షరములు నేటి అచ్చు అక్షరములవలె అతి అందముగానుండుటే గాక, నేడే టంకసాల నుండి వచ్చినవాటివలె తళతళ మెరుస్తున్నవి.

ఈ నాణెములు ఆంధ్రదేశములో ఇంతవరకు కడప, నెల్లూరు, వినుకొండ, గుడివాడ, ఘంటసాలలో దొరకెను. ఘంటసాల వాణిజ్యకేంద్రమగుటచే ఇక్కడధికంగా నాణెములు దొరికెను. ఈ నాణెములు చెడగొట్టి అనేకులు నగలు చేయించుకొనిరి. కొందరివద్ద వర్షాకాలములో భూమిపై అప్పుడప్పుడు దొరికిన నాణెములఫోటోలు తీయించి, ఆ బ్లాకులే ఇందు పొందుపరచితిని.

అందులోని ఆరు ప్రతిమల్లో 4 యాంటోనినస్ క్రీ. శ. 138 న 5 (Hadrian) అడ్రియన్ క్రీ. శ. 117 మిగతావి ఎక్కువగా పోల్చలేకపోతిమి.

## ప్రాచీన ఆభరణములు

పూర్వకాలములో "స్వర్ణకారులు వెండిబంగారపు భూషణములు చేయువారు; వీరు బంగారుపై అత్యంత

రమణీయములగు నగిషీ చెక్కుటలో ప్రసిద్ధిగాంచిరి."[1]

దీనికి సాదృశ్యముగనే మా కిటీవల ఈ గ్రామములోని ఒకగృహస్థునింట పురాతన ఆభరణములు చూచుటతటస్థించినది. ఆ నగల ప్రతిబింబాలు యీ రోమను నాణెములతో కలసివున్నవి.

1 దీనిమీద చక్కని నగిషీ, మధ్య ఎర్రరాయిపొదిగివున్నది. బహుశా దీనిని స్త్రీలుగాని చిన్నపిల్లలుగాని ముఖమునకు కట్టుకొను నగగా యున్నది, దీనిని ముఖబంద్ అనవచ్చు. దీనిఎత్తుసరి 10 చిన్నములు.

2 ఇది ఒకరూపు. చుట్టూ చక్కని నగిషీపని మధ్య ఒక స్త్రీ చంటిపిల్లతో కలదు. దీని తూకం 3¼ చిన్నములు.

3 పాదములు. దీనిఎత్తుసరి 4 చిన్నములుమాత్రమే. బహుతాటగావున్నది. దీనిమీద చేసిన నగిషీ పని బహుఅద్భుతంగా వున్నది. ఇంతపలచని రేకుపై ఆ పనివాడు ఇంత మనోహరంగా నగిషీపని ఎలాచేశాడాఅని మనకు ఆశ్చర్యము వేయును. ఈ పాదములు ఎవరివో! బహుశా రామచంద్రునివో లేక సీతామహాదేవివో కావచ్చు. ఇది ఆభరణముకాదు, పూజకుపయోగించునదిగా తోచును. ఆకాలపు పనితనమునకు ఇవి ప్రబల నిదర్శనములు.

## కుమ్మరపనులు

"ఆకాలపునాటి కుమ్మరులీకాలపునాటి వారికన్న నధిక చాతుర్యము గలవారని నాకు దొరకిన పగిలిపోయిన

1 బౌద్ధమహాయుగము పుట ౩౭౭

కుండముక్కలు మొదలుగునవి తేటపఱుచుచున్నవి. అయ్యది నిస్సంశయంగా నిర్వివాదాంశము. కొన్ని కుండలయొక్క మూతులు మూడు నాలుగడుగులు నడిమికొలత గలిగి మిక్కిలి పెద్దవిగానుండి ధాన్యము మొదలగునవి నిలవజేసు కొనుట కనుకూలంగానుండి యుండబోలు. కొన్ని మిక్కిలి సొగసుగా నగిషీ చేయబడినవిగా నున్నవి."[1]

ఈ గ్రామములో పాళ్ళమీద వివిధరకములైన వింత గొలుపు కుండపెంకులు దొరకును. కొన్ని పెద్దపెద్ద బానల ముక్కలు, వాటిఅంచులు చాలా వెడల్పుగను మందముగ నుండును. ఆ బాన మధ్యప్రదేశపు ముక్క మందము అరం గుళముగలదు. మధ్యభాగము నలుపుగను లోపలిభాగము, పైభాగము ఎర్రగానుండును. దీని లోపలిభాగమునకు సున్నము దట్టముగా అంటివున్నది. బహుశా ఇది గట్టికొరకు పూయ బడి వుండునేమో.

ఇంకను వివిధరకములైన పెంకులు దొరకును. అవి అన్నీ చాల అందముగా వుండును. అవి ఎరుపురంగుతోనే వుండును. కొన్ని సాదావి. మరికొన్ని నగిషీపని కలిగి చాలా అద్భుతముగా వుండును. అంచులకు, మధ్యభాగములకుకూడ వివిధములైన నగిషీలతో వున్న పెంకులు దొరకును. కొన్ని ఎర్రని అంచులుగల పెంకులు దొరికినవి. అవి పగడపురంగు గలిగి పాలిష్ చేసినట్లు బహు నునుపుగాను, రమ్యముగను వున్నవి.

---

1 ఆంధ్ర దేశకథా సంగ్రహము పూర్వభాగము పుట ౧౮౩

అన్నిటికంటె చిత్రమైనదగు ఒక మూకుడు పెంకు దొరకినది. దాని మధ్యభాగము కొంచెము ఘందము, అంచు పోనుపోను క్రమముగా మందముగ పెంచబడి, బైట ఎర్రరంగు తోను, అంచు లోపలిభాగము తారువంటి మిక్కిలి నల్లని రంగుగలిగి బహు నునుపుగా పింగాణీ పాత్రవలె నీడ కన్పించుచు చూచు వారలకు ఆ కాలపు కుమ్మరుల హస్తనైపుణ్యము; బుద్ధికుశలత చాటుచున్నవి.

## వాణిజ్య కేంద్రము

ఆంధ్రనాణెములపై ఓడముద్రలుండుటచే నౌకావ్యాపార మాకాలమున సాగుచుండెనని ఆంధ్రరాజులద్దానిని ప్రోత్సహించుచుండిరని విదితమగుచున్నది. ఇపుడా కాలమున నాంధ్రదేశమే యేదేశములతో వ్యాపారమొనర్చియుండెనో యనుసంగతిని గురించి తెలిపినపిదప కంటకశైల వాణిజ్యకేంద్రమనువిషయమును విశదీకరించుట సముచితము.

క్రీస్తుకుపూర్వమే ఆంధ్రదేశము మంచి నౌకలుకలిగి యుండి వివిధదేశములతో విస్తారమగు వ్యాపారము చేసియుండెను. అందుచే ఆంధ్రదేశ మాకాలమున ఐశ్వర్యముతో తులదూగెను.

"ఈ ప్రాంతములలో బౌద్ధమతాభివృద్ధికి వాణిజ్యమే కారణము. ఏలనన వణిజులలోఁ బెక్కుమంది బౌద్ధులే. వారీ విధముగా నైశ్వర్యము గడించుటయేగాక తద్వాణిజ్యము

వలన నాంధ్రరాజులుగూడ మిక్కిలి లాభమువడసిరి. ఆ కాలముననే గొప్పగొప్ప స్తూపములన్నియు నిర్మింపబడెను. కృష్ణా గుంటూరు మండలములలో క్రీ.శ. ౨-3 శతాబ్దులలో నిర్మింపబడినస్తూపములన్నియు నాకాలమందలి బౌద్ధ వణిజులయొక్క యైశ్వర్యమునకును ధర్మనిష్ఠకును నిదర్శనములు."[1]

ఆంధ్రదేశ మాకాలమునసింహళము, యవ, సుమత్రా, భరణి మున్నగు ద్వీపములతోను, కామరూప, బర్మా, చీనా, రోము, గ్రీసు, మొదలగు దేశములతోను వ్యాపారమొనర్చెను.

వివిధదేశములతో వ్యాపారము జరిపినను మనదేశములో లభించిన రోమను నాణెములవల్లను, విదేశచరిత్రకారులవల్లను రోముతోడి వ్యాపారమునుగూర్చియే విశేషముగా దెలియవచ్చుచున్నది. రోముతోడి వ్యాపారప్రారంభ మీ క్రింది ప్రమాణమువలన తెలియనగును.

"ఆంధ్రమహాసామ్రాజ్యంతో సంబంధము గలిగినది. రోమక సామ్రాజ్యము, క్లాడియస్ చక్రవర్తుల కాలమున వర్తకమారంభమాయెను. ఆంధ్రచక్రవర్తుల పోషణముక్రింద వర్తక మభివృద్ధిగాంచి యాంధ్రదేశమునకేగాక హిందూదేశమునకుగూడ నైశ్వర్య ప్రదాయకమయ్యెను."[2]

---

1 Epigraphia Indica Page IV

2 ప్రాచీనాంధ్ర నౌకాజీవనము పుట ౨౨

ఆనాటి రోముతోడి మనవ్యాపారమునుగూర్చి ఆశ్చర్యకరమగు ఈ క్రిందివిషయము గమనించవలసినది.

"ఆకాలమున నాగరిక ప్రపంచమును విస్మయపడజేసిన హైందవ పీతాంబరములును, పాముకుబుసముల దిరస్కరించు మజిలిన్ వస్త్రములును, బంగారు జరీవలువలును రోమకప్రజలను మూర్ఛాగతుల నొనర్చెడివట. భోగలాలసులగు రోమన్ నారీమణు లెంతమూల్యమైన నిచ్చి వీనిని గ్రహించెడివారట! రోమక సామ్రాజ్యమునుండి భారతవర్షమునకు వాణిజ్యరూపమున బ్రవహించి వచ్చుచున్న ధనప్రవాహమునుజూచి 'ప్లైని' (రోమను చరిత్రకారుడు క్రీ. శ. 77 మిగుల బ్రఖ్యాతము) నిట్టూర్పు విడచుచు నట్టి ధనక్షయము రోమను ప్రజాళికి మిక్కిలి యరిష్టదాయకమని వాపోయినాడు ........ రోమను రాజ్యమునుండి యాకర్షింపబడినరోమను నాణెములు ఆగష్టస్ సార్వభౌముని కాలమునాటివి నెల్లూరు, ఘంటసాల, గుడివాడ ప్రాంతములలో బెక్కులు కాన్పించినవి. ఈనాణెములు దక్షిణ హిందుస్థానమున నిప్పటి బ్రిటిషురూకలంత విరివిగ నుండెడివట. దీనివలన రోమక హైందవరాజ్యములకు నడుమ నెంతటి యపారమగు వ్యాపార వాణిజ్యములు నడచెనో గ్రాహ్యమగుచున్నది."[1] ఇంత యఖండవ్యాపారము జరుగుటచేతనే నేటికి నిచట రోమను నాణెములు దొరకుచున్నవి. ఇక నీ కంటకశైలనుండి యాకాలమున వివిధదేశములకు రవ్వశల్లాలు, మల్లుశల్లాలు, పట్టుశల్లాలు పలువిధములగు రంగువస్త్రములు కలంకారీ యద్దకములో నిపుణతగన్న

---

1 ప్రాచీనాంధ్ర వాణిజ్యవైభవము

ముద్రసరకులు నింక పలురకములైన యితరపరిశ్రమలు ప్రసిద్ధి గాంచి యెగుమతి యగుచుండె నని 'నేతపరిశ్రమ' వలన విదిత మగు చున్నది. "తూర్పుతీరమునగూడ నాకాలమున మంచి రేవులుండెడివి. కృష్ణాజిల్లాలోని కృష్ణాపట్టణము ఘంటశాల గూడూరు—ఈ రేవులద్వారా యమూల్యమైన వస్త్రములు యెగుమతి దిగుమతు లగుచుండెడివి. ఆనాటివ ర్తకులు సింహళమునుంచి సుగంధద్రవ్యములును, సుమత్రానుంచి బంగారమును, చైనానుంచి కర్పూరమును మనదేశమున కీ రేవుల గుండా దిగుమతి చేసెడివారు. సన్నని వస్త్రములును మేలైన దూదియు రోముకును ఈజిప్టునకు నెగుమతి చేయబడు చుండెడివి."1

ఆంధ్రదేశమునకు వజ్రభూమియను పేరుండెను. ఇది గాక రాబర్టు సూయల్ గారు విశేషానుభవముగల మణికారకులు (రత్నవర్తకులు పూసలవర్తకులును, రత్నములు సానబట్టువారును మణి కారకు లనబడుదురు) ఈ ప్రాంతమున నుండిరని చెప్పుటచే నిచటనుండి విశేషముగ మణులు మొదలగునవి యెగుమతి యగుచుండెనని యూహింపనగును. ఇచట లభించు పురాతనపు ఇటుకరాళ్ళలో ఊకయుండుటచే నిచట నుంచి బియ్యముగూడ నెగుమతి యగుచుండె నని తలంపవచ్చును.

## విదేశవర్తకులు వర్తకశాలలు నెలకొల్పుట

క్రీ. పూ. 2 వ శతాబ్దినాటికే ఆంధ్రదేశ మితర దేశములతో వర్తకమొనర్చి అభివృద్ధి నొందెను. విదేశీయుల

1 ది 17-9-1939 ఆంధ్రపత్రిక పుట ౬

ఎవరికిని సముద్రమార్గము తెలియకపోవుటచే లాభమంతయు మనవారేపొందుచుండిరి. పిమ్మట వారుగూడ మార్గము గని పెట్టి వాణిజ్యము చేయజొచ్చిరి. ఇటుల మన దేశమునకు మొట్టమొదట వచ్చినది హిప్పాలస్. ఇతడు క్రీ. శ, 47 వ సం॥రమున వచ్చి హిందూమహాసముద్ర బంగాళాఖాతము లందు దిరిగి "పెరిప్లస్ ఆఫ్ ది ఇరిత్రియన్ సి" అను గ్రంథ మును రచించెను.

ఇట్లు హిప్పాలస్‌తో ఆరంభమైన విదేశీయులరాక నానాటికభివృద్ధి జెందెను. అనంతరము 16వ శతాబ్దియందు బందరులో విదేశీయులగు ఒళందులును, పరాసులును, ఆంగ్లేయులును వలసవచ్చి వర్తకశాలలు నిర్మించినటులనే ఆంధ్రసామ్రాజ్య కాలమున పారసీకులు, ఫినీషియనులు, గ్రీకులు, రోమనులు మున్నగు విదేశీయులును పరిశ్రమలభి వృద్ధిలోనున్న ప్రదేశములలో వలసలేర్పరచుకొని వర్తక మొనర్చుచు దేశీయ వర్తకులు పొందు లాభమును దామే పొందసాగిరి.

"రోముతో వ్యాపారము రానురాను విస్తారముగ జరిగెను. కొంతకాలమునకు బిమ్మట రోమనులనేకులు దక్షిణ హిందూస్థానమున కేతెంచి స్థిరపడిరి.........క్రీస్తు శకపు మొదటిరెండు శతాబ్దులలో రోమనుపౌరులు వర్తకముకొరకు వచ్చిదక్షిణహిందూస్థానమునబెద్ద పెద్దవలసగుంపులుగానేర్పడి స్థిరపడిరని ననుటకు మంచిహేతువులు గలవని విన్సెంటు స్మిత్తుగారు వ్రాయుచున్నారు."[1]

---

1 హిందువుల ఆధిక్యము పుట ౬౮

ఇటుల వలసజొచ్చుటయేగాక దిగువ నుదహరించిన ప్రదేశములందు వర్తకశాలలగూడ నెలకొల్పివిరివిగ వ్యాపార మొనర్చినట్లు విదితమగుచున్నది.

"పశ్చిమతీరమున కళ్ళికోటయుఁ దూర్పుతీరముల కావేరిపట్టణమును మైసాలియానగరము కలకసాలయును కూడూరును పాలూరును మొదలగు నగరములం దొక కాలమున విదేశీయులు వర్తకశాలలు నెలకొల్పియుండినట్లు తెలియుచున్నది."[2]

## నాగరికతను వ్యాపింపజేయుట

ప్రాచీనకాలమున సాహసికులగు ఆంధ్ర ఓడకవర్తకులు వివిధదేశములకు వర్తకమునకై వెడలుచుండిరి. వారితోఁబాటు బౌద్ధభిక్షువులును బ్రాహ్మణ ప్రచారకులుగూడ దమ తమ మతబోధలకై యాయాచోటులకు బయలుదేరుచుండిరి. వారు సుమత్ర జావా ద్వీపముల కరిగి యచ్చటి యనాగరిక ద్వీపవాసులను నాగరికులుగఁజేసిరి. జావా, సుమత్ర, బోర్నియో మొదలగు ప్రాగ్ద్వీపములలో నాంధ్రదేశపు బట్టణనామము లెన్నియో యుండుట యిందులకు నిదర్శనము. ఈ దీవులందేగాక బర్మా మొదలుకొని మలాకాద్వీపకల్పము వరకు నాంధ్రులవలస లనేకములు గలవు. ఆంధ్రదేశము నుండియే నాగరికత ప్రాగ్దేశములకును, ద్వీపములకును వ్యాపించెననుటకు సయాం, కంబోడియా మొదలగు దేశము

2 ప్రాచీనాంధ్ర నౌకాజీవనము, పుట ౪౬.

లందు శాలివాహన శకము నేటివరకును నాణెములలో వుండుటే నిదర్శనము.

ఆంధ్రదేశమునుండి వివిధ ప్రాంతములకు వర్తకులతో పాటు మత ప్రచారకులుకూడా పోయి నాగరికతను మన దేశములో బౌద్ధమత మభివృద్ధిలోనున్నంతవరకును వ్యాపింప జేయుచు లోకకల్యాణార్థము పాటుపడిరి. ఇటుల నాగరికత ఘంటసాల, గూడూరు రేవులనుండి వ్యాపించెననుటకు నిదర్శన మీ దిగువ నుదహరించుచున్నారము.

"టోలమీ పేర్కొనిన కొంటకొస్సైల ఘంటసాలకును కొడ్డూర మచిలీపట్టణ సమీపముననున్న గూడూరుకును సరి పోవుచుండుటచే నూతన చరిత్రాంశ మొండు ద్యోతకమగు చున్నది. ఈ రెండునగరములును మిక్కిలి ప్రాచీనప్రశస్తి గలిగినవనుటయేగాక యిటీవలివరకు విశేషములు తెలియ రాకుండెను."[2]

"బర్మా, కంబోడియా, మలాకా, సయాం దేశముల లోని నాగరికత దక్షిణ హిందుస్థానమునుండి కొనిపోబడినదే యని ప్రతీతియేగాని యా నాగరికతను గొంపోయిన సాహసి కులకు దూర్పుతీరమున నిర్గమద్వార మెద్దియో చరిత్రకారకు లన్వేషింపలేకుండిరి. కాని టోలమీ పేర్కొనిన నగరము లాంధ్రదేశములోని వైనట్లు చరిత్రకారు లిప్పుడు నిశ్చయింప గలుగుటచే నాంధ్రదేశమునుండియే బర్మామొదలుకొని-చీనా వరకు గల దేశములన్నిటికిని హిందూ నాగరికత, హిందూ

2 ప్రాచీనాంధ్ర నౌకాజీవనము పుట 73

దేశపు మతములు, చిత్రకళలు మున్నగునవి గొంపోబడెనని నిశ్చయముగా జెప్పుట కవకాశము కలుగుచున్నది. ఈ విషయమునుగూర్చి వ్రాయుచు డూబ్రియెల్ పండితుడు టోలమీ కాలమున బర్మా, మలాక, కంబోడియా, అనాం, జావా దేశములకు హిందూ నాగరికత ఘంటసాల, గూడూరు రేవుల నుండియే బయలుదేరి వ్యాపించినటుల నిస్సంశయముగా సిద్ధాంతీకరింపవచ్చునని నుడివియున్నాడు.[1]

## అధినివేశ రాజ్యము లేర్పరచుట

ఆంధ్రసామ్రాజ్యకాలమున బర్మా, సయాం, అనాం, కంబోడియా మొదలగు దేశములతో ఆంధ్రులు వాణిజ్య మొనర్చుటయేగాక పెక్కుమంది ఆ దేశములకు వలసవెళ్ళి అచట నివాస మేర్పరచుకొనిరి.

క్రీ. శ. 1 వ శతాబ్దినాటికే తెలంగాణమునుండి వర్తకులు వెడలి ఐరావతీ డెల్టాభూముల నాక్రమించుకొని రాజ్యస్థాపన మొనర్చి బౌద్ధమత ప్రచారము జేసిరి. బర్మాదేశములో తెలుగురాజులకు ప్రథమ రాజధాని తాటన్. ఇదే త్రాటన్, త్రట్టునాడు అనగా అగసాలిపట్టణము. ఇందుచేతనే బర్మాకు సువర్ణభూమి యను పే రాకాలమున వచ్చెను. టోలమీ ఘంటసాల గూడూరు రేవులనుండియే ఇండోచైనా బర్మా, సయాం మొదలగు ప్రాంతములకు వాణిజ్యమునకై యోడలు పోవుచుండెనని వ్రాసెను.

1 Ancient History of the Deccan. Page 66, 88.

శ్రీయుత చేకుమళ్ళ రాజగోపాలరావుగారు కూడ ఈ విషయమిట్లు వ్రాయుచున్నారు.

"సయాం, అన్నాము మొదలగు దేశములతో బందరు సమీపమందలి రేవుపట్టణములు వర్తకముజరుపుచుండెడివి."[1]

"ఆంధ్రులు తూర్పుతీరమునకు వలసపోయినట్లు నిదర్శనములు కలవు"

ఈ రేవుపట్టణములు గూడూరు ఘంటసాలలను సంగతి విఖ్యాతవిషయమేగదా! ఇంక నిచటనుండి వలసజొచ్చుటయే గాక యధినివేశ రాజ్యములగూడ నేర్పరచిన ట్లనేకప్రమాణములు గలవు.

"క్రీ.శ. 75వ సంవత్సరములో నమరావతీ పట్టణమును రాజధానిగాఁగలిగి హిందూదేశమును బాలించిన ఆదిత్య సార్వభౌముని కాలమున ఘంటసాల గూడూరు రేవులనుండి జావాద్వీపమునకు వలసనంపి యధినివేశరాజ్య మేర్పరుప బడెను"[2]

"ఆంధ్రచక్రవర్తుల కాలమున బౌద్ధమతము ద్వీపద్వీపములకు వ్యాపించెను. హిందూనాగరికత క్రీస్తుశకారంభకాలములోనే ప్రాక్సముద్ర ద్వీపములకు వ్యాపింపనారంభించెను. కటకశాల, గూడూరు రేవులనుండి క్రీ. శ. 75 సం॥ ర ప్రాంతమున నాంధ్రదేశీయులు వలసబోయి జావా

1 భారతి—సంపుటము 4 సంఖ్య 7 పుట ౧౧౯

2 నేతపరిశ్రమ పుట ౭౦

ద్వీపములందధినివేశ రాజ్యము లేర్పరుచుకొనిరి. ఈ మహత్కార్యము నాదిత్యుడను రాజొకడు నిర్వహించె నని తెలియు చున్నది."[1]

ఇటు లీప్రాంతమునుండి వలస లేర్పరుచుటయు నధిని వేశ రాజ్యములు స్థాపించుటయే గాక బౌద్ధభిక్షువులు వివిధ దేశముల కరిగి తమ మతవైభవములను జాటిరి. ఆంధ్ర సామ్రాజ్యకాలమున మన దేశము మహదైశ్వర్యముల నొందుటయే గాక తన్నాగరికత విజ్ఞానము వివిధ రీతుల విలసిల్లి వివిధదేశములకు వ్యాపించెను.

"దీనికి సాదృశ్యముగనే యమరావతీస్తూపమునందలి చిత్రరువులు కృష్ణా గోదావరీ ముఖద్వారములందుండిన రేవు పట్టణములనుండి సువర్ణభూమి, (దక్షిణ బర్మా) కంబోడియా, సయాం దేశములకును, జావా, బోర్నియో, సుమత్రా మున్నగు ప్రాగ్ద్వీపములకు వివిధప్రాంతములనుండి వచ్చిన బౌద్ధభిక్షువులు మతప్రచారమునకై పోయినటుల సాక్ష్యమిడు చున్నవి."[2]

## బౌద్ధులకు కూడలిస్థానము

కంటకసేల వాణిజ్యకేంద్రమని తెలుసుకొంటిమి. ఈ వాణిజ్యము పరదేశములతో నౌకామార్గమునజరుగుచుండుట చేత, ఆ కాలమునందలి వర్తకులు అధికధనము సంపాదించి ఇక్కడ స్తూపములు, సంఘారామములు కట్టించుటచేతను,

---

1 ప్రాచీనాంధ్ర నౌకాజీవనము, పుట 81.

2 Indian Archtecture. Page 103

ఈ ప్రాంతమునుండియే నౌకలమీద బౌద్ధభిక్షువులు, బుద్ధదేవుని దివ్యప్రేమ సందేశమును తెలుపుటకువివిధదేశములకు ఆ యావరక నౌకలతో అరుగుచుండుటచేతను, ఈ కంటకసేల సింహళమునందలి బౌద్ధులకును, ఆంధ్రదేశమునందలి బౌద్ధులకును, ఒక ప్రాంతమునుండి మరొక ప్రాంతమునకు పోవుటకు జంక్షన్‌గా (కూడలి) వుండెను.

ఈ కంటకసేల ఆ కాలమున అనేక శాసనములలో పేర్కొనబడుటచేతను, అనేకులు యిక్కడ బౌద్ధస్తూపములకు దానధర్మముల నిచ్చియుండుటచేతను ఇది పుణ్యక్షేత్రమై యుండెననుటకు అవకాశముగలదు.

ఇది బౌద్ధయుగమున చీనా మొదలు రోమువరకు ప్రఖ్యాతమై విలసిల్లి, వివిధదేశములనందలి బౌద్ధులకు కూడలి స్థానమైయుండెను. దీనికి తార్కాణముగనే యిచట అనేక బౌద్ధమత కట్టడముల శిథిల చిహ్నములు నేటికిని కానవగుచున్నవి.

## పెదవేగి — కంటకసేల

బృహత్పలాయలను పల్లవులను 300 సంవత్సరములును తరువాత వారిని జయించిన తూర్పు చాళుక్యులను మరి 300 సంవత్సరములును 7వ శతాబ్దమువరకు యిటుల 600 సంవత్సరములు యేకరీతిని రాజధానిగా నుండి వేంగిపురమని పిలువబడి పన్నెండు విస్తీర్ణము గలిగి మహాభోగభాగ్యముల ననుభవించిన ఆ పట్టణప్రదేశమున నేడు చినవేగి పెదవేగి యను గ్రామములు శిథిలదేవాలయములతోను దిబ్బలతో

నున్నవి. పెదవేగి యేలూరునకు ఉత్తరమున 6 మైళ్ళ దూరమున గలదు.

పెదవేగి గ్రామములో ఒక అసామిభూమి దున్నుచుండగా యీ శాసనము కనిపించినది.

శాసనశిల— ఇది ఒక చలువరాయి. మొదలు చివర కూడ విరిగి మధ్యఖండము మాత్రమే మిగిలినది.

ఈ శాసనమునందలి భాష ప్రాకృతము.

బ్రాహ్మీలిపిలో వ్రాయబడెను (దేవనాగరి తెలుగు కన్నడములకు మాతృక)

శాసనము:—

219 of 1927

జె కంటకశాలి

అపరశేల

దవేంగవలితి

నఘుంచా అ

"ఇందులో కంటకశేలి (ఘంటసాల) అపరశేల, పెదవేగియొక్క పేర్లుమాత్రము ఉదాహరింపబడెను" 1

ఇది శిలాశాసనముయొక్క మధ్యభాగమగుట చేతను మిగతా ఖండములు దొరకకపోవుటచేతను యీ శాసనమును

1 Buddhist remains in Andhra and History of Andhras. Page 4.

గురించి యేమియు చెప్పుటకు వీలులేదు. కాని ఆకాలములో కంటకసేల ప్రఖ్యాతమగుటచేతనే యీ శాసనములోను ఇతర శాసనములలోను పేర్కొనబడుటకు కారణములని తలప వచ్చును.

## అమరావతీ స్తూపము - కంటకసేల

"భక్తులైన ఆంధ్రదేశకళోపాసకులు బుద్ధభగవానునికి కానుకగా సమర్పించిన యట్టి పూజాకుసుమములలో అమరావతీ స్తూపము శ్రేష్ఠమైనది. చలువరాతిమీద చిత్రితమైన యీ అమరావతీ శిల్పసంపదను సూక్ష్మముగ బరిశీలించినచో చతురులైన బౌద్ధయుగమునాటి ఆంధ్ర శిల్పకళా విశారదుల చేతిలో నా చలువరాయి తనకాఠిన్యమంతయు వీడి యెట్లు తీర్చినట్లు చక్కనగు మైనపుముద్దగా మారినదని తోపక మానదు."[2]

ఇది కృష్ణాతీరమున ఆంధ్రరాజధాని యగు ధాన్యకటకమను యిప్పటి ధరణికోటకు తూర్పున అరమైలుదూరమున నున్నది. ఇది యిప్పుడు గుంటూరుజిల్లాలోని సత్తెనపల్లి తాలూకాలోని అమరావతి నడుమనుండుటచేత అమరావతి స్తూప మని పిలువబడుచున్నది.

క్రీస్తునకు పూర్వమే యీ ధాన్యకటకము దక్షిణదేశమునందలి నగరములలో కెల్ల మిన్నయని ప్రఖ్యాతిగాంచి

2 అమరావతీ స్తూపము, యితరవ్యాసములు, పుట 3౦

నది. ఇందలి చైత్యము బౌద్ధవాఙ్మయమున ప్రసిద్ధమైనది. ఇంతియే గాక ఈ స్తూపము ఆంధ్రదేశమందుగల అన్ని స్తూపములకంటె ప్రాముఖ్యము జెందినది. ఇది క్రీస్తుకుపూర్వము 2వ శతాబ్దమున కట్టబడెను. భూగర్భమున బడిన యీ స్తూపము కనుగొనబడిన తరువాత ఇందలి శిల్పనైపుణ్యతవలన ఆంధ్రుల కీర్తి దిగంతముల వ్యాపించినది.

ఈ స్తూపముచుట్టు అనేక చిన్నస్తూపములు, బౌద్ధ భిక్షువులకు విహారములు (మఠములు) పుణ్యవంతులచే కట్టింపబడినట్లు యిటీవల కనుగొనబడెను. ఇచ్చట అనేక శాసనములు లభించెను. అందులో :—

"ఆకాలమునందాంధ్ర దేశమునందుండిన పట్టణములు, పల్లెలు పేర్కొనబడెను. రాజగిరి, కేవూరు, మందర, విజయపురము (బెజవాడ) ధాన్యకటకము (ధరణికోట) కుట్టుపర వేన, మహావనశాల, కూడూరు, (బందరుదగ్గర గూడూరు) లేక (కృష్ణామండలములోని గుడివాడయై యుండవలెను), వడిపరి వేవన, (బద్దిపర్రు) సాధుగ, రాజశైలము, కటకశాల (ఘంటసాల) నడతూరు, మహాకాండూరు, వేలగిరి." 1

ఈ శిలాశాసనములోని గ్రామములు కొన్ని అనగా పైన పేర్కొనబడినవేగాక మిగిలినవి యింకను తెలియరాలేదు. ఆశాసనములుకూడ కనిపించుటలేదు. మరికొన్ని విరిగిపోవుట చేతను పూర్తి వివరములు తెలియుటలేదు.

1 ప్రాచీనాంధ్ర కథసంగ్రహము. పూర్వయుగము. పుట 104

అటులనే కంటకశేలవాసిచే యివ్వబడిన దానమును గూర్చి వ్రాయబడిన శిలాశాసనముకూడ మొదలు, చివర విరిగి మొండెము మాత్రము మిగిలియున్నది. ఆఖండమునందలి భాగము ఇందు ఉదహరించుచున్నారము. ఇది బ్రాహ్మీ లిపిలో ప్రాకృతమున వ్రాయబడెను.

## నెం. 54 శాసనము 1

సిద్ధం, కటకసోలకాస, ఉపాసకాస, ఉతరాస, సమతుక, సభగినికాస, సపుతుకాస, సధుతుకాస (దానమ్)

సిద్ధం—మన వైదిక మతమువారు స్వస్తిశ్రీ అని వ్రాయునటులనే బౌద్ధులు వ్రాయు మంగళార్థకము.

అర్థము:— కటకసోల కాస = కంటకశేల వాసియు, ఉతరాస = ఉత్తరుడను పేరుగల, ఉపాసకాస= బౌద్ధగృహస్థుడు(బౌద్ధులలో గృహస్థులకు ఉపాసకులనియు, సన్యాసులను భిక్షుకులనియు అందురు) సమతుక = తల్లితోను, సభగినికాస= సోదరీమణులతోడను, సపుతుకాస= పుత్రులతోడను సధుతుకాస= కుమార్తెలతోడను, దానం= ధర్మము చేసెను.

తాత్పర్యము:—కటకసేల నివాసియు ఉత్తరుడను బౌద్ధగృహస్థుడు తల్లి, సోదరీమణులు, పుత్రపుత్రికలతో కలసి చేసిన దానము స్థిరముగా వర్థిల్లుగాక.

---

1 Burge's Archilogical Survey of South India. Vol. I Page 106, Plate No. 54.

అసలు శాసనములో 'కుమారైలతో' అంతవరకే యుండెను. మిగిలిన భాగము విరిగిపోవుటచే వచ్చినవాడు దానముచేసియుండవచ్చునని యూహించి అర్థపూర్తికొరకు 'దానం' అనిచేర్చిరి. పైభాగము క్రిందిభాగముకూడపోవుటచే అతడు యేసంవత్సరమున దానముచేసెనో, యేమిదానము చేసెనో, యెందులకొరకు చేసెనో మనకు తెలియకున్నది.

ఐననూ యిందువల్ల నేడు మనము కుటుంబములతో కాశీ మొదలగు పుణ్యక్షేత్రములకు తీర్థయాత్రలు చేయునటు లనే నాడును బౌద్ధులు అమరావతి,నాగార్జునకొండ మొదలగు ప్రదేశములకుతీర్థయాత్రలకై వెడలి పుణ్యప్రాప్తికొరకు దాన ధర్మము లొనర్చెడివారని తెలియుచున్నది.

## నాగార్జునకొండ-కంటకశేల

నాగార్జునుడు:—ఈయన ఆంధ్రబ్రాహ్మణుడు. క్రీ. శ. 2వ శతాబ్దమున జన్మించి బౌద్ధమతము అవలంబించి సన్యాసము స్వీకరించుటయే గాక బౌద్ధమతమునకు ఆచార్యుడై మహాయానమును వ్యాప్తిలోనికి తెచ్చిన మహానుభావుడు. ఈ నాగార్జునాచార్యుడు భారతవర్షమునందంతటనే గాక త్రివిష్ట పము (టిబెట్టు) నందుకూడ మహాయానము ప్రచారమొనర్చి "రాజగృహమువచ్చి 12 సంవత్సరములుండి అచ్చటనుండి ఘంటాశైలమునకరిగి యిచటనుండి దక్షిణముననున్న శ్రీపర్వతమునకుబోయి ఆమహామహుడు మనియుండిన చాలకాలము (జీవితాంతమువరకు) అచ్చటనే గడిపెను." 1

1 Asia Major Page 22

మహాయానమున సంగపరిత్యాగమును గావించనక్కర లేదు. ప్రేమపాశమును విడనాడవలసిన పనిలేదు. ఎచ్చట ఉన్ననూ, యేవృత్తి అవలంబించిననూ గృహస్థధర్మమవలంబించియు సర్వభూతములయెడ ప్రేమజూపుచు లోకకళ్యాణము గోరి సత్కార్యాచారపరాయణుడై బౌద్ధధర్మము ప్రకారము ప్రవర్తించుచుండినచో యెట్టివాడైనను నిర్వాణము పొందవచ్చును.

"నాగార్జునకొండ అంటే వట్టి రాయి రప్పకాదు, వట్టి కొండకాదు. నాగార్జునుని కొండ ప్రజా మత విప్లవానికి మరువరాని ప్రబల సంకేతం; నూతన విప్లవ విజయ సూచకంగా జనసామాన్యం వెలయించిన బౌద్ధ స్మారకచిహ్నం నాగార్జునకొండ. క్రొత్తగా తమకు అందుబాటులోనికి వచ్చిన నిర్వాణపదానికి జనసామాన్యం కట్టుకొన్న సోపానమార్గము. మూర్తీభవించిన జనసామాన్యోత్సాహం నాగార్జునునికొండ.

నాగార్జునికొండ అంటే, ప్రాచీనాంధ్రులకళానిక్షేపము విజ్ఞాన విధానం, విప్లవ పతాక, ప్రజాశక్తి............ ప్రాచీనాంధ్రులు వెలయించిన కళాస్మారక చిహ్నము: ప్రాగ్దేశములలో కళావిషయమున ఆంధ్రుల ఔన్నత్యము ప్రతిపాదించిన మహాసంస్థ. సర్వవిధాలా ఆంధ్రుల పెన్నిధి నాగార్జునకొండ."

మల్లంపల్లి సోమశేఖరశర్మ– భారతి–నవంబరు 1944.

బౌద్ధవాఙ్మయమున సిరిపర్వతము (శ్రీ పర్వతము) చాల ప్రాముఖ్యమైనది. ఈ శ్రీ పర్వతమే శ్రీశైలముగా

నిర్ణయించిరి. కాని నాగార్జునకొండలో దొరికిన శాసనముబట్టి యీ పర్వతమే శ్రీపర్వతమనుటలో యెట్టి సందేహము లేదు. నాగార్జును డిందుండుటచే నాగార్జునుని కాలమున గౌరవార్థకముగ యిది శ్రీపర్వతమని పిలువబడియుండవచ్చును. తరువాత నాగార్జునకొండ యని పేరు వచ్చియుండును. ఈనాగార్జునకొండ గుంటూరు జిల్లాయందలి పల్నాడు తాలూకాలో మాచర్లకు 15మైళ్ళ దూరమున నున్నది. ఈ పర్వత ప్రదేశము షుమారు 200 యకరముల విస్తీర్ణము గలది. ఈ ప్రదేశమునకంతకును విజయపురి యని పేరు. ఇది 3వ శతాబ్దమున ఇక్ష్వాకులకు రాజధానియై యుండెను. ఇందు అనేక చైత్యములు కలవు. నేడు నాగార్జునసాగరువల్ల ఈ క్షేత్రం తిరిగి ప్రపంచప్రసిద్ధి గాంచినది.

శ్రీ పర్వతమును ప్రదేశమున మహాచైత్యము (ప్రధానచైత్యము) కనుగొనబడె. దానిలో బుద్ధుని శరీరధాతువు దొరికెను. కాశీకి 4మైళ్ళదూరమున ఉన్నట్టియు బుద్ధుడు ప్రప్రథమమున ధర్మము బోధించినట్టిదియు నగు 'సారనాధ్' నందు నూతనముగా స్థాపించిన మూలగంధ కుటీవిహారమందు దీనిని భద్రపరచి పూజించుచున్నారు.

ఈ శ్రీపర్వతము కాశ్మీరము, గాంధారము, చీనా, అపరాంతము, వంగము, వనవాసి, తామ్రపర్ణిద్వీపము, (సింహళము) మొదలగు దూరదేశములందు బౌద్ధమతము ప్రచారము చేయువారికి పుణ్యక్షేత్రమని యిందులో దొరికిన శాసనమువల్ల తెలిసినది. బుద్ధుని శరీర ధాతువు యిచ్చట

చైత్యమున ఉండుటచేతను నాగార్జునాచార్యుడు ఇచట నివసించుటచేతను దీనికిట్టి పవిత్రత బహుళా యేర్పడి యుండ వచ్చును.

## శాసనము (No, 214 of 1927)

ఇందు అనేక శాసనములు దొరికెను. వాటి అన్నిటిలో పెద్దదియు, కంటకశేలకు సంబంధించినదియు నగు శాసనము లోని సారాంశ మిందు పొందుపరచు చున్నారము. మొట్ట మొదట బుద్ధదేవునిగూర్చి యీ విధముగా స్తోత్రము చేయ బడెను. "వందలకొలది రాజఋషు లుద్భవించిన సుప్రసిద్ధ ఇక్ష్వాకువంశమున జన్మించినట్టియు, దేవతలకు, మానవులకు సర్వజీవరాసులకు శుభకరమగు క్షేమమార్గమును చూపించి నట్టియు, కామ, క్రోధ, లోభ, మోహ, భయ ద్వేషములను, మారుని దూతల అహంకార గర్వములను నాశనముచేసి, దుష్టత్వమును దునుమాడినట్టియు; మహాశక్తి సమన్వితుడై దశశక్తులను వశమొనర్చుకొన్నట్టియు, అష్టశీలములు అను ధర్మమార్గమును జూపెట్టినట్టియు; చక్రచిహ్నములతో విరాజిల్లు భవ్యమైన దివ్యసుందర పాదములు గలిగినట్టియు; బాలార్కునితో తుల్యమగు దివ్య తేజస్సు గలుగునట్టియు; శరత్కాలమునందలి చంద్రునింబోలె మనోహరుడైనట్టియు; ప్రపంచమునందలి సమస్త జనులచే గొనియాడబడునట్టి బుద్ధ దేవుని పూజ శాశ్వతముగా వర్ధిల్లుగాక !"

మాధరీపుత్రరాజు యొక్క ౧౮ వ సంవత్సరము హేమంతఋతువునందలి ౭ వ పక్షం ౧౦ వ దినము ఇది

పేర్కొనబడెను. ఈ రాజు ఇక్ష్వాకు వంశజుడుగాను 3 వ శతాబ్దమున యున్నట్లుగాను తలచబడుచున్నది.

బహుపుణ్యావతియు, మిక్కిలి ఐశ్వర్యముగలిగిన బోధిశ్రీ (సిరి)యను బౌద్ధగృహస్థురాలు, తన భర్త, అత్తమామలు, తన అన్నదమ్ములు, అక్కచెల్లెండ్రు వారిభార్యాభర్తలు మొదలగు సమస్త బంధుకోటి పేరుపేరు వరుసను పుణ్యఫల ప్రాప్తికొరకు కొన్ని ధర్మకార్యముల నొనర్చెను.

ధర్మగిరియందొక చైత్యము రాళ్ళు వేయబడిన ఒక చైత్యగృహము, అవసరమయిన అన్నిపనులు, కులహార విహారమునందు ఒక చైత్యశాల, సింహళ విహారమునందలి ఒక బోధివృక్షముక్రింద ఒక దైవపీఠము, దేవగిరియందు ఒక గుహ, పూర్వశైలమందు ఒక తటాకము, ఒక పంచశాల, ఒక మంటపము, కృష్ణానదీముఖద్వారమున కంటకశైలమందలి మహాచైత్యముయొక్క తూర్పుద్వారమున ఒక శిలామంటపము, హీరముధావయందు మూడు గుహలు, పాపిలాయందు ఏడు గుహలు పుష్పగిరియందు ఒక శిలామంటపము.

ఈవిధముగా పవిత్రక్షేత్రములందు పైన పేర్కొనిన ధర్మకార్యములన్నియు నెరవేర్చుటకు ముగ్గురు అధికారులను నియమించినట్లుకూడ పై శాసనమున కలదు.

కనుక కంటకశేల చైత్యముకూడ పుణ్యక్షేత్రముగా తెలియబడుటయేగాక ఇందు ప్రధాన చైత్యమునకు దానము చేయబడెనని చెప్పుటచే యీ కంటకశేల యందింకను అనేక చైత్యములుండెనని యందువల్ల విదితమగుచున్నది.

## కంటకశైలలోని స్తూపములు

"ఆంధ్ర సామ్రాజ్యకాలములో బౌద్ధమతము ఆంధ్ర దేశమంతను వ్యాపించెను. ఆ కాలమునందలి మతములలో బుద్ధుని మతమే బహుజనానురాగము బడసి దేశమంతటను వ్యాపించి సర్వోత్కృష్ట జనమతముగ నెంచబడుచు నగ్రస్థానము వహించెను."[1]

"ఇట్టి మతమును మన ఆంధ్రులు అవలంబించుటే గాక దీనిని విశేష వ్యాప్తిలోనికి మనవారు తెచ్చిరి. అశోకుని అనంతరం, మగధరాజ్యమున ఆదరణ తగ్గినది. దానిని అభివృద్ధిలోనికి తెచ్చినది ఆంధ్రులే. ఆంధ్రరాజులు రాజ్యము చేయుచుండిన కాలమున బౌద్ధమతము ఆంధ్రదేశమున విరివిగ వ్యాపించియుండెను. దానంజేసి నాడు తెలుగు దేశమున బౌద్ధుల సంఘారామములు, గుహలు స్థూపములు చాల వెలిసినవి."[2]

ఇటుల ఆంధ్రదేశము బౌద్ధమతముతో నిండియుండుటే గాక, కంటకశేల పుణ్యక్షేత్రమై, బౌద్ధులకు కేంద్రమై అనేక స్తూపములకు ఆలవాలమై యుండెను.

బుద్ధుడెట్టి విగ్రహారాధన పనికిరాదని చెప్పినా, ఆయన శిష్యగణము, అనంతరము ఆ మతవ్యాప్తికై అనేక స్తూపములు కట్టిరి. స్తూప మనుశబ్దము సంస్కృతము. దీని అర్థము

1 ఆంధ్రుల చరిత్ర పుట 178.

2 బహుధాన్య ఉగాది సంచిక 75.

దిబ్బ. కాని బౌద్ధవాస్తురీత్యా ఇటుకలతోనో, రాతితోనో, ఘంటాకృతిగనుండు నిర్మాణమునకు స్తూపమని పేరు.

ఆంధ్రదేశమందలి స్తూపములన్నీ, ఇటుక రాతితో కట్ట బడి వాటిపైన బౌద్ధమతమునకు సంబంధించిన వివిధ చిత్ర శోభితమైన పాలరాళ్ళను అతికించిరి. అవి చూచుటకు కన్నుల పండువుగా వుండుటేగాక బౌద్ధగాధలన్నియు, వీటి ద్వారా తెలియును. విదేశాలకు పోయినపుడు వారిభాష తెలి యదు కాన యీశిల్పములద్వారానే అధిక స్వల్పకాలమున బౌద్ధమతము వ్యాప్తిగావించిరి.

ఘంటసాల స్తూపమును గురించి బాస్వెల్ గారు (కలెక్టరు) 1870-71 సంవత్సరములో పురాతన విషయము లను గురించి వ్రాయుచు గవర్నమెంటుకు తెలియచేశారు. అటుతర్వాత పురావస్తుశాఖకు సూపరెంటెండెంటగు అలె గ్జాండర్ రేగారు 1906 ప్రాంతాల యీ గ్రామమునకువచ్చి ఒక నెలరోజులువుండి స్థానికంగా లంజదిబ్బ అని పిలువబడు చున్న స్తూపమును త్రవ్వించి పరిశోధనచేసి రిపోర్టు ప్రచు రించారు.

ఆ స్తూపము అమరావతీస్తూపము తరువాతదిగా నిర్ణ యించి, దాని నమూనా వంటిది దక్షిణదేశమున ఎచటను లేదని ప్రకటించారు. అందలి ధాతువును వారు తీసుకొని పోయారు.

దీనితో ఇచ్చట ఒక్కస్తూపమున్నట్లుగానే లోకము నకు వెల్లడయ్యింది. కాని ఇచట పెక్కుస్తూపములున్నట్లు నిదర్శనములు నేటికినికలవు. నాగార్జునుని కొండలోనిశాసనము

వల్ల, కంటకశేలలో మహాచైత్యమున్నట్లు తెలిసినది. కనుక మహాచైత్యమననేమో మనమిపుడు తెలుసుకొనవలసియున్నది. "ఒక్కచైత్యమేయుండునెడల చైత్యమనియు, పెక్కు చైత్యముండునెడల నందు ప్రధానమయిన దానిని మహా చైత్యమనియు పేరుండును."[1]

అమరావతిలోను, నాగార్జున కొండలోనుగల చైత్యములు మహాచైత్యములే. అటులనే ఇచటిదిని మహాచైత్యమే.

కనుక మిగతా స్తూపము ఎచటనుండెనో తెలుసుకొనవలసివున్నది. అలెగ్జాండర్ రేగారు త్రవ్వించిన స్తూపము ఘంటసాలలో తూర్పునగలదు. వారే మరొకదానిని తమ రిపోర్టులో పొలిమేరదిబ్బ అని పేర్కొన్నారు. అది దేవరకోట పొలిమేర దక్షిణమున గలదు. అది స్తూపశిథిలమై యుండునని వ్రాసిరి. ఇది గుండేరు అను మురుగుకాల్వను ఆనుకొనివున్నది. ఈ దిబ్బను ఇక్కడివారు కోటదిబ్బ అందురు. ఇది కోటదిబ్బకాదు స్తూపమే. వేటూరి ప్రభాకర శాస్త్రిగారు దీనిని చూచి స్తూపశిథిలముగానే నిర్ణయించిరి

అమరావతిలో నాగరాజు పాలనలో కట్టబడిన దని అనుకొన్న స్తూపము ఇదే అని వారి వాదన.

ఈ స్తూపము ఘంటసాలకు, 4 ఫర్లాంగుల దూరమున గలదు. ఘంటసాలను ఆనుకొనియున్న లంజదిబ్బయను వాడుక పేరుగల స్తూపశిథిలమంత యెత్తులేకపోయినను, దీనియొక్క ఆకార, నిర్మాణములనుబట్టి యిది స్తూపమనుటలో ఎట్టిసందేహమును లేదు.

---

1 ఆంధ్ర విజ్ఞాన సర్వస్వము రెండవ సంపుటము. పుట, 287.

దీనినానుకొనివున్న పొలాలలో స్తూపపు శిలాఫలకములు దొరుకుట దీనిని మరింత బలపరుచుచున్నది.

పెన్నేరమ్మదిబ్బ అని పిలుచుచున్నచోట కొన్ని స్తూపపు రాళ్ళు నేటికిని అచటవుండి పెన్నేరమ్మ పిల్లలని పిలువబడుచున్నవి. ఆ ప్రదేశమంతయు రాతిమయమై, కొంత భాగము సున్నపుకట్టడమేగాక, ఇటీవల అచట మట్టిత్రవ్వగా, ఆమట్టిలో పాలరాతి చిన్నముక్కలు (విగ్రహములు చెక్కునపుడు రాలిన ముక్కలు) మట్టిలో కలిసికనిపించాయి. ఈపై సందర్భములనుబట్టి అచట స్తూపమోలేక గంధకుటియోలేక ఏదోఒక బౌద్ధమత సంబంధనిర్మాణమై యుండునని భావించవచ్చు.

ఇటులనే ధర్మగోటకములోని మాలపల్లికి ఉత్తరమున ఇటుకరాళ్ళపాడు అను ప్రదేశముకలదు. అచ్చటకూడాబౌద్ధ కట్టడచిహ్నములు కన్పించుచున్నవి. అచటకూడా స్తూపమో, చైత్యాగారమో, పుణ్యశాలయో ఏదియో ఒకటి వుండి వుండాలి. ఆ ప్రదేశములో గొయ్యి పెట్టగా అక్కడ కొన్ని శిలాఫలకములుకూడ దొరికినవి.

ఆ గోతిలో ఒక రాతిఛత్రము దొరికినది. అది సున్నముక్రింద ఉపయోగించి నట్లు తెలియవచ్చినది. ఇంతే గాక అక్కడ రెండురాళ్ళు దొరికినవి. అవి రెండును బౌద్ధ శిలలే. ఆ రాళ్ళు రెండునుకూడ ఇందు మరొకచోట మీరు చూడగలరు.

ఇక్కడ బౌద్ధయుగపునాటి ఇటుకరాళ్ళను, పాల రాళ్ళను మట్టి త్రవ్వినపుడు దొరికినవి.

ఇటీవల గోటకములో మట్టి త్రవ్వుచుండగా రెండు శాసనములు, ఒక సింహము దొరికినవి. వేయేల? ఘంటసాల ప్రదేశములో రెండు మైళ్ళలో అనేక చోట్ల త్రవ్వునపుడు ఇటుకరాళ్ళు, పాలరాళ్ళు నేటికీ లభిస్తూవుంటాయి.

ప్రభుత్వంవారు యీ ప్రాంతములో పలుచోట్ల త్రవ్వించిన ఆంధ్ర దేశ చరిత్రకు సంబంధించిన అనేక అపూర్వాంశములు తప్పక గోచరము కాగలవు.

## స్తూపము త్రవ్వట

పురావస్తుశాఖ వారి రిపోర్టులో ఘంటశాలస్తూపం త్రవ్వకానికి సంబంధించిన వివరాలు :—

"ఈ లంజదిబ్బ గ్రామమున కీశాన్యమూలనున్న ఒక చేలోనున్నది. దానియాకృతి గుండ్రముగను మధ్యకొలత సుమారు 112 అడుగులు పొడవును, ఎత్తు 23 అడుగులు నుండెను. పైభాగమున ఇటుకగోడలును పాటిమట్టియు గలవు. దీనిని ఆనుకున్న భూమియంతయు సాగుచేయబడుచున్నది. కొంతవరకు ఈదిబ్బ అంచుమీదకూడ దున్నివ్యవసాయము జేయుచున్నారు. ఈదిబ్బ క్రిందిభాగము నందొకవైపునతాళ్ళ తోట పెరుగుచున్నది. ఇటీవల ఈదిబ్బను త్రవ్వి పరీక్షించి చూడగా ఇచట నొక బౌద్ధస్తూపమునుండినట్లును బహుశః అమరావతిలోని కట్టడములకు దరిమలానే ఎప్పుడో దీనిని కట్టినట్లు ఇచట దొరికిన గుర్తులనుబట్టి యూహించుచున్నారు. ఈ కట్టడిముయొక్క పైభాగమంతయు శిథిలమై

పోయినది. కాని దానిపునాదులును, ఈ దిబ్బయొక్క పై భాగమువరకు నిలిచియున్న గోడలును గన్పించుచుండెను. ఇవిమాత్రము శిథిలముగాకుండ మిగిలియున్నవి. ఈ స్తూపము యొక్క నమూనావంటిది దక్షిణహిందూస్థానములో నిదివరకెక్కడను గన్పించలేదు.

ఈ ఘంటసాల స్తూపములో మధ్య 10 అడుగుల చచ్చౌకము గలిగి లోపల బోలులేకుండా ఇటుకతో గట్టిగా కట్టబడిన దిమ్మ యొకటి గలదు. దాని చుట్టును ఆవరణగా 19 అడుగుల చచ్చౌకముగలిగిన సమచతురావరణగలదు. ఆవరణయొక్క గోడమందము 3 అడుగుల 4 అంగుళములు. మధ్య దిమ్మ నాలుగువైపులను 2 అడుగుల 4 అంగుళముల కత్తెరగోడలతో ఆవరణ గోడకు కలుపబడియున్నది. వీని చుట్టును గుండ్రము 3 అడుగుల 6 అంగుళములమందమును 55 అడుడుగుల 10 అంగుళముల ఉలివెలుపలిమధ్య కొలతయు గల యొక ఇటుకగోడ కలదు. పైన విపరించిన కత్తెరగోడల లోపల నున్న సమచతురావణయొక్క నాలుగు మూలల నున్న గోడలును బయటికి వ్యాపించి ఈ గుండ్రని గోడలలో కలిసినవి. ఈ గుండ్రని గోడచుట్టును వెలుపల 11 అడుగుల 7 అంగుళముల దూరమున మరియొక గుండ్రని గట్టి యిటుక గోడకలదు. ఈ గోడమందము 18 అడుగుల 3 అంగుళములు. ఈ గోడవెలుపలి భాగమునకు సున్నము చేయబడినది. దక్షిణమున రెండుఅడుగుల ఎత్తు వదలిపెట్టబడెను; అది తిన్నగా నిలువుగా నున్నది. ఈ రెండు గుండ్రని గోడలకును నడుమ నున్న ప్రదేశము 16 అరలుగా విభజంప బడినది. లోపల

ఘంటసాల స్తూపపు ప్లాను—
మధ్యనున్న చదరము స్తూపకేంద్రమునందలి ఘనచతురస్రాకారపు నిర్మాణమును సూచించును. కేంద్రము నుండి వ్యాపించిన నాలుగు అడ్డగోడల పునాదులు కూడ నిందు చూడనగును.





నల్లగా చిత్రించబడిన భాగము ఇచటి దిబ్బ—చుక్కల గీతలు అప్పటి స్తూపనిర్మాణ మిట్లుండియుండునని సూచించును.

నున్న చిన్న సంద్రయావరణలో మరి 16 అరలు ఏర్పడి యున్నవి. ఇట్టిస్తూపములో నేర్పడిన 32 గదులును పాటి మట్టితో గట్టిగా పూడ్పబడినవి. దీనిచుట్టును 5 అడుగుల 7 అంగుళముల వెడల్పును 4 అడుగుల 5 అంగుళముల ఎత్తును కలిగి పిట్టగోడవలె నున్నది. దీనిమీద కొందరు గుంపుగా చేరి ప్రదక్షిణమునకు తిరుగుటకు వీలైనంత వెడల్పుగా నున్నది. దీనిచుట్టును చాలాభాగము త్రవ్వివేసినారు. తాళ్ళతోపు అడ్డము వచ్చినచోట మాత్రమే విడిచిపెట్టిరి. తూర్పు వైపునమాత్రము కొంచెము పగిలిపోయియున్నది. ఇందులో నేమియు పాలరాళ్ళు దొరకలేదు. దీనికి నాలుగువైపుల 5 అడుగుల వెడల్పు 17 అడుగుల 6 అంగుళముల పొడుగున నాలుగుమెట్లు ముందుకు చొచ్చుకునివచ్చినవి. ఉత్తరవైపు మెట్లుపూర్తిగా నున్నవి. దక్షిణమున కొన్ని అడుగు మెట్లూడిపోయినవి. పశ్చిమమునకొన్ని జాడలు గన్పించుచున్నవి. తూర్పున పూర్తిగా శిథిలమైపోయినది. దాని యావరణ గోడ మీదను కొంతభాగము సున్నమువేసినట్లు కన్పించినది. ఈ బేసుమెంటు చుట్టూరా 4 అడుగుల 6 అంగుళముల లోతున నేలంతయు ఇటుకగోడలతో చపటా చేయబడినది. * ఇది చాలవరకు శిథిలమైయుండుటచే దీని వెడల్పు తెలిసికొనుట

* ఈ స్తూపము కట్టిన ఇటుకరాళ్ళు భట్టిప్రోలు రాళ్ళకంటె బాగా వున్నవి. వాటిలో ఊకకూడ కలదు. నాగార్జునకొండలోని కట్టడములకు ఉపయోగించిన ఇటుకరాళ్ళు 20X 19X3 పరిమాణం కలిగినట్లుగనే ఇక్కడివికలవు. ఇట్టిరాళ్ళు అశోకుని ముఖ్యపట్టణమయిన పాటలీపుత్ర మున కట్టడములకు కూడ ఉపయోగింపబడి ఇతర ప్రాంతముల ఇట్టి నమూనా, లేకుండుట యొక విశేషము.

గాని, దీని అంచుచుట్టును పాలరాతితో చూరుకట్టిరని నిర్ధారణ చేయుటకుగాని వీలులేదు. అచటచట కొన్ని పాల రాళ్ళు మాత్రము దొరికినవి.

## శ్రీ పాదము

ఇది బుద్ధభగవానుని పాదచిహ్నము చెక్కబడిన పాల రాయి. దీనినే శ్రీ పాదచిహ్నమందురు. ఈ రాతియొక్క మూడుకోణములు విరిగిపోయినవి. ఇట్టివియే ఇదివరకు అమరావతివద్ద దొరికినవి. చెక్కడమంతయు చాలవరకు యెండవానలకు శిథిలమైపోయినది. మడమలవెనుక నొక తామరపుష్ప గుచ్ఛము కలదు. మడమలమీద రెండు చక్రములుగలవు. మనోహరమైన ఆ రెండు చిహ్నములును సహస్ర కిరణ తేజముతో విరాజిల్లుచున్నవని బుద్ధభగవానునికి 2 చిహ్నములలో నిదియొకటి యని బౌద్ధపురాణములయందు వర్ణింపబడెను. ఈ చక్రములచుట్టు నింక ననేకములైన దివ్య చిహ్నములు గలవు. అవి చాలభాగము శిథిలమైనవి. వక్ర రేఖా చతుష్టయముతో గూడిన స్వస్తికయు, త్రిశూలమును మాత్రము స్పష్టముగ గన్పించుచున్నవి.

## అస్తిక

ఈ స్తూపముయొక్క మధ్యనున్న చచ్చౌకపు దిమ్మమీద ఇటుకరాళ్ళు సమరేఖలుగా పేర్చబడినవి. ఇట్లు పైనుండి మూడు అడుగుల లోతువరకు నా దిమ్మరాళ్ళనూడదీయుచు పోగా అచట దానిమధ్య నొక 9 అంగుళముల చౌకముగల



శ్రీ పా ద ము లు

"ప్రియయువతిం బ్రభుత్వమును వీఁడి యరణ్యముఁ జేరెఁ దత్త్వ ని
శ్చయమునకై మహాతపము సల్పి కృతార్థతఁ గాంచె నెల్లెడన్
దయయు నహింసయున్ బరమధర్మములన్ వెలకొల్పె నమ్మహో
దయుడగు బుద్ధదేవుని పదంబుల కేను నమస్కరించెదన్."

—వేటూరి ప్రభాకరశాస్త్రిగారు.

చిన్న నుయ్యి గన్పించెను. అది మట్టితోపూడ్చబడి యుండెను. ఆ పైనున్న మన్ను కొంచెముతీయగా ఈ క్రిందివస్తువులు దొరికినవి. బహుశా ఒకప్పుడీవస్తువు లా చట్టిలో వేయబడి యుండును.

## దొరికినవస్తువులు

(1) $^3/_8$ అంగుళములు చౌకముగల యొకచిన్నసీసపు నాణెము. దానికొకవైపున అస్పష్టమైన గుర్తేదియో గలదు.

(3) పంచకోణములును శ్వేత నీలవర్ణములును $^9/_{16}$ అంగుళముల పొడవునుగల యొక స్ఫటికపు పూస.

(3) మూడు చిన్నపూసలు. ఇవి మన్నులో కలసి యున్నవి. భట్టిప్రోలులో దొరికిన భరిణ చుట్టును నిట్టివే బంగారు పుష్పములు కన్పించెను.

(4) మరియు ఆమన్నులో కొన్ని ఎరుపు తెలుపు నీలపురంగు గలిగిన స్ఫటికపు రాళ్ళుకూడా గలవు.

వీనిక్రింద ఒకచిన్న ఎఱ్ఱనిమట్టి చట్టిగలదు. దీనియెత్తు మధ్యకొలత 4 $^1/_2$ అంగుళములు. దీనిమీద అర్ధచంద్రాకృతి గల భరిణమూత గలదు. ఆమూతపైన నొకచిన్న బుడిపె యుండెను. దానినిండా మెత్తని నల్లమన్ను గలదు. దాని యడుగున నిగనిగ మెరయుచున్న మరియొక చిన్న పిడత గలదు. అది బహుశారాతితో చేయబడినది. అది $1\frac{3}{4}$ అంగుళముల యెత్తును $\frac{1}{4}$ అంగుళముల మధ్య కొలతయు గలది. అందులో రెండు చిన్న చుక్కలు అస్తికలో పగడపు పెంకులోగలవు. $^5/_8$ అంగుళముల పొడవుగల శ్వేతషణ్ముఖ

పూసయొకటి గలదు. అయిను చిన్న గుండ్రని పూసలు ఒక పలుచని ముత్యపుచిప్ప పూస చిన్న ముత్యములు రెండు పసుపు పచ్చని స్ఫటికపు ముక్కలు రెండు బంగారపు రేకులు అందొకటి అష్టదళ పుష్పముగ కత్తిరింపబడినది. మరి ఏవో కొన్ని లోహపుముక్కలు. ఆస్తూపములో దొరికిన వస్తువు లివియే.

ఈ స్తూపమునకు నడుమనున్న ఆ చిన్ననుయ్యిక్రిందికి పోనుపోను వెడల్పగుచు 13 అడుగుల లోతుకు పోవుసరికి 2 అడుగుల 6 అంగుళములు చౌకమై తరువాత క్రమముగ ఒకసారి 9 అంగుళములు మరియొకసారి 12 అంగుళము లును వెడల్పగుచు తుదకు డిబ్బయొక్క భాగముండి 26 అడు గుల లోతువరకు యీ నుయ్యి వ్యాపించియుండెను. ఘంట సాల స్తూపముయొక్క మధ్యగోడలకు ఉపయోగించిన ఇటుక అంతప్రశ స్తమైనదికాదు.విరిగిపోకుండా పూర్తిగానున్న రాయి దొరుకుట దుర్లభము స్తూపముల కలంకారముగా చెక్క బడిన పాలరాళ్ళనేకము ఈ చుట్టుప్రక్కల గ్రామములోదొరు కును. శిలాస్థంభములు, పానువట్టములు, ఛత్రము, పీఠము మొదలగునవి గలవు. ఇందులో కొన్ని యిటీవలనే చెక్కబడి నవి. గ్రామస్థులు కొన్ని రాళ్ళను తీసికొనిపోయి పగులగొట్టి సున్నముగా జేసికొనిరి. కొన్నిరాళ్ళను సరిహద్దుగట్లను పాతు కొనిరి. జలధీశ్వరస్వామి దేవాలయములో అక్షరములు చెక్క బడిన నొక పాలరాతి స్తంభము గలదు.ఇదియు నీస్తూపమునకు సంబంధించినదై యుండును. మిలిచిన పానువట్టములను వడ్ల గుంటలక్రింద వాడుకొనుచున్నారు. కొన్ని శిలాపీఠములను



ఆయక స్తంభం - గోటకమాల పల్లెలోనిది





1. శిలా స్తంభము-గోటక మాలపల్లెలో వున్నది

బట్టలుఉతుకు రాళ్ళుగా ఉపయోగించుచున్నారు. కొన్ని దేవతావిగ్రహములు చెక్కిన రాళ్ళనుమాత్రము పూజించుచున్నారు.

(1) ఇదియొక శిలాస్తంభము. ఈ పాలరాతిమీాద ఎంత మనోహరమైన శిల్పము చెక్కబడియున్నదో చూడుడి. ఈ గ్రామమునకు పశ్చిమమున నొక ప్రదేశము ఇప్పటికిని బుద్ధవనమనే పేరుతో వ్యవహరించుచున్నారు. దీనినే కరిణీకపు లెక్కలలో బౌద్ధుల జీర్ణవనము అని వ్రాయబడియున్నది. దీనిదగ్గర (Parchir) లో నొక చెట్టుక్రింద నిలువుగా పాతి పెట్టబడియున్నది.

దీనిమీాద ముందుప్రక్కను కుడివైపునను మాత్రమే ఈ చక్కని నగిషీపని చెక్కబడినది. తక్కిన రెండు ప్రక్కలు ఖాళీగాను, నున్నగాను నున్నవి. దీనినెత్తిపై కొంచెముముక్క ఊడిపోయినది. దీనిమీాద చెక్కబడిన లతాశిల్పమునకు అడుగున గుండ్రని పాత్రాకార మొకటిగలదు. అందులోనుండియే బయలుదేరినట్లు కమలగుచ్ఛములును పుష్పపత్రాదులు నొకదానిపైనొకటి మిక్కిలి ముచ్చటగా చెక్కబడినవి. ఇందలి మొదటిపటము ఆ స్తంభముయొక్క ముందుభాగము రెండవ పటము దానికే కుడిప్రక్క ఈ వైపుకున్న చెక్కడపుపని గూడ రమారమి ముందరప్రక్కవలెనే యుండును. సాంచియను ప్రదేశములోగల ఉత్తరద్వారమునందు నిట్టి శిల్పమే కానవగును.

(2) గ్రామ సరిహద్దులలోనున్న పొలిమేర దిబ్బవద్ద నీ స్తంభము భూమిలో పాతిపెట్టబడియున్నది. దీని శిరో

భాగము విరిగిపోయినది. మిగిలియున్న భాగము అష్టముఖిగా నున్న రెండుప్రక్కలను చెక్కడము (నగిషీపని) కన్పించు చున్నది. క్రింద నొక సింహాసనపీఠము, దాని కిరువంకలను రెండు తామర పుష్పగుచ్ఛములు చక్రముచుట్టు త్రిశూలాలంకారమును గన్పించుచున్నవి. రెండవవైపున గూడనిట్టిపనియే గలదుగాని చాలవరకది శిథిలమైనది. ఇదిగాక నాలుగు విరిగిన స్తంభములు అక్కడనే పాతబడియున్నవి. దీనికి వుత్తరమున కొన్ని గజములదూరములో ఒక చెట్టుక్రింద నున్నని సమ చతుర్ముఖ స్తంభమొకటి పాతబడియున్నది.

(3) ఇది స్తూపమునకు సమీపమున ఒక నూతివద్ద పడియున్నది. అందముగా చెక్కబడిన ఒక గుండ్రని పాలరాయి. దీనిమధ్య నొకరంధ్రముగలదు. దీని అంచుచుట్టును మూడువరుసల అలంకారములు చెక్కబడెను. అడుగువరుసను కమలపత్రావళిగలదు, పైవరుస స్తంభములకు పుష్ప గుచ్ఛములు తోరణములుగా కట్టబడెను. మధ్యవరుస కొన్ని జంతువులొకదానివెనుక నొకటి వరుసగా నున్నవి. ఈ జంతు సముదాయము ఏనుగ, మేక, పులి, ఆవు, దుప్పి, గుఱ్ఱము, సింహము, దున్నపోతు; అడవిపంది, ఈ వరుస క్రమముగా నున్నవి.

(4) ఈ రాతిపలక ఇప్పుడు జలధీశ్వరస్వామి గుడిలోని కొన్ని విగ్రహములకు వెనుక గోడకు బిగింపబడియున్నది. దానిమీద స్తంభములు కమలదళములు అడ్డకట్టలు కొంత వరకు గన్పించుచున్నవి. తరువాత నొకద్వారమువలె నున్నది. దానిగుండా భక్తులు పూజాద్రవ్యములను గైకొని లోపలికి



శిల్ప శిలాఫలకము



పూర్ణకుంభము - ఘంటసాల



ధర్మచక్రము - ఘంటసాల

పోవుచున్నారు. అడుగున నొకపరుగెత్తుచున్న గుఱ్ఱమును మానవశిరస్సుగల యొక జంతువును గలవు. అడుగున కొన్ని బొమ్మలున్నవి. ఈ రాతిపలక స్తూపముచుట్టునుగల ప్రదక్షిణ మార్గమునకు అంచుగోడలోని భాగముగా కన్పించుచున్నది.

(5) ఈ పాలరాతి పలకమీద బౌద్ధస్తూపాకృతి బహు చక్కగా చెక్కబడినది. ఇప్పుడిది శివాలయము కాంౌడువెవున ప్రహారీగోడదగ్గరనున్న అమరావతి పెదగంజాము అను ప్రదేశ ములకడ దొరికినవానికిని దీనికిని అంతవ్యత్యాసమేమియు లేదు. ఇవి యచ్చటి స్తూపమున కడుగుభాగమున గోడలో నమర్చ బడినవి. బహుశా ఇదియు అట్టిదే అయివుండును. ద్వారము నకు లోపలనున్న బుద్ధదేవుని విగ్రహాముచుట్టును పూజచేయు భక్తులుగలరు. ఈ ద్వారముపైన అయిదు స్తంభములు గలవు. వీనిలో మధ్య స్తంభముపై నొక ఛత్రముగలదు. ముందును త్రోసికొనివచ్చిన ప్రక్కద్వారములు ఇరువైపులను గలవు. సింహాద్వారమునకు వెలుపల ఈశ్వరారాధకులు గలరు. వారివెంట నైవేద్యాది పూజాద్రవ్యములను గొనితెచ్చుమరు గుజ్జువాండ్రున్నారు. దీని యడుగుననుండి పైవరకును చిత్ర మైన నగిషీ పనితో అలంకరింపబడినది.

(6) ఇది మరియొక చిత్రమైన శిలాశిల్పముగల పాల రాయి. ఇప్పుడిది ఘంటసాలకు దక్షిణమున సుమారు మూడు మైళ్ళదూరముననున్న రామానగరగ్రామములో రోడ్డుప్రక్కన నున్నది. కొన్ని పర్వదినములందు ఆ గ్రామవాసులు దీనిని పూజించుచుందురు. బౌద్ధులకు మహాపవిత్రమైన బోధివృక్ష మును పూజించు విధానము చిత్రింపబడియున్నది. ఈవృక్షపు

మాను కడుగున రెండు తామరపుష్పములుగల యొకసింహ పీఠముగలదు. ఈపీఠము నిరువైపుల సింహాకృతి గలిగినరెండు పాదములు కొంచెమెత్తైన దిమ్మనానుకొని మోయుచున్నవి. ఇరువైపులనున్నతక్కిన ప్రదేశమంతయు భగవదారాధకులైన భక్తులతో నిండియున్నది. ఈ వృక్షమున కిరువైపులను రెండు ఏనుగులుగలవు, ఒకదానిముఖము వృక్షమువైపునకును రెండవదానిముఖము బయటివైపునకు గలదు. ఈ రెండు ఏనుగులమీదనున్నవారు బోధి మహావృక్షమును పూజించి నమస్కరించుచున్నారు. క్రిందనున్నవారు కొందరు పూజా ద్రవ్యము లర్పించుచున్నారు. కొందరు మహానంద నిమగ్నులై మౌనముతో నున్నారు. ఎడమవైపునున్న యొక విగ్రహము నకు చిత్రమైన ముసుగుగలదు. పెదగంజాములో దొరికిన పలక రాళ్ళమీదగూడ సరిగా నిట్టి ముసుగేగల విగ్రహములేగలవు. స్త్రీ విగ్రహములకు బరువైన కడియములును, మురుగులును గలవు. చెట్టుప్రక్కల నిలుచున్న యొక విగ్రహము చెవులో బరువైన కర్ణాభరణములు గలవు. ఈరాతికడుగున సింహము దుప్పి, ఏనుగు, ఎద్దు, మేక, పులి, దున్నపోతు అను ఎనిమిది మృగములు వరుసక్రమముగా చెక్కబడియున్నవి.

(7) బౌద్ధశిల్పములు చెక్కబడిన పాలరాతి పలకలపై బౌద్ధమతము క్షీణించినతరువాత కొంతకాలమునకు వానిని చెడగొట్టి హిందూ దేవతావిగ్రహములను తిరిగి వానిపై చెక్కి నట్లూహించుచున్నారు. అట్టివానిలో ఈ నారసింహ విగ్రహ మొకటి. ఇది చక్కగా చెక్కబడినది.

(8) తక్కినవి భైరవస్వామి.
(9) సరస్వతీదేవి.
(10) రతిదేవి*

ఇవిమూడును మిక్కిలి మోటుగానున్నవి. ఇవి ఇప్పుడు శివాలయములో నున్నవి. బౌద్ధకాలమునాటి మంచి మంచి శిలాశిల్పము లనేకము లిట్లుధ్వంసముచేయబడినట్లు గనుపించుచున్నవి. హిందూవిగ్రహమునకు ఒక మంచిరాయి కావలసి వచ్చినప్పుడు ఈ దిబ్బత్రవ్వి యొకరాతిని తీసి దానిపైనున్న బౌద్ధశిల్పమును చెడగొట్టి హిందూవిగ్రహములను చెక్కుకొనుచుండిరి. హిందూవిగ్రహము పోలికకలిగిన శిల్పములు దొరికినయెడల వానిని చెడగొట్టకుండాపూజించుకొనుచుండిరి. చరిత్రప్రసిద్ధి కెక్కిన పూర్వపు శిల్పములను కాపాడుకొనవలెననెడి జ్ఞానము ప్రజలలో నంతగా వ్యాపించియుండక పోవుటచే దేశములో నిట్టి యవివేకకృత్యములెన్నియో ఇదివరకు జరిగినవి. ఇంకను కొన్నిచోట్ల జరుగుచున్నవి."

స్తూపమునకు సంబంధించిన వాటినిగురించియు మరి కొన్ని అప్పటప్పటికి కనుపించిన వాటినిగూర్చియు 'రే'గారు తమ రిపోర్టులు వ్రాసియే యుండిరి. ఇటీవల కన్పించిన వాటిని గురించి సందర్భానుసారముగా మేము చెప్పగా మిగిలిన మరి కొన్ని స్తూపశిధిలశిలలనుగురించి తెలియ చేసెదము.

అమరావతీశిల్పమునుబోలు శిల్పచాతుర్యము గల అనేకశిలలు దేశదౌర్భాగ్యమువల్ల అనేకప్రాంతములనుండి

---

* ఈ సరస్వతీ రతీదేవుల విగ్రహాలు మొహంజోదారునాటి వంచురు. అనగా 6000 సంవత్సరాల క్రితమునకు చెందినవని.

సముద్రములుదాటిపోయినట్టులనే యిచ్చటనుండికూడ ఉత్తమ శిల్పశిలలుపోయినవి. పోగా మిగిలిన శిథిల శిలలగురించి వివరింతుము.

ఇటీవల పురాతన వాస్తుశాఖ తీసుకొనిపోయి మద్రాసు మ్యూజియమందుంచినదానినిగురించి యిచ్చటించెదము.

"తెలుగుశాసనలేఖకుడగు మహారాజశ్రీ వి. ఆర్. కృష్ణమాచార్యులుగారిచే ఘంటసాలలో ఒక మనోహరమయిన ఆవిష్కరణము చేయబడెను. అమరావతీ శిల్పమును బోలు చక్కగాచెక్కబడిన ఒక పాలరాతి పలక రామస్వామి దేవాలయపు (రామాలయపు) ఆవరణమున కనుగొనబడెను. పద్మదళముగా రాతిఅంచుచుట్టును, ప్రధానదృశ్యము వలయాకారముగ మధ్యను చిత్రింపబడెను. దురదృష్టవశాత్తు, ఆ దృశ్యములో చెక్కబడిన విగ్రహము విశేషముగా జీర్ణించిపోవుటచే, స్పష్టముగా కన్పించుటలేదు. అతివిచారకరమైన స్థితిలోనుండిన ఒక అశ్వమెదుట, ఇద్దరు స్త్రీలు సాగిలబడుచుండ ఇంకను అనేకమంది స్త్రీలచే పరివేష్టింపబడి (పాశ్చాత్య పద్ధతిని) సింహాసనము నధిష్ఠించి ఉదాసీన వదనముతోయున్న రాజుముందు కానుక పాత్ర హస్తమునందిడుకొని ఒక వ్యక్తి మధ్యనిలబడియుండెను. బహుశః అదిబుద్ధుని పూర్వపుజీవితపుగాథగా తోచును. ఈ పలకతప్పక బౌద్ధస్తూపమునకు సంబంధించినదైయున్నది."[1]

1 Annual report of the Archilogical Dt. S. C. Madras 1919-20 pages 30, 31.



కలశము



సింహము



అర్హతుడు

ఇట్టివెన్నో ఇతరప్రాంతములకు పోగా మరికొన్ని మన మూర్ఖత్వమువల్ల నాశనముకాగా మిగిలినవాటినిగురించి తెలిపెదము.

1 పాదములు— మనుష్యుని (Fulsize) పూర్తియెత్తు గల విగ్రహముయొక్క పెద్దపాదములు మాత్రమే. ఇవి ఒక రావిచెట్టుక్రింద నేడు పూజంపబడుచున్నవి. ఇవి బహుశాః బుద్ధుని పాదములుగావచ్చు. ఆ దివ్యసుందరవిగ్రహ మంతా యెచట జీర్ణమయ్యెనో యెవరుచెప్పగలరు?

2 సింహము—ఇది నేడు ఒక ఆసామియింటిలోవున్నది. ఇట్టిసింహములు స్తూపపుప్రాకారములో పలుచోట్లగాక ద్వారముల కిరుప్రక్కలవుండును. ఇది చాలఅందముగా నున్నది. శతశిల్పి నూతులపాటి నరసింహచౌదరి ఇట్టి సింహములను సిమెంటుతో చేసి విశేషవ్యాప్తి కలిగించెను.

3 అర్హతుడు: ఇది ఒక బౌద్ధఅర్హతుని ప్రతిమ. దీని కాలుచేతులు శిరముకూడ ఖండించిరి. ఏమిప్రయోజనము పొందిరో ఈ ఘనకార్యమునకు!

4 మహానాగము: లంజదిబ్బవద్ద దొరికినదే. దీని తల శిథిలమయినది. దీనితలలు బహుశః అయిదో, ఏడో వుండవచ్చును. ఇట్టినాగము అమరావతీస్తూపములోను కలదు. బౌద్ధమతమునకు పూర్వము నాగపూజ జరుగుచుండెడిది. హిందువులు బుద్ధుని దశావతారములలో చేర్చి, బుద్ధుని బోధలు కొన్ని హిందూమతములో చేర్చుకొని ఆమతమును లేకుండ చేసినట్లుగనే ఆనాటి బౌద్ధులు ఈ నాగపూజ వారి

మతములోకూడ చేర్చుకొని, వారిని తమ మతములో చేర్చుకొనియుండవచ్చు.

ఈ నాగమునకు సిమెంటుతో శిరస్సుచేసి, జలధీశ్వరాలయ ఆవరణములో సుబ్రహ్మణ్యస్వామి గుడివెనుక నేడు నిలపబడినది. మార్గశిర శుద్ధ షష్ఠికి ప్రతి సంవత్సరము జరుగు సుబ్రహ్మణ్యస్వామి ఉత్సవసందర్భంలో ఈ సుబ్బారాయునకు కూడ పూజ జరుగుచున్నది.

బుద్ధజయంతి మహోత్సవ సంచికలో సుప్రసిద్ధ పత్రికా సంపాదకు లగు నార్ల వెంకటేశ్వరరావుగారు ఘంటసాల శిల్పాలనుగురించి ఈ విధంగా వ్రాశారు. XXX VII

"ఘంటసాల అసలుపేను కంటకశైలమని చెప్పారు. నిజానికి 'టోలమి' కూడా దీని "కొంటి కొస్సిల" అని పేర్కొన్నాడు. బుద్ధదేవుని అశ్వరాజమైన "కంటకం" పేర ఇది కట్టబడిందని అనుకుంటున్నారు. ఈ కంటక చిత్రం వున్న శిల్ప భాగం, ఘంటసాల నుంచి తెచ్చినది మద్రాసు మ్యూజియంలో భద్రపరుపబడివుంది. ఘంటసాల శిలలు మరికొన్ని పారిస్‌లో మ్యూజీగయ్‌మెట్‌లో వున్నాయి. 1954 లో నేను పారిస్ వెళ్ళినప్పుడు ఈ శిధిలాలు చూశాను. ఒక పాలరాతి చెక్కడంలో మూషంతస్థుల మందిరమూ భక్తులూ చెక్కబడ్డారు. మరొక చెక్కడంలో పుత్రజననవార్తవిని ఆనందపరవశుడైన శుద్ధోదనుడు చిత్రించబడ్డాడు. మూడవదానిలో భార్యాపుత్రులను విడనాడి బైలుదేరటానికి నిశ్చయించుకొన్న సిద్ధార్ధుని బొమ్మ చెక్కివుంది.

బ్రిటిష్ మ్యూజియమ్ ప్రాచ్యవస్తుశాఖ అసిస్టెంటు కీపర్ అయిన డగ్లస్ బారెట్‌గారి అభిప్రాయం ప్రకారం; ఘంటసాల శిల్పాలలోకల్లా ముఖ్యమైన చెక్కడం బోస్టన్‌లో వుంది. ఆరాతి పలకకు రెండువైపులా చిత్రాలు చెక్కి వున్నాయి. "ఒకవైపున అమరావతి రాళ్ళ మాదిరిదైన ఒక స్తూప సంపూర్ణ చిత్రం చెక్కబడివుంది. రెండవవైపు, నిరంజన నదీ తీరాన బుద్ధుని విగ్రహం చెక్కబడివుంది. ఎడమ మూలపైగా స్తంభంముక్క కనబడుతుంది." రెండు వైపుల చెక్కబడి వుండటమే ఈ శిల ప్రాముఖ్యమా? నాకు తెలియదు. కాని ఘంటసాలవద్ద స్తూపము చాలా పెద్దదై ఉండటమే కాకుండా, ఆంధ్రలో కెల్లా చాలా ప్రముఖమైనదని కూడా నేను నమ్ముతున్నాను. ఘంటసాల శిల్పకృతులు అమరావతీ శిల్పరీతితో తులతూగుతూ వుంటవి. ఘంటసాలలో దొరికిన బుద్ధవిగ్రహం శిరస్సు, కొన్ని విధాలలో చూస్తే అమరావతీ నాగార్జునకొండ విగ్రహాలకన్న చాలా శిల్ప విశిష్టత కలదని నా యభిప్రాయము. ఈ ముఖంలో ఎక్కువ ప్రశాంతత ఎక్కువ గాంభీర్యము ద్యోతకమౌతు న్నాయి. పెదవుల చిరునవ్వు, రేయి తొలిజామున ఆకాశంలో మిలమిలలాడ్తూ నిశీథాన్ని మరింత రమణీయంగా తోపింపచేసే, నెలవంక రూపంలో వుంటుంది.

కాని అసలు విషయం వదిలి వెళ్తున్నట్లున్నాను. అంటే ఘంటసాలవద్ద, 'రీ' త్రవ్వితీసిన పురావస్తువుల విషయం. ముఖ్యస్తూపం యొక్క వైశాల్యం ఆయన్నాకర్షించింది.

అందులోనే ఎక్కువ పరిశోధనలు కావించాడు. అందులో పాలరాతి చెక్కడాలు దొరకలేదు. అస్థినిక్షేపపాత్ర స్తూప పునాదులుమాత్రం బైట పడ్డాయి. అసలిందులో పాలరాతి శిల్పాలు ఉండిఉండకపోవచ్చును. నిజానికి ఘంటసాల శిల్పాలన్నీ; కోటదిబ్బలో వున్నాయి. 'రీ' ఇదికూడా ఉల్లేఖించే వుంచాడు. ఇదేకాక పొలిమేరదిబ్బ అనే మూడవదిబ్బకూడా ఆ ప్రక్కలనేవుంది. కోటదిబ్బ విషయం 'రీ' ఇల్లా వ్రాశాడు. దక్షిణాన్న ఊరిపొలిమేర సమీపంలో చెరువుగట్టు నానుకొని ఒక చిన్న దిబ్బవుంది. ఇటునుంచి అటు 70అడుగుల వ్యాసం వుండి దాదాపు గుండ్రంగా వుంటుంది. ఇటుకరాతి పునాది గోడలు అక్కడక్కడ కనబడతాయి. రబ్బీ సంతటా అలుము కొనివుంది. ఇదికూడా ఒక స్తూపశిథిలం అయివుండవచ్చును.

రీగారు ఒకపెద్ద పరిశోధన చెయ్యగల ఆస్కారాన్ని ఇక్కడ చెయి జార్చుకొన్నారు. తర్వాత 1920లో ఒకరైతు పొలం దున్నుకొంటూ, ఈ కోట దిబ్బ అంచున దున్నుతూంటే దాదాపు 60 శిల్పశిలలు బైటపడ్డాయి. ప్రతిఒక్కటి శాక్యముని జీవితాన్నో జాతక కథలనో వర్ణించే చెక్కడపు పనితో నిండివుంది. ఆ ఊరిపెద్దలు కొందరు నాకు చెప్పిన కథప్రకారం, కొన్నాళ్ళు ఈ రాతిఫలకాలు గుట్టగా ఒక చెట్టుక్రింద పడేసి వుంచారట. పుదుచ్చేరి నుంచి యం. జి. జోలియస్ డూ్ బ్రెయిల్ గారి ఏజెంటు ఒకడు వచ్చి చూచి గప్‌చిప్‌గా ఈ రాళ్ళ మొత్తం అంతా 5,000 రూపాయలను కొనుక్కుపోయాడు. ఈ విధంగా ఘంటసాల శిం..

నిధులు శాశ్వతంగా మన చెయిజారిపోయి, పారిస్ మ్యూజీ గుయ్‌మెట్ చేరాయి.........."

కోటదిబ్బనే ప్రదేశానికి సమీపంగా వేమూరి వెంక ట్రాయులుగారి పొలం వున్నది. ఆ చేనిలో ఏ పైరు ఏపుగా కానందున, ఆయన త్రవ్వించసాగాడు. ఆ త్రవ్వకంలో ఇటుకరాతి గోడలు కనిపించినవి. ఆ రాయి తీసిన తర్వాత బౌద్ధ విగ్రహాలు బోర్లగా పడేసివున్నవి. వాటి నన్నిటెని ఒక చోట చేలోనే పోగుపెట్టెను.

డూబ్రెయిల్ ఈ చారిత్రికప్రదేశం చూడవచ్చినపుడు చూచి ఆనందం పొందాడు. ఆయన ఆ రైతుకి, గ్రామదేవా లయాలకు కొంత ధనం యిచ్చినమాట వాస్తవమే. లంజ దిబ్బ చుట్టుప్రక్కలకూడా త్రవ్వించాడు. అక్కడ కొన్ని విగ్రహాలు దొరికినవి. వాటినికూడా ఆయన ఏజంట్లు పాండు చ్చేరి 1928లో తీసుకొనిపోయారు. ఈ విధంగా పరదేశాలకు ఈ శిల్ప సంపదపోవటం దురదృష్టమే.

ఇంతేకాదు, ఆ డూబ్రెయిల్ గారు అమరావతి నాగా ర్జునకొండ మ్యూజియములనుండి కొన్ని శిల్పాలను తీసుకొని పోనున్నట్లుగ్రహించి ఆయనకు ప్రభుత్వం కృష్ణా గుంటూరు మండలాలు ప్రవేశించరాదని 144 శెక్షను జారీచేసినట్లు తెలుస్తుంది.

## మ్యూజియం

ఈస్తూప పరిశోధనకై వచ్చిన ఎర్నెస్ట్‌రీ తన రిపోర్టులో ఇక్కడ కొన్ని స్తూప శిల్పాలున్నట్లు వ్రాశారు. వ్రాయటమే

నిధులు శాశ్వతంగా మన చెయిజారిపోయి, పారిస్‌మ్యూజీ గుయ్‌మెట్ చేరాయి........."

కోటదిబ్బనే ప్రదేశానికి సమీపంగా వేమూరి వెంకట్రాయులుగారి పొలం వున్నది. ఆ చేనిలో ఏ పైరు ఏపుగా కానందున, ఆయన త్రవ్వించసాగాడు. ఆ త్రవ్వకంలో ఇటుకరాతి గోడలు కనిపించినవి. ఆ రాయి తీసిన తర్వాత బౌద్ధ విగ్రహాలు బోర్లగా పడేసివున్నవి. వాటి నన్నిటిని ఒక చోట చేలోనే పోగుపెట్టెను.

డూబ్రెయిల్ ఈ చారిత్రిక ప్రదేశం చూడవచ్చినపుడు చూచి ఆనందం పొందాడు. ఆయన ఆ రైతుకి, గ్రామదేవాలయాలకు కొంత ధనం యిచ్చినమాట వాస్తవమే. లంజదిబ్బ చుట్టుప్రక్కలకూడా త్రవ్వించాడు. అక్కడ కొన్ని విగ్రహాలు దొరికినవి. వాటినికూడా ఆయన ఏజంట్లు పాండుచ్చేరి 1928లో తీసుకొనిపోయారు. ఈ విధంగా పరదేశాలకు ఈ శిల్ప సంపదపోవటం దురదృష్టమే.

ఇంతేకాదు, ఆ డూబ్రెయిల్‌గారు అమరావతి నాగార్జునకొండ మ్యూజియములనుండి కొన్ని శిల్పాలను తీసుకొనిపోనున్నట్లుగ్రహించి ఆయనకు ప్రభుత్వం కృష్ణా గుంటూరు మండలాలు ప్రవేశించరాదని 144 శెక్షను జారీచేసినట్లు తెలుస్తుంది.

## మ్యూజియం

ఈస్తూప పరిశోధనకై వచ్చిన ఎర్నెస్ట్‌రీ తన రిపోర్టులో ఇక్కడ కొన్ని స్తూప శిల్పాలున్నట్లు వ్రాశారు. వ్రాయటమే

మరికొన్ని అక్కడక్కడ కలవని వాటినన్నింటిని సేకరించి భద్రపర్చుటకు మ్యూజియం నిర్మాణం చేయించవలసిన ఆవశ్యకతను గురించి ఒక పిటీషను ఇవ్వగా, వారు వెంటనే ఆ ప్రదేశమున కరిగి తగుచర్యలు తీసుకోవలసినదని తమ తాబే దార్లకు తెలుపగా 1963_9_27 వ తేదీన ఇచటకు వచ్చి ఈ రచయితను, పిటీషనరును కలుసుకొని స్తూపాన్ని, ఇచట నున్న ఓపెన్ మ్యూజియమును సందర్శించి ఫొటోలను తీసు కొని వెళ్ళిరి. అచిరకాలములోనే ఇచట మ్యూజియం నిర్మాణంకాగలదని, ఇచట లభించే శిల్పఖండాలు భద్రపరచ బడగలవని ఆశించవచ్చును.

# చాళుక్య యుగము

చాళుక్యులు మన తెలుగుదేశాన్ని సుమారు అయిదు వందల సంవత్సరాలు అవిచ్ఛిన్నంగా పరిపాలించారు. క్రీ. శ. 625_1118 వరకు.

ఇంత సుదీర్ఘకాలం పరిపాలించినారు గనకనే చాళుక్యులు తెలుగుసంస్కృతికి సాహిత్యానికి సృష్టికర్తలయ్యారు. వీరు శైవులు. దేవబ్రాహ్మణభక్తులు. వేంగి, బెజవాడ, రాజమహేంద్రవరము వరుసగా వీరి రాజధానులు. ఆకాలపు చరిత్ర కనుక దీనిని చాళుక్యయుగ మనవలసివచ్చినది.

## ఘంటసాల నామోత్పత్తి

బౌద్ధయుగమున ఓడరేవై వాణిజ్యకేంద్రమై వివిధ దేశములతో వర్తకవ్యాపార మొనర్చి నానా దేశవర్తకుల కాలవాలమై వివిధదేశములకు వలసబంపి, చీనా, బర్మా మొదలగు దేశములకు నాగరికత నేర్పి, బౌద్ధులకు కేంద్ర స్థానమై ప్రఖ్యాతమైన స్తూపములతో విరాజిల్లిన కంటకసేల, ఘంటసాలయను పేరెప్పుడు పొందెనో చెప్పుటకాధారము లేదు. శ్రీ జలధీశ్వర ఆలయములోని తొమ్మిదవ శతాబ్దపు వాడగు విష్ణువర్ధనుని శాసనమువల్ల ఘంటసాలగా మారెనని విదితమగును.

ఇక 'ఘంటసాల' పేరెటులవచ్చెనో పేర్కొందుము. ప్రతిగ్రామమును గురించి ఏదియో చెప్పుకొందురు గదా! ఇక ఈ గ్రామనామమును గురించి స్థలపురాణముగ చెప్పుకొను కథలు ఇలా వున్నవి.

ఒకానొక కాలమున ఈ దేశమునకు కాటకము వచ్చెను. ఆ క్షామ సమయాన యీ ప్రాంతమును పాలించుచున్న రాజు, తన రాజధాని సమీపమునందలి అరణ్యమునకు వేటకురాగా ఒక చెట్టుక్రింద ఒక మగశిశువు రోదన మొనర్చుచుండెను. సంతాన హీనుడైన ఆ రాజు ఆ శిశువును దెచ్చి రాణికిచ్చి పెంచమనెను. ఆమె అత్యంతాదరముతో ఆ బిడ్డను పోషించెను. ఆ బాలుడు పెద్దవాడయిన పిమ్మట ఆ రాజు మరణించెను. మంత్రులంతట ఈ యువకుని పట్టాభిషిక్తుని చేసిరి.

ఈ రాజు తన వృత్తాంత మంతయు మంత్రులవల్ల తెలుసుకొని తనతలిదండ్రులను తెలుసుకొనగోరి యీ గ్రామమున కుత్తరదిక్కునవున్న గోటకములో ఒక అన్నసత్రము గట్టించి వచ్చినవారికెల్ల అన్నదానము చేయుచు వారివృత్తాంతము తెలుసుకొనుచుండెను. ఆ సత్రమువద్ద ఒక సాలగట్టించి అందు అధికదూరము వినిపించు నొక గంటనుంచెను. భోజన కాలము తెలియజేయుటకు ఆ గంటను మ్రోగించెడువారు. ఆ ఘంటనుంచిన సాల ప్రదేశమును ఘండసాలయనిరి. ఆ ఘంటసాల పేరే ఈ గ్రామనామ మయ్యెనని పెద్దలు పలుకుదురు.

మరొకవిధముగా ఈ కథనే మరికొందరు చెప్పుదురు. ఆ బాలరాజు సింహాసనమధిష్ఠించి దిగ్విజయ మొనర్చి చక్రవర్తి యాయెనట. ఆయన తానెక్కడ దొరుకుటచే తనకట్టి మహార్దశ కలిగెనో ఆ స్థలమందు, తన కృతజ్ఞతను దెలుపుటకొక అన్నసత్రము గట్టించి, అందులో నొక గంటనుంచి, ఆ

గంటమ్రోగించిన వారందరికేని లేదనక భోజనమిడుదునని చాటించెనట. తదాదిగా అచ్చట ఆ గంట అహోరాత్రములు మ్రోగుచుండెడిదట. ఈ కారణముచే ఇక్కడ నిర్మింపబడిన ఈ గ్రామమునకు గంటసాలయను నామము వచ్చినదట. అనంతరమిది ఘంటసాలగా మారినదట.

దీనికి సాదృశ్యముగా యీ గ్రామమున కుత్తరమున గల గంజికాలువ, ఈ సత్రమునందలి అన్నమువార్చిన గంజి పారుటవల్లనే ఏర్పడినదందురు.

ఈ గ్రామ నామమునకు జోడించిన కథ శాతవాహనుని కథను పోలియున్నది. దీపకర్ణి కృష్ణానదీ పరిసరారణ్యముల కరిగినపుడే పవిత్ర కృష్ణవేణీ పరిసరప్రాంతమున బాలుడు దొరికెను. తరువాత నా బాలుడు (శాతవాహనుడు) మహా పరాక్రమశాలియై వైరివీరుల చెండాడి చక్రవర్తి యగుటే గాక శకకర్తకూడ ఆయెను.

ఈకథ వినుటకు యింపుగానేవున్నది. కాని ఇది నమ్మదగినదికాదు. ప్రతి గ్రామమునుగురించి యిలాగే ఏదో చెప్పుకొందురు. ఈ గ్రామ కోటకమును గురించియు, లంజదిబ్బను గురించియు ఇట్టి కట్టుకథలే కలవు. చారిత్రక ప్రమాణముల వల్ల ఇవి అన్నియు నిరాధారములని విదితమగును.

ఘంటసాలలోని స్తూపములు, దాని వునికి ప్రాచీన ప్రశస్తిని తెలియచేయుచున్నవి. బౌద్ధయుగమున ప్రఖ్యాతిగాంచిన కంటకసేల కాలక్రమమున ఘంటసాలగా మారెను. ఇటుల మారిన గ్రామములు ఆంధ్రదేశమున పెక్కుగలవు.ఆంధ్రదేశ

కథాసంగ్రహము పూర్వయుగములోని ఈ దిగువ నుదాహరణములవల్ల విదితముకాగలదు. చెఱువూరు—చీపురపల్లి (226 పుట) మొలతంబ్లు—మాడేకబ్లు(226పుట) పాంబఱ్ఱు—పామఱ్ఱు (295 పుట) బాఱువళి—పలివెల (295 పుట) మంతదొఱ్ఱు—మందపఱ్ఱు (337 పుట) ఇంతేకాక కందనోలు — కర్నూలు (151 పుట) విజయవాటిక—బెజవాడ, నాఁగగడ్డ—నంగేగడ్డ అయినవి. ఈ విధముగా పెక్కు సాదృశ్యములను జూపించవచ్చును.

ఈ గ్రామమునకు గజరాజ పట్టణమని నామాంతరము ఉన్నది. ఈ విషయముకూడ యిచట పరంపరగా చెప్పువాడుకవల్లనేగాక ఒక కథవల్లనుకూడా తెలియుచున్నది. అదేదన, ఇద్దరు భట్రాజులు ఒకప్పుడు యాచనకై తిరుగుచుండిరనియు అందొక రోజున పూసడమను గ్రామమునకు వెళ్ళి (ఈ పురసమీపగ్రామము) ఆ రోజంతయు అన్నము దొరకక పస్తుండెనియు; ఆరాత్రి తమ సాంకేతిక స్థలమునకు వచ్చి, తన వృత్తాంతముచెప్పగా; రెండవ భట్టుమూర్తి, దాపున దాలిపర్రుండగా, ఎదుట ఎండకుదురుండగా, కాయగూరకు, కాజ కోసూరులుండగా, మజ్జిగకు మల్లంపల్లి యుండగా, గజరాజపట్టణంబైన ఘంటసాలుండగా, పూసడమేల వెళ్ళితివిరా, యాచకపుమొండీ యని; పరిహాసమాడె ననియు చెప్పుదురు.

దీనినిబట్టి ఒకానొకప్పుడు గజరాజు అను నతడు ఈ పురమును పాలించుటచేతనో, మరి ఏకారణముచేతనో దీనికి యీ నామాంతర మొచ్చియుండునేమో!

ఎన్నికథలు చెప్పినా, కంటకసేల నామమే ఘంట సాలగా మారెనుగాని మరొకటిగాదని వేరే వివరించనక్కర లేదు విజ్ఞులకు.

## ఘంటసాల పురము

బౌద్ధయుగమున కంటకశేల మహాపట్టణముగా విలసిల్లి నట్లు మనము తెలుసుకొంటిమి. అనంతరము పదమూడవ శతాబ్దమువరకు ఇది పురముగానుండెనని శాసనములవల్ల తెలియు చున్నది. తొమ్మిదివ శతాబ్దములో విణ్ణువర్ధన మహారాజు 2000 యిండ్లను బ్రాహ్మణులకు దానము చేసినట్లుండుటయు, ఇచటి దేవాలయములకు అనేక ప్రాంతములవారు దానము లొనర్చినట్లు శాసలములవల్ల విదితమగుటయు ఇచటి వైశ్యులు పలుప్రాంతములలో దానము లొనర్చుటయే గాక ఘంటసాల పురముగా పేర్కొనుట మొదలుగాగల కారణ ములవల్ల యిదియొక పట్టణముగా నుండెనని తెలియుచున్నది.

దీనికి సాదృశ్యముగ యిచట పరంపరగా చెప్పుకొను వాడుకవల్ల యిచట 101, దేవాలయములు, 101 చెరువులు, 101 నూతులు ఆ కాలమున వుండెడివని తెలియుచున్నది.* దానికి అనుకూలముగనే, రైతులు భూముల మరమ్మతు వగైరాలకు పాటిమన్ను త్రవ్వునపుడు, నూతులు తీయునప్పు డును, అనేక లింగములు, విగ్రహములు, నందులు, పాను వట్టములును దేవాలయమునకు సంబంధించినవి దొరికినవి. ఇంకను భూమిమీాద కన్పించు గుర్తులనుబట్టి కొన్ని దేవా

* 101 వుండదు. అష్టోత్తరశతం వుండుట సాంప్రదాయమంటారు.

లయముల కట్టడములుగా కన్పించుచున్నవి. ప్రస్తుతగ్రామము నకు పడమరనున్న వైష్ణవుని చెరువునకు పడమర చన్నకేశవ స్వామి ఆలయమును, ఉత్తరమున ఒక విష్ణాలయమువుండెనని చెప్పెదురు. ఊహాయు గుర్తులేగాక, యీపురమున అనేక దేవాలయములున్నట్లు బోడిలింగం గుంటలో దొరికిన శాసన మును (852 of 1917) బట్టి భోగేశ్వరాలయమును, బందరు లోని రంగనాథస్వామి ఆలయములోని శాసనమును (856 of 1917) బట్టి విశ్వేశ్వర స్వామి ఆలయమున్నట్లును తెలియుచున్నది.

నేడు మనము చూచుచుండగనే అనేక దేవాలయ ములు శిథిలమగుచుండగా కొన్ని వందల సంవత్సరముల క్రితమువున్న దేవాలయములు యీ గుర్తులతోతప్ప యెటు లుండగలవు?

ఆ కాలములో రాజులు, ధనవంతులు, భక్తులు దేవా లయములు కట్టించుట ధర్మకార్యముగా తలచుటచే యిన్ని దేవాలయములు యీ పట్టణములో యుండెనని నమ్ముటవింత కాదు. విజయనగరమును అయిదుమాసములు తురుష్కులు నాశనమొనర్చినను, నేటికిని అచట అనేక జీర్ణదేవాలయము లుండుట కాంచుచున్నారముకద! ఇచట నూటొక్క చెరు వులుకూడ వున్నవి అంటిమిగదా! మహాపట్టణములో ఇన్ని చెరువులుండుటకూడ సహజమే. వాటిని తిరిగి వెల్ల వేయించెడి వారు, మరమ్మత్తు చేయించెడివారు లేకపోవుటచే కాలక్రమ ముగా అవి పూడిపోవుట సహజమేగద.

దీనికిసాదృశ్యముగ ఇప్పటికినికొన్ని చేలప్రదేశములు పల్లముగా నుండుటయేగాక, చెరువులపేర్లతో పిలువబడు చున్నవి. గుర్రగుంట చేను, కుమ్మరగుంట చేను, జలధిలింగం గుంటచేను, ఆముదాలగుంట చేను, గుంటబీడు చేను, ఇంకను బోడిలింగంగుంట, కాకర్లగుంట అను గుంటపేర్లతోనున్నవి పెక్కుకలవు.

గుంట అనగా నేడుమనముఅనుకొనునట్లు చిన్నగొయ్యి మాత్రమేకాదు. పూర్వకాలమున కకారాదులుగానున్న శబ్దములు నేడు గకారాదులైనవి. కాలి_గాలి, కుంట_గుంట_ కడప_గడప, కుడి_గుడి మొదలగున వెన్నియో కలవు. కుంటయనగా కుంట వి స్తీర్ణ గల భూమికి చెరువునకు అర్థము. పూర్వకాలమున చెరువునకు కుంటయేవాడబడెను. పైన తెలిపిన విధముగాకుంట గుంటయైనది.

ఇటులనే నూటొక్క నూతులకలవని నాగులనుయ్యి, లింగంనుయ్యి, అక్కలనుయ్యి మలకలనుయ్యి దక్షణపునుయ్యి మొదలగునవు నేటికిని కానవచ్చుచున్నవి. అవసరములేక పోవుటచే మిగత నూతులు పూడ్చివేయబడిగాని, శిథిలములై గాని, పూడిపోయిగాని యుండవచ్చును.

పూర్వకాలమునాటి కొన్ని నూతులు; దిగుడుబావులు రెండు యిటీవలదొరికినవి. ఈ కట్టడములు చూచినయెడల అడుసుపోసినట్లే కనపడదు. ఆ నిర్మాణము అంత బాగా వున్నది. ఇది పురమను అనుకొనుటకు వరుసగా కొన్ని వరల నూతులు ఇప్పటి నూతులకంటె చాలచిన్నవిగా కన్పించును.

ఈ గ్రామమునందలి ఇప్పటి జలధీశ్వరాలయము ఆ కాలమున శైవక్షేత్రముగా నుండి యుండెను. ఈ దేవాలయమునకు ఆ కాలమునందలి రాజప్రతినిధులుకూడ దాన ధర్మము లొనర్చియుండుటచేతను ఇదియొక పురమై, మండలమునకు ముఖ్యనగరమై యుండెనేమోనని తలచుటలో అసమంజస మేదియు వుండదు. పదమూడవ శతాబ్దమువరకు ఇది ఓడరేవుగా నుండెనని పరిశోధకు లంగీకరించుటచే ఇది అప్పటివరకు పురముగానే వుండును. చాళుక్యుల పరిపాలనలో ఆంధ్రదేశములోని బెజవాడ విశాఖపట్టణములకు నామాంతరములున్నట్లుగనే ఘంటసాలను చోడపాండ్యపురమనినామాంతరముండుట ఇది పురమని నమ్ముటకు అన్నిటికంటె ప్రబల కారణముగా కన్పించుచున్నది.

పైసంగతి సందర్భలనుబట్టి యిది చాళుక్యయుగమున పట్టణమై అనేక దేవాలయములతోను పండితులతోను వణిక్ శ్రేష్ఠులతోన విలసిల్లి విఖ్యాతి గాంచినటుల కానబడుచున్నది.

## ఘంటసాల నివాసులు

ఆకాలమున ఏయేవర్ణములవారుండిరో వారినందరిని గురించి వివరముగా చెప్పుటకు వీలులేదు. కాని శాసనములను బట్టి యీ పురమున వివిధవర్ణములవారున్నట్లు విదితమగుచున్నది. అందులో బ్రాహ్మణులు అధికముగా నున్నట్లు నమ్ముటకనేక ఆధారములు కలవు.

ప్రస్తుత గ్రామములోని భూముల (చేలు) పేర్లుచాలా బ్రాహ్మణులవే. ఇచట అనేక దేవాలయములుండుడ చేత విశేషముగా బ్రాహ్మనుండిరని నమ్ముటకు వీలుగానున్నది. ఇంతియేగాక తొమ్మిదవ శతాబ్దమున విష్ణువర్ధన మహారాజు ఇచట 2000 బ్రాహ్మణులకు గృహదానము చేసినట్లు జల ధీశ్వరాలయమునందలి శాసనము తెలుపుటచే విశేషముగా బ్రాహ్మణు లున్నారనుటలో ఎట్టిసందేహము లేదు.

ఇది రేవుపట్టణము గనుక వర్తకవ్యాపారము విశేష ముగా జరుగుటకు వీలుండుటచే వైశ్యులుకూడా విశేషముగా నుండిరనుటకు ఊహయేగాక శాసనములవల్లకూడా ఇచట వైశ్యులు పెక్కురుండి రనుట కాధారములుకలవు. వైశ్యుల ముఖ్య పట్టణముల గు అష్టాదశ పట్టణములలో ఘంటసాల ఒకటిగా పేర్కొనబడెను. జలధీశ్వరునకు వైశ్యులు దానము చేయుటయేగాక యీ దానధర్మములు సక్రమముగా నెరవేరుటకు స్థానాపతులో లేక సాని మునూర్వురినో చూడ వలసినదిగా ఇతర దేవాలయములలోని ధర్మశాసనములలోవలె గాక వైశ్యులే (యీ శాసనములలో ఈ ధర్మ్ముణవు నకరము నూడయిబ్బంద్రుందారరసి రక్షింపంగలవారు అనియుండుటచే) చూడవలసినదిగా నుండెను.

ఇంతేగాక ఘంటశాల వైశ్యులు, బెజవాడలోను, ఏలూరులోను దేవాలయములకు ధర్మములు చేసిరి. ఘంటసాల ఇంటిపేరుగల వైశ్యులు చాల విశేషముగా నుండిరి. వారి గోత్రములురెండుండుట దీనికి మరింత బలమైన కారణముగా

వున్నది. ఈ ఘంటసాలవారుకూడ కన్యకాపరమేశ్వరితో అగ్నిగుండమున ప్రవేశించినవారిలోనివారే.

వైశ్యులకు పెనుగొండ ప్రధాననగరము అచటకూడ ఘంటసాలవారున్నట్లేగాక ఘంటసాల యింటిపేరుగల వైశ్యుడును, మరికొందరును ఒక ధర్మశాసనమును పెనుగొండ నగరమునందలి నగరేశ్వరస్వామికి చేసినట్లుగలదు. పెనుగొండ వైశ్యులచట దేవాలయమునకు ధర్మముచేయుట పెనుగొండలో ఘంటసాల వైశ్యులు వుండుటచేతను, ఘంటసాలకు పెనుగొండకును ఎక్కువసంబంధమున్నట్లు తెలియుచున్నది. మరియొక పెనుగొండ ధర్మశాసనములో ఘంటసాల ఇంటిపేరుగల వైశ్యుడక్కడనుండుట ఘంటసాల వైశ్యులుఅచట ప్రాముఖ్యమును బొంది ప్రధాన స్థానమునుకూడ ఆక్రమించినట్లు విదితమగుచున్నది ఈదిగువ పెనుగొండ కైఫియతువల్ల విదితము కాగలదు.

"పెనుగొండ వైశ్యులు.........................
..................భ్రాతృ ప్రభావులు...................
..............పాంచారులునిరవంద్యాజున్నాగుణీ..........
..............కొండుల ఖంటసాలత్ర.................
.................నరసింహ్వా నారాయళ...........
యిన్నగరంవారు వ్రాయించి యిచ్చిన ధర్మశాసనపట్టు. శ్రీ నగరేశ్వరస్వామివారికిన్ని కన్యకాపరమేశ్వరికిన్ని నిత్యమహోత్సవములకు పెండ్లికి అర్ఘ్యపాద్యాన్ని, యిలువర్స కట్నం పావులాను, యీ ప్రకారంగాను మర్యాదచేస్తిమి. గనుక మన నూటయిబ్బంద్రునగరం వారున్ను,వరుషేవరుపె

వారిలో యెవరు నడిపించకపోయినా శ్రీనగరేశ్వర, శ్రీ జనార్దనస్వాముల పాదపద్మములకు తప్పినట్లు."[1]

పై శాసనము పశ్చిమగోదావరి జిల్లాలోని పెనుగొండ నందలి నగరేశ్వరాలయములో కలదు. దీనిలోని పై అయిదు పంక్తులలోని మధ్య అక్షరములు కొన్నితప్ప మిగతా అక్షరములు అరిగిపోవుటచే, అందలి భావముయొక్క అర్థము పూర్తిగా అర్థము అగుటకు వీలులేదు. కాని పెనుగొండ వైశ్యుల నుద్దేశించి ఘటంసాల ఇంటిపేరుగల ఒక వైశ్యుడును మరికొందరు వైశ్యులు (వైశ్యకులపెద్దలు) పెనుగొండ లోని నగరేశ్వరస్వామివారికిని, కన్యకాపరమేశ్వరికిని నిత్య మహోత్సవము చేయగలందులకు ఖర్చుకుగాను, పెండ్లికి అర్థ రూపాయి కట్నమును, ఇలువరస ప్రతి యింటియజమాని సంవత్సరమునకు పావలాయున్ను యివ్వవలసినదిగా ఏర్పాటు చేసిరి. ఈ యేర్పాటును వైశ్యులలో ఎవరు భంగపరచినను శ్రీ నగరేశ్వర శ్రీ జనార్దనస్వాముల పాదపద్మములకు తప్పినట్లు అని ప్రమాణవచనము పలికిరి.

విశ్వబ్రాహ్మణులుకూడ ఉన్నట్లు తెలియుచున్నది. ఇన్ని దేవాలయములుండుటచే, యీ దేవాలయములకుసంబంధించిన పనులును, గృహనిర్మాణములు చేయవలసియుండు వారుగానుండుటేగాక ప్రస్తుతగ్రామములో కొంతభూమి కమ్మర్లపాడు అని పిలువబడుచుండుటచేతను, ఘంటసాల పేరుగలవారు విశ్వబ్రాహ్మణులలో నేటికిని వుండుటచేతను పై

1 I. C. R. Vol II P. 202.

కారణములనుబట్టి వీరుకూడ యుండిరనుట కాధారములు కనిపించుచున్నవి.

ఇంకను గొల్లలు, కళావంతులు మొదలుగాగల ఇతర జాతులుండిరి. కమ్మవా రాకాలమున ఇచట లేనేలేరు. ఇచటకు ప్రథమమున వచ్చిన కమ్మవారగు వేంపాటివారు కమ్మవారని నేటికిని పిలువబడుచుండుట దీనికి ప్రబలాధారముగానున్నది.

### ఏలూరు మసీదులో నున్న శిలాశాసనము

### నెం. 531 / 1893

చిరముగ ఘంటసాల యెఱసెట్లీపు గోత్రము వెన్నిసెట్టికిని సరసిజనేత్రి దారమకు సత్పుత్రవాసమ వెట్టెంబన్నిసీపురమున సోమనాథున కపూర్వ్వముగా నిరుసంధ్యదీప మూ సరసిజగర్బ్భవక్త్రికర చంద్ర శశాంక్క శకాబ్దసంధ్యలన్ ॥*
ఈ దీపము యీ గుడితానపతులు ఆ సంద్రాక్కము నడపంగాలము

శాలివాహనశకము ౧౧౨౪ అనగా క్రీస్తుశకము ౧౨౦౨ సం॥ము ఏలూరువందలి సోమనాథునకు ఘంటసాల యెరశెట్ల గోత్రజుడగు వెన్నిశెట్టికి, దారమకును కలిగిన యట్టి పుత్రికయగు వాసమ ప్రతిదినము సంధ్యాసమయముల దీపారాధన చేయ దానముచేసెను. ఈ దీపారాధ పైనపేర్కొనిన

*"అంకానాం వామతోగతిః" అనుసూత్రము ననుసరించి సరసిజగర్భవక్త్రి = నాలుగుమోములు, కర = రెండుచేతులు, చంద్ర-చంద్రుడు శశాంక = శివుడు అనగా ౧౧౨౪ అగును.

విధముగా ఆ చంద్రార్కము జరుగగలందులకు ఈదేవాలయ ధర్మకర్తలు చూతురుగాక.

## ఏరూరు మసీదులో నున్న శిలాశాసనము

వెం 532/ 1893 రు

పురకరకైరవాప్త శశిభూరి శకాబ్దములొప్ప శారగ్నిక్ కిని, సరసిపురంబులోనిలిపె సంధ్దియ దీపము వెన్నిసెట్టికిందారు ణియ ఘంట్టసాల పురిదారమకును ఫలమొంద్ద వీరికిని; వరసుత యైన వాసమ ధ్రువంబుగ నా శశితారకంబుగాను.ఈ సంధ్య దీపముసేకొని కన్నమ పండ్డితులు నామనయు రెండ్డుసంధ్యల నడపంగ్గలవారు.

దీనితాత్పర్యమేమన ఏలూరు పట్టణములోగల విష్ణాలయములో ఉదయము సాయంకాలము ఉభయసంధ్యవేళల దీపారాధన చేయగలందులకు తత్ఫలితము ఘంటసాలపురము లోని తమ తల్లికి కలుగునట్లుగా, వెనిసెట్టికుమార్తె వాసమ దీపదానము శాలివాహనశకము ౧౧౨౩ సం॥ అనగా క్రీస్తుశకము ౧౨౦౧ సం॥న చేసెను. ఈ దీపము ఆచంద్రార్కము స్థిరముగా వుండు గాక. ఈ సంధ్యదీపము తీసుకొని కన్నమ పండితుడు, నామనయు ఉభయసంధ్యలవేళల అనగా వుదయ సాయంకాల సంధ్యలందు దీపారాధన చేయవలెను.

## బెజవాడలోని శాసనము

నెం 261/ 1892 రు

స్వస్తిశ్రీ సకవర్షంబులు ౧౧౭౬ నేటి చైత్ర శుద్ధ ఏకదశయ్యు సోమవారనాండు బెజ్జవాడ మల్లీశ్వర శ్రీమహా

దేవరకు గంట్టశాల మిఁతితికిలవు మారిసెట్టికొడుకు మారిసెట్టి అఖండదీపమునకై నిచ్చిన మోదాలు ౨౫ వీనింజేకొని బట బోల సూరెబోయిని కొడుకులు వలెబోయుండును రామనబో యుండును ప్రోలెబోయుండును దమ పుత్రానుపాత్రికము నిత్య మానెంఁ నెయ్యి ఆచంద్రార్కము బోయంగలవారు.

శాలివాహనశకము ౧౧౪౭ కు సరియగు క్రీస్తుశకము ౧౨౨౫ సం॥ బెజవాడలోని మల్లీశ్వరస్వామికి ఘంటసాల ఇంటిపేరుగల మిఁతికిలపు గోత్రుడగు మారిశెట్టికొడుకుమారి శెట్టి ఆ దేవాలయములో రోజు ౧ కి మానెడు నెయ్యి పోసి శాశ్వతముగా అన్ని వేళలందు దీపారాధన చేయగలందులకు బటుబోయిన కొడుకులు వలెబోయుడు, రామనబోయుడు, ప్రోలెబోయుడు వీరిముగ్గురు (గొల్లలు) పరముగా ౨౫ ఆవు నుల యిచ్చెను.

## జలధీశ్వరాలయము

ఈ పురమున ౧౦౧ దేవాలయములుండెనని ప్రతీతిగల దని తెల్పియుంటిమిగదా! శాసనమువల్ల యిచట భోగేశ్వ రాలయము విశ్వేశరాలయము జలధీశ్వరాలయములుండి నట్లు తెలియుచున్నది భోగేశ్వరాలయము నామరూపులు లేకుండగనే నశించినది. విశ్వేశ్వరుని పేరుతో ఇటీవల కట్టిన ఒక ఆలయము కలదు. పోగా మిగిలినది జలధీశ్వరాలయ మొకటే పురాతనమైనది కలదు. ఇది అగస్త్యమహాముని చే ప్రతిష్ఠింప బడెనందురు. చారిత్రక దృష్టితో చూచిన దానిని నమ్ముటకు వీలులేకున్నది. అగస్త్యమహర్షి నేటికి నాల్గువేలసం॥ల

క్రితము కురుపాంచాల భూములందు నివసించుచు ఆకాలము నాటి వ్రాత్యులను, వైదికులను గావించుటకై ప్రయత్నం చేయగా నేటిపూర్వాచార పరాయణులవలెనే నాడును, పూర్వాచార పరాయణులు ఆయనను సంఘబాహ్యునిగా చేయుటచే దక్షిణదేశమునకు వచ్చెను. దక్షిణాదికి వచ్చిన ఆర్యులలో యీయనయే ప్రథముడు. ఈయన యిచట తాను సంకల్పించిన విధమున ఆర్యధర్మమును విస్తరింపజేసెను. నాల్గు వేల సం॥ల క్రితము దేవాలయములు లేవు. ఆకాలమున ఆర్యులు ఇంద్రాగ్నులను పూజించుచుండిరేగాని, నేటి పౌరాణిక దేవతలను పూజించలేదు. ఈ కారణములనుబట్టి ఇది అగస్త్య మహామునిచే ప్రతిష్ఠితమనుటకు వీలులేదు. బౌద్ధులు స్తూపములను ఆకర్షవంతముగా కట్టి, పామరజనమును తమమతములోనికి వచ్చునట్లు చేసుకొనుటచూచి హిందువులు దేవాలయములు కట్టినట్లు విదితమగుచున్నది ఇంతేగాక అనేక ప్రసిద్ధ దేవాలయములు స్తూపపురాళ్ళతో కట్టబడినవే.

ఈ దేవాలయము ఎప్పుడు నిర్మాణమయ్యెనో చెప్పుటకాధారములులేవు కాని ఈ పేరుతో దైవపూజ అతిపురాతన కాలమునుండి అనగా క్రీస్తుశకారంభ కాలమునుండియు జరుగుచుండవచ్చును. ఈ దేవాలయమునకు 9వ శతాబ్దమున దానము లిచ్చినట్లు కనిపించుచున్నవి. కనుక షుమారు 1000 సం॥ల క్రితమే నిర్మింపబడిదనుటలో సందేహములేదు. ఇది మట్టి అడుసుతోనే కట్టబడినది. తర్వాత షుమారు 100 సం॥ క్రితమే [illegible]

ప్రాచీనకాలమున బౌద్ధస్తూపములున్న ప్రదేశములోనే హిందువులు హిందూదేవాలయములను, బౌద్ధులను తమమతములోనికి త్రిప్పుకొనుటకు నిర్మించిరి. ఈ దేవాలయముచాల ప్రఖ్యాతిచెందినది. మూడువందల సానులు యీదేవుని ఆరాధించుచుండినట్లు, శాసనమువల్ల తెలియుచున్నది. దీనికి అనేకులు దానమిచ్చుటచేత ఇదిమహాపుణ్యక్షేత్రమై యొప్పెననుటలో సందేహములేదు.

ఘంటసాల స్తూపము మాదిరి స్తూపము లేనటులనే యిట్టి దేవాలయము ఎచటను వున్నట్లు చెప్పరు. ఇచటి విశేషమేమన, పార్వతీ పరమేశ్వరులు ఏకపీఠమునవుండుట. సాధారణముగా ప్రతి శివాలయమున శివలింగమే ప్రతిష్ఠింపబడియున్నది. ఈ ఆలయపు ఇటుకరాళ్ళుకూడ స్తూపపురాళ్ళ అంతపెద్దవే.

## జలధీశ్వరాలయమునందలి శిలాశాసనములు

ఈ శాసనశిల బౌద్ధస్తూపమునకు చెందిన పాలరాయి. ఇటులనే ఆంధ్రదేశములోని చాల శాసనశిలలు స్తూపపురాళ్ళే. ఈ రాతి మూడువైపుల కొద్ది శిల్పము కలదు.

ఇది షుమారు మూడుగజములు ఎత్తుండును. పైభాగము విరిగిపోయినది. ఇపుడు 2 3/4 గజములు ఎత్తు, షుమారు అర్ధగజము వెడల్పు పాతిక మందము గలిగియున్నది.

ఈ శిలాసాసనము షుమారు డెబ్బది సం॥ల క్రితము యీ ఆలయప్రాకారంలో నూయి త్రవ్వుచుండగా అయిదు

గజములలోతున దొరికినదట. ఇది అంతలోతున ఏలపారవేయబడెనో తెలియరాదు. దీనిని బయటకుతీసి జలధీశ్వరాలయపు ధ్వజస్తంభమువద్ద పాతిరి. ఎండకు ఎండి వానకు తడిసి పోవుచుండుటచే దీనిని శిథిలముకాకుండ కాపాడదలచి, 1929 సం॥న గ్రామసంఘమువారు కట్టించిన జలధీశ్వరాలయపు ముఖమండపములో దక్షిణదిక్కున పదిలపరచిరి.

ఇచట బౌద్ధస్తూపము త్రవ్వించిన అలెగ్జాండర్ రే ఈ శాసనశిలను గురించికూడ తమ రిపోర్టులో వ్రాసియుండిరి. వారు దీనిమీద నాల్గుశాసనము లున్నట్లు, అందులో ఒకటి పాలీభాషలో నున్నట్లును వ్రాసియుండిరి. కాని పాలీభాషలో శాసనము లేనేలేదు ప్రాచీన తెలుగు అక్షరములనే వారట్టుల భావించిరి. దీనిమీద వారు వ్రాసినట్లు నాల్గుగాక, ఏడు శాసనములు కలవు. ఇందులో ఆరు గవర్నమెంటు శాసన పరిశోధన శాఖాధికారులచే 1917 సం॥న కాపీచేయబడెను. మిగతా ఒక శాసనములోని రెండు పంక్తులుమాత్రమే అస్పష్టముగానుండి పైభాగము వ్రాయబడిన శాసనభాగము విరిగిపోవుటచే దానిని వదిలివేసిరి.

ఇవి వివిధకాలములందు వ్రాయబడియున్నవి. ఈ శాసనములనుగురించి వరుసక్రమముగా తెలియచేయుదుము.

విష్ణువర్ధన మహారాజు దానశాసనము.

తొమ్మిదవ శతాబ్దము తెనుగులిపి. స్వస్తి యను రెండు అక్షరములు మినహా మిగతాక్షరములు సామాన్యులకు తెలియవు.

శాసనభాష: సంస్కృతము.

శాసన విషయము: తూర్పు చాళుక్యరాజగు విష్ణువర్ధన మహారాజు, ఘంటసాలలోని రెండువేల బ్రాహ్మణులకు దానము చేసెను. ఈ ధర్మమును నాశన మొనర్చినవారు పంచ మహాపాతకము లొనర్చినవా రగుదురు.

శాసనములో పేర్కొనిన రాజు: విష్ణువర్ధన మహారాజు.

ఈ శాసనములో సంవత్సర ముదహరింపబడక పోవుటచే యితని కాలము తెలిసికొనుటకు వీలులేకయున్నది. విష్ణువర్ధనుడను పేరుగల రాజులు తూర్పు చాళుక్యులలో చాల మంది కలరు. విష్ణుభట్టసోమయాజిచే వీరి పూర్వీకుడగు జయసింహవల్లభ మహారాజు పెంచబడుటచే, తత్సూచకముగా, వీరిలో చాలమందికి విష్ణువర్ధనుడను నామముండెను. శాసన అక్షరములనుబట్టి 9వ శతాబ్దపువాడుగా నిర్ణయించిరి. తొమ్మిదవ శతాబ్దములో ఇద్దరు విష్ణువర్ధనులు కలరు. కవి విష్ణువర్ధనుడు క్రీ. శ. 843_844 వరకును, మొదటి చాళుక్యభీమవిష్ణువర్ధనుడు క్రీ. శ. 888_918 వరకును పాలించిరి. వీరిలో బహుశా చివర విష్ణువర్ధనుడై యుండవచ్చు.

ఘంటసాలలోని శ్రీ జలధీశ్వర దేవాలయములోని శిలా స్తంభముమీదనున్న శాసనము. పడమరనున్న మూటిలో మధ్యది.

"స్వస్తివిష్ణున
మహారాజ్యేఘణ్ణశా
లానివాసినః శ్రీ వియా
బ్రహ్మణా నామృణ్ణాన్వి

హస్రికాయ్యాన్కృ అస్మిన్వః
పన్ధ్వవహార య స్యోపరిబా
ధాంకురుతే సపఞ్చమహా
పాతకసంయుక్తోభవతి"

849/1917

శాసనం పేరు: కులోత్తుంగ చోడదేవుని దానశాసనము.

శాసనయోగ్యత: ఈ శాసనములోని అక్షరములు లోతుగా కొట్టకపోవుటచే ఏమో చాలా అరిగిపోవుటచే మధ్యమధ్య కొన్ని అక్షరములు కన్పించుటలేదు. ఉన్న అక్షరములుకూడ బాగుగలేకపోవుటయేగాక సరిగా కన్పించుట లేదు. పైభాగమువిరిగిపోవుటచే చాలభాగము కానరాకున్నది.

శాసనవిషయము: వెలనాటి కులోత్తుంగ చోడదేవుడు కొంతధనమును కొంతభూమిని జలధీశ్వరునకు దానముచేసినటుల కలదు. ఇంతేగాక కొన్నిప్రాచీన తెలుగుపదములు కూడ కలవు. చివరకు ఈ ధర్మమును చెరచినవారు కాశీలో హత్యచేసినట్లును గంగసమీపమున వేయి ఆవులను వేయిమంది బ్రాహ్మణులను తమ తలిదండ్రులను వధించిన పాపముల పోవుదురనియు తమపెద్దకొడుకు పుత్తైలో తిన్నవారగుదురనియు యుండి, చివరకు పులియాన విజయపనాయకుడు 5 పుట్లచేను ఇచ్చెనని యుండెను.

శాసనమునందలి కొన్నిప్రాచీన తెలుగుశబ్దములకర్థము:

వారణాసివచ్చి వ్రచ్చినవారు= కాశీవచ్చి హత్యచేసినవారు. కొన్ని శాసనములలో వారణాసి వచ్చినవారనికూడ కలదు.

గంగకఱుత = గంగానదీ సమీపమున.

వేయిగవిలను = 1000 కపిలవర్ణముగల ఆవులను, ఆవులలో ఈ రంగు ఆవులు శ్రేష్ఠమైనవి. కొన్ని పూర్వశాసనములలో వేగవిలాళు అనికూడ వున్నది. వే- వేయి, వేయికి ప్రాచీనరూపము. గవిలాళు = కపిలవర్ణముగల గోవులు.

వేవురుబ్రాహ్మణులను = వెయ్యిమందిబ్రాహ్మణులను

ఇరుగురులను = తలిదండ్రులను. కొన్ని శాసనములలో ఇరులను = పూర్వీకులను అనికూడ వున్నది. పెద్దకొడుకు కపాలమునంగుడిచినవారు = పెద్దకొడుకు పుఱ్ఱెలో భుజించినవారు. పుట్టిచేను = 8 యకరములు.

పైశబ్దము లన్నియు, ఈ శాసనమునందలి ధర్మమును చెడగొట్టినవారు అట్టి పాపకార్యములు చేసిన పాపఫలిత మను భవింతురని దిగువను వ్రాయబడెను.

## వెలనాటిచోడులు

శాసనములో పేర్కొనబడిన దాత, కులోత్తుంగ చోడదేవుని దత్తపుత్రుడు కులోత్తుంగ చోడగొంక.

తూర్పు చాళుక్యులలో బహు పరాక్రమశాలియగు ప్రఖ్యాత రాజరాజనరేంద్రుని కుమారుడగు కులోత్తుంగ చోడదేవుడు క్రీ. శ. 1063 లో రాజ్యమునకు వచ్చెను. (వేంగిదేశమునేలిన చాళుక్య ప్రభువులలో ప్రథమ చోళరాజు యితడే.) ఇతనికాలము చోళరాజ్యములో వేంగిరాజ్యము కలసిపోయెను. అందుచే యితడు వేంగిరాజ్యమును చోళ రాష్ట్రము (Province)న కుత్తరరాష్ట్రముగా ఏర్పాటుచేసి ఇచట తనకు ప్రతినిధిగా తనకుమారుడగు రాజరాజును 1 1/2

సంవత్సరములువుంచెను. ఆ తర్వాతతనపినతండ్రియగు విజయా దిత్యుని 15 సం॥లు ప్రతినిధిగా నుంచి తానుచోడరాష్ట్రము లోని కాంచీపురమును రాజధాని చేసుకొని పరిపాలించెను.

తరువాత వెలనాటి చోడులు చాళుక్యచోడులకు ప్రతి నిధులుగానుండి క్రీ. శ. 1186 వరకు గోదావరి మొదలు నెల్లూరువరకు కులోత్తుంగుని కాలమునుండి, కాకతీయుల వరకు పరిపాలన మొనర్చిరి.

వెలనాడు అనునది గుంటూరుమండలములోని చంద వోలు ప్రాంతమునకు మొదట వర్తించినను తరువాత విస్త రించినది. వెలనాడు మండలమునకు చందవోలు రాజధానిగ నుంచెను. ఇది గుంటూరుజిల్లా రేపల్లెతాలూకాలో నున్నది. వెలనాడుకు ప్రభువులుగనుండిన చోడులు చాళుక్యచోడుల యధికారముక్రింద వారికి ప్రతినిధులుగావుండి వేగిదేశమును బరిపాలించి మిక్కిలి ప్రసిద్ధిగాంచిరి. వీరిసంతతివారే కమ్మ వారని శ్రీయుతకొత్త భావయ్యచౌదరిగారు వీరినిగురించి ఇటుల వ్రాయుచున్నారు. "క్రీ శ 11, 12 శతాబ్దములలోను అంతకు పూర్వమును ఆంధ్రదేశమును పాలించిన వెలనాడు లేక తెలుగు చోడులు నేటికమ్మవారి పూర్వులే యనుటకు చాలినన్ని యధారములు గలవు."[1]

వెలనాటి గొంకరాజపుత్రుడయిన యీచోడుని చాళుక్యచోడుడు పెంచుకుని దేశమునకు రాజప్రతినిధిగనియ మించెను. కులోత్తుంగుడే యితనిని రాజప్రతినిధిగా నియ మించియుండును.

1 భారతి. 1938 మార్చి. పు. 255

ఇందుపేర్కొనబడిన విజయపనాయకుడు వెలనాటి కులోత్తుంగ చోడగొంక ఆజ్ఞానుసారము యీ ప్రాంతమును పరిపాలించిన నాయకుడుగా ఉండవచ్చును. ఇతడును యీ దేవాలయమునకు కొంతభూదానము రాజప్రతినిధివచ్చినపుడు చేసియుండును.

ఘంటసాల శ్రీ జలధీశ్వరస్వామిఆలయములోని శిలా స్తంభ శాసనము.

సంక్రాంతి నిమిత్తమున
శ్రీ మన్మహా మణ్డలేశ్వర కు
లోత్తుంగ చోడకొంక్క రాజులు ఘ
ంట్టశాల ........ శ్రీ జ
లధీశ్వ ........
...తమ (దల్లి దండ్రులకు) (సవ్వ ణ)
..................
.........(మాడలు)
.........(వేలంద్రుము) సేను
...బద్ధముగా నాచంద్రార్క్కణము దేవదా
నముగా నిచ్చితిమి ఇదమ్మ్ణవున
కులిలోపుముదలంచిన వారు వా
రణాసి వచ్చి వ్రచ్చినవారు గ్గంగ్గక
ఱుత వెయి గవిలను వేవురు
బ్రాహ్మలను వధిఇంచ్చిన
వారు [తమ] ఇరుగురు [లను,
వధించ్చిన వారు పె

ద్దకొడ్కు కపాలమునం గు
డిచినవారు. పులియన విజయపనా
యకుండు యిచ్చిన [చేను] పుట్లు ౫

## గొడకొమ్మిశెట్టి శాసనము

శాసనయోగ్యత: ఈ శాసనములో కొంతవచనము కొన్ని పద్యములు కలవు. వచనము బాగుగనే కన్పించు చున్నది. పద్యములో అచ్చటచ్చట అక్షరములు పోయినవి.

శాసనవిషయము: శాలివాహన శకము 1066 సరి యగు క్రీ. శ. 1144 సంవత్సరమున పెనుగొండ కాపురస్తుడును వైశ్యుడును అగు నాబెలగోత్రుడైన గొడకొమ్మి శెట్టి తనతండ్రి ఎఱియ శెట్టికిని తనతల్లి బమ్మమ్మకును తనకును పుణ్యప్రాప్తికొరకు ఘంటసాలయైన చోడపాండ్య పురము నందలి జలధీశ్వరస్వామికి దక్షిణమున, వుత్తరమున రెండు దీపములు అహర్నిశములు వుంచుటకుగాను, ఈదేవాలయము నందలి ౩౦౦ దేవదాసీల పరమున పదిరాజరాజమాడ లుంచెను. ఆసానులు నిత్యం రెండుమానికలు నెయ్యిపోసి యీ దీపములు శాశ్వతముగా సంతానక్రమమున నడిపించ వలసినదనియు ఈ ధర్మమును ఈ పురమునందలి వైశ్యులు కాపాడవలసినదని యున్నది.

ఈ శాసనమునందలి కొన్నిశబ్దముల (ఇపుడు వాడుకలో లేనివాటిని)ను గురించి వ్రాసినగాని దీని అర్థము వివరముగా దెలియక పోవుటయేగాక ఇందలి కొన్ని శబ్దములు

ఆ కాలములోని కొన్ని విషయములను తెలుపునవిగా నుండు టచే వానినిగూర్చి వ్రాయుచున్నారము.

శాసనమందు పేర్కొన్న రాజు—ఈ శాసనములో శాలివాహన శకమున్ను అప్పుడు పరిపాలించుచున్న కులోత్తుంగ చోడదేవర రాజ్యపరిపాలన సంవత్సరముకూడ చక్కగా నుదహరించిరి. ఈ రాజు ప్రథమ కులోత్తుంగుని మనుమడు. క్రి శ. 1113–28 పాలించిన విక్రమ చోళునికొడుకు. ఈ రెండవ కులోత్తుంగ చోళుడు క్రీ.శ 1128–1159 పాలించెను.

ఉత్తరాయణ సంక్రాంతి పూర్వకాలమున దానములు విశేషముగా చేసెడివారు. ఇతర సంక్రాంతులలోకూడ చేసినవి లేకపోలేదు. కాని ఇది అన్ని సంక్రాంతులలోనికి అధిక పుణ్యప్రదమైనది.

పెనుగొండశాసనుడు—శబ్దార్థము—పెనుగొండను పాలించెడివాడు. ఈ పెనుగొండ అనంతపురంజిల్లాలోని పెనుగొండ కాదు. తళ్ళికోట యుద్ధానంతరం విజయనగరాజులకు రాజధానియై నేటికి నాటివైభవములు చూపెట్టు దివ్యమందిరము లెన్నియో అందుగలవు. ఈ పెనుగొండ పశ్చిమగోదావరి జిల్లాలో తణుకుతాలూకాలోనిది. కన్యకాపరమేశ్వరి జన్మస్థానము ఇచట ప్రసిద్ధమైన కన్యకాపరమేశ్వరిపీఠము, దేవళము కలదు. ఇది వైశ్యులకు ప్రధాననగరము. ఇచట వైశ్యులు విశేషముగా నుండుటయు కన్యకాపరమేశ్వరి జన్మస్థానమగుటచే దీనికిట్టి ప్రాముఖ్యముగలదు. ఇచ్చటనే వైశ్యధర్మములు కట్టుబాటులు ఏర్పడుచుండెను. పెనుగొండ శాసను

ననునది వైశ్యులకు బిరుదువాచకము. ఇటులనే తెలిక తెగ వారు 'బెజవాడ శాసనులను'[1] పద ముపయోగించెడివారు. పెనుగొండ వైశ్యులకును, బెజవాడ తెలిక తెగవారికిని ప్రధాన పట్టణములగుటచే వీరీ సంజ్ఞావాచక ముపయోగించెడివారు. దీనికి సాదృశ్యముగాను వివిధవర్ణముల వారికి ప్రధాన తీర్థముల పేర్లను సూచించు ఒక శ్లోకము శ్రీయుత వేటూరి ప్రభాకరశాస్త్రిగారివద్ద చూచితిమి. దానిని యీ దిగువ నుదహరించుచున్నారము_

"బ్రాహ్మణానాం కాశీకాక్షేత్రం,
క్షత్రియానాం అయోధ్యా,
వైశ్యానాం పెనుగొండ,
కుండికుంభకాశ్చైవ కొండవీడు,
తిలఘాత ఇంద్రకీల,
కొల్లాపురి ఎరుకుల,
శ్రీశైల శైవత,
జంగమారాధ్య విధిచసాతెన తణక స్తథ,
చెంచుకాకా ఓబళేచ్చైవ,
విశ్వకర్మ కాశికాభవేత్,
కమ్మరి వుజ్జయినిచ్చైవ,
తురుష్క మక్క కేతథా,
పుష్పరి............
సర్వవర్ణం తిరుమలాభవేత్,"

1. ఆంధ్రదేశ కథాసంగ్రహం. పూర్వయుగము, పుట 320

తాత్పర్యము :—

బ్రాహ్మణులకు కాశి, క్షత్రియులకు అయోధ్య, వైశ్యులకు పెనుగొండ, కుమ్మరులకు కొండవీడు, తెలిక తెగవారికి బెజవాడ, ఎరుకుల కులస్థులకు నైజాములోని కొల్హాపురం, శైవులకు శ్రీశైలము, జంగములకు, ఆరాధ్యులకు సాతానులకు తణుకు, చెంచువాండ్రకు అహోబలం, విశ్వబ్రాహ్మణులకు కాశీ, కమ్మర్లకు ఉజ్జయినీ, మహమ్మదీయులకు మక్కా, వుప్పర్లకు.........పుణ్యక్షేత్రములు. సర్వవర్ణములకు తిరుపతి పుణ్యక్షేత్రము.

వేంగిన వైశ్యుడు—వేంగిదేశపు వైశ్యుడు. పూర్వము ఆంధ్రదేశము, ఆయా రాజుల కాలములలో వివిధభాగములు చేయబడి పిలువబడుచుండెడిది. ఈ భేదము లనేకముగా నుండెడివి. ఒక్కొక్కప్పు డొకపేరుతో పిలువబడుచుండెను. అలాగే వేంగిదేశ మన కృష్ణాగోదావరుల మధ్యదేశము.

సాని మున్నూర్వురు= దీని అర్థము మూడువందల సానులు. సాని అనే శబ్దము స్వామి అనగా సన్యాసి అనుపదమునకు స్త్రీ వాచకము. పు. స్వామికి, స్త్రీలింగం స్వామిని అనుటకు సాని అనిరి. పూర్వకాలమున ఈ సానిశబ్దము గౌరవవాచకముగానే వుండెడిది. ఏలనన శాసనమునందలి వైశ్యస్త్రీలపేర్ల చివర సాని శబ్దము వుండెను. సూరాసాని.

ఇంతేగాక నాపసాని శబ్దమునూ గౌరవవాచకము. నాపసాని నాగప్పసాని పదపర్యాయము. దీనికర్థము నాగవల్లి తంతునందుపు ముత్తైదువ. అటులనే దొరసానిశబ్దమును గౌరవ

పదమేగద. వీరిని పూర్వము దేవదాసీలని పిలిచెడివారు. ఏల నన ప్రాచీనకాలమునుండియు వీరివృత్తి దేవదాస్యము. వీరి నృత్తగీతాభినయనములచే దేవుళ్ళ నారాధించుచు నవివాహితులై పవిత్రజీవనము గడుపుచుండెడివారు. వారివలన గాంధర్వ విద్య భరతశాస్త్రము అభివృద్ధిపొందినవి. ఇట్టి పవిత్రసంఘము కాలక్రమమున అపవిత్రమైన పడుపువృత్తికి లోనైనది; నేటికైనను వారిలో మార్పుకలిగినందులకు సంత సింప వలసినది.

పూర్వకాలమున ప్రసిద్ధమైన దేవాలయములలో మూడువందల సానులుండెడివారు. ఇటులనే పెదకళ్ళేపల్లి, చేబ్రోలు వగైరా దేవాలయములలో వుండినట్లు శాసనముల వల్ల తెలియుచున్నది.

సాని మున్నూరు ఒకసంస్థ. దేవునికి జరుగవలసిన అంగరంగ భోగములకు సానులు అవసరముగదా. ఒకనాటి సాని మరునాటికి పనికిరాదు. కనుక ప్రతిదినమును, స్వామికి అనగా దేవునికి, ఒక కన్నెపడుచు కుంభహారతినిచ్చి, రాత్రి స్వామిసన్నిధియందు పవళింపుసేవ చేయు ఆచార మా కాలమున నుండెను. ఇట్లు నిత్యసేవకు స్వామికి సంవత్సర మంతయు, పండుగ పర్వదినములుపోను, మున్నూరు రోజులును పవళింపుసేవకై సానులు మున్నూరుగడపను రాజులు మాన్యములిచ్చి పోషించెడివారు.

బాపట్లతాలూకా చేబ్రోలు గ్రామములోని నాగేశ్వ రాలయములందలి శాసనమునుబట్టి వారికి వార్షికముకూడ తెలియుచున్నది. ఆ శాసనములో యిటులవున్నది. "సాని

మున్నూఱుప్రరలో నాను ఎనిమిదేన్డు వయస్సున, గుడ్డిగుడి గొలిచి వారికెల్లను ఒక్కొక్కళ్ళకు ఖ2౨ ఎనిమిది సంవత్సరముల వయస్సు పైబడి దేవాలయములో సేవచేసెడి మూడు వందల సానులకు ప్రతి ఒక్కరికి సంవత్సరమునకు రెండేసి పుట్లు యిచ్చెడివారని పైభాగమువల్ల తెలియుచున్నది.

ఈ సాని మున్నూరుగడప, దేవాలయమునకు యెదుట వీధియం దుండెడిదట. ఇప్పటికిన్ని అట్టిచిహ్నములు చేబ్రోలు నందుగలవు. ద్రాక్షారామములో పెదసాని మున్నూరు చిన సాని మున్నూరుకూడ యుండెడిది.[1]

సానియమాన= సానుల మానిక.

సానిమున్నూర్వురకు దేవాలయ వ్యవహార నిర్వహణమునందు కొన్నిహక్కులు కొన్ని నియమములు వుండెడివి. దేవభాండారమునకు కొలిచి సాగింపవలసిన, నేయి, నూనె, ఆముదము మొదలయినవాటికి మానికలు సానిమున్నూరు సంఘమువారే నిర్ణయించెడివారు. అది వారికి చెల్లుచుండిన మర్యాద. ఇంకను ఆ కాలములో వివిధ మానిక లుండెడివి. త్రిభువనాంకుశమాన, చాళుక్యరాజులమానిక, త్రిభువనాంకుశ వరాహామాన మొదలగునవి.

శెట్టి= శ్రేష్ఠి అనగా వుత్తముడు అను శబ్దముయొక్క తద్భవము కాని ఇది వ్యాపారసూచక పదమైనది. ఇది విశేషముగా వైశ్యులకును, ఇతర వ్యాపారులకును కలదు. సాలిశెట్టి, గాజులశెట్టి మొదలగునవి.

---

1 Epigraphia Indica P. 147

ధమ్ముణ్వు= ధర్మము,నకరము నూటయిబ్బంద్రు= నకరము, నగరముయొక్క ప్రాచీనరూపము. ఇట్లలనే కడప_గడప, కుంట_గుంట మొదలుగా ప్రాచీనకాలమునందలి కకారము గకారముగా మారెనని వ్రాసియుంటిమిగద. నూట = నూరు, ఇబ్బడ్డి = రెండు [1] "జమిడిమ్మడి జడిజంట రెండు" జమిడి,ఇమ్మడి,ఇబ్బడి, జంటరెండు సమానార్థకములు. తొమ్మిది, తొమ్మంద్రు, అయినట్లులనె ఇబ్బడి ఇబ్బంద్రు అనగా ఇద్దరు. కనుక నకరము నూట యిబ్బంద్రు =నూటయిబ్బంద్రునగరం వారు. నకరము నూటయిబ్బంద్రుయొక్క ఆధునిక పదము_నూటయిబ్బంద్రు నగరంవారు అనగా వైశ్యులు. దీనికి వుదాహరణము.

"స్వస్తిశ్రీ విజయాభ్యుదయ శాలివాహన శకవర్షంబులు ౧౫౭౬ అగునేటి జయనామ సంవత్సర వయిశాఖ శు ౧౫ లు శ్రీమదఖిలాండకోటి బ్రహ్మాండనాయకులు కోమటి నూతుల చింతల తిరువెంగళనాథ స్వామికి నిత్య తళిహాకో దీపారాధన వుత్సవమునకు నడిచేటట్లుగా తూర్పున, దక్షిణము, పశ్చిమోత్తర చెతుదిక్కులవున్న స్తితాశేష నూట యిబ్బంద్రునగరం వారువ్రాసి సమర్పించిన తామ్రశాసన మెట్లన్న. ఇతిహాసము, అష్టాదశపట్టణంబు గల నూట యిబ్బంద్రు నగరస్వాములు (వైశ్యులు,) తమ కులగురువగు భాస్కరాచార్యుల వారిని.

---

1 పాంబ నిఘంటువు పుట 211-212.

తే. కుసుమ సెట్టి నివాస కోమలాంగి నధి
పుడమగుట నూటమూడనలగుండములను
బడి వైశ్యుల తతి ముక్తిగనుట
విప్రకులముఖ్య మా కిది విస్తరింపు.

కుసుమసెట్టి కుమార్తె యగు కన్యకాపరమేశ్వరిని విష్ణువర్ధన మహారాజు వివాహము చేసుగొనదలచి అడుగుట, వైశ్యులలో నూటమూడు గోత్రములవారు అమ్మవారితో కలసి అగ్నిగుండములలో ఆహుతి అగుట మాకు వివరముగా చెప్పవలసిన దని అడిగిరట.

తే. కులము నగరేశ్వరుండును గోత్రములును
నగరశబ్దంబు మానంబు నయముతోడ
వలయువారుండు డొల్లని వారలెల్ల వైశ్య
బాహ్యులైపొందు వసుధననుచు.

విష్ణువర్ధనునికి యివ్వవలసినదనికొందరు వద్దనికొందరు అనేసరికి కన్యకాపరమేశ్వరి,కులము,నగరేశ్వరస్వామి, గోత్రములు, నగరశబ్దము, గౌరవము కావలెనని కోరెడివారు తనతో అగ్నిహోత్రములో ప్రవేశించవలసినదనగా 612 గోత్రములలో 103 గోత్రములువారుమాత్రమే ప్రవేశించిరట. అందులో లాభాల గోత్రమువారు నిస్సంతువులై దంపతిసహితముగాప్రవేశించుటచే మిగిలిన గోత్రములు 102 మాత్రమే. అద్దే నకరము నూటయిబ్బండ్రు. తరువాత నూటయిబ్బండ్రు నగంవారు అని వాడుక పదమయ్యె. తతిమ్మావారిని వెలిపెట్టుటచే తత్సూచకముగా ఈ సంఖ్యావాచకము వుపయోగించెడివారు. ఉత్తరవైపున క్రిందభాగమున వున్నది.

స్వస్తి శ్రీ శకవ
షం ౧౦౬౬ నేంటి శ్రీకులోత్తు
౦గ చోడదేవర విజయరా
జ్యదివ్య సంవత్సరంబులు ౧౮ శ్రాహి ఉ
త్తరాయణ సంక్రాంతి నిమిత్తమున పెను
గొండశాసను వేంగినవైశ్యుండు నా బెలగో
త్రుండు గొడకొమ్మిసెట్టి దమతల్లిదండ్రులు ఎఱి
యమ సెట్టికిం బమ్మమ్మకుం దనకును దమకు
వుగా ఘంటసాలయయన చోడపాండ్యపుర
మున శ్రీ జలధీశ్వర మహాదేవర దక్షిణో
త్తరములంబెట్టిన యఖండదీపములు రెం
టికిని నిన్దులసాని మున్నూవ్వర వశమునంబె
ట్టిన రాజరాజమాడలు పది ఈ పదిమాడ
లుంచెకొని సానియమాన నిత్యరెండు మాన
లు నెయియాచంద్రాక్కరము సంతానక్రమ
మునం బోసినట పంగ్గలవారు ఈధమ్మువు
నకరము నూటయిబ్బండ్రుం దారరసిరక్షిం
పంగలవారు (కటి) పగాశకసమ
౦బులు దక్కర సాంబరేంవు సమ్మితముగ ను
త్తరాయణ నిమిత్తమునందతి భక్తి బావ్వతీ
హితునకు ఘంటశాల జలధీశ్వర దేవర కాదిమూ
త్తిరకానతసురభ...కిమనః ప్రభవారికిం
జంద్రమౌళికిన్, ధనదవద్ధన సుధాక
రుం డెజ్జిమ సెట్టికి వనజాయతా

క్షయనంగాండను...సుపుత్రుడై
తనకునుం దల్లిదండ్రులకు ధర్మువుగాంబెనుం
గొండ శాసనుండ...గొండకొమ్మి...
న నుగాతః.........డిత్రయున్
ఆపురహారునకు వలపల దాపల శాశ్వత
ములై బెడగంగ్గా, దీపింపంగ వేంగినకు(చెడంగడరంణ్ణా)
ల, దీపకుండై రెండఖండ దీపములిచ్చెః. 3
ఈ గిరిశు దక్షిణోత్తర, భాగములనహన్నిః
శములుం బాయక వెలుంగను శ్రీగు
ణామణిభూష (ణుండ) భోగమతోం
గారిదవ్ర.........లిఖితం దేవాచార్యః స్య

## సోమనమంత్రి దానశాసనము

దాత_ గుంటూరు పల్లవ రాజవంశావళికి చెందిన బెజవాడ నేలిన బొద్దన రెండవకుమారుని పేరు నారాయణ దేవు (క్రీ. శ. 1150_63) ఈయనవద్ద దత్తనకుమారుడు సోమన్న మంత్రిగా వుండెను. ఈయన భరద్వాజ గోత్రుడు.

ఈ శాసనము చక్కగా వ్రాయబడి చదువుటకు అనుకూలముగా నున్నది.

శాలివాహన శకము 1081 కి సరియగు క్రీస్తుశకము 1159 సం॥వన దక్షిణాయన సంక్రాంతికాలము సోమవన తన తల్లిదండ్రులకు ధర్మముగా ఘంటశాలయైన చోడపాండ్య పురము నందలి శ్రీ జలధీశ్వరస్వామికి అఖండ దీపారాధన

నిమిత్తము ఈ దేవాలయమునందలి సాని మున్నూర్వురవశ ముద నీ రాజరాజ మాడలుయిచ్చి సానియొక్క మానికతో మానెడు నిత్యంపోసి సంతానక్రమమున ఆచంద్రార్కము ఈ ధర్మము నడపవలసినదని.

ఈ శాసనములో రాజరాజు పేర్కొనబడెను. ఇతడు రెండవరాజు. ఇతనితండ్రి రెండవ కులోత్తుంగ చోడుడు. ఈ రాజరాజు క్రీ. శ. 1146_62 పరిపాలనచేసెను. ఈతని కాలమున ఆంధ్రదేశమునకు వెలనాటి ఇమ్మడి గొంకరాజు (రెండవ గొంకరాజు 1159_63) ఇతని రాజప్రతినిధిగా నుండెను.

ఘంటసాలలోని శ్రీ జలధీశ్వర దేవాలయములోని శిలాస్తంభశాసనము_పడమరవైపున క్రిందిభాగమునున్నది.

స్వస్తిశ్రీ రాజరాజ
సంవత్సరములు ౧౪
శ్రాహిశకవర్షములు
౧౦౭౧ నేణ్టి దక్షిణాయ
న సంక్రాంతి నిమిత్తము
న ఘంటశాల మైయ్న చో
డ పాండ్యపురమున శ్రీ జ
లధీశ్వర మహాదేవరకు
నఖండవర్తి దీపమునకు
మా చొప్పున సోమన
తనతల్లి చంద్రులకుం దన
కును దమ్మునపుగానిందుల

సాని మున్నూఱ్వురవసము
నం బెట్టిన రాజరాజ మాడ
లు ౹౽ ఇయ్యేను మాడలు జే
కొని సానియమానవిత్య
మా నెండు నెయివోసి సన్తాన క్ర
మమున నాచంద్రార్కముగ
డంపగలవారు

## ఇందులశెట్టి దానశాసనము

ఇది చక్కగా వ్రాయబడి లోతుగా చెక్కబడి చదువుటకు చాలా అనుకూలముగా నున్నది.

శకము 1142కు సరియగు విక్రమ సంవత్సర చైత్ర బ 12 గురువారము క్రీ. శ. 1221 మార్చి 25 తారీఖున విషువు సంక్రాంతినాడు మిత్రెకుల గోత్రుడును అగుపలకొమ్మిశెట్టి తన తండ్రి మారిశెట్టికిని తల్లి సూరాసానికిని తనకును పుణ్యప్రాప్తికొరకు అఖండదీపము ఘంటసాల (శ్రీ) జలధీశ్వర స్వామికి యిచ్చుచు ఆ దీపారాధనకొరకు 25 ఆవులును 1 ఆబోతును మర్వబోయుని మనుమడు, భీమనబోయుని కొడుకును అగు పవనబోయిని పరమున యిచ్చి అతడు ప్రతిదినము సానియ మాన (సానుల) మానెడు నెయ్యియిచ్చుచు సంతాన క్రమమునంనడుపవలసినదనియు, ఈ ధర్మము నకరము నూట యిబ్బంద్రు రక్షించవలసినదనియు నై యున్నది.

ఈ శాసనము తిథివారములతోకూడ చక్కగ వ్రాయబడినది. కాని రాజుపేరు వ్రాయబడలేదు. వెలనాటి రాజుల

పరిపాలన 1196 తో నశించినదిగాన యిందులో చోడపాండ్య పురమని (ఘంటసాల పర్యాయనామము) పేర్కొనబడలేదు. కాని శాసనాధికారి సంధివిగ్రహి దేవనామత్య స్వవిషయః అని వుండుటచే ఇదిదేవనామాత్యుని మండలమనియు అనగా అతడు ఈ మండలాధిపతని విదితమగుచున్నది. ఇదిఆకాలమున కాకతీయ గణపతి దేవచక్రవర్తి (క్రీ. శ. 1120_61) పరిపాలనక్రింద యుండి వుండవచ్చును. శాసమునందలి కొన్ని ప్రాచీనపదములు బోయుడు = ఇదిపూర్వకాలమున పశువుల కాపరి (గొల్లల) నామాంతముగ వాడబడెను. ఇప్పటికీ గొల్ల బోయిడు అనుట వాడుకకలదు. మోదాలు = మొదవులు గోవులు. అప్పట్లో 25 ఆవులను కాని 5 మాడలు కానియిచ్చి నచో రోజూ మానెడునెయ్యిపోసి దీపారాధన చేయుచుండెడి వారని శాసనముల వలన విదితమగుచున్నది

నెం. 851/1917 రు.

ఘంటసాల శ్రీ జలధీశ్వరస్వామివారి ఆలయములోని శిలాస్తంభముమీద శాసనము.

స్వస్తిశ్రీ శకవర్షంబులు
౧౧౪౨ విక్రమ సంవ
త్సర చైత్ర ౧౫ గురువా
రమునందు విషువు స
ంక్రాన్తి నాడు ఘంట
శాల శ్రీ జలధీశ్వర మహా
దేవరకు ఇందులసెట్టి మె

డ్డికుల గోంత్రుడైన పల్లకొ
మ్మిసెట్టి మన్మండు మారి
సెట్టి తమతండ్రి మారిసె
ట్టికిని తమతల్లి సూరాసా
నికిని తనకును ధర్మ్మార్వు
గా నఖండవర్తిదీపమున
కుమల్వాబోయుని భీమనబో
యునికొడ్కు పురువనబో
యునివసమున నిచ్చిన మో
దాలు ౨౫ అంబోతు ౧ వీని
ంజేకొని సానియ మాన ని
త్య మానెడు నేయి వోసిస
ంతానక్రమమున నాచంద్రా
ర్క్కమ్ము నడుపంగలవాండు శ్రీశ్రీశ్రీ
ఈ ధర్మ్మార్వు నకరము నూట ఇ
బ్బంద్రును రక్షింపంగలవారు
శాసనాధికారి సనివిగ్రహి దేవనామా
త్య స్యవిషియః శ్రీ శ్రీ శ్రీ

## అవయాండి శెట్టి శాసనము

ఈ శాసనము చక్కగా వ్రాయబడినది. నేటి అచ్చు అక్షరములవలె అక్షరముల పొందిక వున్నది. సంవత్సరము గాని రాజు పేరుగాని ఏమియు లేదు. ఒక పద్యము చివర చిన్న

వచనముకూడకలదు. శాసనలిపినిబట్టి ఇది పదమూడవశతాబ్ద పుదిగా తలపబడెను.

చోడకుమారుడగు అవయాండిశెట్టి జలధీశ్వరాలయమునకు దద్దళము కట్టించెను. ఇంతేగాక ఇతడు ప్రతి సం॥రం దేవీదేవరలకు నూతనవస్త్రము లిచ్చుచుండెడివాడు. మండపముమీద భృంగిని చేయించెను. ఇతడు ప్రతి సంవత్సరం నూతనవస్త్రములిచ్చుటయు దేవాలయ మరమ్మతు చేయించుటచే యీ పురవాసు డని తలచుటలో పొరపాటుండదు. చండీశ్వరుడు, భృంగీశ్వరుడు ఈశ్వర సన్నిధాన సేవకులు. ఇందులో చండీశ్వరుడు మూగవాడు. నేటి దద్దళముపై భృంగీశ్వరుడు లేదు.

కలయంగ గుడిమేలు క
ట్టు గట్టించి జలధీశునకు
శైలజకు నొల్లెజోడ్లు
ఇభచరమ్మఱ ధరునకు
నేంటేంట నిచ్చుచో
డకుమారుం డభి
మానభూషణు
ండవయాండి
సెట్టి॥ మండపము
మీాందభింగి
ం జేయించెను
కునాచార్యుఱస లి
ఖితం

## చోడపాండ్యపురము

ఘంటసాలకు చాళుక్యుల కాలములో చోడపాండ్య పురమను నామాంతరము వచ్చినది. ఈపేరు ఎందుకువచ్చెనో ఎప్పుడు వచ్చెనో తెలిసికొనుటకు ముందు 'చోడపాండ్య' అనే శబ్దములనుగురించి ముందు తెలిసికొనవలయును గనుక, ఇందును గురించి తెలియపరచి అనంతరము చోడపాండ్య పురమునుగురించి తెలిపెదము.

చోడపాండ్య దేశములు : దక్షిణదేశమున ప్రాచీన కాలమునుండియు, చోడపాండ్య చేర (కేరళ) రాష్ట్రములు ప్రసిద్ధిగాంచినవి. అందులో చోడపాండ్య దేశములు ఆంధ్ర దేశమునకు దక్షిణమున వున్నవి. ఈ రాజ్యములో ముఖ్య ముగా అరవము మాట్లాడుదురు. చోడరాజ్యమునకు ప్రథమ రాజధాని కాంచీపురము, తర్వాత తంజావూరు. నెల్లూరు మొదలు పుదుక్కోటవరకు గల ప్రదేశమే పూర్వపు చోళ మండలము. దక్షిణమున పాండ్యరాజులు, పడమట చేర రాజులు, వుత్తరమున చాళ్యులు; తూర్పున సముద్రముకలదు. పాండ్యదేశము వారికి దక్షిణమున వున్నది. ప్రస్తుత మధుర తిరునల్వేలి జిల్లాలు యీ దేశములోనివే.

ఈ రెండు దేశములకును అనాదినుండియు విరో ధము. చోళదేశపు రాజగు రాజ రాజ చోళుడు (క్రీ. శ. 985-1010) పాండ్యదేశమును జయించి (1009) యీ తొండమండలము (తొండమాన్ రాజ్యమేలుటచే దీనికితొండ మండలమని పేరువచ్చెను.)నకు జయగొండ-చోళమండలమని

పేరుపెట్టెను. ఈవిధముగా చోళులు వారు జయించిన ప్రాంతములకు, పట్టణములకుకూడ తమయొక్కయు, తమ వంశజులయొక్కయు, తమఇంటి నామాంతరములుగా పెట్టుట సాంప్రదాయ మగుటచే అటుల పెట్టెడివారు. కాని తిరిగి పాండ్యరాజు తనరాజ్యమును ఆక్రమించుకొనగా రాజరాజ కుమారుడగు రాజేంద్రచోళుడు, యితడు చాల పరాక్రమవంతుడు, (క్రీ. శ. 1011_45) 1012 సం॥న మరల పాండ్యదేశమును జయించి 'చోళపాండ్య' అను బిరుదముతో తన కుమారుడగు జాతవర్మ సుందరచోళుని రాజప్రతినిధిగా నియమించి అతనిని మధురలోవుంచెను. (చోళపాండ్య అనగా పాండ్యదేశము యొక్క చోళరాజ ప్రతినిధి) ఇటుల రాజప్రతినిధుల నియమించిన వారిలో రాజేంద్రుడే మొదటివాడు.

తర్వాతరాజేంద్రచోళుడు వేంగికిరాజగువిమలాదిత్యుని (రాజరాజనరేంద్రుని తండ్రిని) జయించి (అనగా ఆంధ్రదేశమును జయించి) గంజాం మండలములోని మహేంద్రగిరి పర్వతముమీద జయ స్తంభమును నెలకొల్పుటేగాక, చోళ పతాక చిహ్నమగు పెద్దపులితల, దానిముందు రెండుచేపలు పాండ్యదేశము తనచే జయింపబడినందులకు గుర్తుగా ఆపర్వతముమీద చెక్కించెను.

ఇతడు గంగానదివరకుగల దేశమునుజయించి గంగయ కొండ అను బిరుదము వహించెను. దీనికి చిహ్నముగ గంగయ కొండ చోళపురమును గట్టించెను.

ఇతడు విమలాదిత్యుని (1011_22) క్రీ. శ. 1013 లో ఓడించి అతనిని ఖైదీగాతీసుకొని తంజావూరులో వుంచెను.

ఇతనిని జూచి రాజేంద్రచోళుని చెల్లెలగు మండవాదేవి ప్రేమించుటచే అతనికిచ్చి వివాహముచేసి ఆయన రాజ్యము ఆయనకిచ్చెను.

కనుక రాజేంద్రచోళుడు పాండ్యదేశమును ఆంధ్రదేశమును జయించి తత్ చిహ్నముగా మహేంద్రగిరిమీద జయస్తంభము నాటినటులనే వారిసాంప్రదాయానుసారము ఘంటశాలకు చోడపాండ్యపుర మను నామాంతరము పెట్టియుండవచ్చును.

వీరరాజేంద్రుని అనంతరం యితని మేనల్లుడును సుప్రసిద్ధుడగు రాజరాజ నరేంద్రుని కుమారుడగు కులోత్తుంగచోళుడు, క్రీ. శ. 1069_1113 ఆంధ్రదేశమునకును, తన మాతామహస్థానమగు చోడదేశమునకును రాజయ్యెను.

పాండ్యరాజు మరల తనదేశమును వీరరాజేంద్రుని మరణాంతరము స్వాధీనము చేసుకొనుటచే కులోత్తుంగుడే విక్రమపాండ్యుని కుమారుడగు వీరపాండ్యుని [1] (1066 లో) జయించి తనతమ్ముడు గంగయ కొండచోళుడును చోళపాండ్య బిరుదుతో పాండ్యదేశమునకు రాజప్రతినిధిగాచేసి మధుర సింహాసన మెక్కించెను.

ఈ కారణముచే ప్రథమ కులోత్తుంగుని కాలమునను రావచ్చును. ఈ కులోత్తుంగుడు మన ఆంధ్రదేశములో కొన్ని పట్టణములకు నామాంతరములు పెట్టెను.

బెజవాడలోని విఘ్నేశ్వరాలయములోని తమిళశాసనమువల్ల (325 బి. 1892) ప్రథమ కులోత్తుంగుడు తన రాజ్య

1 Historical Inscriptions of S. India P. 18

పరిపాలన 41 సం॥న 1110 బెజవాడకు రాజేంద్ర-చోళపురం అని నామాంతరం పెట్టెను.[2]

ఇటులనే కళింగదేశమును 1095_96 జయించి విశాఖపట్టణమునకు కులోత్తుంగ చోడపట్టణమని నామాంతరము పెట్టెను.[3]

ఘంటసాల ఆ కాలములో జిల్లాకు ముఖ్యపట్టణమై యుండవచ్చును ఏదోవిధముగ ప్రాముఖ్యము లేకపోయినచో నామాంతరము రాదుకద.

పైసంగతి సందర్భములనుబట్టి ప్రథమ కులోత్తుంగుని కాలముననే ఘంటసాలకు చోడపాండ్యపురము అని నామాంతరము వచ్చియుండెననుట ఎక్కువ సమంజసముగా కాన్పించుచున్నది.

## బందరులోని శాసనములు

ఈ శాసనము బందరులోని రామలింగేశ్వరస్వామి ఆలయములో ఉన్నట్లుదహరించబడెను. గాని ఇపుడు అచట లేదు. దీనిమీాద, దీనిక్రిందనే మరియొక శాసనము జలధీశ్వర స్వామికి సంబంధించినదే గలదు. మరియొకటి కూడ బందరులోనే రంగనాథస్వామి ఆలయములో విశ్వేశ్వరస్వామికిచ్చిన దానశాసనము కలదు.

ఈ శాసనశిలలు బందరు ఎప్పుడు పోయెనో తెలియదు. అవి బందరులో వ్రాయబడినవికావు. బందరు ౧౨ వ

2 Inscriptions of the Madras presidency Vol. 11 Rangachary P. 882.

3 ఆంధ్రదేశ కథాసంగ్రహము, పుట 315

శకాబ్దమున లేనేలేదు. ఇటులనే కళ్ళేపల్లి నాగేశ్వరస్వామికి సంబంధించిన శిలాశాసనమొకటి బందరులోని ఏకాంబరేశ్వర స్వామివారి ఆలయ గర్భాలయ ద్వారమునకు తూర్పు దిక్కున నిలువుగా నున్నది. ఈ శాసనములు ఏకారణముచేత ఎందుకు ఎప్పుడు పోయెనో చెప్పజాలము.

ఈ శాసనము సరిగా వ్రాయబడి యుండలేదు. అరిగి పోయి చదువుటకు వీలులేకుండా వున్నది.

శాలివాహన శకము 1069 అనగా క్రీస్తుశకము 1146. రెండవ గొంకరాజు కాలము 1130–1163 ఘంటసాలయైన చోడపాండ్య పురమునందలి (శ్రీ) జలధీశ్వర మహాదేవరకు అఖండ దీపారాధన నిమిత్తము 25 ఆవులను ఎవరో యిచ్చినట్లు కలదు.

బందరులోని రామలింగస్వామి దేవాలయంలోని శిలా స్తంభముపైన చెక్కబడిన శాసనము.

854/1917

స్వస్తి సకవర్షంబులు ౧౦౬౯ నేంటి
కార్తిక బహుల పంచాదశియు గు
రువారమున ఘంటశాలయైన చోడ
[పాండ్య] పురమున (శ్రీ) జలధీశ్వర
శ్రీ మహాదేవరకు
.........వసము న
.........టినమో
.........ఆవి

855/1917

ఈ శాసనము 854 వలెనే వున్నది. ఆ శిలా స్తంభము మీదనే వ్రాయబడెను.

11 శతాబ్దమున ఘంటశాల యయిన చోడపాండ్య పురమున శ్రీ జలధీశ్వర మహాదేవరకు అఖండదీపారాధన నిమిత్తము ఈ దేవాలయములోని సానిమున్నూర్వర వశమున యడవడి మహోలిశెట్టి కొన్ని కులోత్తుంగ చోడమాడలు యిచ్చెను.

బందరులోని రామలింగస్వామి దేవాలయములోని శిలా స్తంభముపైన చెక్కబడిన శాసనము:

855/1917

స్వస్తిశ్రీ శకవరు
షంబులు ౧౦ (౩)...
....................
టశాలయైన చోండపాండ్యపు
రమున ......శ్వరమహాదేవ
రకు యడవడి మహోతిసెట్టి అఖండ
దీపమున నిందులసాని మునువ్వ
రవసమున బెట్టిన కులోత్తుంగ
మా.

856 of/1917

ఈ శాసనము బందరులోని రంగనాధ స్వామివారి ఆలయములో వున్నట్టుగా శాసనపరిశోధక సంఘంవారి రిపోర్టు తెలిపినది. కాని ఇది యిపుడచట లేదు.

పైభాగము అంతయు చక్కగానే చదువుటకు వీలుగా నుండి క్రిందభాగము చదువుటకు వీలులేకుండా వుండుటచే ప్రయత్నించపడనేలేదు.

ఘంటసాలలోని ప్రాచీన దేవాలయమునకు సంబంధించినది. అనగా విశ్వేశ్వరస్వామికి సంబంధించినది. ఇచట పూర్వము చాలదేవాలయము లుండెనను వాదమును బలపరచుచున్నది. ఈ పేరుతోనే నేడు ఆలయము యిచట వున్నది.

శాలివాహనశకము ౧౦౬౧ క్రీ. శ 1139 శుద్ధతదియ (మాసము విడువబడినది) సోమవారమున ఘంటసాలయైన చోడపాండ్యపురమునందలి విశ్వేశ్వరస్వామివారికి (ఎవరో ఏదో దానముచేసియుండిరి. ఆభాగము చదువుటకు వీలులేని స్థితిలో యున్నది.)

బందరులోని రంగనాథస్వామి ఆలయములోనిశాసనము.

856/1917

స్వస్తి సకవశేణంబులు
౧౦౬౧ నేంటిసుద్ధతదియ
సోమవారమున ఘంటసాల అయి
న చోడపాండ్యపురమున శ్రీమ
ద్దు విశ్వేశ్వ రమహాదేవరకు శ్రీ.

మిగతా భాగము చదువుటకు వీలులేనిస్థితిలో యున్నది.

## భోగేశ్వరాలయ శాసనము

852/1917

ఈ శాసనశిల, ధూపహారతులు, దీపములు మొదలగు దేవాలయ సంబంధపు పనిముట్లు ఈ గ్రామములోని బోడి

లింగం గుంట అనే ప్రదేశములో దక్షిణదిక్కున ఒక ఆసామి తన భూమికి కోరడివేయుటకు భూమి త్రవ్వుచుండగా దొరికెను. ఈ శాలనశిలను శాసన పరిశోధక సంఘము వారు తీసికొనివెళ్ళిరి.

ఇది పాలరాతి పలక. నలుచదరముగావున్నది. క్రింది భాగము విరిగిపోయెను. బహుశా ఈదేవాలయమును ఇచటనే యుండియుండవచ్చును.

ఈ శాసనము తెలుగు అక్షరములతో సంస్కృతమున వ్రాయబడెను. చాలాతప్పులు కలవు. సరిగాకూడ కన్పించుట లేదు.

చాల ప్రాముఖ్యమైన శాసనము. ఇది ఘంటశాలలోని పురాతన దేవాలయమును గురించియేగాక, ఆకాలము నందలి రాజప్రతినిధియైన వీరరాజేంద్రుని గురించికూడకలదు.

ప్రథమమున వీరరాజేంద్ర చోళుని(1150_80) గురించి యీా విధముగా స్తోత్రముకలదు.

సముద్రపర్యంతముగల భూమినంతయు జయించి నానా రాజుల హస్తముల స్వీయపాదములను బెట్టి వేంగిదేశము నేలుచున్న వీరరాజేంద్రు చోడునకు జయము కలుగుగాక. ఆయన బాహు పరాక్రమముచే, వెలనాడు దేశమంతయు సిరిసంపత్తులతో కూడుకొనియున్నది. అటులనే ఘంటశాలయు.

శాసనమునందలి పేర్కొనబడినరాజు

వెలనాటి వీరరాజేంద్ర చోడుడు. ఇతడును వెలనాటివాడే, దుర్జయవంశజుడు. ఇతడు రెండవ గొంక రాజునకు సబ్బాంబికయందు జన్మించెను. ఇతడు బహుపరాక్రమశాలి.

సారసిపురాధ్యక్షుం డయిన (ఏలూరు) తెలుంగు భీమనాయకుడు యీ రాజేంద్ర చోడుని అధికారముధిక్కరించి కొల్లేరు కోటలోయుండగా ఆకోటను ధ్వంసమొనర్చి అతనిని వధించెను. ఇతడు ౧౨వ శతాబ్దములో అనగా క్రీ. శ. ౧౧౬౩ ప్రాంతమున రాజప్రతినిధిగా యుండవచ్చును.ఇతడు వెలనాటి కులోత్తుంగుని మనుమడే.

ఈ వీరరాజేంద్ర చోళుడు ఘంటసాలకరుదెంచిన సమయమున ఆహ్వానసూచకముగ వ్రాయబడి యుండవచ్చును. వీరు చోడరాజులమని దుర్జయ వంశజులమని చెప్పుకొనిరి. వీరు కమ్మవారికి పూర్వీకులు.[1]

ఈ వెలనాటి చోడులు చందవోలు రాజధానిగా పరిపాలించిరి.

శాలివాహన శకము ౧౧౯౮ సం॥న కౌశికగోత్రుడు మరఘు దిండికుమారుడును అను నూకనార్యుడు ఘంటసాలయందలి భోగేశ్వర మహాదేవరకు మేషసంక్రాంతి కాలమున దీపప్రదాన మొనర్చెను.(ఇంకను ఏదియో యుండెగాని శాసన శిల విరిగిపోయెను.)

852/1917

"స్వస్తిశ్రీ ఉదధివలయ ప్రిధ్వీభూరి
...విశాల ప్రసవ విశద వేంగిక్షోణర
క్షైక దక్షః నిఖిల న్రిపతి మౌళివ్రాత విన్య
స్తపాదోజయతు విజయలక్ష్మీవీరరా

1 కమ్మవారిచరిత్ర పుట ౧౪౩

జేంద్రచోడః॥ తద్బాహు విక్రమ సురక్షితభూ
రిప్రిథ్వ్యాస్తత్సంపదాన్నిధిరయం వఱినాడ్డు
దేశః తత్రాప్యశేష వసుశాలి సముల్లస
న్విద్యోతతేమతి మతాంఘణశాలనా
మ్నా॥ దమ్మోణ కౌశిక ఇతి ప్రథితో పితత్ర
బికాపతి రఖాదిండినామా ఆరాధ్యదవ
నలంగిరీశ ప్రభావో లేభేషవిత్రగుణ
నూంకనాయ్యణ॥ ప్రభుః శాకాబ్దేవసునంద
ఖేందుగణితేమేషీ సితేభాస్కరేపు
ణ్యేతద్విషు వత్యాధౌలం శ్రీనూం
కనాయ్యణప్రభుః ఆచంద్రార్కమశేషలో
కవిలసత్సంపదాంసెవీధి శ్రీభోగేశ్వ
రశంకరాయ మహతె...ప్రదీపంముదా
శకవరుషంబులు ౧౧౮౭...నేంటి
...క్రాంతినాండు ఘంటశాల శ్రీ
భోగేశ్వర మహాదేవరకు......"

తర్వాత పగిలిపోయెను.

## గోటకము

పూర్వమొకప్పుడు వేశ్యలు ముగ్గురు అక్కచెల్లెండ్రు కలరనియు, ఒకతె, గుడివాడలోను, రెండవది ఘంటసాల లోను, మూడవది భట్టిప్రోలులోను, వుండెడివారనియు వారు నివసించెడుప్రదేశములు నేడు లంజదిబ్బలని పిలువబడుచున్న

వనియు, ఆ యూ గ్రామస్తులు చారిత్రక జ్ఞానము తెలియని వారు చెప్పుకొందురు. ఆంధ్రదేశమునందలి బౌద్ధస్తూపము లే యీపేరున పిలువబడుచున్నవి గాని మరియొకటికాదు.

బౌద్ధస్తూపములకు లంజదిబ్బలను పేరువచ్చుటకు ఇది కారణము కావచ్చును. ఆంధ్రదేశములో 4,5 శతాబ్దములలో బౌద్ధము క్షీణింపసాగెను. ఇందులకు ముఖ్యకారణము బ్రాహ్మణమత విజృంభణే. బౌద్ధసన్యాసులు, సన్యాసినులు స్త్రీ పురుషభేదములేక కలిసియుండెడివారు. స్త్రీపురుషులు కలిసియుండుట కొప్పుకొనని హిందువులు వారియందుండే ద్వేషముచేత దిబ్బలు—వారి సంఘారామములను లంజదిబ్బలని పేరిడియుండవచ్చును ఆదిబ్బలకు లంజదిబ్బలను నామము స్థిరపడియుండెను.

పైనచెప్పిన ఈగ్రామమునందలి భోగవనిత ఈపురము రాజధానిగా ఏలుచున్న రాజుయొక్క భోగపత్ని. చాలా ధనము సంపాదించి, పిదప విరక్తిచెంది, 'సానందు'డనుపేరు గల యోగీశ్వరుని యుపదేశము పొందినదనియు, ఆభోగపు చాన పచ్చని మీనాయెక్కి ఒకానొకరోజున శ్రీకాకుళము గురువుయొద్దకు వెళ్ళుచుండగా కాటకదినములలో గ్రాసము లేక బాధపడుచున్న పశువులు ఆ పసుపురంగు మీనాచూచి అదేదో గ్రాసమైయుండునని వెంటపడెననియు, అప్పుడామె ఆ రాజువద్ద అడుగుమాడ చొప్పున కొనిపశువుల మేతకొరకు ధర్మగోటకముగా ఆప్రదేమును వదలెనని ఒక పురాతన కాగితముపై వ్రాయబడిన దానివల్ల తెలియుచున్నది.

గోటకము; గో = గోవులు, అలకము = సంచరించే ప్రదేశము. గోటక శబ్దమే ఘోటకమయ్యె. ధర్మముగా పశువులు తిరుగు ప్రదేశము గాన ధర్మగోటకమను పేరు రావలసియుండె. కాని సంస్కృతజ్ఞానము లేనివారుచ్చరించుటచేత ఇది ఘోటకమనిపిలువబడియుండవచ్చును. ఆవిధముగనే, నాటి నుండి నేటికి ఆపేరుతోనే పిలువబడుచున్నది.

ఈ ప్రదేశము యీ గ్రామమునంటి ఉత్తరమున షుమారు 270 యకరముల్లు విస్తీర్ణముగలిగి అనాదినుండి అవిచ్ఛిన్నముగా పశుభూమియై యున్నది. ఈ గ్రామము నందలి పశువులును, అతివృష్టికాలమునందు యింకా మరి కొన్ని గ్రామములందలి గొర్రెలు, మేకలుకూడ యిందు మేయును. ఇది ఈ గ్రామమున కెంతయు యుపయోగకారియే గాక, యీగ్రామ ప్రతిష్ఠకు, పూర్వకాలపు గుర్తునకుకూడ ఆధారమైయున్నది.

ఇట్టి గోటకమే నర్సాపురము తాలూకా పాలకొల్లులోని క్షీర రామేశ్వర దేవాలయములోని యీ దిగువ శిలా శాసనమువల్ల వున్నట్లుగా తెలియుచున్నది.

నెం 513_1893

స్వస్తిశ్రీ శకవర్షంబులు ౧౨౪౦ గు వేంటికార్తీకశుద్ధ ౧౪ దు స్వస్తి సహస్రబాహు ప్రతుపవీర్యగుణసంపన్నులైన శ్రీమన్మహామండలేశ్వర కోన భీమవల్లభరాజుల సుపుత్రులైన రామనాధదేవ కుమాళ్ళు క్షీరరామేశ్వర

శ్రీమహాదేవరసన్నిధిని సర్వకాలమున్ను యుదకదానము
చేస్తిమి ఇసరి
వంచరికి యుదకాలు తెచ్చి పోసెడి బ్రాహ్మణుండు సనేంద్ర
శేఖరుని
వెందాయవీరికి పొండూరినరిహేతి దిక్కుపాలాననురాజేశ్వర
దేవసేసి ఉత్తరాన అలకోటి దక్షిణాన గోటకము.

దీనినిబట్టి ఇట్టి గోటకములు ప్రాచీన కాలమునవుండెడి వనియు ఈగ్రామమునవున్న ధర్మగోటకము నిజముగా వారకాంత వదలినది కాదనియు చారిత్రకజ్ఞానము కలవారికి విదితమే. ఇట్టి పురాతన స్తలముల కేవో పుక్కిటపురాణములు ప్రతి గ్రామమున వున్నట్లే యిచటనుకలవు.

ఇంకను ఈ ధర్మగోటకమునకు బుద్ధవనమని మరియొక పేరుకలదు. బౌద్ధభిక్షువులు నాలుమాసములు వానకాలములో గుహాలందో, విహారములందో (మఠముల) గడపుట సాంప్రదాయమై యున్నది. కనుక ఇది బౌద్ధయుగమున మహాపట్టణమేగాక బౌద్ధులకుకూడలి వాసమై యుండుటచేతను యీ ధర్మగోటక ప్రదేశములోని నేడు మాలపల్లి యున్న ప్రదేశమున కుత్తరమున ఇటుకరాళ్ళపాడు అనుప్రదేశమునకు బౌద్ధకట్టడ చిహ్నము కన్పించుచున్నవి. అచటనే బౌద్ధసంఘారామమునకు సంబంధించిన రెండుశిలలు దొరికినవి. అవి యీ మాలపల్లిలో నేడు గంగానమ్మ పోతురాజులుగా పూజింపబడుచున్నవి. ఇందుచే ఇది బౌద్ధవనముగా నుండెనేమో యనుకొనుట కాధారముగా వున్నది. చాతుర్మాస వ్రతము

సలిపెడి కొన్నిచోట్టుల వనములుండుట బౌద్ధవాఙ్మయమువల్ల విదితమగుచున్నది.

ఇంతేగాక బౌద్ధయుగమున పశువులకుగాను పచ్చిక బయళ్ళు గ్రామస్తులందరికి కలసియుండెడివని తెలియుచున్నది. బౌద్ధయుగమునందలి గ్రామములు గ్రామజీవనమును గురించి శ్రీయుత వేలూరి సత్యనారాయణగారిట్టుల వ్రాయుచున్నారు.

"ఆకాలమునందలి ప్రతిగ్రామమునందుకు పశువుల మేతకుపకరించు పచ్చిక బీళ్ళు వుండెడివి. పచ్చిక బీళ్ళు గ్రామవాసుల కెవ్వరికిని ప్రత్యేకముగా వుండవు. వరికోతలైన తర్వాత ఊరిపశువులన్నియు పొలములలో దిరిగి మేయును."

బహుశా ఇది బౌద్ధయుగమునాటి పచ్చికబీడేమో. పై మాటిలో ఇది గోటకము పేరునకు తగియుండుటచే చరిత్రాత్మకముగా దీనినే నమ్మవలసి వచ్చుచున్నది.

ఏదిఏట్టులున్నను అనాదినుండి యీ ప్రదేశము ధర్మముగా గ్రామమునందలి సమస్తప్రజల పశువులకు వుపయోగపడుచున్నది.

# జమీందారీ యుగము

సుస్థిరమైన ప్రభుత్వము ఏర్పడలేదు. ఎన్ని ప్రభుత్వాలు మారినా ఈ ప్రాంతం జమీందారులపాలనలోనే వుంటూ వచ్చింది.

కంపెనీ పరిపాలనపోయి 1858లో విక్టోరియారాణి పరిపాలనవచ్చిన తర్వాత సుస్థిరమైన ప్రభుత్వ మేర్పడినది. అప్పట్లోకూడ కొంతవరకు జమీందార్లదే పరిపాలన.

ఘంటసాల దేవరకోట పరగణాలో చేరినది. ఇందులో జమీందారుల పరిపాలన, ఘంటసాల ప్రజల సంబంధాలు చెప్పబడును.

ఈ కాలంలో జమీందారులు సంగీత సాహిత్యాలను పోషించారు గనుక దీన్ని జమీందారీ యుగమని కవు లన్నారు.

శాసనమువల్లను చరిత్రవల్లను 13 వ శతాబ్దమువరకు ఓడరేవుగా నుండిన ఘంటసాలపురము నదీ ముఖద్వారము మారుటచే రేవుపోయినందున పట్టణ ప్రాముఖ్యము తగ్గి క్రమ క్రమముగ క్షీణించియుండును. ఎన్నో దేవాలయములు, కట్ట డములు శిథిలమై భూపతనమైనవి. ప్రాచీన కట్టడములలో జల ధీశ్వరాలయము చెక్కుచెదరకుండా వున్నది. స్తూపము కేవ లము దిబ్బగానే మనకునేడు కన్పించును. ఇవి రెండే దీని ప్రాచీనతను కంటికి కట్టినట్లు చూడగనే తెలుపునవి.

ఆ పట్టణము ఏ వరదకో, ఉప్పెనకో లేక మరో విధము గనో, పాడైపోయినట్లు తోచును. లేక కొద్ది జనసంఖ్యతో కుగ్రామముగ వుండెనేమో. పెద్దలవల్ల నేటి ఘంటసాల షుమారు 200 సంవత్సరముల నాటిదిగా మాత్రమే విదిత మగును. అంతకు పూర్వ చరిత్ర తెలుసుకొనుటకు ఎట్టి ఆధారము లేదు. అనగా 13, 18 శతాబ్దముల మధ్య చరిత్ర తెలియదు. నేటి ఘంటసాల ప్రాచీననివాసులుగా, బ్రాహ్మ ణులు, విశ్వబ్రాహ్మణులు, కాపులు ముతరాచులుగా తెలియ నగును. ల్యాండు రిజస్టరునుబట్టి భూములన్నియు వారివిగనే తోచును.ఇప్పుడు వారి భూములన్నీ పోయినవి. అవి అన్నీ కమ్మవారి పరమైనవి.

నేటి ఘంటసాల వివిధ వర్ణములు గల పెద్ద కమ్మటూరు. కమ్మవారి తర్వాత అధిక సంఖ్యాకులు పద్మ శాలీలు. తిన్నని విశాలమైన వీధులు. తీర్చి దిద్దిన భవంతులు. వీధులు పరిశుభ్రముగా వుండి కళకళలాడుతూ కనులపండు వుగ వుండును. ఈ గ్రామ మధ్యవున్న దేవాలయము ముందు విశాలమైన ప్రదేశము, ఈ గ్రామానికి మరింత శోభ తెచ్చింది. ఉత్సవసమయమున నాటకాలు, తదితర సమయాల్లో సభలు జరుపుకొనుటకు వీలుగా వుంటుంది. ఈ గ్రామ విశిష్టత ఏమన ప్రతి యింటికినిచక్కని ప్రహరి; ఇంటిముందు పందిరి;ప్రహరీముందు అరుగులతో వచ్చెడి అతిథులను ఆహ్వా నించుచుండును. గ్రామస్తులందరు ఇండ్లను పరిశుభ్రముగ వుంచుకొందురు. కొన్నిగ్రామాదులలోవలె రైతులు పశు వులను యీ గ్రామములో ఇంటి ఆవరణలో వుంచరు.

సంక్రాంతి పండుగకు ప్రతియిల్లు ఒక పెళ్ళియిల్లువలె కళకళ లాడుచుండును. ఈ గ్రామశోభ అప్పుడు అతిశయించును. ఒక ప్రాచీన వాస్తుశాఖ సూపరెంటెండెంటు యిట్టి గ్రామమును నే నిదివర కెన్నడును చూచియుండలేదని దీని ప్రత్యేకతను ప్రశంసించెను.

ఈగ్రామము భాగ్యవంతమైనదికాదు, విద్యావంతులు కలది కాదు. కాని ప్రాచీన మర్యాదలు, పరువు ప్రతిష్ఠలు, రాజకీయ చైతన్యము కలిగి మంచి చొరవకు తెలివితేటలకు, ఆత్మ గౌరవమునకు, నూతన పోకడలకు ప్రసిద్ధిగాంచినది.

మహమ్మదీయులకాలంలో శిస్తు వసూలు చేయుటకు దేశముఖులనే ఉద్యోగులుండేవారు. వారిని కొంతకాలం క్రోరీలని పిలిచారు. తర్వాత వీరిని జమీాందారులన్నారు.

కొంతప్రదేశం పన్ను వసూలుచేయటానికి సారా దుకాణపు పాటలవలె పూర్వంకాలంలో పాటలు పెట్టేవారు. ఆ పాటలు పాడి, ఆ ప్రాంతాల శిస్తు వసూలుచేసేవారే జమీాందారులనబడ్డారు చివరకు.

ఈ జమీా చాలా పురాతనమైనది. ఈ ఏర్లగడ్డవారు 16వ శతాబ్దమునుండి వుండిరి. వీరు కమ్మవారు. సుప్రసిద్ధమైన వాసిరెడ్డివారు వీరు బంధువులు. వారితో నాటినుండి నేటి వరకు వియ్యమొందుచున్నారు.

ఏర్లగడ్డ గురివినీడుగారు ప్రథమదేశాయి లేక జమీాందారు 1576_1607.

వీరిలో కంచినీడుగారు (1682_95) వరకు జమీాందారులు.అందుచేతనే కంచినీడుదేశం మంచుకు పండుతుందనే

సామెత కలిగింది. ఈ ప్రాంతమంతా మంచి ఫలవంతమైన ప్రదేశం.

ఈ జమీందారులలో కోదండరామన్న గారు (1746–91) వుండిరి. వీరు సేద్యానికి అనుకూలమైన కొన్ని పనులు చేశారు. కృష్ణ వరదలువచ్చి గ్రామాలు ఎప్పుడూ జలమయ మయ్యేవి. వీరు కృష్ణానదికి తూర్పువైపు కట్టపోయించి రైతుల కష్టాలను ఈడేర్చారు.

వీరే కళ్ళేపల్లిలోని నాగేశ్వరాలయాన్ని, శ్రీకాకుళంలోని ఆంధ్రవిష్ణు ఆలయాన్ని కట్టించారని అంటారు. కాని అవి రెండు అంతకు పూర్వమున్నట్లు నిదర్శనాలున్నవి. బహుశా మరమ్మతు చేయించి ఉత్సవాలు ఏర్పాటుచేసి వుండవచ్చు.

ఆంధ్రనాయక శతకంలో చెప్పినట్లు ఆంధ్ర విష్ణువునకు తలవెంట్రుకల సంగతి వీరికాలంలోనే జరిగినదట.

దేవరకోటనే పదము మనకు 16 వ శతాబ్దంలో కృష్ణ రాయలకాలంలో కనపడుతుంది.

శ్రీ కృష్ణరాయలు కళింగ విజిగీషతో దండెత్తి శ్రీకాకుళం విచ్చేసి, ఆంధ్రనాయకుని సేవించగా ఆయన ఈయనను ఒక గ్రంథాన్ని కృతియివ్వమని అడుగగా ఆముక్త మాల్యదనురచించిరి. ఆంధ్ర విష్ణువునకు మూడుగ్రామములను ఇచ్చినట్లు శాసనము నేటికిని ఈ దేవాలయములో వున్నది.

"కొండపల్లి సీమకుం జేరి వచ్చిన దేవరపుం గోటపు స్థలంలో యేర్లగడ్డ" అని రాయలశాసనములోవున్నది ఆయన

అరుదెంచినది, క్రీ. శ. 1519 అని కొమర్రాజువారు నిశ్చయించారు.[1]

ఈ దేవరకోట యెస్టేటును గురించి ఒక సంగతి ప్రచారంలో వున్నది.

కృష్ణదేవరాయలు శ్రీకాకుళంలో ఒక విద్వద్గోష్ఠి ఏర్పాటుచేసి, అందులో దాశరధు లెక్కువా పాండవు లెక్కువా అని ప్రశ్నించారట.

ఎవరికితోచిన సంగతులు వారు చెప్పిన తర్వాత రాయలు ఇలా తేల్చారట.

'దాశరధులు ఈశ్వరాంశ సంభూతులు. వారికి అమానుష శక్తులున్నవి. వారిలో ఉత్తమ యోగ్యత కలుగుటలో విశేషమేమున్నది ?

"పాండవులులలో ఈశ్వరాంశ లేదు. అయినను వీరికి దాశరధులు సాటిరారు."

వింజామర వీచుచున్న చాకలి ఈ మాటవిని "దేవర వారు అవతారం చాలించినా అభిమానం మానలేదని" అనే సరికి, అతని సమయస్ఫూర్తికి రాయలు మెచ్చి, ఏమి కావాలో కోరుకొమ్మనగా, దేవరకోట దయచేయవలసినదనగా యిచ్చెనందురు.

దీనికి సాదృశ్యంగా తాళపుచెవులు కొన్ని చాకలి వద్ద వుండేవంటారు.

ఇది చమత్కారంగావున్నది కాని వాస్తవంకాదు.

---

1 చారిత్రక విషయములు పుట. 34

దేవరకోట పరగణా అని ఈ యెస్టేటుపేరు. ఘంటసాల పొలిమేరను ఆనుకొని కోటదిబ్బవద్ద పూర్వం దేవరకోట వుండేదని, అక్కడే వీరుం డేవారని అంటారు. అక్కడపూర్వం గ్రామం వున్నట్లు నిదర్శనాలున్నవి.

ఆ దేవరకోటవారు, ఆ ప్రదేశం నచ్చక దానికి ఒక మైలులో ఒకగ్రామం ఘంటసాలకు దక్షిణంగా కట్టు కున్నారు.

ఈ జమీందారులు లక్ష్మీపురంలో ఇప్పుడు పంచ దార మిల్లున్న చోటకొంత కాలము, పాగోలులో కొంత కాలమువున్నట్లు చెప్పుకుంటారు.

మొదటి అంకినీడుగారు కాశీయాత్రచేసివచ్చిన తర్వాత అక్కడతాము దర్శించిన ఒక ప్రాసాదపు నమూనాను బట్టి చల్లపల్లిలో రు 1,32.000 లతో బహుసుందరమైన కోటను చుట్టూ పెద్దయెత్తున ప్రహారీని బురుజులను కట్టించారు.

వీరే శివగంగలో తమ ఇష్టదేవత_అమ్మవారి ఆలయ మునుకూడా నిర్మాణము చేశారు. వీరు శైవులు. కాశీనాథుని నాగేశ్వరరావుగారి పితామహులు వీరి కులగురువులు.

అంకినీడుగారు దేవబ్రాహ్మణ భక్తులు. వీరెక్కడ వున్నా నిత్యము బ్రాహ్మణ సమారాధన జరగవలసినదే.

వీరు 1791_1831వరకు పరిపాలించారు. వీరు సుప్రసిద్ధ జమీందారులగు వాసిరెడ్డి వెంకటాద్రినాయుడుగారు, నూజి వీడు సంస్థానాధి పతులగు శ్రీ రాజా రంగయ్యప్పారావుగారు సమకాలికులు. వారిని గురించి ఒక ఐతిహ్యాం కలదు. ఈ సంగతి, వారి ప్రకృతికి నిదర్శనము.

ఒకనాడు వాసిరెడ్డి వెంకటాద్రినాయుడుగారు, రాజా రంగయ్యప్పారావుగారు, అంకినీడుగారు, కలిసి యేదో గోష్ఠి సాగిస్తున్న సందర్భంలో రంగయ్యప్పారావుగారు, "మన అనంతరం ప్రజలు మనలనుగురించి యేమనుకుంటారో మనం చర్చించుకుందామా?" అని ప్రశ్నించి "మీమీ అభిప్రాయాలు చెప్పండి" అని కోరారు. మిగతా యిద్దరు మాట్లాడలేదు. కొంతసేపు అయిన తర్వాత "అయితే నేనే చెబుతాను. వినండి" అని తన అభిప్రాయం యీక్రింది విధంగా చెప్పారు.

చల్లపల్లి వారు నిరంతరం బ్రాహ్మణసంతర్పణలు చేస్తూవుంటారు. కనుక బ్రాహ్మణులు మాత్రమే దుఃఖపడతారు. మిగతా ప్రజలు ప్రత్యేకించి యేమీ పట్టించుకోరు. నేను చనిపోయిన తరువాత సంగీత విద్వాంసులు ముఖ్యంగా కళావంతులు హెచ్చుగా దుఃఖపడతారు. ఇంకా యెవ్వరు అంతగా పట్టించుకోరు. శ్రీవాసిరెడ్డి వెంకటాద్రి నాయుడుగారు చనిపోతే ఆ బాల గోపాలం అన్ని కులాలవారు దుఃఖపడతారు.

కాసుల పురుషోత్తము అంకినీడుగారి ఆస్థానములో వున్నట్లు తెలుస్తుంది. ఆయన హంసలదీవి వేణుగోపాలశతకము, మానసబోధశతకము, భక్తకల్పద్రుమశతకము, ఆంధ్రనాయకశతకము రచించినారు. ఆయన పెదప్రోలువాసి. అన్నిటిలోకి ఆంధ్రనాయకశతకము అగ్రగణ్యమైనది. కీర్తి నిందగా రచిస్తూ ఆంధ్రవిష్ణువుని ఉత్సవాలు ఏర్పాటు చేయించుకోవలసినదిగా కవి కోరాడు.

ప్రబంధాలలో రామరాజభూషణుని వసుచరిత్రకు సాటి లేనట్లు శతకాలలో ఆంధ్రనాయక శతకానికి వీను మిగిలినది లేదు. వీరిద్దరు వందివంశజులే.

శ్రీ అంకినీడుగారు ఉత్సవాలు తిరిగి చేయించ సాగారు. వైశాఖశుద్ధ పూర్ణిమనాడు కల్యాణోత్సవం వైభవంగా సాగించారు.

కాసుల పురుషోత్తము వెంట ఒక కవి అంకినీడుగారి దర్శనానికి రాగా ఇత డెవరని అడిగాడట. అంతట ఆయన అతనిది గొల్లపల్లి, ఇతనిది చల్లపల్లి అని కృష్ణుని అంకినీడు గారిని పోలుస్తూ ఒక సీసపద్యము చెప్పేసరికి రాజాగారు, నిన్ను నేను ఒకసారంటే, నీవు నాలుగుసార్లన్నావే, అని అన్నారట.

జమీందార్లకు ఇట్లా ఇజారాలు యివ్వటంవల్ల వారు రైతులను బాధపెట్టసాగారు. కంపెనీవారికి సరిగా పన్నులు చెల్లటంలేదు.

ఇదంతా చూచి ఆనాటి గవర్నరు జనరల్ కార్న వాలీసు 1802 లో శాశ్వత ఫైసలాయితి (పర్మనెంటు సెటిల్మెంటు) చేశాడు.

ఈ పద్ధతిలో రైతు ఆదాయంలో సగంవంతు రైతుకి వదిలి, తతిమ్మా సగంలో రెండువంతులు గవర్నమెంటుకిచ్చి పన్ను వసూలుచేసినందుకు ప్రతిఫలంగా జమీందారుకు ఒక వంతు తీసికొనుట.

ఈ ఫైసలాయితీ ప్రకారం రైతులమీద శిస్తు పెంచ రాదు. జమీందార్లకు అంతే. అప్పట్లో లెఖ్ఖలు తేల్చి రు 1,02,640 యెస్టేటు ఆదాయంగాను, జమీందారు చెల్లిం

చవలసిన పేష్కషు రు85,500లుగాను నిర్ణయించి అక్రమమైన పన్నులు వసూలు చేయవద్దని అంకినీడుగారిని హెచ్చరించాడు.[1]

ఈ అంకినీడు ధోరవారు ఇలా గుళ్ళు గోపురాలు కట్టి అప్పుల్లో మునిగి రైతులను బాధపెట్తూ పేష్కషు చెల్లించలేకపోయేసరికి, కలెక్టరు ఆయన్ని అరెస్టుచేసి, సంస్థానాన్ని ఆయన పినతండ్రి వెంకటాద్రి నాయడుకిచ్చి ఆయన్ని జమీాందారుని చేస్తే బాగుంటుందని శిఫార్సు చేస్తే, కంపెనివారు కలెక్టరు శిఫార్సుని తోసేసి అంకినీడుగారే జమీాందారుగా వుండవలసినదని నిశ్చయించారు.

అంకినీడుగారికి ఖర్చులెక్కువైనవి. అప్పులు బాధపడలేక 1816 లో తన యెస్టేటుని స్వాధీనం చేసుకోవలసిందిగా కలెక్టరుని కోరగా కలెక్టరు అంగీకరించలేదు.[2]

అంకినీడుగారికి సంతానం లేదు. ఆయన ఒక దత్త పుత్రుని దుర్గాప్రసాద నాయడుగారిని స్వీకరించాడు. 'ఆయన మైనరు ఎనిమిదేళ్ళు గనుక కోర్టుఆఫ్ వార్డ్సు వారు స్వాధీనం చేసుకొని, మైనారిటి వెళ్ళిన తర్వాత ఆయనకు 1833 లో స్వాధీనం చేశారు. ఈ యెస్టేటు యింకా అప్పుల్లో నేవున్నది. ఈ దుర్గాప్రసాదనాయడుగారి భార్యపేరు దుర్గాభవానమ్మగారు. ఆమెకు సంతానం లేనందున భర్త ఆమెకు దత్తతాధి

---

1 Kistna District Manual
కాని వీరి పేష్కషుమొత్తం 78,705మాత్రంగా ఇతర లెఖ్ఖలను బట్టి కనపడుతుంది.

2 Kistna District Manual- Page 326

కారం యిచ్చారు. దాన్ని పురస్కరించుకొని ఆమె మెరకని పల్లెలంకలోని ఏర్లగడ్డ వారిలో ఒక మైనరుని దత్తత చేసుకొన్నది.

మళ్ళీ కోర్టుఆఫ్‌వార్డ్సు వారు స్వాధీనం చేసుకొని దత్తుడైన అంకినీడుగారికి 1851 లో అప్పగించాడు.

ఆయన తనతల్లి మాటవిని, భార్యా పిల్లలతో తగాదాలు పడ్డాడు. భార్యాపిల్లలు శ్రీకాకుళంలో వుండేవారు.

ఆయన కాలంలో 1864 లో ఉప్పెన వచ్చినందున శివగంగ దేవాలయము, చల్లపల్లి కోట దెబ్బతినగా మరమ్మత్తు చేయించి, అప్పుల్లో పడ్డాడు. రెండు లక్షల పైగా అప్పైనది.

ఈ అప్పులకు కారణం జమీందార్ల దుబారాఖర్చులే అని యెంతవరకు వారిమీదకే పోతాడు కృష్ణాజిల్లా మాన్యుయల్ రచించిన మెకంజి. అది పాక్షిక సత్యము. కాని అసలు పరిస్థితులు వేరు.

[1]"1832నుండి 1837 వరకుమొత్తం 5సంవత్సరములలో గుడివాడ, విన్నకోట పరగణాల రెంటిమీద గురజ యెస్టేటుకు వచ్చిన ఆదాయం రు 76,892 మాత్రమే అయితే పేష్‌కష్ క్రింద పర్మనెంటు సెటిల్‌మెంటు యేర్పాటు ప్రకారం ప్రతియేడుకట్టవలసింది రు 81,433/లు. ఒక్క సంవత్సరం కట్టవలసిన పేష్‌కష్కైనా అయిదు సంవత్సరముల ఆదాయం చాలలేదంటే నాటి కరువు వైపరీత్య మెట్టిదో బోధ

1 కపుతరం చరిత్రపుట 72.

పడగలదు. పేష్కష్ బాకీలకు, ఎస్టేటు జరుగుబాటుకు జమీాందారు ఋణములు చేయవలసి వచ్చింది. పిళ్ళాదిశెట్టి వెంకటచలం నాయుడువద్ద రు. 70,000 లు అప్పు తెచ్చిరి.”

1832_36 వరకు గల తీవ్రకాటకమునకు ప్రజలందరు బాధపడిరి. పంటలే లేనిది పన్నులెట్లా వస్తవి. దీనివల్ల జమీాందారులు ఋణగ్రస్తులు కాక తప్పలేదు. ఇది వాస్తవ సంగతి. అప్పట్లో పుట్టి రు 15_0_0 లు.

ఆయన దేవబ్రాహ్మణ భక్తుడు. శివగంగ, కళ్ళేపల్లి శ్రీకాకుళంలో ప్రతి సంవత్సరము ఉత్సవాలు ఏర్పాటు చేశాడు.

ఈ పరగణాలో 66 గ్రామాలు రెండు అగ్రహారాలు కొన్ని పాలాలు కలిసి నూరు గ్రామాలు వుండేవి.

ఇక ఈ జమీాందారీ పద్ధతిని గురించి తెలుసుకుందాం.

జమీాందారీయుగంలో మొట్టమొదట రైత్వారీ పద్ధతి వుండేదికాదు. ప్రతి గ్రామంలోను ధనవంతులు పలుకుబడి గలవారు కొందరు వెళ్ళి జమీాందారుగారికి మూడేళ్ళకో, అయిదు సంవత్సరాలకో గ్రామం మొత్తంమీాద ఇంత భూమి తీసుకున్నట్లని ముచ్చిలికా వ్రాసి వచ్చేవారు. దీనినే యిజారా అమరకదిట్టం అనేవారు. వారిని ఆ కాలంలో జిమ్మాదారు లనేవారు. జిమ్మాదారులంటే వాటాదారులన్నమాట.

ఈ జిమ్మాదారులు గ్రామంలోకివచ్చి రైతులకు అర

కలవెంట భూమిని యిచ్చేవారు. ఈ పద్ధతినే ఆస్రాలేక అమానీ అనేవారు.

ఈ కాలంలో అధికంగా జొన్న, కొద్దిగా నల్ల పెసర వేసేవారు.

రైతులు పంటచేలలో ఏమీ తీసుకొనిపోకుండా వుండేందుకు జమీందారు కొందరిని కాపలాదారులను వుంచేవారు. వారికి నిగహావానులు_నిగామానులని వాడుకపదం. ఏ పైరు ఎంతవేసింది కొలవటానికి కొందరు వచ్చేవారు,కోతకుతయారైనతర్వాత అంచనాదారులు వచ్చేవారు.అంచనావేసుకొని వెళ్ళేవారు. తర్వాత మహాశ్ఫ్యాల్‌దార్లు వచ్చేవారు. వారి కాపలా క్రిందనే జొన్నలు వగైరా నూరిపిడి చెయ్యవలసి వుంటుంది.అట్లా అయిన తర్వాత రాసులుపోసేవారు. సాధారణంగా పంటకళ్ళాలన్నీ దగ్గరగా వుండేవి. తర్వాత జమీందారుగారి కొలగాళ్ళు వచ్చి మరకాలతో కొలిసేవారు. అప్పట్లో అంబారుపుట్టి_ కళ్ళములోవున్న ధాన్యరాశిపుట్టి. కోరుపుట్టి అంటే _ జమీందారుగారికి శిస్తుకు బదులుగా కొలిసే పుట్టెడు ధాన్యం.

అప్పట్లో భూమిహక్కు జమీందారుదే.రైతు కేవలం కౌలుదారు మాత్రమే. పంటలు సరిగా పండనందున రైతుల వల్ల ధాన్యం వసూలయ్యేది కాదు. ధాన్యం రాకపోయినా, జమీందారులకు పేష్కషు తప్పేదికాదు. వారు తలైనా తాకట్టుపెట్టి పేష్కషు చెల్లించకపోతే వారి ఆస్తి జప్తుచేసి వేలం వేసేవారు.

ఈ జమీందారులు కమ్మవారు. రైతులు కమ్మవారు. పెత్తనదారులు కమ్మవారు. కనుక ఈ యెస్టేటుని నిలపాలని, పెత్తనదారులు కృషిచేశారు. ఇట్లా రెండుసార్లు ఈ యెస్టేటు పోకుండా కాపాడారు.

మొదటిఅంకినీడుగారి కాలములోను తర్వాత ఆయన మనుమడు రెండవ అంకినీడుగారి హయాములోను.

పెత్తందార్లు ముబాదలాగా ముందు జమీందారు గారికి రైతులు యివ్వవలసిన శిస్తులక్రింద యిచ్చి తర్వాత వసూలు చేసుకొనేవారు. వీటిని ముస్తకపోళ్ళనేవారు.

మల్లికార్జున ప్రసాద్‌నాయడుగారి తండ్రి అంకినీడుగారికి బందురులోని పిళ్ళారిసెట్టి పార్థసారథినాయుడు, గోవింద నాయుడు, సముద్రానాయుడులవద్ద రు 80,000లు, గొర్రెపాటి కృష్ణమ్మ, వేమూరివెంకట్రామయ్యహామీవుండి యిప్పించారు.

ఇలా ఈ యెస్టేటు తమదిగా భావించారు ఆనాటి పరగణా పెత్తందారులు.

ఇట్లా భావించినా అవసరమైనపుడు ఈ జమీందార్లతో ఘంటసాల పెత్తందారులు ఢీకొని పోరాడిన పోరాటాలు లేకపోలేదు. అనగా కోర్టులద్వారా తమ నష్టకష్టాలను పరిహరించుకొనేవారు.

ఈ వ్యవహారాలు యెక్కువగా అంకినీడుగారి కాలం లోను వారి కుమారులైన శ్రీమంతు రాజామల్లికార్జునప్రసాద్ నాయడు బహద్దరుగారి కాలములోను జరిగినవి.

అంకినీడుగారి కాలంలో(1851_75) జరిగిన పోరాటాల సంగతి ముందు తెలుసుకుందాము.

ఈ పోరాటాలలో నాయకత్వము వహించిన ప్రజా స్వామ్యవాది రైతుబంధువు గొర్రెపాటి బాలకృష్ణమ్మను 1844_1906 గురించి ముందు తెలుసుకొనుటవసరం.

ఒక దేశంలో ఒక మహాపురుషుడు జన్మించి అనేక మార్పులు తెచ్చి ఖ్యాతిగాంచునటులనే ఒక్క గ్రామములో ఒక్క పురుషుడు పుట్టి అట్టిపనేగావించి ప్రఖ్యాతి చెందును. అట్టి పురుషులలో చెందినవాడు బాలకృష్ణమ్మ. ఆయన ఆకాలములో జమీందారులకు వ్యతిరేకముగను రైతుల కనుకూలముగను అనేక వ్యవహారములను నడిపి యీ పరగణాలోనే గాక తదితర ప్రదేశములలోకూడ అధిక ఖ్యాతి గాంచినపురుషుడు. వర్చస్సులోనేమి, వర్తనలోనేమి, వేష బాషలలోనేమి ఆయన అన్ని విధముల అధికఖ్యాతిగాంచెను. ఈ గ్రామములో అనేకప్రముఖులు కలిగినను ఆయనకు పూర్వము ఆయన అనంతరము అట్టివారు కలుగ లేదు.

♦ ఆయనపేరుతో ఘంటసాల పేరు ప్రఖ్యాతమైనది.

---

• 1 ఆయనవద్దికలు, నెమ్మది,నిండు, నిబ్బరము,హుందా,హోదా ఆయనమనుమడగుచైర్మన్ వెంకయ్యలోను,ఆయనవిద్య,సంస్కారము, వినయము, ఆయనమేనల్లుడు వేమూరి రత్నయ్యలోను, ఆయన లౌకిక జ్ఞానము,సమయస్ఫూర్తి, పెత్తనము, ప్రజావశీకరణము ఆయనకు పుత్ర సమానుడును,శిష్యుడును ఆయనను భక్తితో అనుదినము స్మరించిన గొర్రె పాటివెంకయ్యలోను కొంతవరకు కలవు.వీరుమువ్వురు ఆయన అనంత రము ప్రాముఖ్యములోనికి వచ్చినవారే. వీరిఅనంతరము ప్రాముఖ్యము వహించిన గొట్టిపాటి బ్రహ్మయ్యలో బాలకృష్ణమ్మ గుణములలో అధిక గుణములు కలవు.

ఆయన 18 ఏటనే గ్రామమునసబు అయ్యెనుకాని, ఎన్నడు గడపదాటి అధికారిని సాగనంపలేదు. ఆయనమూర్తి చూచే అందరూ ముగ్ధులయ్యేడివారు. అధికారులందరూ ఆయనకు ఆకాలములో కుర్చీయిచ్చి గౌరవించెడివారు. ఆయన పండితుడు, లౌకికుడు, వేదాంతి, వ్యవహారదక్షుడు, మంచి మాటకారి ఆయనకు వశ్యులు కాని వారులేరు.

దేవరకోట పరగణాలో అధిక భాగము ఆయన చెప్పు చేతల్లోనే వుండెడిది. ఆయనతో సంప్రదింపుకు అనుదినము పనివడి పరిసరగ్రామాలువారు వచ్చుచుండెడివారు. ఆ కాలములో జమీందారి జబర్దస్తీలు, అన్యాయములు అరికట్టిన ప్రముఖుడాయన.

ఆనాడు జమీందారులదే ప్రభుత్వము. ఆ కాలములో ఈ గ్రామరైతులు జమీందారీ అన్యాయములను అరికట్టుటకు శాసనబద్ధముగ చేసిన కృషి అధికము. అందులో కొన్ని వ్యవహారములు మాత్రమే వివరించెదను.

## మరకాలతగాయిదా

పూర్వము శిస్తు రొఖ్ఖరూపముగగాక ధాన్యరూపేణ యిచ్చెడివారు. దీనినే 'ఆస్రా' లేక 'అమానీ'పద్ధతి అనేవారు. ఈ పద్ధతిలో పండిన పంటలో సగంవంతు జమీందారునకు యివ్వవలెను. కాని జమీందారు అప్పటి బజారుధర ప్రకారము తనవంతుక్రింద డబ్బుతీసుకొనెడివాడు. ఈ అవకాశము పురస్కరించుకొని అధికధనము రైతులనుండి గుంజవలెననే

దురుద్దేశముతో తక్కువ మరకాలతో కొలిపించసాగెను. ఈ అన్యాయమును అరికట్టుటకు బాలకృష్టమ్మ రైతులచే ప్రభుత్వమువారికి పిటీషనులను పెట్టించెను (1870)

ఈ పిటీషనులను విచారించుటకు కొమ్మూరు వెంకట చలం అనే తహశ్శీల్ దారు, మోపిదేవి మకామునకు వచ్చెను. అప్పటి జమీందారగు అంకినీడుగారు తహశ్శీల్ దారు యెదుట కుర్చీలో కూర్చుండియుండుటచే భయభీతులైన రైతులుతమకు జరుగుచున్న అన్యాయమును చెప్పుకొనుటకు ఎవ్వరును సాహసించరైరి. అంతట బాలకృష్ణమ్మ ఉత్తరీయముతీసి నడుమును కట్టి, సాక్ష్యము చెప్పుటకు సంసిద్ధుడై వచ్చెను. అక్కడనే ఆసీనుడైయున్న అంకినీడుగారు 'బాలకృష్ణమ్మా! ముక్కు పచ్చలారలేదు అబద్ధములాడవద్దని హెచ్చరించెను. 'యదార్థము తప్ప ఒక్క అబద్ధముకూడ మనవి చేయనని' ఆయన సమాధానము చెప్పి రైతులకు జరుగుచున్న అన్యాయము నంతను ఆ విచారణాధికారి యెదుట పూసగ్రుచ్చినటుల చెప్పెను.

ఆయన అనంతరము పరగణాలోని ప్రముఖులందరు కూడ ఆ విషయంలో జరుగుచున్న అక్రమమును చెప్పుకొనిరి. వరుసగా రైతులందరిని విచారించిన పిమ్మట 'కమ్మవారంటే అందరూ కమ్మవారేనా? ఒక్క బాలకృష్ణమ్మకే చెల్లును' అని రైతులకనుకూలముగ చెప్పుచు, శిఖామరకముతో ఇక ముందునుంచి కొలిపించవలసినదిగా తీర్పుచెప్పెను. నాటి నుంచి శిఖామరకము కొలతను వచ్చెను.

## పరగణావ్యాజ్యము

ఆ కాలములో జమీాందారులెన్నో అక్రమ రుసుములు వసూలు చేయుచుండెడివారు. జమీాందారుగారి ఇష్టదేవత యగు దుర్గాదేవి ఉత్సవమునకు అమ్మవారి రుసుమని కత్తికి (17 యకరములు) రు 2_0_0, బాజాఖర్చని రు2_8_0(పెత్తన దార్లకు,ఆటపాటగాళ్ళకు,జమీాందారీ ఉద్యోగుల ఖర్చులకు) వెట్టీల ఖేరీజులు రు 0_7_0, నాయకవాడి రు 0_2_8 వసూలు చేసెడివారు. ఈ రుసుములూ తాళ్ళశిస్తు అక్రమము చెల్లకూడదని 1873లో గొర్రెపాటి బాలకృష్ణమ్మ, వేమూరి వెంకయ్య (ఘంటసాలపాలెం) కలసి దావా వేయుటకు నిశ్చయించుకుని వెంకయ్య పేరుతో దావా దాఖలుచేసిరి. దీనికి పరగణాలో రైతాంగము దగ్గర ఖర్చులకు కత్తివరుసన వసూలుచేసిరి. దావా హైకోర్టులో రైతులపక్షమే అయ్యెను. అయినప్పటికీ తాళ్ళశిస్తు మాత్రము యిచ్చుటకును మిగతా రుసుములు యివ్వకుండావుండే పద్ధతిని రాజీపడిరి.

దీనికి కారణము రైతులు ఇవ్వవలసిన చందా ఇవ్వక పోవుట,వారిలో ఐకమత్యము లేకపోవుట,వ్యవహరించినవారే నష్టపడుట, దావాదారునకు ఖర్చులక్రింద రు 300_0 జమీాందారిచ్చుటేగాక ఇంకా కొంత సహాయముకూడా చేసెను.

## బాలకృష్ణమ్మ గుణగణాలు

చాకలి,కమ్మరి, కుమ్మరి మొదలగువారు నెలకొకసారి యెస్టేటు వారికి వెట్టి చాకిరి చెయ్యాలి. రోజుకు ఒక శేరు

గింజలు యిచ్చేవారు. బాలకృష్ణమ్మ ఈ వెట్టిని ఆపించాడు.

న్యాయవిషయంలో ఆయన జమీందారంటూ వెనుకాడేవాడు కాడు. 1864 లో ఉప్పెనకు చాలా కలప ఈ గ్రామానికికొట్టుకొని వచ్చింది. రెండవ అంకినీడుగారు ఈ కలపంతా తమ సిబ్బంది ద్వారా పోగుచేయించి, తమ ఆవరణలో పెట్టించిరి.

ఈ కలపంతా తమదని బందరులో ఆ నాటి ప్రసిద్ధ వర్తకులగు తాడేపల్లి వారు వచ్చి బాలకృష్ణమ్మతో చెప్పుకొనిరి. తమ పేర విలాసము వాటి మీద చెక్కించామని చూపవలసిందని చెప్పిరి. అప్పుడు ఆయన దానిని ఘంటసాల బళ్ళపైన యెత్తించి తోలిపెట్టెను.

ఈ సంగతి అంకినీడుగారికి తెలిసి, పోగుచేసేవరకు ఊరుకొని అడగకుండగనే తోలిపెట్టి ప్రతిష్ఠను పాడుచేశాడు. మొట్టమొదటనే కాదనకపోయెనా అని అన్నారట. బాలకృష్ణమ్మ న్యాయపరాయణతకు నిర్భయత్వానికి ఇటువంటివెన్నో కలవు.

## పీ స బ డి

ఆస్రాలో గొర్రెపాటి బాలకృష్ణమ్మ వగైరాలచేత అంకినీడుగారు అమరక దిట్టం వ్రాయించుకున్నారు.

బాలకృష్ణమ్మకు ఆయనకు విరోధంరాగా, కొందరిని బాలకృష్ణమ్మకు ధాన్యం యివ్వకుండాచేసి, అంకినీడుగారు బాలకృష్ణమ్మపై దావా వేశారు.

బాలకృష్ణమ్మ తనది ప్రతిఫలరహితమైన ఇజారా కత్త నగా అప్పటి హైకోర్టు జడ్జి విల్సన్ దావా కొట్టివేసెను.

బాలకృష్ణమ్మను సాధించుదామన్నదితనకే ఎదురైనది, జమీందారుగారికి.

ఈ సంగతినిబట్టి ఇక అంకినీడుగారు ఆస్రా పద్ధతిని అమరకం వసూలుచేయలేదు గనుక వీసబడిలోకి దిగవలసి వచ్చింది.

వీసబడి అనగా రైత్వారిపట్టా. ప్రతిరైతు స్వాధీనంలో వున్న భూమికొలిసి రొఖ్ఖ శిస్తుకు పట్టాయివ్వటం. ఇది 1871 ప్రాంతాలజరిగినట్లు తెలుస్తుంది.

అంకినీడుగారు తమ యెస్టేటులో పనిచేస్తున్న గోళ్ళ మూడి లక్ష్మీనరసయ్య, వీసంపాటి వెంకటాచార్యు లనేవారి నిద్దరిని పరగణాలలో భూములకు సారాన్నిబట్టి తరం నిర్ధారణ చేయించి రొఖ్ఖం శిస్తుకు పట్టాలుయిచ్చారు. ప్రతి చేలో మట్టివండి రుచి చూచి ఒక్కొక్క చేలో ఎన్నోతరములుగా ఏర్పరచి మొత్తంచేనుకు తరంవారి శిస్తు కట్టారు. ఈ శిస్తు కట్టడంలో ఘంటసాల పాలెం కాపురస్తుడు పరగణా పెత్తందారు వేమూరి వెంకట్రాముడు అధికంగా పాటుపడ్డారు. ఆనాటి ఇతర పరగణా పెత్తందారు లంతా తోడ్పడి దీనికి అంగీకరించారు.

యావరేజి పదితరాలు. తక్కువ రేటు కత్తికి రు4_0_0. హెచ్చు రు 70/లు. జరీబులశిస్తు అనగా పొగతోట శిస్తులు వేరు. వాటికి అధిక శిస్తు.

వెంకటగిరి బొబ్బిలి జమీలతో పోల్చుకుంటే చాలా తక్కువశిస్తే, జబరదస్తీలు తక్కువే.

రొఖ్ఖంశిస్తులెఖ్ఖ తయ్యారు చేయించిన పరగణా పెత్తందారులు.

| | |
|---|---|
| 1 గొర్రెపాటి బాలకృష్ణమ్మ-<br>గ్రామ మునసబు | ఘంటసాల |
| 2 వేమూరి వెంట్రాముడు- | ఘంటసాలపాలెం |
| 3 మాలెంపాటి దూర్వాసులు- | నిమ్మగడ్డ |
| 4 తుమ్మల సీతాపతి-<br>గ్రామ మునసబు | కొడాలి |
| 5 ఘట్టమనేని గోపన్న-<br>గ్రామ మునసబు | అయ్యంకి |
| 6 రావి పద్దన్న- | రావివారిపాలెం |
| 7 మండవ బుచ్చన్న- | పెదప్రోలు |
| 8 చంద్ర వీరయ్య- | మంగళాపురం |

గ్రామడవ్రళ్ళలో పైవారు పరగణాపెత్తం దార్లని వ్రాయబడివున్నది.

## జమీందారులు - పెత్తందారులు

జమీందారీయుగంలో ప్రతి గ్రామానికి ఒక పెత్తందారుండేవాడు. పరగణాకు అంతకు ఒక పెత్తందారుండేవాడు. ఈయనను పరగణా పెత్తందారనేవారు. ఘంటసాల పాలెం వేమూరివారి కుటుంబంలో జ్యేష్ఠుడు పరగణా పెత్తందారుగా వుండేవారు. వేమూరి వెంకట్రాముడు ఆయన కుమారుడు

వెంకయ్య, వెంకయ్య కుమారుడు వెంకట్రాముడు వరుసగా పరగణా పెత్తందార్లయ్యారు.

ఈ సందర్భంలో ఒక ఘటన వివరిస్తాను. దీన్ని బట్టి ఆ కాలంలో జమీందారు, పరగణా పెత్తందారు ఎటువంటి వారో విదితం కాగలదు.

జమీందారు రెండవ అంకినీడుగారు పేష్కషు చెల్లని కారణాన జమీ వేలం కానుండగా పరగణా పెత్తందారగు వేమూరి వెంకట్రాముడుని కలుసుకొనుటకు ఘంటసాల పాలెం మేనామీద వస్తూవుండిరి. అప్పట్లో వెంకట్రాముడు ఆ గ్రామ చెరువు గట్టుమీద నిలువుచెంబు క్రింద వేసుకొని కూర్చుండివుండిరి. మేనా బోయీలు కేకలు వేసుకొంటూ ఆయన ముందుగానే అవతలి కెళ్ళారు. అక్కడ దిగి అంకినీడు గారు వెంకట్రాముడూ అంటూ కొన్ని గజాలు రాగా ఈయన కొన్ని గజాలు నడచివెళ్ళి ఆయనను గౌరవ పురస్సరముగ సంబోధించి విషయము తెలుసుకొని, మేముండగా జమీ వేలము కానివ్వమని వాయిదానాటికి ధనము వసూలు చేసుకొనివెళ్ళి జమీను వేలంపడకుండా కాపాడెను. ఆనాటి పెత్తందార్ల ఆత్మగౌరవ మటువంటిది.

ఆనాటి జమీందార్లు రైతులనెలా బాధపెట్టేది పెత్తందార్లెలా వారిని చూచేది తెలిపే ఒక సందర్భం ముచ్చటిస్తాను.

ఘంటసాలగ్రామ పెత్తందారగు గొర్రెపాటి చంచయ్యగారికి వేమూరి సుబ్బయ్యగారు(రామన్నగారి తండ్రి) అల్లుడు.

ఆయనకు గ్రామంలోను చుట్టుపక్కల పలుకుబడివున్నది. బోళ్ళపాడు గ్రామపెత్తందారాయన, ఏడుకత్తులభూఖామందు. ఒక రోజున ఆయన 12 గంటలకు స్నానంచేయడానికి అంగ వస్త్రం కట్టుకొని సిద్ధంగా వుండగా, ఘంటసాలకు తూర్పు వైపునవున్న చిట్టూరుకరణం చిట్టూరు పెదపేరరాజు వచ్చి గావురుమని యేడ్చెను. కారణ మడగగా తనకుగల భూమికి శిస్తు చెల్లించలేని కారణాన జమీందారుకోటకు పిలిపించి నెత్తిమీద దుంగపెట్టి అవమానించెనని చెప్పేసరికిసుబ్బయ్యా ఉగ్రుడై ఆ అంగవస్త్రంతోటే నాల్గుమైళ్ళ దూరాన వున్న చల్లపల్లి కోటలోనికి వెళ్ళి, వారి బంధువయిన ముక్త్యాల జమీందారు గారితో మాట్లాడుచున్న అంకినీడు గారిని చూచి "ఈ జమీ పుట్టిన తర్వాత యెంతమంది జమీం దారు లయ్యారు? మీ రెన్నో వారు? ఇల్లా రయితులను యెన్నడైనా హింసించారా? ఇట్లాగైతే రైతులనుండి శిస్తులు వసూలు చేస్తారా? జమీందారీ నిలిచినప్పుడుచూస్తా"నని పెద్దగాగర్జించాడు. అసలే సుబ్బయ్యా కళ్ళుఎరుపు. అందులో యెండలో నడిచిరావటం, కోపంతో వళ్ళు తెలియని ఆవేశంతో అనడం ఇదంతా చూచి యేమీ సమాధానంచెప్పకుండానే అంకినీడుగారు తెలి విగా దిగ్గునలేచి, వెనుకవసారాలోనికి వెళ్ళి సుబ్బయ్యాను యీ వైపునకు తీసుకొనిరమ్మనమని, ఆయన అక్కడకు రాగానే, "ఏమిబావా కళ్ళంత ఎర్రగా వున్నవి. ఏమైనా పుచ్చుకోలేదు గద అని పరిహాసమాడి, నీవేదైనా అంటే నేను ఒంటరిగా వున్నప్పుడు అనాలిగాని, పరాయి జమీందారు ముక్త్యాలవారి

యెదుట అంటే మనకు అమర్యాద, వారికి లోకువ అవ్వడం కాదు. ఇంతకూ వచ్చిన పనేమిటో చెప్పు!" అని ఆయనను శాంత పరచి ప్రశ్నించడం, ఆయన జరిగిన విషయం చెప్పి, "ఈ బ్రాహ్మణుడు నా బిడ్డలాంటివాడు. ఈయనను ఇట్లా అవమానించినందున నన్నూ నేను మరచిపోయి;అంత కోపం రప్పించింది.1 భూములుపండలేదు. ఈయన పెద్ద కుటుంబీకుడు శిస్తు ఎట్లా చెల్లించగలడు?" అని తిరిగి గద్దించేసరికి, ఇంతకు యేమి చేయమంటావు అని జమీందారుగారు అడగగా ఆయనతో సంప్రదించి, కాజముతాకు సముద్దారుగా ఆయనను నియమించి, ఆయనకు యిచ్చే జీతం శిస్తుక్రింద జమకట్టుకోవలసిందని, మిగతా మొత్తం ఆయనకు ఇవ్వవలసిందని చెప్పి తిరిగి ఘంటసాలకు చేరుకున్నారు వారిద్దరు.

రెండవ అంకినీడుగారు 1875 లో అస్తమించారు. ఆయనకు మల్లికార్జున ప్రసాదనాయడు బహద్దరు, దుర్గాప్రసాద్‌నాయడు బహద్దరు (బాబుగారు) వెంకటామన్న లింగన్ననాయడు బహద్దరు (బాబయ్యగారు) అనే ముగ్గురు కుమాళ్ళుండిరి. అందులో జ్యేష్ఠుని ప్రభుత్వంవారు 1876లో జమీందారుగా ప్రకటించారు.

---

1 ఆ కాలంలో జమీందారులు శిస్తులివ్వని వారిని ఎండలో నిలబెట్టి భుజాలమీద దూలాలెత్తటం చేస్తూవుండేవారు. ఒక్కొక్కప్పుడైతే బండయెత్తేవారు. పన్నులివ్వకపోతే భూమి వేలంవెయ్యటం ఇటీవల భూములకు ధరలు పెరిగినాక వచ్చింది.

మిగతా సోదరులిద్దరు, ఈ యెస్టేటులో తమకు భాగ మున్నదని హైకోర్టులో దావా వేశారు.

అప్పుడు కోర్టు ఆఫ్ వార్డ్సు వారు స్వాధీనం చేసుకొని సీనియరు డిప్యూటి కలెక్టరగు దేవేంద్ర వెంకటచలం పంతులుని రిసీవరుగా వేశారు. ఆయన చాలా న్యాయంగా వ్యవహారించాడు.

ఈ దావా ప్రీవీకౌన్సిలు వరకు వెళ్ళింది. అందులోను అవిభాజ్యమని మల్లికార్జున ప్రసాద్ నాయడు బహద్దర్ గారికే జమీాందారీ అర్హత వున్నదని తీర్పు చెప్పారు.

మల్లికార్జున ప్రసాదనాయడు బహద్దరుగారు ప్రథమంగా చల్లపల్లి వచ్చినపుడు పరగణాలో పెత్తందారులు, ప్రముఖులు, ప్రజలు వారిని సత్కరించటానికి వచ్చారు. బాలకృష్ణమ్మ కూడా వెళ్లాడు. ఆ కార్యక్రమమైనవెంటనే, బాలకృష్ణమ్మ వద్దకు జమీాందారుగారి ఉద్యోగివచ్చి, మీా తరపున ఎందరున్నారో భోజనానికి రావలసిందిగా రాజాగారు సెలవిచ్చారని అన్నాడు. దానిమీాద టాయన 'నా సంగతి కేమి, యెస్టేటులోని ప్రముఖులు చాలామంది వచ్చారు వారి సంగతేమి ఆలోచించారు' అని ఆయన అనేసరికి 'వారి సంగతి రాజాగారు సెలవివ్వ లేదు. తమ రొక్కరి విషయమే తెలుసుకోవలసిందని సెలవిచ్చా'రన్నాడు అతను. 'నేనూ నాతో వచ్చినవారు ప్రత్యేక వసతి మే మిదివరకే ఏర్పాటు చేసుకున్నాము' అన్నాడాయన. ఇట్లా తన ప్రత్యేకతను నిలబెట్టుకొంటూ వుండేవాడు బాలకృష్ణమ్మ. ఆయన ఏనాడు జమీాందారుగారి సువారంలో భోజనం చేయలేదు. అగ్రహారంలో

తనే భోజనానికి ఏర్పాటు ఒకచోట చేసుకొన్నాడు.

అప్పట్లో రిశీవరైన చేనేంద్ర వెంకటచలం బాల కృష్ణమ్మా! రాజాగారికి పరిచయం చేస్తాను రావలసిందని కోరితే వచ్చి పెద్దలు తమ దయవుంటే చాలు. ఎక్కడున్నా ఆశీర్వదిస్తూ వుండండి. అని ఆయనవద్ద సెలవు పుచ్చు కున్నాడు.

ఆయనవద్ద యెప్పుడు వెన్నుకాచి వుండే శిష్యు డైన గొర్రెపాటి వెంకయ్య "ఏమి పెదనాన్నా! జమీందారుగారి పరిచయం అయితే బాగుండేది కదా వద్దన్నారేమన్నాడు. అలాకాదురా అబ్బాయి మనవద్ద సరుకుంటే జమీందారుగారే మనలను పిలిపించుకుంటారు. ఆయన పరిచయం చేసినా మన వద్దశక్తి లేకపోతే ఆయన మనలను పలకరించనే పలకరించడు. అందుచేత జమీందారు గారి పరిచయంకంటే ఆయన పరిచయమే కావాలన్నందుకు ఆయనెంతో సంతోషించాడు కాని అన్యధా భావించ లేదుగా! కనుక సందర్భానుసారంగా మాట్లాడాలి అన్నాడు. అది ఆయన లౌకికజ్ఞానానికి నిదర్శనము.

మరల అసలు విషయానికి వద్దాము. మల్లికార్జున ప్రసాదనాయడు బహద్దరుగారు 1890 లో వైభవంగా పట్టాభి షిక్తులై 1928 వరకు జమీ ఏలారు. ఈయన చాలా అదృష్ట వంతుడు, వ్యవహారదక్షుడు. ఈయన కాలంలో ధరలు పెరి

గినందున రాబడి రు 2,50,000 ల నుండి నాలుగు లక్షల వరకు పెరిగింది.[1]

చాలా గోభూములు మొదలగు వాటిని స్వాధీనం చేసుకున్నాడు. అందుచేతనే ఈయన ఆధీనంలో కృష్ణలంకలు, అరణ్యాలు, తోటలు, మెరక, పల్లపు భూములన్నీ అమాంబాపతు య 52,000 లు వుండేది.

వీరివద్ద కోపల్లె కృష్ణారావు మేనేజరుగా వుండేవాడు. ఆయన కుడివరం, మేలివరం – అనగా వ్యవసాయము శిస్తు వసూలు– రెండు హక్కులు మనకేనా అంటే ఎవ్వటికైనా ఈ జమీలుపోతే యీ భూములన్నా వుంటవన్న లోకజ్ఞుడు.

ఈయన ఆయుర్వేదములో ఆరితేరినవాడు. స్వయంగా వైద్యం చేసేవాడు. ఒక ఆయుర్వేద వైద్యాలయాన్ని కూడా స్థాపించారు. మందులుంటే మరణం లేదని నమ్మినవాడు. ఆయనకు ఒక విషయం తెలుసు ఒకవిషయం తెలియదు అను కొనటానికి వీలులేదు. సంగీతం సాహిత్యం అన్నీ తెలుసు. అనుభవంలో పండిపోయాడు. అయినా అన్నిటినిమించి భూదాహం అధికం.

ఈయన తాతతండ్రులు, భూముల్లో రైతులను ప్రవేశపెట్టాలని ప్రయత్నించేవారు; ఈయన భూములను యెలా స్వాధీనం చేసుకొందామని ఆలోచించేవాడు.

---

1 వావారాజివ్య విఖ్యాత జనచరిత్ర.

అప్పటి రెంటరికవరి ఆక్టునుబట్టి పట్టా ఈ విధంగా వుండేది.

శ్రీ జగజ్జననీ సహాయం

శ్రీ కాకుళేశ్వర శ్రీ దుర్గామల్లేశ్వర

శ్రీ స్వామివారి ఆజ్ఞాధారకులయిన కృష్ణాడిస్ట్రిక్టు మచిలీపట్నం సబు డిస్ట్రిక్టు చల్లపల్లి గ్రామ నివాసస్తులున్న జమీందార్లున్న మహారాజశ్రీ శ్రీమంతురాజా ఏర్లగడ్డ అంకినీడు బహదరు దొరవారి కుమాళ్ళు, మహారాజరాజ శ్రీ శ్రీమంతు రాజా మల్లికార్జున ప్రసాదనాయడు బహద్దరు జమీందారు పరగణే దేవరకోట సర్ దేశముఖు సర్కారు ముస్తుఫాన్నగరు వగయిగా ధొరవారు.

దేవరకోట జమీలో చేరిన...గ్రామజిరాయతీ దారుకు దయచేయించిన వీసబడిపట్టా స్న ఫసలీ.

మా వంశపరంపరా శాశ్వితపు జమీహక్కు అయినటు వంటి మా పాలనలో చేరినటువంటిన్నీ దేవరకోట జమీను మ॥......గ్రామంలో లెఖ్ఖ ప్రకారం నీజిరాయితీ క్రింద వున్న యీ దిగువ నుదహరించిన శేరీభూమికి......నిర్ణయ మైన శిస్తు.

ఇందుకు కిస్తీబంది వివరం

| కిస్తీలు | పెస్కులుసహాయ మొత్తంకు 1 కి ఏ చొప్పున | |
|---|---|---|
| | మెరకకు | పల్లంకు |
| ది 12 అక్టోబరు | | |
| ది 12 నవంబరు | | |
| ది 12 డిశంబరు | | |
| ది 12 జనేవరు | | |
| ది 12 ఫిబ్రవరు | | |
| ది 12 మార్చి | | |
| ది 12 ఏప్రిల్ | | |
| ది 12 మెయి | | |

| పొలం వివరం | | విస్తీర్ణం | శిస్తు మొత్తం | | |
|---|---|---|---|---|---|
| మెరక పైర్లభూమి | | | | | |
| పల్లపు పైర్ల భూమి | మామూలుపల్లం | | | | |
| | బాపతు పల్లం | | | | |
| వెరశి. | | | | | |
| లోకల్ సెస్సు........................ | | | | | |
| కరణము శలగ ........................ | | | | | |
| నాయకవాడి జీతం........................ | | | | | |
| వెట్టి ఖేరీజాలు........................ | | | | | |
| | | మొత్తం | | | |

1 సదరహీకి స్తీ బందీ ప్రకారం మాసర్కారు ఉద్యోగస్తుల పరంగా చెల్లించి రశీదులు పుచ్చుకుంటూ వుండవలసినది. బాకీ పయికం గుజస్తు తాకీఖు లగాయతు నెల 1 కి నూటికి రు 0_8_0 చొప్పున వడ్డీతో చెల్లించవలసినది.

2 పైన వుదహరించిన మెరక పయిర్ల సాగు పొలంలో పల్లపు పయిర్లతో సాగు చేసినట్టయితే సదరు పల్లపుపయిర్లకు ఏర్పడియున్న శిస్తురేట్లుక 1 కి రు 100. 0.0 చొప్పున నున్నూ అందుకు పద్ధతుల ప్రకారం ఏర్పడిన సెస్సులున్నూ దాఖలు చేస్తూ మెరక పయిర్ల శిస్తును తగ్గించుకో వలసినది. పల్లపు పయిర్లతో సాగుచేయుమెరక బాపతు పల్లం భూములు ఏకారణము వల్లనయినా మెరకపయిర్లతోసాగు చేయునెడల పల్లపు పయిర్ల శిస్తునుతగ్గించుకుని మెరక పయిర్లకు ఏర్పడిన మామూలు శిస్తుసెస్సులతో సహా మామూలు కిస్తీ బందీ ప్రకారం చెల్లించవలసినది.

3. సదరుయేభూములకు గాని గవర్నమెంటువారికి పద్ధతుల ప్రకారం చెల్లించ వలసి వచ్చే నీటితీరువ వగైరాలకు నీవే జవాబు దారుడవుగాని పయి శిస్తులో చేరివుండలేదు.

4. సదరహీ భూములు మామూలు 44 మూర అర పగ్గమున మేము సర్వే చేయించిన మీాదట జాస్తీ తేలిన యెడల ఆజాస్తీ భూములకు మామూలు రేట్లు ప్రకారం అయ్యే శిస్తున్నూ పద్ధతుల ప్రకారం ఏర్పడే సెస్సులున్నూ పయి కిస్తీలతో చేర్చుకుని చెల్లించ వలసినది. కమ్మీ తేలిన పక్షమునకు అందుకు సదరు ప్రకారం అయ్యే శిస్తు ముదరా యిప్పించడమవును. అయితే మసాయతు అయ్యే పరియంతం

పయిన వుదహరించిన శిస్తు నిరభ్యంతరముగా చెల్లిస్తూ వుండవలసినది.

5. నీక్రింద వుండే శేరీ భూములలో వ్యవసాయముకు విరుద్ధంగా వుండే యే పనులున్నా చాయకూడదు.

6. సదరు గ్రామ భూముల సాగుబడికిగాను మేము యిదివరకు త్రవ్వి వున్నటు వంటిన్ని ముందు త్రవ్వించ బొయ్యేటటువంటిన్ని పంటనీరుపారుదల అయ్యే కాలువలతో సంబంధించిన ఏయిలాకాయున్నా నీకు ప్రత్యేకంగా లేదు.

7. మజ్కూరులో వుండేపోరంబోకలు గయాళు బంజరు వగైరా రయితాధీనంలేని భూముల తోను వాటిలో నుండే విశిష్ట వృక్షములతోను నీకు యంతమాత్రముజోక్యం లేదు.

8. సదరహీ భూములలో వుండే తుమ్మలు మినహా యొస్టేటు రివాజు ప్రకారం తాడిచెట్లు చింతలువగైరా తావిశిష్ట వృక్షములున్నా ఏవిధము గాను నీవు వ్రాస్య పర్చడము 9 వ షరతుకు భిన్నముగా అనుభములోకి తెచ్చుకోవడము మొద లైనవి చాయ కూడదు.

9. సదరహీ భూములలోవుండే తాడి చెట్లకు పెంట్లకు నూటికి రు 8_0_0 చొప్పున నున్నా గీశేపోతులకు నూటికి రు 6_0_0 లు చొప్పున నున్నా గీతయీాదులకు నూటికి రు 2_0_0 చొప్పున నున్నా సాలు 1 కి యేర్పడేశిస్తున్నా పద్ధతుల ప్రకారం అయ్యే సెస్సులున్నా మెట్టకిస్తీలతో చేర్చుకని చెల్లిస్తూ అందుల ఫలమును నీ తసరఫు చేసుకోవల సినది.

10. ఇదే షరతులతో నీవు దాఖలు చేసేముచ్చికాలో నున్నూ వున్న యీ పట్టాలో నున్నూ షరతుల ప్రకారం జరిగించుకుంటూ వుండవలసినది.

ఈ పట్టా 1909 సంవత్సరానిది. ఇంతకంటే ముందు పట్టాలభించనందున పట్టా షరతులు తెలియటానికి ఉదాహరించటమైనది.

ఇక ఈ రాజావారికాలంలో జరిగిన వ్యవహారాలు తెలుసుకుందాము.

## కరణం శలగ

పర్మనెంటు సెటిల్‌మెంటుకు పూర్వం యెస్టేట్‌లో వుండే అంఛనాదార్లు మహాస్సూల్‌దార్లు తనిఖీదార్లు వగైరా సిబ్బందిని తీసివేసి, కోర్టుకుగాని, సర్కారుకుగాని సరైన లెక్కలును సంజాయిషీని అందజేయుటకు, తద్వారా ప్రజల ఆస్తులను భద్రపరచుటకు కరణముల సిబ్బందిని మంచిస్థితిలో స్థిరపరచుటకు 1803 లోనే కరణముల రెగ్యులేషన్ ప్రవేశ పెట్టిరి. దీని ప్రకారం వీరిని నియమించు అధికారం జమీందారునిది కాని తీసివేసే అధికారంకంపెనీవారిది. ఈ విధంగా కంపెనీవారు గ్రామ వ్యవస్థతోను రైతులతోను, సరాసరి సంబంధాన్ని పెట్టుకొని జమీందారీ యాజమాన్యాన్ని తగ్గించటానికి సంకల్పించారు.

గ్రామం తాలూకు యావత్తు విషయాలు పూర్తిగా ప్రభుత్వానికి తెలియచేయటం, ప్రతి అయిదేళ్ళ కొకసారి కరణాలు లెక్కలను తయారుచేసి పంపేవారు. వీటిని డవుళ్ళు

అనేవారు. గ్రామమెుత్తంగుడి కట్టు మెరక పల్లం సాగు భూములు, బంజరులు, పోరంబోకలు గ్రామకంఠం, సేద్యం చేసేభూములలో, పైరులు, పశువులు, కోళ్లు, అరకలు, మనుష్యులు, పెత్తందారు లెవ్వరో, యీ యావత్తు సమాచారము వ్రాసేవారు. ఇప్పుడా దవుళ్ళుస్థానే సెటిల్ మెంటు రిజస్టరులుంటున్నవి.

ఆ రోజులలో జమీందారీగ్రామాల్లో కరణాలను గవర్నమెంటు జీతం యిచ్చేదికాదు.

రైతులేకత్తికి రు1_0_0 చొప్పున యిచ్చే మామూలు. కరణము రైతుకు జమీందారుకూ మధ్యమనిషి. అయినా ఆశిస్తు అక్రమంగా రైతుల దగ్గరే వసూలు చేసేవారు.

ఈ కరణం, శలగ రైతులు కరణానికి యివ్వాలిగాని, జమీందారు వసూలు చెయ్యటం అక్రమం అని దావా తెచ్చారు.

హైకోర్టువారు జమీందారు సహజంగా బలవంతుడు. ఈరుసుం జమీందారు వసూలు చేస్తే కరణం జమీందారుచెప్పినట్లు చేసేస్థితిలో వుంటాడు. రైతుస్థితి మరింత అధ్వాన్నమగుతుంది. కనుక జమీందారువసూలు చేయరాదని తీర్పు యిచ్చారు. [1]

## పగ్గం కేసు

వేమూరి బ్రహ్మయ్య అనే ఆసామికి గుండేరునకు ఆనుకొని కొంతభూమి కలదు. ఆ గుండేరు జమీందారుది.

---

1 1909 నుంచి గవర్నమెంటువారే జమీందారీ గ్రామాల్లోకూడా కరణాలకు జీతాలివ్వసాగారు.

ఆ ఆసామి తనచేలో తుమ్మలు కొట్టగా తన భూమిలోని తుమ్మలు కొట్టెనని జమీందారు 1899 లో క్రిమినల్ కేసు పెట్టగా, బ్రహ్మయ్య తాను కొట్టినమాట నిజమే కాని, నా భూమిలో కొట్టితినిగాని జమీందారు పోరంబోకలో కొట్టలేదని ఆన్సరు పెట్టగా ఇది సివిల్ వ్యవహారమని కేసు కొట్టివేసిరి.

జమీందారుగారు వూరుకుంటారా! సివిల్ కోర్టుకు లాగాడు రైతుని. రైతు పోక తప్పదుగా! జమీందారుగారి వాద మేమన, పగ్గమనగా 44 గజములని కత్తికి 14 యకరములని చల్లపల్లిలో కత్తికి 14 యకరములె. రైతువాదన-పగ్గం అనగా 144 అడుగులు, అంటే 48 గజములని కత్తికి 17 ఎకరములని దీనికి అనుకూలముగా రోడ్డుఫండు లెక్కలలో కరణములు కత్తిఅంటే 17 యకరములని వ్రాసిరి. అది రైతు దాఖలుచేసెను. ఇదికూడా హైకోర్టుముఖం చూచినది. హైకోర్టులో రైతుపక్షమే అయినది. జమీందారుగారి వల్లరు 350-0-0 లు కూడ ఖర్చులు యిప్పించిరి. ఈ కేసునకు యెస్టేటులోని రైతులుకూడ కొందరు ధనసహాయము చేసిరి.♦

♦ ఈ సంగతి గ్రహించి మల్లికార్జునప్రసాద్ బహద్దరుగారు (ఇప్పటివారి తాతగారు) ఘంటసాలవారికి మిగతా వారికిగల తేడా నాకు తెలుసునయ్యా! ఇతర గ్రామస్థులు ఏదైనా తగాదావస్తే వారంతవారే తంటాలు పడతారు. మీవూరుమాత్రం అట్లాకాదు. మీ వ్యవహారం పరగణా తగాదా చేస్తారయ్యా! ఆ సంగతి నాకు తెలుసు. అందుకనే,ఘంటసాలతో యెట్టి తగాదా పెట్టుకోవద్దని అనుకున్నాను. అని రామస్వామి వలె సన్నిధినుండి వ్యవహరించిన గొట్టిపాటి వెంకయ్యతో అన్నమాట అక్షరాల యదార్థమే.

## గోతులు పెట్టిరని దావా

ఇళ్ళు వగయిరాలు కట్టుకొనుటకు, గోతులు పెట్టి రాయి తీయగా, తన భూమి వ్యవసాయమునకు నాలాయఖుగా చేసెనని జమీందారు దావా తెచ్చెను. ఇందులో జమీందారుగారి వాదమేమన, రైతుకు వ్యవసాయము చేసుకొనుహక్కుమినహా భూమియందెట్టి హక్కులేదని.

రైతువాదన ఏమన, జమీందారునకు ఒక్క శిస్తు వసూలు చేసుకొనే హక్కు మినహా భూమియందెట్టి హక్కు లేదని, అన్ని హక్కులు రైతువే అని. ఇదికూడ హైకోర్టు వరకు వెళ్ళింది. ఇది రైతుల పక్షమైనచో తనకు నష్టముకలుగునని జమీందారు రాజీపడి కేసు ఎత్తివేసుకొనెను.

పశువుల చావిళ్ళుమినహా ఇళ్ళుకూడా శేరీభూములలో కట్టుకోనిచ్చేడివాడుకాడు జమీందారు. స్థిరమైన ఆక్రమణలు చేయకూడదని పట్టాలో షరతున్నది. జనసంఖ్య పెరుగుతుంటె రైతులు ఎక్కడ ఇళ్ళు కట్టుకొనవలెనో! ఇళ్ళుకట్టిన తనభూమికి విలువే పెరుగునుగా! ఎవరైనా సాహసించి ఇళ్ళు వేసుకొంటే పీకి పారవేయించెడివాడు జమీందారు. 1908 ల్యాండు ఆక్టు వచ్చేవరకు రైతులకు యిట్టి బాధలే అధికము. ఆక్టు వచ్చిన తర్వాత కొన్ని బాధలు తగ్గెను.

## రామన్న పేటవారికి సహాయము

రామన్నపేట అగ్రహారము. ఆ బ్రాహ్మణుల భూములు రాజాగారు స్వాధీనము చేసుకొనుచుండగా కొందరువచ్చి, ఘంటసాల యస్టేటుకుతల్లి గ్రామము. మీరు మమ్ములను కాపాడ వలెనని బాలకృష్ణమ్మతో చెప్పుకొనిరి. అప్పుడాయన యీ గ్రామము దగ్గరనేవున్న పాలెం, దేవరకోట పెద్దలనుకూడ కబురంపి వారి అంగీకారముకూడ పొంది, వారివద్ద ఆభూములు కౌలుకు తీసుకొన్నట్లు లిఖితమేర్పాటుచేసుకొని ఘంటసాల, పాలెం, దేవరకోట గ్రామాదులనుండి కొంతమంది జనము కుమ్మక్కుతో నూరు నాగళ్ళు తోలుకొనిపోయి ఆ భూమి దున్ని వచ్చిరి. రాజాగారు నాగళ్ళు పోయే ప్రదేశము (డొంకలు) పూడ్పించెను. ఆ డొంకలు అడ్డము వేసుకొనిపోయి దున్ని వూడ్పువేయించిన పిమ్మట జమీందారుగారు వీరిపై ఏమీ జోక్యము తీసుకొనలేదు. 'డొంకలు వూడిపి స్తేవారాగు తారయ్యా' అనె నట మల్లికార్జున ప్రసాదు నాయడుగారు. ఈ విధముగ ఆ కాలములో తమవ్యవహారములు దిద్దుకొనుటే గాక, ఇతరులకుకూడ సహాయము చేసెడివారు ఘంటసాలవారు. ఘంటసాల అంటె పాలెం, దేవరకోటలు దీనిలో ఇమిడివున్న వనే అనుకోవాలి. వీరిని ఆశ్రయించినవారి యినాములు నిలిచినవి. మిగతా వారివి జమీందారు స్వాధీనం చేసుకొన్నారు.

## మాధవరాయడు

బాలకృష్ణమ్మ తమ్ములలో ఈయన ఒకడు. ఈయన అధిక ప్రతిభావంతుడు. భారతాదులు బాగా చదివినవాడు, పట్టుదల గలవాడు, మంచి వ్యవహర్త. ఈ యెస్టేటులో తుమ్మలు మినహా మిగతా చెట్లన్నీ జమీందారునవే. ఎవరైనా ఒక చెట్టు కొట్టితే క్రిమినల్ కేసు పెట్టేవాడు. ఇటువంటి స్థితిలో మాధవరాయడు మన మల్లికార్జున ప్రసాద్ నాయడు బహద్దరు ధొరవారికి కొరకరానికొయ్య అయ్యాడు. ఆయన తన భూమిలోని తాటిచెట్లు వ్యవసాయానికి యిబ్బందిగా వున్నవని నోటీసు యిచ్చి కొట్టించెను. ఆయనపై ఏవిధమైన చర్య తీసుకోవాలో తోచక, ఏమిచేస్తే, ఎదురు వ్యవహరించి యెస్టేటు తగాదా చేస్తారో ననే భయంతో జమీందారుగారు మిన్నకుండిరి. అటువంటిది బాలకృష్ణమ్మ తమ్ముని ప్రతిభ.

## రామస్వామి

ఈయన బాలకృష్ణమ్మ తమ్ముడు. ఆయనకు ప్రత్యర్థి. అన్న తర్వాత పలుకుబడి గలవాడు.

ఘంటసాలలో ప్రముఖులైన, వేమూరి పెద్దయ్య, వెంకన్న, వడ్లమూడి రామస్వామి, దోనేపూడి చినరామన్న, బాలకృష్ణమ్మపక్షము. గొర్రెపాటి రంగన్న, పెద శ్రీరాములు ఆయన ప్రాణమిత్రులు.

వేమూరి రామన్న, పట్టయ్య, రామస్వామిపార్టీ. గొర్రెపాటి వీరన్న, సుబ్బన్నలు ఆయన ఇష్టసఖులు.

ఇట్లా గ్రామములోనే గాక పరగణా అంతా వీరి ఉభయులకు పార్టీలు వుండేవి, గుడివాడ తాలూకాలో కొంత కాలము యిటీవల అడ్డూరివారిల్లి, లింగంవారి పార్టీలున్నట్లే.

వారు ప్రత్యర్థులుగా ఉన్నను ఒకరియెడల ఒకరు అగౌరవముగ ప్రవర్తించుకొనక ఉభయుల మానమర్యాదలు చెడకుండ, ప్లీడర్లువలె ప్రవర్తించెడివారు.

రామస్వామి మేలిమిబంగారు ఛాయ గలిగి మంచి అందముగా వుండెడివాడు; బాలకృష్ణమ్మవలెనే. ఆయన బంగారపు మొలత్రాడు, చామపువ్వు కడియము ఆయన శరీరకాంతితో కలిసిపోయెడివి. ఆ రూపమునకు తగిన దుస్తులు వేసుకొనెడువాడు. ఆయన గొప్ప రసికుడు. అధికారులలో పలుకుబడి కలవాడు. ఆ కాలములో బందరులో అధిక పలుకు బడి గల పిళ్ళారిశెట్టివారితోను, కోకావారితోను స్నేహమధి కము. గొర్రెపాటివారికి, వారికిగల స్నేహము యీ నాటికీ నిలచియున్నది.

రామస్వామి జమీందారుగారికి అనుకూలుడు. ఆయ నది చిన్నపార్టీ. చిన్నపార్టీ వారందరు అధికముగ జమీం దారునకు అనుకూలముగ నుండుట సహజము. ఆయన తెలివి తేటలకు, ఒక సంగతి వివరిస్తా.

మల్లికార్జున ప్రసాదనాయడుగారికి ఒక నోటు వ్రాసెను. అది ఆయనకు తెలియకుండగనే ప్లైంటుకివెళ్ళి డిక్రీ అమలుకు సిద్ధంగావున్న సమయమున తెలిసినది. రామస్వామి ఎంత సంపాదించినను చేతిలో పైసా నిలచెడిదికాదు. అట్టివాడు ఋణమొత్తుల తీర్చగలడు? కనుక ఒకటి ఆలోచించెను.

జమీాందారుగారు ఒంటిరిగావున్న సమయమున, తన గోవా మొలత్రాడుతీసి మీా బాకీకి యిది తీసుకొని బాకీ రద్దు చేయించవలసినదని చేతికిచ్చెను.

ఆ జమీాందారు అది చేతపుచ్చుకొని అటు యిటు త్రిప్పిచూచి ఆయనతోగల పరిచయముచే ఆ త్రాడును తీసుకొనుటకు సంకోచించి తిరిగి యిచ్చివేసి బాకీ రద్దుచేసెను. ఆయన జమీాందారుల సన్నిధినివున్నా అధిక గౌరవమర్యాదలు పొందుచు సంచరించెడివాడు. ఆయన ఆత్మగౌరవమునకు, పలుకుబడికి ఆనాటి జమీాందారి కుటుంబపువారి మన స్తత్వమునకు ఒక ఘటన తెలిపెదను.

ఆయన అధికకాలము చల్లపల్లిలోను, బందరులోను వుంటూవుండెడివాడు. బందరులో ప్రముఖులు, ప్లీడర్లు, ఉద్యోగులు ఆయనకు పరిచయులే. బందరు పురమందిరములో ఒకనాడొక సభ జరుగుచుండెను. ఆ మందిరమంతయు కిటకిట లాడుచుండెను. రామస్వామి వచ్చేసరికి వెంకట్రామలింగన్న బహద్దరుగారు (బాబయ్యగారు) కూర్చున్న కుర్చీ దగ్గరవున్న కుర్చీ ఖాళీగా వుండుటచే దానిమీాద రామస్వామి కూర్చుండెను. తన సరసను యెస్టేటు రైతు కూర్చుండుట తన కవమానకరముగ భావించి కొంతసేపటికి ఆయన మరొక కుర్చీలో కూర్చుండెను.

ఆత్మ గౌరవాభిమానముగల రామస్వామి ఇది తనకు అవమానముగ యెంచి దానికి ప్రతిక్రియ చేయదలచి మిత్రులతో ఆలోచించెను. ఆయన ఆ కాలములో అధికముగ జిల్లా

సిరస్తాదారింటికి వచ్చెడివాడు. ఆ సిరస్తాదారు కోకా నారాయణ స్వామి, రామస్వామికి ప్రియమిత్రుడు. బాబయ్యగారిని ఒకరోజున 9 గంటలకు రమ్మనిచెప్పి ఆ సమయమునకే రామస్వామిని కూడ రమ్మనమనెను. ఏర్పాటుప్రకారము ఆ జమీందారుగారి తమ్ముడు వచ్చి కుర్చీలో కూర్చుండెను. ఆ సమయమునకు మరి నలుగురు ప్రముఖులుకూడ కుర్చీలలో కూర్చునియుండిరి. రామస్వామిరాగానే సిరస్తాదారు లేచి కుర్చీ తెచ్చుటకు మనిషినిపంపి కుర్చీ వచ్చేవరకు నిలుచుండగా ఆయనతో పనివుండి వచ్చిన ప్రముఖులు, వెంకట్రామ లింగన్న బహద్దరు, రామస్వామి కుర్చీమీద కూర్చునేవరకు నిలువుకాళ్ళమీదనే నిలబడిరి. రామస్వామి రాజసపు పనులు పెక్కులు కలవు ఇట్టివి.

## గోటకం కేసు

శ్రీ రాజా యార్లగడ్డ మల్లికార్జునప్రసాద్ నాయడు జమీందారుగారు మంచి వ్యవహారదక్షుడు, పరమ లౌకిక మూర్తి అని పాఠకులకు విదితమే. ఈయన ప్రతి గ్రామము లోను యేర్పడిన గోభూములను తానే భుక్తపరచుకొని స్వంత కమతాలుగా సేద్యము చేయించెను. ఇందులకు ఈయన అవలంబించిన పద్ధతి దాదాపు ఈ గ్రామము లన్నింటిలో రైతులు కమ్మవారు, ఈర్ష్యాద్వేషాలతోనో, పెద్దరికముకొరకో ప్రతిగ్రామంలోను పార్టీలుండేవి. అందొక పార్టీని చేరదీసి, సివిల్ క్రిమినల్ వ్యాజ్యాలలో వారికి ఆర్థికముగను, ఉద్యోగస్తులకు శిఫార్సులుచేసియు, తమ స్వంత

కమతాలమీాద నౌకర్లను ఆ గ్రామాల తగాదాలలో తనకను కూలమైన పార్టీకి మద్దతునిచ్చియు వారిని తన కనుసన్నల మెలగునట్లు చేసుకొనేవారు. ఈ పార్టీవారిచేత గ్రామ ఉమ్మడి భూములను తమ స్వంత కమతములుగా కవుళ్ళు వ్రాయించుకొని భుక్తపరచుకొనేవారు. యెదురుతిరిగిన గ్రామస్తులమీాద సివిల్ క్రిమినల్ కేసులు పెట్టించి హైకోర్టు వరకు ఈడ్చేవారు. ఆబోతుతో దుక్కిటెద్దు పోట్లాడలేనట్లే రైతులున్నా యీ జమీాందారుతో పోట్లాడలేక వ్యాజ్యాలు ఆడలేక ప్రాచీనకాలమునుంచి గోభూములుగా ధర్మభూములుగా వున్నవాటిని జమీాందారునకు ధారాదత్తము చేయక తప్పలేదు.

ఈ జమీాందారీ వ్యతిరేక పోరాటాలలో ప్రముఖ పాత్రవహించి వ్యవహరించిన ప్రజానాయకుడు గొర్రెపాటి బాలకృష్ణమ్మ. జమీాందారువైపు పూర్తి మద్దతునిచ్చి వ్యవహరించిన గడుసరి, మాటకారి, రసికుడు, యీ బాలకృష్ణమ్మ రెండవ తమ్ముడు రామస్వామి. ఘంటసాలలో ధర్మ గోటకమని పిలువబడుచున్న గోభూమి షుమారు 270 యకరముల భూమిగలదు. ఘంటసాల, ఘంటసాలపాలెం పశువులమందలు దానిలో పగలు పచ్చికమేయుచుండెను. ఇది అనాదినుండియు జరుగుచున్నది. దీనిపై శ్రీ మల్లికార్జున ప్రసాద్ నాయుడు గారి కన్నుపడినది. దీనికి తగిన వ్యూహారచనయు జరిగినది. రామస్వామి తన పార్టీవారిచే కత్తులు వ్రాయించుట జరిగినది. జమీాందారు పూర్తిమద్దతుగల రామస్వామిని తట్టుకొనుట తనకు కష్టమైన పనియని యీ పోరాటంలో అపజయం

పొందుట తథ్యమని, బలవంతునితో ఆ జన్మాంతము విరోధము పెంచుకొనుట బహు చిక్కులతో కూడిన సమస్యని బాలకృష్ణమ్మ భావించాడు. అనేక సందర్భములలో జమీందారులని లక్ష్యము చేయక వ్యవహరించి శెభాసనిపించుకొనిన ప్రజానాయకుడగు బాలకృష్ణమ్మ వృద్ధాప్యమున జవసత్వములుడిగిన కారణాన అట్టి నిర్ణయమునకు తప్పని సరిగ వచ్చినట్లు చెప్పుదురు.

దీనికితోడు చిరకాలము తాను చేసిన ప్రజాసేవను ప్రజలు గుర్తించక పైపెచ్చుకొందరు కృతఘ్నులుగా మారిన కారణాన ప్రజలకు చేసిన మేలు పీనుగకు చేసిన జాగరణ ఒకటే అని స్థితికివచ్చాడు.

అందుచేత వారికి అవసరము లేనిది మనకేల? మనము మాత్రము జమీందారునకేల విరోధము కావలెనని అనుకొన్నాడు.

ఇదే అదునని ఉభయ పార్టీలవారి చేత 1898_9_28 తారీఖున పదిమందిచేత య 1కి రు. 2. 8. 0 చొప్పున కవులుకు తీసుకున్నట్లు వేరే వేరే ముచ్చిలకాలు జమీందారుగారు వ్రాయించుకొని రిజస్టరు చేయించుకున్నారు.

ఈ గ్రామములో హెచ్చు పలుకుబడిగల కమ్మవారందరు ఒక త్రాటిమీద ఐకమత్యముతో నడుచునెడల వారి నెదిరింపగల శక్తి మిగతా అన్ని వర్ణములవారు కలసినను లేదు. పేరు ప్రతిష్ట, శక్తిసామర్థ్యములు వ్యవహార దక్షత కలిగిన నాయకులు బాలక్రష్ణమ్మ, రామస్వామి సోదరులు నాయకత్వమున జమీందారు ధర్మగోటకమును కబళించు

చుండ యెదిరించుటకు శక్తిలేక పోయినను, యీ అధర్మ కార్యమునకు అష్టాదశ వర్ణాలవారు లోలోపల కమిలిపోతూ యీ అధర్మము నెదుర్కొనుటకు మార్గములను వ్యక్తులను అన్వేషించుచుండిరని చెప్పక తప్పదు. ఈ ధర్మగోటక వ్యవహారమునకు పూర్వమే బాలకృష్ణమ్మ, రామస్వామిగార్ల ప్రతిభ మధ్యందిన మార్తాండుని పగిది వెలుగుచుండిన కారణాన వారిని తేరిపార చూచుట గ్రామమంతా వెరగొందుచుండెననుట అతిశయోక్తిగాదు. ముగ్గురు యువకులు ఇరువది అయిదు సంవత్సరములవయస్సుగలవారు అదును దొరికినపుడు వీరి నెదిరించుటకు లోలోన ఆలోచనలు చేయుచుండిరి. వారే 1. గొట్టిపాటి వీరరాఘవయ్య 2. దోనేపూడి వెంకట్రాయులు. 3. బాలకృష్ణమ్మకు అండదండలుగా వుండే గొర్రెపాటి రంగన్న మనుమడు రామస్వామి.

బాలకృష్ణమ్మ, రామస్వామి ఐకమత్యంగా వుండే రోజుల్లోనే బాలకృష్ణమ్మ మొదటి తమ్ముడు శ్రీరాములు గుడివాడ తాలూకా ప్రముఖులు అడుసుమిల్లి సుబ్రహ్మణ్యంతో కమీషన్ కొట్టు వ్యాపారం సాగించుటయు అందులో వారికి అభిప్రాయభేదములు వచ్చుటయు క్రిమినల్ కేసులకు కోర్టులకెక్కుటయు జరిగినది. శ్రీరాములకు ఎదురుగా ఘంటసాలలో అడుసుమిల్లి వారికి అనుకూలముగా సాక్ష్యము చెప్పువారు అవసరమయ్యారు. అప్పుడు పైముప్వురు బహిరంగముగా అవసరమైన సహాయము చేయుట కంగీకరించి దోనేపూడి బాపన్న, దోనేపూడి వెంకయ్యలను సాక్ష్యము పంపుటయు తటస్థించినది.

తర్వాత ధర్మగోటకపు వ్యవహారంలో బాలకృష్ణమ్మ, రామస్వామి జమీందారు కనుకూలమైనపుడు గ్రామములో అన్ని కులములవారి దృష్టి వీరరాఘవయ్య, వెంకట్రాయుడుల (అప్పటికి వీరి మిత్రుడు రామస్వామి స్వర్గస్థులైరి) పై బడినది. ఆయా కులములలోని ముఖ్యులు వీరిని కలుసుకొనుట జమీందారునకు వ్యతిరేకముగా వ్యవహరించుటకు కృతనిశ్చయులగుట జరిగినది.

ఘంటసాలలో యిల్లిల్లు అన్ని వర్ణాలవారివి తిరిగి ఇంటింటికి రెండు అణాలకు తక్కువ కాకుండా వసూలు చేయుటకు నిశ్చయించుకున్నారు. ఘంటసాలపాలెం సంపన్నులతో కూడిన గ్రామం పరగణా పెత్తందారు వేమూరి వెంకట్రాముడుగారి స్వగ్రామం, ఘంటసాలకు శివారు. ఈ ధర్మగోటకం ఘంటసాల – ఘంటసాల పాలెం మధ్య గలదు. రెండు గ్రామాల పశువులకు ఉపయోగపడును. కనుక వారితో సంప్రదించుటకు వెళ్ళగా ఉద్దండులగు బాలకృష్ణమ్మ రామస్వామిగార్లు అండ జమీందారున కుండగా ముక్కుపచ్చలారని పిల్లవాళ్ళు మీరేమి చేయగలరని ప్రశ్నల వర్షముచే నఖశిఖపర్యంతం వీరి మనోనిబ్బరమును కృతనిశ్చయమును పరిశీలించి ఆగ్రామ ముఖ్యులు వేమూరి వెంకయ్య తుమ్మల చన్నారాయుడు (కొత్తపల్లి మునసబ్) మూల్పూరి రామస్వామిలతో సంప్రదించి "మేము అయ్యే ఖర్చులో మూడవవంతు భరిస్తాము. మా గ్రామ వ్యవసాయ భూమి ఘంటసాల వ్యవసాయ భూమిలో సగంవంతు గనుక. ఈ వ్యవహారంలో మీాకు జయము జరగాలని మనోవాక్కాయ

కర్మల ఆశీర్వదిస్తాము. నిరంతరం దేవుని ప్రార్థిస్తూవుంటాము కాని బలవంతుడగు జమీందారుతో ప్రత్యక్షముగ విరోధము కొని తెచ్చుకోము. మేము దెబ్బలాడుటకు రాము, దస్త్రంకట్టి వ్యవహరించవలసినారు మీరే" అని చెప్పారు. ఆ షరతుల కన్నిటికి వీరు అంగీకరించి ఘంటసాలవచ్చి బ్రాహ్మణులు వైశ్యులు, విశ్వ బ్రాహ్మణులు, పద్మశాలీలు, గాజుల బత్తులు, ముదిరాచులు, యాదవులు, భజంత్రీలు, రజకులు వీరి నాయకులందరిని ఒకచోట చేర్చి ముచ్చటించి వారి అండదండలు తమకు నిరంతరం వుండగలవనే కృతనిశ్చయము, ప్రోత్సాహము గల్గించుకున్నారు.

బ్రాహ్మణులకు నాయకుడు పిశుపాటి పెదసుబ్బయ్య, వైశ్యులకు గెల్లి సుబ్రహ్మణ్యాం, విశ్వ బ్రాహ్మణులకు వాన పాముల సుబ్బారాయుడు, పద్మశాలీలకు పోలన కోటప్ప, భజంత్రీయులకు చినముత్తేవి బసవయ్య, రజకులకు పోతార్లంక పిచ్చయ్య, వెంట్రప్రగడ లక్ష్మయ్య; చందాలు ప్రారంభించినారు. గోటకమునకు సంబంధించిన పాతరికార్డులన్నీ అందుబాటులో కరణాలుంచారు. దీని కంతకూ నాయకత్వం వీరరాఘయ్య, దోనేపూడి వెంకట్రాయులది. భూములకు ముచ్చిలికాలు వ్రాసిన రైతులు వేమూరికోటయ్య వగైరాలు నాగళ్ళతో గోటకమును దున్నుటకు రావటము (1) వేమూరి వెంకన్న (పెద్దకాపు) (2) మొనిగళ్ళ శ్రీరాములు (3) వేమూరి రామస్వామి (4) గొర్రెపాటి లక్ష్మన్న కుమార్డు గోపాలుడు (5) గెల్లి సుబ్రహ్మణ్యాం (6) దోనేపూడి బాపన్న (7) దోనేపూడి వెంకట్రాయులు (8) గొట్టిపాటి వీరరాఘవయ్యల

నాయకత్వమున చాలామంది మమ్ములను చంపి ఈ భూమిని దున్నండని సాత్వికముగా వారలను నిరోధించడం, వారున్నూ చేయునది అధర్మమని తెలిసిన వారగుటచే యెట్టి దౌర్జన్యమును చేయక ధర్మగోటకము దున్నకుండానే నాగళ్ళను తోలుకొనివెళ్ళి జమీందారునకు యీ విషయము తెలియ జేయుట; పై యెనమండుగురిపైన క్రిమినల్ కేసును బందరు సబ్ మేజిస్ట్రేటు కోర్టులో దాఖలు చేయుట జరిగినది. రయితులకు ప్లీడర్లు (1) శ్రీ వల్లూరి సూర్యనారాయణరావు పంతులుగారు B,A.B.L.LT. (Senior) (2) కలపటపు నరసింహంగారు B.A. (Junior) వీరిద్దరు ధర్మముకొరకు త్యాగబుద్ధితో తమ సర్వశక్తులను వినియోగించి న్యాయమునకై పోరాడిన ధీరులు. గ్రామములో శ్రీ జలధీశ్వరాలయం ముందు అన్నికులాల ప్రజలుచేరి ఒక ధర్మగోటక కమిటీని యేర్పరచుకొనిరి. దానికి అధ్యక్షుడు గొర్రెపాటి బ్రహ్మన్న కుమార్డు వెంకయ్య, ఉపాధ్యక్షుడు మరియు కోశాధిపతి కొండపల్లి చిట్టెన్న కుమార్డు సుబ్బయ్య, కార్యదర్శులు గొట్టిపాటి వీరరాఘురయ్య, దోనేపూడి వెంకట్రాయులు. అన్ని కులాలు ప్రముఖులు యెన్నుకొనబడిరి. తరచు ప్రజాసమూహాము గొర్రెపాటి బ్రహ్మన్న కుమార్డు వెంకయ్య అధ్యక్షతను సమావేశమై యెప్పటికప్పుడు యీ కేసుకు సంబంధించిన వివరాలు తెలుసుకొనుట, ముందు కర్తవ్యమునుగూర్చి నిర్ణయించుకొనుట జరుగుచుండెడిది. ఈ అధ్యక్షుడు వెంకయ్య అధ్యక్ష పీఠము నధిష్ఠించునపుడు అందులకై ప్రత్యేకముగా ఏర్పరచుకొనిన దుస్తులు సూటుకోటుతోవుండేవారు.

ఇదంతా చూచి తాము తప్పుదారిని పడుట గుర్తించిన గ్రామవృద్ధ విజ్ఞానవేత్త, పూజ్యులు బాలకృష్ణమ్మ తమకు గల పార్టీతో అనగా కమ్మవారిలో హెచ్చుమందితో ప్రజల పక్షమున జేరెను. ఈ సందర్భమున ఆయన తన వారలతో "ప్రజావశీకరణరా నాయనా, ప్రజాశక్తి నెవరు అడ్డగించగలరు" అని అనినారట. వీరి చేరికతో అనంత శక్తియేర్పడెను.

న్యాయము ప్రజల పక్షమున వున్నను, న్యాయము వ్యక్తీకరించగల సమర్థులైన న్యాయవాదు లున్నను, బందరు స్టేషనరీ సబు మేజస్ట్రేటు జమీందారు పక్షమున తీర్పు చెప్పుచు ముద్దాయి లెనమండుగురు అక్రమ ప్రవేశము చేసిరని ముద్దాయి లందరకు ఒక్కొక్కరకు రు 35 ల చొప్పున జరిమానా విధించెను.

దీని పైన హెడ్‌క్వార్టర్సు డిప్యూటి మేజస్ట్రేటు కోర్టులో 1900 జులై 23 న అపీలు చేశారు. ఆయన సమగ్రంగా విచారించి జరిమానాను రద్దుపరచి, జమీందారు ప్రజల స్వాధీనములోగల ధర్మగోటకమును ఆక్రమించుకొనవలెననే దురుద్దేశముతో, యీ క్రిమినల్ కేసుపెట్టి, సివిల్ కోర్టుద్వారా పొందవలసిన లాభమును, క్రిమినల్ కోర్టు ద్వారా పొందనెంచెననియు, ఈ గోటకము ప్రజలదే గనుక ఇండియన్ పీనల్ కోడు 147, 447 సెక్షనులు అన్వయించవనియు,అపీలుదారులు తమ గ్రామ వుమ్మడి సొత్తును సంరక్షించుకొనుటకు చేసిన ప్రయత్నం సక్రమైనదని తీర్పు చెప్పెను.

ఈ న్యాయమూర్తిపేరు కె. శ్రీనివాసన్. ధనాశకు గాని ధనికుల ప్రాబల్యానికిగాని లోబడక ధర్మసంస్థాపనార్థము న్యాయపీఠ, మేర్పడెనని నిర్ధారణ చేసిన మహనీయుడు వంద నీయుడు గద.

రాత్రిళ్ళు గ్రామంలో చందాలువసూలు చేసుకొనుట, తెల్లవారు సరికి బందరు వెళ్ళి ముద్దాయిలకు సాక్షులకు కూనపరెడ్డి వారింట్లో స్వంతంగా వంటచేసుకొనుట, ప్లీడర్లకు వ్యవహార సందర్భములో సంజాయిషీ సాధన సామగ్రి అంద చేయుట వీరరాఘవయ్య వెంకట్రాయులగార్ల పని. వీరుసదా స్మరణీయులు. గోటకం సుబ్బయ్యనే సార్థక నామధేయుడైన పిసుపాటి పెదసుబ్బయ్య, పోలన కోటప్ప, వానపాముల సుబ్బారాయడు, గెల్లి సుబ్రహ్మణ్యం, మొదలగువారి సేవ స్తవనీయము.

ఈ కేసుల్లో జమీందారుగారికి ఇరవై వేలు, ప్రజలకు మూడు వేలు ఖర్చులయినవి. మూడు వేలానాడు ప్రజలు ఖర్చు పెట్టగలరా? చందాలకై ఇతర గ్రామాలకు వేమూరి అప్పన్న గారి వెంకన్న, యీ పెదచలమన్న, పిసుపాటి పెదసుబ్బయ్య, గొట్టిపాటి వీరరాఘవయ్య, దోనేపూడి వెంకట్రాయులు, గొర్రెపాటి బ్రహ్మన్న కుమారుడు వెంకయ్య, యీ బాల కృష్ణమ్మ వగైరాలు, ముతరాచులు, యాదవులు ఇంకా ఇతర కులములు వారు కలిసి రెండు ముఠాలుగా తిరిగి వసూలు చేశారు. బాలకృష్ణమ్మ వెంట పోతార్లంక సుబ్బయ్య వుండే వాడు.

ఘంటసాల పరిసర గ్రామాలేగాక గుంటూరు జిల్లాలోని పెదపూడి. కూచిపూడి మొదలగు గ్రామాలు, బెజవాడ, ముస్తాబాదు, ఏలూరు, కొవ్వలి, మొదలగు గ్రామాలు కూడా తిరిగారు. పదివందలవరకు వసూలైనవి.

ఏలూరు పరిసర ప్రాంతాల్లో చింతలపాటి లక్ష్మీపతి శాస్త్రిగారు తోడ్పడ్డారు.

ఈ కేసులో రు 50 ల ఫీజుకు వకాల్తా పుచ్చుకొని ధర్మరక్షణకై పనిచేసిన వల్లూరి సూర్యనారాయణరావుగారు ప్రశంసార్హులు.

ఈ గోటకమునకు అతరాఫు ఆసామి పెద్దకాపు మొదటి ముద్దాయి, వేమూరి వెంకన్నగారిని కూడకట్టుకొనుటకు జమీందారు ఉద్యోగులు చాలా ప్రయత్నించారు. కత్తిన్నర భూమియిస్తామని ఆశ పెట్టారు. "కత్తిన్నర మీరిచ్చేదేమిటి? ఈ గోటకమంతా నాదే అనుకుంటూంటే" అన్న ధీరుడాయన. జమీందారు సామ, దాన, భేదోపాయాలు సాగలేదు.

ఈ కేసులో గ్రామము అధిక భాగము ఒకపార్టీలోకి వచ్చి ఇతరత్రా వ్యవహారాల్లో కూడా ఆ పద్ధతినే వుండెను.

గ్రామంలో పెత్తనదార్లు పార్టీలవల్ల జమీందారునకు లోబడినా గ్రామస్తులు మాత్రం లోబడలేదు. పెత్తనదారులను తోసివేసి, ధర్మ రక్షణకై ఆయా కాలాల్లో నూతన పురుషులు వచ్చి ప్రజానాయకత్వం వహిస్తూనే వుండిరి.

## సమ్మోరీదావాలు

ఈ సమ్మోరీదావాలు స్న 1308 - 1312 ఫసలీలకు బోళ్ళపాడు వగైరా పల్లపు భూములకు జమీందారునకివ్వ వలసిన శిస్తు విషయమై తగాదా.

కృష్ణ ఆనకట్ట 1855న కట్టినప్పటికీ ఘంటసాల రైతులకు సంబంధించిన బోళ్ళపాడు, చిట్టూరు వగైరా గ్రామాల భూములు భీమనది ఛానల్ క్రింద 1897లో సాగుకువచ్చినవి. అందువల్ల పట్టాలలో పల్లపుభూమికి యకరమునకింతని లేదు.

మాగాణి అయిన తర్వాత మెట్టతరంమీద య 1 కి రు 1-6-0 చిట్టూరుకు, బోళ్ళపాడుకు రు 1-0-0 హెచ్చు శిస్తు యిచ్చేపద్ధతిని పై ఫసలీలకు రైతులు ముచ్చిలకాలు వేశారు. కాని జమీందారు పట్టా లివ్వలేదు.

ధనాశచేత జమీందారు తనయిష్టంలేకుండా రైతులు పల్లపు సాగుచేశారని కత్తికి నూరు రూపాయల చొప్పున రావాలని, డిప్యూటీ కలెక్టరువద్ద దావా తెచ్చాడు. డిప్యూటీ కలెక్టరు విచారించి రైతులు ముచ్చిలకాలువేసిన పద్ధతినే నిర్ణయించాడు,

దీనిపైన జమీందారు జిల్లాకోర్టులో అపీలు చేయగా క్రింది కోర్టు తీర్పు ఖాయపరిచారు.

అంతటితో ఆగుతాడా జమీందారు! హైకోర్టుకు వెళ్ళాడు.

హైకోర్టు జడ్జి 'బోసెన్' గవర్నమెంటు కాలువ త్రవ్వించి కృష్ణనదీ జలాన్ని ప్రవహింపచేస్తుంటే జమీందారు కెందుకు హెచ్చు శిస్తు యివ్వాలని ప్రశ్నించాడు.

జమీందారు ప్లీడరు, రైతులు యిదివరకే ముచ్చిలకాలు హెచ్చుశిస్తు యివ్వటానికి వేశారు, జమీందారింకా హెచ్చుకోరుతున్నాడనగా, ఆ ఫసలీలకు నేను చెప్పవలసినది లేదనగా, తిరిగి ఆ ఫసలీలకు సదరు ముచ్చిలకాల ప్రకారం శిస్తుకు జమీందారు దావా వేశాడు.

దానిమీద రైతులు ముచ్చిలకాలు వేసినప్పటికీ జమీందారు పట్టాయివ్వలేదు, గనుక ఉభయులు వప్పుకుంటే గాని ఎక్చేంజి (మార్పు) కాదని రైతుల తరఫు ప్లీడరు చెప్పగా, అది న్యాయమైనది, కంట్రాక్టు పూర్తికాలేదు కనుక ముచ్చిలకాలు చెల్లనేరవని తీర్పు ఇవ్వటం జగిరింది.

చివరకు జమీందారు రాజీ బేరానికి రాకతప్పింది కాదు.

లోగడ అయిదు సంవత్సరాలకు (1899-1904) మెట్ట రేటు ప్రకారం పుచ్చుకొని, యం 1 కి బోళ్ళపాడుకు ఒక రూపాయి, చిట్టూరుకు 1-6-0 చొప్పున యిచ్చేటట్లును, జమీందారు పంటబోదులు మురుగుకాలువలు మరమ్మతు చేయించేటట్లును ముచ్చిలకాలు వేసిరి.

కాని ఈ జమీందారు జన్మలో బోదులు త్రవ్వించిన పాపాన పోలేదు. ఇక మురుగు కాలవల సంగతి కూడానా?

రైతులు జమీందారుతో ప్రతి దానికి కోర్టు కెక్కి పోరాడలేరు గదా.

## ల్యాండు యాక్టు

1802 లో శాశ్వత ఫైసలాయతిలో (పర్మనెంటు సెటిల్ మెంటు) రైతులకు జమీందారులకు గల హక్కులు పూర్తిగా నిర్వచింపబడలేదు.

రెంటు అనే పదాన్నిబట్టి, ఆంగ్లదేశపు ఆచారాన్ని బట్టి 1861 లో ఏర్పడిన హైకోర్టు ఇంగ్లీషు జడ్జి కాలెట్ భూమిహక్కు జమీందారునదే అనెను. ఈ దేశంలో రాజులెందరు మారినా, భూమి హక్కు రైతుదే అన్న సంగతి ఆయనకు తెలియదు.

1860 లో గవర్నమెంటు 30 ఏళ్ళకొకసారి రీ సెటిల్ మెంటు పద్ధతి ఏర్పాటుచేసి శిస్తును పెంచెను.

జమీందార్లు తమకూ శిస్తు పెంచేహక్కు కలదని ఆందోళన చేసిరి. దీనికి ఆ ఇంగ్లీషు జడ్జి 'కాలెట్' అంగీకరించెను.

ఆ జడ్జి చేసిన తీర్పువల్ల రాష్ట్రమంతటా రైతులలో గగ్గోలు పుట్టెను.

అందువల్ల మద్రాసు రాష్ట్ర ప్రభుత్వము 1865 లో రెంటు రికవరి బిల్లును — శిస్తు వసూలుచేసుకొనే బిల్లు తెచ్చెను.

అది సెలెక్టు కమిటీఎదుటకు వచ్చేసరికి జమీందార్ల ఆందోళననుబట్టి వారికి అనుకూలముగనే చట్టమాయెను. ఈ ఆక్టును బట్టి జమీందారునకు శిస్తు హెచ్చించే హక్కు ఏర్పడెను.

రెంటు రికవిరి ఆక్టులోని లోపాలను దిద్దాలని 1898లో ఓకనన్ని బిల్లు వచ్చేసరికి జమీందారులు తమ పలుకుబడివల్ల దానిని చర్చకు రాకుండానే చేశారు.

1865_1905 వరకుగల లోపాలను రద్దు చేయాలనే తలంపుతో రివిన్యూ మెంబరు ఫోర్బ్సు 1905లో యెస్టేట్సు ల్యాండు ఆక్టు బిల్లును తెచ్చెను.

"పర్మనెంటు సెటిల్‌మెంటు రీత్యా జమీందారు పన్ను వసూలు చేయువాడుగనే పరిగణింప బడుచున్నాడు." అని ఆయన బిల్లును ప్రతిపాదించుచు చెప్పెను. దీనివల్ల జమీం దారు భూస్వామందు కాడని తేలినదిగదా ?

ఇది 1908లో యాక్టుకాబడినది. దీనివల్ల జమీం దారీ శిస్తు బకాయి ఫస్టు చార్జి అయినది.

శిస్తు హెచ్చించే హక్కు జమీందారునకు పోయి, డిప్యూటీ కలెక్టరుకు ఏర్పడెను.

మరొకమార్పు_1908 సంవత్సరమునకు పూర్వము 12 సంవత్సరములనుండి జమీందారు స్వంతముగా సాగు చేయించుకొను భూమిమాత్రమే స్వంతకమతము. అట్లా కానిచో ఆ భూమి రైతీయల్యాండు అనగా శేరీభూమి - రైతుదే అని ల్యాండు ఆక్టులో చెప్పబడెను.

దీనిని బట్టి రైతులకు జమీందారునకు అనేక తగా దాలు ఏర్పడెను.

వాటిలో పేరొకానతగినది వక్కలగడ్డది. ఈ గ్రామము చల్లపల్లికి ఒకమైలును ఘంటసాలకు రెండు మైళ్ళలోను

కలదు. ఈ గ్రామ రైతులు పంటలు పండనందున శిస్తులు చెల్లించ లేకపోయిరి. అందుచేత భూములన్నీ జమీందారు పరమైనవి. తర్వాత వారు మళ్ళా ఆ శిస్తు రేటుకే నాముకు చేసుకొనుచుండిరి. కొంత కాలమునకు ల్యాండుఆక్టు వచ్చినది. రైతులను భూములనుండి తొలగవలసినదని జమీందారుగారి మేనేజరు కోపల్లి కృష్ణరావు పంతులుగారు వచ్చి చెప్పిరి. అంతట రైతులు "మేము చాలాకాలమునుండి సాగు చేయుచున్నాము. మాకితర ఆస్తి లేదు. మేము మీరు కోరిన మక్తాయిచ్చి వ్యవసాయము చేసుకుంటున్నాము, మా కోర్కె న్యాయమైనది, మేము తొలగమని రైతులందరూ ఏక గ్రీవముగా చెప్పిరి. తర్వాత రాజాగారు పోలీసులకు రిపోర్టు చేసి పోలీసు ఇనస్పెక్టరును, పోలీసులను బోడగుంట మాదిగలను, తమ యెస్టేటులోని ఇతర సిబ్బందిని తీసుకొనివచ్చి, రైతుల స్వాధీనములో వున్నమద్దుల పొలమనే నాలుగు వందల యకరాలను స్వాధీనము చేసుకొన ప్రయత్నించిరి సబ్ యినస్పెక్టరు జమీందారుగారి గుర్రాన్ని యెక్కి వచ్చి రైతులను కొట్టసాగెను. జమీందారు బలగం కత్తులు, తుపాకులు, బరిసెలు మొదలగు ఆయుధాలతో వచ్చిరి. రైతులది ధర్మము, వారి హక్కును, కాపాడుకొనుటకు వారు వారి స్వాధీనములో ప్రవేశించిన ఈ రాక్షస మూకను తొలగమన్నారు. దాని మీద వారు రైతులమీద పడ్డారు. వారిచేతుల్లో ఆయుధాలున్నప్పటికీ, రైతులు ప్రాణాలకు తెగించి సాహసంగా వీరోచితంగా వారితో తలపడిపోరాడి వారి తుపాకులను కత్తులను స్వాధీనము చేసుకొని, ఆ భూమిలో వేసిన డేరాలను తగుల

పెట్టారు. ఆ రాజాగారి సిబ్బంది, పోలీసులు కాళ్ళకు బుద్ధి చెప్పారు.

జమీందారుగారి జనం అలా చల్లాకు చెదురుకాగా ఈ రైతులు మళ్ళా పోలీసులు వస్తారని అరెస్టులు జరుగునని పరాయి గ్రామాలకు వెళ్ళారు. అందులో చాలామంది ఘంటసాలకు వచ్చారు. ఆ వచ్చినవారిని చూచి ఘంటసాల రైతాంగమంతా దేవాలయంముందు జేరి ఈ తగాదా జమీందారు – రైతుతగాదా; రైతులది న్యాయమైనది, కనుక మనము వీరికి అండగా వుండాలని అనుకొని వారికి అభయమిచ్చి, పోలీసులకు కనపడకుండా చాలా రోజులు వారిని దాచారు. జమీందారు అందులో కొందరిమీద కేసు పెట్టగా వారికి జామీనువుండి, ఆ కేసులోకూడా సాయపడిరి. గొర్రెపాటి వెంకట్రాయుడు కుమారుడు కృష్ణయ్య, వేమూరి రామన్న కుమారుడు కోటయ్య. ఘంటసాలగ్రామము తరఫున కృషిచేశారు. అట్లాగే దేవరకోటలో దోసేపూడి (శ్రీ)రాములు, నాగన్నలు, వేమూరు గ్రామస్తులు కొందరు సహాయపడిరి.

రైతుల తరఫున వల్లూరి సూర్యనారాయణరావు వేమవరపు రామదాసు పంతులుగార్లు న్యాయవాదులుగా వుండి చాలా పట్టుదలతో కృషిచేసిరి.

అప్పట్లో జిల్లాజడ్జి ఆంగ్లేయుడు. ఆయన ఇది సివిల్ తగాదా రైతులు తమ హక్కును కాపాడుకొనుట ధర్మము. పోలీసులు ఇందులో జోక్యము చేసుకొనుట అక్రమము, జమీందారుగారి గుర్రము యెక్క

ఆయన ధనానికి ఆశపడి పోలీసు సబ్ యినస్పెక్టరు పోవటం నీచమైన పని అని నిందిస్తూ ఇది సివిల్ తగాదా అని కొట్టి వేస్తే, జమీందారు హైకోర్టుకు వెళ్ళాడు. రైతులకు ధనము లేక, కష్టాలు పడలేక, పోరాడలేక పోయారు.

ఆ భూమంతా పోలీసు సహాయ్యంతో ఆక్రమించు కొన్నాడు జమీందారుగారు.

వక్కలగడ్డ గ్రామస్థుల వనంతోట 32 యకరాలు స్వాధీనం చేసుకున్నాడు జమీందారు.

జమీందారుగారి గుమాస్తా చిత్రపు సుబ్బారావు భూమి కౌలుకు చేస్తుండగా దానిని దేవరకోట రైతులకు రిజిష్టరుఖత్తు వ్రాయించి ఆ భూమినుండి వక్కలగడ్డ రైతులను తొలగించ కృషి చేశారు రాజాగారు.

ఈ మాదిరిగా వక్కలగడ్డ రైతులపై పగబట్టి, అయినదానికి కానిదానికి కోర్టుకులాగి ప్రయాసపెట్టి వారిని నాశనం చేశారు.

ఈ ల్యాండు ఆక్టునుబట్టి ఈ గ్రామ కాపురస్తు వేమాలి రత్నయ్య 1918 లో ఒక పితూరిని లేవతీశాడు. ఈయనకు అండగా మొవ్వ కాపురస్తుడు యద్దనపూడి కృష్ణా రావు, పాలంకిపాటి కాపురస్తుడు పాలంకిపాటి చలపతిరావు ఆయ్యంకిలో నిడుమోలు నరసింహారావు, మంత్రిపాలెంలో చిగులూరి వెంకయ్య, కోసూరులో గోగినేని బాలకృష్ణయ్య వగైరాలు, జమీందారు తరఫున కొండపల్లి బుచ్చయ్య నిలబడ్డాడు.

ఘంటసాలలో కూడా కొందరి రైతులను రెచ్చగొట్టి చిట్టూరి కమతాన్ని ఆక్రమింపచెయ్యాలని రత్నయ్యగారు ప్రయత్నం చేశారు. కాని పెద్దలు దానికి అంగీకరించనందున ఘంటసాలవారు దీనిలో ప్రవేశించలేదు.

జమీందారుగారు వారిపై సివిల్ క్రిమినల్ వ్యవహారాలను జరిపారు. అందులో ఆయనే జయం పొందాడు.

ఈ మాదిరిగా ల్యాండు ఆక్టు కక్షలకు కారణమైనది. ప్లీడర్లకు ఇది కామధేనువైనది. జమీందారు బలవంతుడు. పలుకుబడి గలవాడు. ఈ ఆక్టు వల్ల వ్యయ ప్రయాసలు పడ్డారు రైతులు. కాని భూమి హక్కు రైతుదేనని తేలింది.

దేవరకోట సంస్థాన చరిత్రయకారుడు ఇలా వ్రాస్తాడు.

"ఆక్టువలన గలిగిన మార్పులమూలమున శ్రీ రాజాగారు ఒక్కసారిగా వ్యాజ్యములో జిక్కబడిరి పేసబడికి దాత్కాలికముగా భూమిని వ్యవసాయము చేయు రహితును, భూమియందు జీతమునకు బనిచేయు భృత్యుడునుగూడ, దమకు సమానహక్కు కలదని వాదింపగా దన్నివారణార్థమై రాజాగా రమిత ధనవ్యయ మొనరింపవలసి వచ్చెను. యీయాక్టు వలన యెస్టేటునకు శాశ్వతముగా వచ్చెడి యీయాదాయములో సాలు 1కి షుమారు లక్షరూప్యముల చొప్పున తగ్గిపోయెను.

పుట 50

## తాళ్ళ కేసు

పూర్వము తాళ్ళనుగీసుకొని కలాలీలు స్వేచ్ఛగా కల్లు అమ్ముకొనేవారు. సారాకూడా కాచేవారు. కల్లు బెల్లంకూడా చేసేవారు. గవర్నమెంటు, ఖండాలు ఖండాలుగ కల్లు పాటలను పెట్టింది. దీన్ని పురస్కరించుకొని చెట్లకు పన్ను గవర్నమెంటు విధించింది. ఇలా గీతద్వారా రైతులకు కూడ కొంత ప్రయోజనం కలుగుతుందనే ఉద్దేశంతో తాను అక్రమలాభం పొందాలని జమీందారు ప్రయత్నించాడు. అది ఎట్లా గనగా గీసే పోతుతాడి చెట్లకు నూటికి ఆరు రూపాయలు చొ॥న పన్ను అని పట్టాలో కలదు. దానిని పురస్కరించుకొని గీసే తాళ్ళకు అనగా గీతకు తయారైన వాటి కన్నింటికి శిస్తు జమీందారు అక్రమంగా వసూలుచేయ ఆరంభించాడు. ఈ అక్రమాన్ని పోగొట్టుటకు రైతులు కోర్టుకు పోవలసి వచ్చింది. ఈ కేసు హైకోర్టు వరకుపోయింది. జమీందారు దేనినీ హైకోర్టు వరకు పోనియకుండా వదలడు. ఆయన ధనవంతుడు. రైతులు బీదవారు. ఆయనతో పోరాడలేరు. పోరాడితే నష్టపడతారు.

అప్పటి హైకోర్టు జడ్జి యగు విల్సన్ ఇటువంటి బుద్ధిహీనుడగు భూకామందును నా జీవితములో చూడలేదని చెప్పుతూ గీసే తాళ్ళనగా గీసిన తాళ్ళే అని రైతులకు అనుకూలముగా తీర్పు చెప్పెను.

ఈ విధంగా జమీందార్లతో పోరాడి ఘంటసాల ప్రజలు రైతు స్వామ్యపు హక్కులను సంపాదించుకొన్నారు.

ఈ జమీందారు తన తమ్ములతో తగాదా పడుటేగాక తన కుమారునితోకూడా తగాదాపడి తాను జీవించి వున్నంత వరకు, చల్లపల్లి కోటలో కాలు పెట్టనియ్యలేదు. ఇక రైతుల విషయంలో కర్కోటకుడుగా ప్రవర్తించడంలో ఆశ్చర్య మేమున్నది ?

## గొర్రెలపాటి వెంకటయ్యగారితో ముచ్చట్లు

ఈయన చల్లపల్లిలోవుంటూ (1910_18) జమీందారు గారి వ్యవహారాలు చూస్తువుండేవాడు అక్కడ వుంటున్న ప్పటికీ ఆత్మ గౌరవానికి, ఘంటసాల గ్రామ శ్రేయస్సుకు భంగం కలగకుండే సంచరించేవాడు.

ఎప్పుడైనా వెంకయ్యగారు ఇంటికి వెళ్ళివచ్చినపుడు, ఘంటసాల పార్లమెంటు' ఏమి ఆలోచిస్తున్నదని జమీందారు అడిగితే, గ్రామ పెద్దల హుందాతనాన్ని పెంచేటట్లుగా సమాధానమిచ్చేవాడు. అంతటాయున అదుగో 'ఘంటసాలను' పార్లమెంటుని అంగీకరిస్తున్నాడని అంటూ వుండేవాడు.

'నమ్మి సితికి వచ్చేసరికి పోయాడయ్యా రామస్వామి అనేవాడు. అసలీ జమీందారు జన్మలో ఎవరినీ నమ్మలేదు.

'కరణం పెత్తన మెక్కడో కాపు పెత్తనమెక్కడో తెలుసునయ్యా; రోడ్డు ఇవతల (బందరు_ అవనిగడ్డ రోడ్డు) కరణం పెత్తనం, అవతల కాపు పెత్తనం.

'ఘంటసాల వారికి, ఇతరులకీ భేదమేమిటంటే, ఎవరి కైనా తగాదా వస్తే వారే వ్యవహరించుకుంటారు; ఘంట సాలతో తగాదావస్తే పరగణాతగాదా చేస్తారయ్యా.'

ఒకసారి వెంకయ్యగారు ఒక ఆసామికి ఋణం యివ్వ వలసిందిగా శిఫార్సు చేశాడు. దానిమీద జమీందారు 'నీవు కూడా కలిసి వ్రాస్తే ఇస్తానన్నాడు.

'నేను యివ్వమన్న వారికల్లా తమరిస్తూంటే అలాగే వ్రాస్తానన్నాడు వెంకయ్యగారు ఈయన సామాన్యుడు కాదు.

'ఏమిటయ్యా! వెంకయ్యా పంతులుగారేనా తెలివి గలవారు? అందరితో సంప్రదించాలి. ఆఖరకు మన ఇష్టం వచ్చినట్లు చేయాలి.

ఈ జమీందారుగారు వృద్ధాప్యంలో రాత్రిళ్ళు పగలు పగలు రాత్రిళ్ళు చేస్తున్నారని కృష్ణాపత్రిక వ్రాసిందని తెలుసుకొని, యాభై కృష్ణాపత్రికలు తెప్పించి ప్రతి సముద్దారుకు పంపించండయ్యా, అన్నాడు.

ఇది ఈయన ఆలోచన. పత్రికను ఆ విధంగా ముఖ మాటు పెట్టాలని.

ఇట్లా ఎన్నో వున్నవి ఈ జమీందారుగారి సంగతులు.

## అంకినీడు ప్రసాద్‌గారు

### 1921-10-12-1928

వీరు బి. ఏ పరీక్షయందు తీర్ణులైరి. వీరి పద్ధతంతా ఆంగ్లేయుల ధోరణే. అనవసర కాలహరణ, వ్యయప్రయాసలు ఏమీ వుండేవి కావు, రాగానే సువారపు దొరల నందరిని పంపేశారు. మంచి పొదుపరి. నాయకః ఒక మేనేజరు వంగల గోపాలకృష్ణయ్య (రిటైర్డ్ సిరస్థదారు) వుంచుకొన్నను

స్వతంత్ర ప్రతిపత్తి వారికేమీ ఇవ్వలేదు. అన్నీ స్వయంగా చూచుకొనేవారు. దురాపేక్షలేని వ్యక్తి.

1921లో చల్లపల్లిలోని మాధ్యమిక పాఠశాలను, ఆస్పత్రిని అవనిగడ్డకు మార్చిరి.

ఈ పరగణాలో ఆంగ్లవిద్యావ్యాప్తి లేదని భావించి 1924లో ఇక్కడ మిడిల్ స్కూలును స్థాపించారు. వైద్య సౌకర్యం కొరకు ఒక ఆసుపత్రిని కూడ నెలకొల్పారు.

పెదవేగి, కృష్ణాపురం, ముంజులూరు, పెనముకూరు మొదలగు గ్రామాలనుకూడ కొన్నారు.

1923లో మిర్జాపురం ప్రోత్సాహంతో జమీందారుల తరఫున శాసనసభకు నిలబడ్డారు.

మీర్జాపురం వారు తర్వాత గొల్లపల్లి రాజాగార్ని నిలబెట్టి కమ్మ, వెలమ కులభేదాలను రెచ్చగొట్టి అంకినీడు గారిని ఓడించారు. అందువలనే 1926లో మీర్జాపురంకు వ్యతిరేకంగా అడుసుమిల్లి గోపాల కృష్ణయ్యగారికి అనుకూలంగాను పనిచేశారు.

మీర్జాపురం రాజా అక్రమంగా ఓట్లు సంపాదించాడని కాంగ్రెసువారు ఈ ఎన్నిక చెల్ల నేరదని పిటీషను పెట్టినప్పుడు ఖర్చులన్నీ తాను భరించి వారికి సహాయపడెను.

ప్రజాస్థానమునకు వీరు (అంకినీడుగారు) నిలబడకుండా జమీందారీనియోజక వర్గములోనే నిలబడుట ప్రశంసింప తగినది. ఘంటసాలతోగాని; మరి ఏ ఇతర గ్రామాలతోగాని వీరు తగాదా పెట్టుకోలేదు. తనయెస్టేటు రైతు ఘంటసాల నివాసి

అను గొట్టిపాటి బ్రహ్మయ్యగారు మీర్జాపురం పిటీషనర్లలో ఒకరుగా ఉండి ఏ ప్రలోభమునకు లోబడక నిజాయితీగా వున్నందుకు, తాలూకాబోర్డు పరిపాలన సక్రమంగా నెరవేర్చి నందుకు హార్షామోదములను తెలిపిన ఉదార హృదయుడు.

## శివరామ ప్రసాద్‌గారు

**1929. 11-26-1949. 9. 7**

ఈయన వివాహము, పట్టాభిషేకము అతి వైభవముగా జరిగినవి.

కృష్ణాజిల్లా రాజకీయాలు మద్రాసు రాజధానిలో చాలా వివాదాస్పదమైనవి. ఈ రాజకీయాలనుబట్టి మంత్రులు మారుతూ వచ్చారు.

కృష్ణాజిల్లాలో బోర్డు అధ్యక్షునుగా తిక్కాని బాలాజీ రావునాయుడుగా రుండగా ఆయన అవకతవకలు చేస్తున్నాడని మీర్జాపురపు జమీందారుగారిని జిల్లాబోర్డు అధ్యక్షుని చేసిరి.

ఆయన అక్రమంగా పరిపాలన చేస్తున్నాడని ఆయనను దింపి చల్లపల్లి జమీందారుగారిని ఆ గద్దెపై కూర్చుండ బెట్టుటకు జిల్లాలోని కొందరు ప్రముఖులు కృషి చేయసాగిరి. అందుకు ఆయన అంగీకరించిరి. యెస్టేటులో ప్రజలతో సంప్రదించకుండా తమ కనుకూలురైనవారిని జిల్లా బోర్డు సభ్యులుగా వుంచుటకు ప్రయత్నం చేయసాగిరి.

అందుకు భిన్నంగా ఈ రచయిత యెస్టేటులోని రైతు లను సమకూర్చి 1932. 10. 27, 28 తేదీలలో చల్లపల్లి



టీపార్టీకి వచ్చిన కృష్ణాజిల్లాబోర్డు సభ్యులు, ఇతర ప్రముఖులు.

# టీ పార్టీ

ఎడమనించి కుర్చీలలోని వారు : తలపిల హనుమయ్య, జంపాల వెంకటేశం, పాత్రో, విద్యాశాఖాధికారి, కొల్లి వెంకటకృష్ణయ్య, కొడాలి వెంకటస్వామి, గొల్లపల్లి రాజా, చల్లపల్లి రాజా, అట్లూరి సీతమ్మ, గొర్రెపాటి వెంకటసుబ్బయ్య, అడ్సుమల్లి గోపాలకృష్ణయ్య, ప్రసంగి వెంకటనారాయణ, శాకమూరి లక్ష్మీపతి, వేమూరి రామయ్య, వేమూరి వెంకయ్యగారలు.

నిలుచున్నవారిలో మొదటి పంక్తిలో : 4 చిగులూరి వెంకయ్యగారు, 5 వేమూరి రామస్వామి, 6 యీ నాగయ్య, 7 యీ సుబ్బయ్య, 8 యీ రత్నయ్య, 9 యీ పేరయ్య, 10 చోడవరపు వెంకటేశ్వరరావు, 11 తంగిరాల సుబ్బారావు, 12 కోట అప్పయ్యశాస్త్రి, 14 కంఠంనేని గోపాలరావు, 15 గొర్రెపాటి వెంకయ్య, 18 వేమూరి వెంకయ్యగారలు.

కోటలో జరిగిన సమావేశములో పార్టీని, రైతులనే యెస్టేటులో అభ్యర్థులనుగా నియమించ వలసినదిగా చేసిన కృషి ఫలించినది. ఈ రచయితను, చిరుమామిళ్ళ వెంకటకృష్ణమ్మ నాయుడమ్మ కొల్లి వెంకట కృష్ణయ్యగార్లను అభ్యర్థులనుగా నిలిపిరి.

చల్లపల్లి యెస్టేటులో రైతులకు జరుగుచున్న అక్రమాలను గురించి రైతులలో అలజడి ఆరంభమైనది. దానిని పురస్కరించుకొని ఘంటసాలలో దివి తాలూకా జమీందారీ రైతులసభ 1933 ఏప్రియల్ 2 తారీఖున జరిగినది. తాలూకా నుంచి చాలా రైతులు వచ్చిరి. ఈ సభకు ఈ రచయిత ఆహ్వాన సంఘాధ్యక్షుడుగాను, సుప్రసిద్ధ రైతు బాంధవుడగు కామయోరి వెంకట చలపతయ్యగారు అధ్యక్షుడుగను వుండిరి. సభలో జరిగిన తీర్మానాలను పురస్కరించుకొని రాజాగారి వద్దకు రాయబారము వెళ్ళుటకూడ జరిగినది.

1933. 5. 31 చల్లపల్లి రాజాగారు ఏక గ్రీవంగా జిల్లాబోర్డు అధ్యక్షులుగా యెన్నికఅయ్యారు.

నూతనజిల్లా బోర్డు ప్రెసిడెంటుకు సభ్యులకు జిల్లాలో పెక్కుచోట్ల టీపార్టీలు యిచ్చుట జరిగినట్లే ఇక్కడను 1933_6_25న ఇచ్చుట జరిపినది. జిల్లాబోర్డు సభ్యులు జిల్లాలోని ప్రముఖులు విచ్చేసిరి.

ఈ రచయిత జిల్లాబోర్డు సభ్యుడుగావున్న సమయములో (1934) యెస్టేటులో దివాను చేస్తున్న అక్రమాలను, రైతులకు కలుగుతున్న కష్టనష్టాలను సోదాహరణంగా వ్రాసి

ఒక మెమొరాండాన్ని రాజాగారికివ్వటం జరిగింది. ఆయన పట్టించుకోలేదు. తర్వాత విలయతాండవం ఆరంభమైనది.

శ్రీ శివరామప్రసాద్‌గారు స్థానిక సంస్థలలో పాల్గొని కృష్ణాజిల్లాకు బోర్డు అధ్యక్షులుగా వుంటూ తమ ఎస్టేటు వ్యవహారాలనే మాత్రము గమనించక జంపాల వెంకటేశం అనే ఆయనను దివానుగా నియమించి, సర్వాధికారాలు ఆయన పరమొనర్చారు. ఈ దివానుగారిని గూర్చి ఇక్కడ ఒక సంగతి చెప్పవలసి వున్నది. గుంటూరు జిల్లా పెదనందిపాడు ఫిర్కా-పన్నుల నిరాకరణోద్యమ సందర్భంలో ఈ మహాపురుషుడక్కడ డిప్యూటీ కలెక్టరుగా వుంటూ, గవర్నమెంటువారి మెరమెచ్చులకై తాను రైతుబిడ్డ కూడా రైతులను నానా బాధలు పెట్టిన ప్రముఖుడు.ఇంగ్లీషు గవర్నమెంటు వారీయనను రైతుల నణచడానికి వుపయోగిస్తుండేవారు. చూచిరమ్మంటే కాల్చివచ్చే స్వభావంగలవాడు.

ఇట్టి ప్రముఖుని పరిపాలన యెంత ప్రజానురంజకంగా వుంటుందో వేరే చెప్పనక్కరలేదు. ఈయనకు ఎస్టేటు సంప్రదాయాలు బొత్తిగా తెలియవు. రైతులతో వ్యవహార సంప్రదింపులు యేమీ గిట్టవు. ప్రతిదానికి వ్యాజ్యమే. ఇకధర్మ నిరతి విచారిద్దామంటే, వారు చూచిన పోరంబోకులు, ధర్మ చెరువులు, ఎస్టేటుకు సంక్రమించవలసిందే. ప్రతి గ్రామంలోను పార్టీలుపెట్టి తద్వారా యెట్టి కార్యములైనా చేయుటకు వెరవని సాహసుడు. యెస్టేటు బాకీలక్రింద రైతుభూములను కొట్టి వేయించు కొనుట, ఈస్టు బ్యాంకు కెనాలు క్రింద రైతుల భూములకు వచ్చిన నష్ట పరిహారాలకు అనవసరంగా

పేచీలు పెట్టటం, సాధారణంగా పోరంబోకుల్లోను, డొంక ల్లోను రైతుగొడ్లు మేసే పద్ధతిని దౌర్జన్యంగా మాన్పించి వేలం వేయించటం మొదలైన కార్యాలను నిరాఘాటంగా చేస్తూ రైతులను క్షోభ పెట్టసాగింది. ఈదివానుగారి దుర్భర పాలన వల్ల ప్రజల్లో అసంతృప్తి కలిగింది.

ఇన్ని కష్టాలనుభవిస్తున్నప్పటికీ నిరంతర కష్టసహిష్ణుత కలవాటుపడిన అమాయక రైతువర్గం బహిరంగంగా ఈ అక్రమాలను మారొకౌన సహించజాలక పోయింది. ఇట్టిపరి స్థితిలో గొట్టిపాటి బ్రహ్మయ్యగారు ఈ దివానుగారిపై పత్రికల ద్వారాను,• కలెక్టరుగారికి రివిన్యూ బోర్డుకు అర్జీల ద్వారాను, ఆందోళన జరుప జొచ్చిరి.

ఆ దివానుగారు కృష్ణాపత్రికలోని బ్రహ్మయ్యగారి వ్యాసమునకు సమాధానముగా తాను వ్రాయించి చిట్టూరు కరణమగు చిట్టూరు చినవెంకట్రాజుగారితో సంతకము చేయించి కృష్ణపత్రికకు పంపిరి. దానిని ఖండిస్తూ మరల బ్రహ్మయ్య గారు కృష్ణాపత్రికకు వ్రాసెను.

రైతులలో దివాను యెడల వ్యతిరేకభావము హెచ్చెను. అంతట ఆయన రాజాగారి వద్దకువెళ్ళి, నన్ను

• దోనెపూడి చన్నయ్యగారి కుమారుడు వెంకయ్య ఘంటసాల గోటకాన్ని జమీందారు ఆక్రమించాలనే విషయం కృష్ణాపత్రికలో చదవగా విని "ఏమిటీ మళ్ళానా? అప్పుడు జమీందారు గోటకాన్ని ఆక్రమించాలని యత్నించినప్పుడు నేనూ వెళ్ళినవాడినే. ఈసారి మళ్ళా వెళ్తాను. ప్రాణ మున్నంతవరకూ వారిని రానివ్వను" అన్నాడు.

ఇట్లా ఈ గ్రామస్తులు తమ హక్కులను కాపాడుకోవాలని ప్రయత్నించిన వారే.

గవర్నమెంటు ఉద్యోగము చేస్తూవుండగా మీరు తీసుకు వచ్చారు. మీ రుపేక్షవహిస్తే నాకు మరల ఉద్యోగం లభించదని చెప్పుకున్నాడు.

అప్పుడాయన కొమ్మారెడ్డి పట్టాభిరామయ్యగారితో సంప్రదించగా, ఆయన గొట్టిపాటి బ్రహ్మయ్యగారికి యీ రచయితకు వర్తమానం పంపగా వీరు వెళ్ళిరి. ఈ యిద్దరు, రాజాగారు, పట్టాభిరామయ్యగారు బందరులో రాజాగారి బంగళాలో మాట్లాడిన పిమ్మట ఆందోళన ఆపవలసినదిగా వారు కోరారు. అయితే దివానుని తొలగించవలసినదిగా వీరు కోరారు. అంతట రాజాగారు ఆయన టరమ్ ఇంకా కొద్దిగా వున్నది. మీరు కాస్త ఓపికపట్టవలసినది. మరల ఆయనను నియమించనని దివాను తృప్తికొరకు తానొక ప్రకటన చేస్తానని మీరు మళ్ళా దానిని ఖండించవద్దని కోరారు. ఆ ప్రకటన చదివి వినిపించగా కొన్ని సవరణలు మేము చేయగా వారంగీకరించారు.

అనుకొన్న ప్రకారము దివాన్ని పంపివేశారు. అప్పుడు వారితో సంప్రదింపుల సందర్భములో మీరు మీ గోటకం విషయమై జోక్యంచేసుకోవద్దని కోరతారని అనుకున్నామన్నారు కొమ్మారెడ్డివారు.

అంతట మా సంగతి మేము చూసుకోగలము, ఈ దివాను పోవటము యెస్టేటు రైతుల కోర్కె. అది నెరవేరితే చాలన్నాము.

**1934** లో ఈ దివానుగారిని సాగనంపి యెస్టేటు రైతులలో సంతృప్తి కలిగించడము జరిగినది.

వీరు తమ తండ్రిగారిచే స్థాపించబడిన మిడిల్ స్కూలును హైస్కూలుచేసి 1934 లో దానికి లక్షరూపాలు పెట్టి ఒక గొప్ప బిల్డింగును కట్టించిరి.

ఘంటసాల కాంగ్రెసుకు బలీయంగా వుండుటచేతను, మరొకరు యెస్టేటులో చల్లపల్లి రాజాగారితో పోటీ చేయ సాహసించనందువలన 1936లో తిరిగి రాజాగారు జిల్లాబోర్డుకు మెంబరుగా నిలబడినప్పుడు గొర్రెపాటి వెంకటసుబ్బయ్యగారిని (కిసాన్)1937 ఆయన శాసనసభకు అభ్యర్థిగా నిలబడి నపుడు గొట్టిపాటి బ్రహ్మయ్యగారిని అభ్యర్థులుగా ఆయనకు పోటీకి కాంగ్రెసు నిలబెట్టినది.

రైతు నాయకుడైన ఆచార్య రంగాగారు భారతదేశములో కిసానోద్యమ నిర్మాత.

ఆయన ఆదిలో జమీందారీ రైతు ఉద్యమాన్ని కూడ ఆరంభించి జమీందారీ విధానం నశించాలని ప్రథమంలో నినాదమిచ్చినప్పుడు అపహాసించింది లోకం. ఆయన అనేక కష్టనష్టాలకు లోనై, జమీందారీ రైతులలో తీవ్రమైన ఆందోళన తీసుకువచ్చాడు.

ఆంధ్రదేశంలో ఈ జమీందారీ రైతు ఉద్యమం వెంకటగిరి,మునగాల యస్టేటు రైతుల బాధలతో, శ్రీ రంగాగారి నాయకత్వమున,నెల్లూరి వెంకట్రామ నాయుడు, రెబ్బాప్రెగడ మందేశ్వరశర్మగార్ల సహాయంతో ఆరంభమై,ఆంధ్ర దేశమంతటా అభివృద్ధిగాంచి,భారతదేశమంతటా బహుముఖముల వ్యాపించి చరిత్రప్రసిద్ధమైన అనేక పోరాటములను

సాగించి రైతువీరుల త్యాగాగ్నిచే దీప్తిగాంచి జమీందారీ విధాన నిర్మూలనకు కారణభూతమైనది.

కాంగ్రెసు ఆదిలో తాటస్థ్యము వహించినా తర్వాత ఈ ఉద్యమానికి చేయూతనిచ్చింది. అభివృద్ధి నిరోధకులగు ఈ జమీందారులు 1937లో కాంగ్రెసుతో పోటీచేశారు. కాని జమీందారులవల్ల కష్టనష్టాలన్నీ అనుభవించిన రైతాంగం యెన్నికలలో కూడ వారుపెట్టిన తీవ్రబాధ నిరోధములకన్నింటినిధైర్యంతో యెదుర్కొని కాంగ్రెసుకే ఓటు చేసింది.

ఎన్నికల ప్రణాళికలో జమీందారీ విధానము రద్దు చేస్తామని కాంగ్రెసు ప్రకటించింది. మద్రాసు రాజధానిలో కాంగ్రెసు అఖండ జయము గాంచింది. కాంగ్రెసువారు మంత్రిపదవులను స్వీకరించారు. ప్రధానమంత్రి చక్రవర్తుల రాజగోపాలాచార్యులు, రివిన్యూమంత్రి ఆంధ్రకేసరి ప్రకాశం పంతులు, స్పీకరు మహర్షి సాంబమూర్తిగారలు అయ్యారు.

కాంగ్రెసు వాగ్దానం ప్రకారం ప్రకాశపంతులుగారు జమీందారీ కమిటీని ఏర్పాటుచేసి దేశమంతటా సంచారం చేసి రైతులను విచారించి పెద్దరిపోర్టును తయారుచేశారు.

గొట్టిపాటి బ్రహ్మయ్యగారు రైతుఉద్యమ సారధులలో ఒకరు. ఆయన అనేక జమీందారీ రైతు సభలకు అధ్యక్షతవహించి దీనికి అండదండగా వుండెను. జమీందారీ రైతు ఉద్యమములో ఆయన మునగాల రైతులకు జమీందారునకు చేసిన పరిష్కారము చరిత్ర ప్రసిద్ధమైనది.

1937లో ఆయన, ఆంధ్రరాష్ట్ర కాంగ్రెసు సంఘమునకు కార్యదర్శిగావుండి; జమీందారీ కాంగ్రెసు ఉప

సంఘ సభ్యుడుగా వుండిఉూ జమీందారీ రైతులకు అధిక కృషి చేశారు.

ఆంధ్రదేశములో రైతు నాయకుడుగా ప్రసిద్ధిగాంచి, కిసాన్ వెంకట సుబ్బయ్య అని ప్రఖ్యాతిగాంచిన గోగ్రెపాటి వెంకటసుబ్బయ్యగారు రాత్రనక పగలనక రెండున్నర సంవత్సరములు కష్టపడి, రైతులను సమీకరించి జమీందారీ కమిటీ ముందు సాక్ష్యములనిప్పించిన సంగతి సర్వజన విదితము.

రైతు, రైతు అనుమాట, ఆయనకు రామనామ స్మరణ అయినది. ఆయన తన జీవితాన్నే రైతు ఉద్యమానికి అంకిత మిచ్చిన రైతుబాంధవుడు. ఆచార్య రంగాకు అన్ని ఉద్యమములలో కుడిభుజముగా నిలచి ప్రసిద్ధిగావించిన రైతు హితాభిలాషి.

జమీందారు సాముదాయక భూములను ఆక్రమించు కోకుండా వెంకటసుబ్బయ్యగారు ఎదిరించాడు. ఈస్టుబ్యాంకి కెనాల్ భూములకు అదనపు శిస్తులు వేయాలని రాజాగారు సంకల్పించినపుడు ఆందోళన ద్వారా అరికట్టాడు. లక్ష్మీపురపు అడవి జమీందారు అమ్మచూపినపుడు ఆయనకు హక్కు లేదని హెచ్చరిస్తూ ప్రకటనలు చేశాడు. ఈ విధంగా యెస్టేటు రైతులకు అండగా నిలచాడు.

ఈ రచయిత 1944లో జమీందారీ పుట్టు పూర్వోత్తరాలు, రైతుల బాధలు, జమీందారీ రైతు నాయకుల ఉద్యమాలు, జమీందారుల దోపిడీలను సాంగోపాంగముగా 'మన జమీందారీలు' అనే గ్రంథం వ్రాసి జమీందారీ

విధానము రద్దుకావాలని ప్రబోధించి రద్దు తప్పక అగునని సూచించి జమీందారీ విధానము రద్దగుటకు తోడ్పడ్డాడు.

1937లో ప్రకాశం కమిటీ ఫలితమే 1947. 3. 28లో రామస్వామిరెడ్డియార్ ప్రధానమంత్రిత్వాన్ని స్వీకరించగా, కళా వెంకట్రావుగారు రెవిన్యూ మంత్రిగావుండి జమీందారీ రద్దు బిల్లును 1948 లో ప్రవేశపెట్టి కృతార్థుడాయెను.

ఎక్కడ కారన్‌వాలీసు? ఎక్కడ కళావెంకట్రావు? కారన్‌వాలీసు ప్రవేశపెట్టిన జమీందారీ విధానాన్ని కళా వెంకట్రావుగారు కలలోను ఇలలోను కనపడకుండా చేసినందున ఆయన నామం కలకాలం వుండగలదు.

ఈ చల్లపల్లి జమీ 1949. 8. 7న రద్దుకాబడినది.

ఘంటసాల గ్రామ రైతాంగం ఆ కాలంలో తమ హక్కులకు పోరాడి విజయంగాంచి విఖ్యాతి గాంచినది.

కాంగ్రెసు కాలంలో కాంగ్రెసుకు పెట్టని కోటగా నిలచిన ఘంటసాల ప్రజానాయకులు జమీందారీ రద్దు చట్టమునకు తమ శక్తినంతను వినియోగించి, తమ జన్మను సార్థకమొనర్చుకొనిరి.

"నేను సైతం ప్రపంచాగ్నికి
సమిధ నొక్కటి ధారవోశాను."

శ్రీ శ్రీ

# గాంధీయుగము

## మహాత్ముడు మకుటంలేని మానవలోక చక్రవర్తి.

ఈ ప్రపంచాన్ని పునీతం చేయడానికి ఇంతకుపూర్వం ఎందరో మహాపురుషులు జన్మించారు; యోగులు, త్యాగులు, మతప్రవక్తలు,మరెందరో రాజకీయ వేత్తలు అవతరించారు. ఇంకెందరో యోధాగ్రేసరులు ఈ భూమండలాన్ని జయించారు. మరికొందరు మహానాయకులున్నా ఆవిర్భవించకపోలేదు.

కాని మహాత్మునివంటి మహాపురుషుడు, పూర్ణ పురుషుడు, పురుషోత్తముడు ఇంతవరకు పుట్టలేదు. 'న భూతో, న భవిష్యతి'. మహాత్మునిలోని ఆ గొప్పతనము, ఆ విశిష్టత ఏది ? ఆయనకు ఈ ప్రపంచమంతా పాదాక్రాంతమై ప్రణమిల్లుతూ వుండడానికి కారణము ఏమిటి ?

ఆయన ప్రాచీనకాలపు ఋషియేగాక, ఆధునికకాలపు రాజకీయవేత్త. ఆరితేరిన ప్రజానాయకుడు. అహంకారయుతమైన పాశ్చాత్య ఖండాన్ని, అధఃపతనమైన ప్రాచ్యభూమిని తరింపచేయుటకు అవతరించిన మహాయోగి. అందుచేతనే ఆయనను మానవలోకం నేడు 'మహాత్ముడు' అని నోరారపిలుస్తున్నది; అంజలి ఇడుతున్నది; తమ హృదయకుహారాల్లో కూర్చోపెట్టుకొని పూజలు సల్పుతూ వున్నది.

పతితమై పదదళితమైన ప్రాచీన భారతభూమిని మరల ఒకసారి జ్యోతిగా వెలార్చి ప్రపంచానికి చేయెత్తి చూపినది

మహాత్ముడే. నిద్రాణమైన భారతజాతిలో ఆయన యెంతో చైతన్యము కలిగించాడు. అతిరథులను, మహారథులను సృష్టించాడు. మోతీలాల్ నెహ్రూ, చిత్తరంజన్ దాస్, సర్దార్ పటేల్, మౌలానావంటి నాయకులను సృష్టించాడు. వేయేల? లక్షలాది త్యాగమూర్తులను, వేలాది నాయకులను సృజించాడు. ఇంతకంటె ఆయన ఒక "నూతన జాతినే" తయారొనర్చిన శిల్పి అనడం ఒప్పుగా ఉంటుంది. తన దివ్య బోధనలవల్ల శతాబ్దములనుండి పరపాలనలో వున్న మనలో ఆత్మవిశ్వాసాన్ని, ఆత్మగౌరవాన్ని కలిగించాడు.

నేడు భారతవర్షానికి ఆయన యుగపురుషుడు. ఆయనతో యొక నూతన యుగోదయమయింది- గాంధీ యుగం. ఆయన మన వేషభాషల్లో, ఆచారవ్యవహారాల్లో మార్పు కలిగించాడు.

గాంధీ యుగంలో భారతావని పోరాటాలలోను, త్యాగశీలతలోను పునీతమైనది.

ఆ బుద్ధభగవాను డుపదేశించిన, విశ్వప్రేమ సర్వజనీన నైతిక శీలవిధులు మన భారతదేశంలో, మనందరి ఆలోచనలకు దృక్పథాలకు పునాదులైనవి; మన దైనందిన ఆచార వ్యవహారాల్లో భాగాలై పోయినవి.

అనంతరం మహాత్ములనేకు లుద్భవించారు. వారందరు ఆ విశ్వప్రేమను, నిస్స్వార్థ సేవల సత్సంప్రదాయాన్ని మరింత పురోగమింప జేశారు. ఆ సత్యశీల విధులంటే అచంచల విశ్వాసాన్ని ప్రకటించారు; సర్వమానవ సౌభ్రాతృత్వాన్ని

సర్వమానవ సమానత్వాన్ని, సమతా ధర్మాన్ని చాటి చెప్పారు.

ఆ బోధనలను తన నిత్యజీవితానికి మన దేశీయ పోరాటానికి అన్వయించి ఆచరించ యత్నించిన మహావ్యక్తి ఒకరు మనమధ్యకు వచ్చారు.

మన కాలంలో మన కళ్ళముందు ఈ ఉన్నత సందేశాలను సాధించి మహా విజయాన్ని చూడగలిగే సౌభాగ్యం మనందరికి కలిగింది.

పారతంత్ర్య భారతావనిలో మహాత్ముడు చైతన్య జ్యోతిని వెలిగించాడు. ప్రపంచం కనీవినీ ఎరుగని శాంతి సమరాన్ని నడిపాడు. అశేషభారత ప్రజలను స్వాతంత్ర్యరాగ రంజితులను జేసి ధర్మవీరుడైనాడు.

ఆయన నిర్మకుట మానవలోక చక్రవర్తి. అశేష మానవలోకానికి నాయకత్వం వహించిన పూజ్యుడు. అట్టి ఆయనకు సహచరులమై, సమకాలికులమై ఉండుట మన భాగ్యం. భారత ప్రజకల్పాంతంవరకు ఆయన ఋణం తీర్చు కొనజాలదు.

## 1917

ఘంటసాల చరిత్రలో 1917 ఒక ముఖ్యఘట్టం.

ఆ రోజులలో పల్లెటూళ్ళనుండి బందరు వచ్చి చదువు కొనే వారిలో ఘంటసాల, కవుతరం విద్యార్థుల సంఖ్య అధికం. కవుతరంనుండి వచ్చుటకు కారణం కీ. శే. కట్టమంచి కొళందరెడ్డిగారు స్థాపించిన జాతీయ విద్యాలయ ప్రభావము;

అందులో ఆచార్యుడుగా ఉండిన చెరుకువాడ వేంకట నరసింహాం పంతులుగారి ప్రతిభ.

ఘంటసాల గ్రామస్తులు వివిధ తరగతులలో చదువుకొనేవారు 17 గురు ఉండేవారు. గొర్రెపాటి వెంకటేశ్వర్లు నాగపూరు చదువుటకెళ్ళి విషజ్వరంవల్ల కీర్తిశేషులగుట జరిగింది. ఆయనతోనే అక్కడకు విద్యాభ్యాసం కొరకు వెళ్ళిన అయినపూడి గోపాలకృష్ణయ్య అక్కడ ప్లేగు వచ్చిన కారణాన వచ్చుట జరిగింది. కలకత్తాలో చదువుటకు వెళ్ళిన ఈ రచయిత కండ్ల జబ్బువల్ల విద్యకు స్వస్తి చెప్పుట జరిగింది. స్కూల్ ఫైనలు చదువుట కెళ్ళిన వేమూరి సీతారామయ్య కీళ్ళవాతం వలన ఇంటికి తిరిగి రావలసి వచ్చింది. గొట్టిపాటి బ్రహ్మయ్య స్కూలు ఫైనలు చదువుతూ జ్వరపడి నందున విద్యకు ఆటంక మేర్పడినది.

వీరందరూ విద్యావంతులు కాకపోయినా బందరు జాతీయ నాయకులగు డాక్టరు పట్టాభి సీతారామయ్య, కోపల్లె హనుమంతరావు, ముట్నూరి కృష్ణారావు, కౌతా శ్రీరామ శాస్త్రిగార్లు మొదలగు పూజ్యులతో పరిచయ భాగ్యము కలిగి వారి అడుగు జాడలలో సంచరించే అదృష్టము కలుగుట వారికిని ఘంటసాలకును దేశమునకును అధిక ప్రయోజనం కలిగించినది.

తన స్మృతులలో గొట్టిపాటి బ్రహ్మయ్యగారు ఇలా వ్రాశారు. "ఆంగ్లవిద్యకు దైవ ప్రేరణచే స్వస్తి చెప్పుట జరిగింది. ఫలితము, రాజకీయరంగమున, స్వరాజ్య సంరంభమున, వివిధ దశలందును మా గ్రామం సముచిత పాత్ర



డాక్టరు పట్టాభి సీతారామయ్యగారు



కోపల్లె హనుమంతరావుగారు

వహించి, స్వరాజ్య సంసిద్ధిగో సక్రమ పాలుపంచుకొనుట దైవ ప్రసాదమనే భావించుచున్నాను." ఇది అక్షరాలా సత్యము.

## కాంగ్రెసు లీగ్ స్కీమ్

రాజద్రోహనేరం క్రింద శిక్షింపబడిన బాలగంగాధర్ తిలక్ 1914లో జైలునుండి విడుదలై వచ్చెను. 1914_8_14 తారీఖున ఐరోపా ప్రధమ సంగ్రామము ఆరంభమయ్యెను. ప్రభుత్వమునకు ప్రజా సహాయము కావలసి వచ్చెను. అనిబిసెంటమ్మ స్వరాజ్యాందోళన ప్రారంభించెను. ఆమె ఇట్లు మద్రాసు ప్రాంతమున ప్రారంభించగా, లోకమాన్య తిలక్ మాకు మీరు సహాయము చేసినచో మీకు మేము సహాయము చేసెదమని ఆయనకూడ, స్వరాజ్యము నా జన్మహక్కు, నేను పొందితీరెదనని ఆందోళన చేయసాగెను. ప్రభుత్వం దమననీతి సాగించెను. అనిబిసెంటమ్మను ఆమె అనుచరులను ప్రవాసమునకు పంపెను. ఏమి పంపినను ఈ ఆందోళన వృధా కాలేదు. "హిందూదేశమునకు స్వపరిపాలన ఇవ్వటమే మా బ్రిటిషుపరిపాలన లక్ష్యమని" 1917వ సం॥ము ఆగష్టులో ఇండియా మంత్రి మాంటేగు పార్లమెంటు సభలో చరిత్ర ప్రసిద్ధమగు ప్రకటన కావించెను.

ఈ ప్రకటనకు అనుకూలముగా ఇండియాకు ఎట్టి స్వాతంత్ర్యము కావలయునో విచారించుటకై మాంటేగు మనదేశమునకు వచ్చెను. తిలక్ వాక్బంధమును తీయించెను. అనిబిసెంటమ్మను విడిపించెను. దేశంలో ప్రశాంత వాతావరణమును కలిగించెను.

1913లో జరిగిన కరాచీ కాంగ్రెసులో కాంగ్రెసు వారు ముస్లింలీగువారు కలసి ఒక రాజ్యాంగ ప్రణాళికను తయారు చేయవలెనని తీర్మానించి ఒక కమిటీని యేర్పాటు చేసిరి. 1916లో వారు సమావేశమై ఒక ప్రణాళికను సిద్ధపరచిరి. ఈ ప్రణాళికను ఇండియాలో అందరిచేత సంతకములు చేయించుటకై కాంగ్రెసు ప్రచారకులు పల్లె పల్లెకూ ఇంటింటికీ వెళ్ళి కోటానుకోట్ల సంతకములు చేయించిరి. ఇట్లా సంతకములు చేయించుటద్వారా గ్రామాలకు స్వరాజ్య సందేశాన్ని వ్యాపింపచేయాలనే భావం గాంధీజీది.

అప్పుడే స్కూళ్ళు మానివచ్చిన యువకులు గొట్టిపాటి బ్రహ్మయ్య, గొర్రెపాటి వెంకట సుబ్బయ్య, వేమూరి సీతారామయ్య మొదలగువారు ఈ గ్రామములోను చుట్టు ప్రక్కల గ్రామాదులలోను ఇంటింటికీ తిరిగి 1917లో అధిక శ్రమపడి సంతకములు చేయించి పట్టాభి సీతారామయ్యగారి వద్దకు పంపిరి.

ఈ యువజన వర్గానికి ఓం ప్రథమంగా ఈ విధంగా కాంగ్రెసు సేవాదీక్ష ప్రారంభమాయెను.

## సహాయ నిరాకరణము

ప్రపంచ ప్రథమ సంగ్రామం 1914లో ప్రారంభింపబడి 1918లో ముగిసెను. యుద్ధం ముగియుటతోనే ప్రభుత్వ దృష్టి మారినది. ప్రజలందరు ఐక్యకంఠంతో ఖండించినను దేశములో రాజకీయాందోళన లేకుండా చేయుటకుగాను బ్రహ్మాస్త్రంవలె రౌలెట్ యాక్టును చేసిరి. ఇందువల్ల హిందూ

దేశమంతా రాజద్రోహకరమైనదని ఎంచవచ్చు. పోలీసులకు సర్వాధికారములు ఇవ్వబడెను. 1919_4_6 తారీఖున ఈ అన్యాయ శాసనమును ఖండించుచూ దేశమంతయు హరతాళముచేసి ఉపవాసము చేయవలసిందని గాంధీమహాత్ముడు ఉపదేశించెను. భరతఖండము ఈ శాసనమునెంత అవమానకరముగా ఎంచినది ప్రపంచమునకు ఇందుమూలముగా తెలిసినది. ప్రభుత్వం వారీ హరతాళమును ఆపుటకు అధికంగా ప్రయత్నించుటేగాక కలకత్తా, ఢిల్లీ, పంజాబులలో తుపాకులనుకూడా ప్రేల్చిరి. అనేకులు హతులైరి. ఏప్రిల్ 13వ తేదీన అమృతసరులోని జలియన్‌వాలా బాగ్‌లో జనరల్ డయ్యర్ శాంతియుతముగ జరుగుచున్న సభపై తన మందుగుండు సామానంతా అగువరకు కాల్పించెను.

మహాత్ముని ఆజ్ఞ చేత ప్రతి సంవత్సరం ఏప్రిల్ 6 లగాయతు 13 వరకు జాతీయ వారంగా భావింపబడుచుండెను.

పంజాబు హత్యాలను విచారించుటకు ప్రభుత్వంవారిచే నియమించబడిన హంటర్ కమిటీ దోషమంతా సత్యాగ్రహులపై మోపి బ్రిటీషు ఉద్యోగులు చేసిన నేరమును కప్పి పుచ్చెను. ఈ కమిటీపై పార్లమెంటుకూడా విచారించి న్యాయమని చెప్పుటచే బ్రిటీషు న్యాయమందు ప్రజలకు పూర్తిగా విశ్వాసము పోయినది.

యూరపు సమితిలో మిత్ర రాజ్యములన్నీ టర్కీ దేశమును పంచుకొనుటచే మహమ్మదీయ దేశములన్నీ కలసి ఖిలాపతు ఉద్యమము ఆరంభించెను. దీనికిని గాంధీజీ నాయకత్వము వహించెను.

పంజాబు హత్యలను, టర్కీ విచ్ఛిత్తిని గూర్చి దుఃఖించు దేశీయులకు, ప్రభుత్వమునకుఃసహాయనిరాకరణము చేయవలసినదని చెప్పెను. కాని అప్పుడు దేశంలోని కొందరు నాయకులు సహాయ నిరాకరణోద్యమములోని కొన్ని విష యాలలో భేదాభిప్రాయులగుటచే దేశాభిప్రాయమును తెలుసుకొనుటకై 1920. సెప్టెంబరులో లాలా లజపతిరాయ్ అధ్యక్షత క్రింద కలకత్తాలో అవసర దేశీయ మహాసభ జరిపెను. ఆ సభలో గాంధీమహాత్ముడు "ప్రభుత్వంవారు తమశక్తిని, బిరుదులు, పాఠశాలలు, కోర్టులు, శాసనసభల ద్వారా బలపర్చుకొనుచున్నారు గాన ప్రస్తుత సందిగ్ధస్థితిలో మనం సంపూర్ణ త్యాగంతో ప్రభుత్వమునకు అన్ని విధముల సహాయం చేయుట మానవలసింద"ని తీర్మానము పెట్టెను. అది ఆమోదింపబడెను.

కాంగ్రెసులో గాంధీ మహాత్ముని తీర్మానం గెల్చుట తోడనే దేశంలో నల్దెడల అసహాయోద్యమము ఆరంభ మయ్యెను. అనేకులు ప్రభుత్వోద్యోగముల మానిరి. పంచా యితీ కోర్టులు నెలకొల్పబడెను. మద్యపాన నిషేధం ఎక్కువయ్యెను. ఖద్దరు ప్రచారం కాజొచ్చెను.

ఇక ఈ ఉద్యమం ఘంటసాలలో ఎట్లు సాగెనో కను గొందము.

## దివితాలూకా కాంగ్రెసు సభ

మహాత్ముడు అసహాయోద్యమము ఆరంభించెను. దేశ మంతట నూతన చైతన్యము వెల్లి విరిసెను. అసహాయోద్యమ

ప్రచారమునకు గాను 1920-10-10 తారీఖున యువకులకు ఉత్సాహము కలిగించిన పెద్దవాడు ఉత్సాహవంతుడును, విద్యాభిమానియగు గొర్రెపాటి వెంకటరత్నంగారు (తండ్రి బహ్మన్నగారు) ఆహ్వాన సంఘాధ్యక్షుడుగనుండి తన ఉపన్యాసమునందు కాంగ్రెసు తీర్మానములను అమలు పెట్టవలసిన ఆవశ్యకతను గురించి ముచ్చటించి, అరుదెంచిన సభ్యులకు అధ్యక్షునకు స్వాగత మిచ్చెను. ఈ తాలూకాలో అప్పటిలో కాంగ్రెసు అభిమాని రాజకీయాలలో ప్రవేశము గల, కావూరి కోదండ రామయ్యగారు అధ్యక్షత వహించి, సభావశ్యకతను గురించి ఉపన్యసించారు.

తాలూకా అంతటినుండి వేలాది ప్రజ పాల్గొన్నారు. మహాత్ముని పిలుపువిని వెంటనే తన ఉద్యోగాన్ని వదలిన కొడాలి ఆంజనేయులుగారు రావటంతో మరింత ఉత్సాహం ఉప్పొంగింది. చెఱుకువాడ వెంకట నరసింహం, కొడాలి శివరామకృష్ణారావు, కానూరి వెంకట చలపతయ్యగార్లు మొదలగు ప్రముఖులు ఉపన్యసించారు. ఈ సభ తాలూకాలో అధిక చైతన్యం కలిగించింది. ఈ తాలూకాలోనేగాక ఈ జిల్లా అంతటిలోను జరిగిన మొదటి రాజకీయసభ యిది.

## ఖాళీ పెట్టెలు

1920లో శాసన సభా ఎన్నికలు వచ్చినవి. మహాత్ముని ఆదేశాన్ననుసరించి కాంగ్రెసు శాసనసభా బహిష్కారం ప్రకటించింది. అందువల్లనే అయ్యదేవర కాళేశ్వరరావు, కానూరి వెంకట చలపతయ్య గార్లవంటి కాంగ్రెసు వాదులు

తమ అభ్యర్థిత్వాలను వదలుకొన్నారు. ముట్నూరికృష్ణరావు, చెఱుకువాడ నరసింహం, బోడి నారాయణరావుగార్ల వంటి పెద్దలతో గొట్టిపాటి బ్రహ్మయ్య, గొర్రెపాటి వెంకటసుబ్బయ్యలు కలసి కాంగ్రెసుప్రచారం చేశారు.

తాలూకా ప్రచారం పూర్తైనది. ఎన్నికలు సమీపించాయి. ఇక ఘంటసాల పోలింగులో ఒక ఓటుకూడా పడకుండా చూడాలని ఏక దీక్షతో యువతరం పని ప్రారంభించింది. అందుచేత పోలింగు ప్రదేశంలోని ప్రతి గ్రామంలోను ఓట్లు ఇవ్వవద్దని ప్రచారం చేయుట జరిగింది. ఘంటసాలలో వీధి వీధికి సభలు జరిపి విరివిగా ప్రబోధం కలిగించారు.

రేపు ఉదయము ఎన్నికలనగా ఘంటసాలలో ఆ రాత్రి ఆ రోజులలో అధికంగా ఉండే రామభజన సమాజము లన్నింటిని సమావేశ పరచి కోలాహలంగా వారిచే భజనలు చేయించి, దేవాలయంముందు పెద్దసభ నొకదానిని ఏర్పాటు చేసి, మర్నాడు ఉదయము గ్రామస్థు లంతా పనులుమాని, మన పోలింగులోని గ్రామాదులకు వెళ్ళి ఓటర్లు ఎవ్వరూ ఓటు చేయకుండా చూడాలని ఇక్కడ పోలింగు దగ్గర సుశిక్షితులవలె మెలిగే కొందరు ఉండాలని ఇలా కాంగ్రెసు ఆదేశానుసారము పనిచేసి గ్రామానికి దేశానికి ప్రతిష్ఠ సంపాదించ వలసిందని బ్రహ్మయ్య, సుబ్బయ్య ప్రభృతులు హెచ్చరించారు. తదనుసారంగా కార్యవిభజన కూడ జరిగింది.

తెల్లవారేసరికి ఈ పోలింగ్ ప్రదేశంలోని వివిధ గ్రామాలకు ఉత్సాహవంతులైన యువజనులంతా వెళ్ళారు. ఓటర్లెవ్వరూ పోలింగు స్టేషన్లకు పోకుండా అమితోత్సాహ దీక్షతో పనిచేశారు.

పోలింగ్ స్టేషన్ వద్ద బ్రహ్మయ్య, సుబ్బయ్య, వేమూరి సీతారామయ్య మొదలగు కాంగ్రెసు ఆజ్ఞలను శిరసావహించువారు నిలబడి, గ్రామాలనుండివచ్చిన గ్రామోద్యోగులకు కాంగ్రెసు ఆజ్ఞలను మన్నించవలసిందిగా హెచ్చరించారు.

సాయంకాలమైనప్పటికి ఒక్క ఓటుకూడా పడలేదు. పోలింగు ఆఫీసర్లు ఆశ్చర్యచకితులై కూర్చున్నారు. గ్రామోద్యోగులలో కొందరకు ప్రభుత్వం వారివల్ల తమకు ఏదైనా మాట వస్తుందేమోనని సందేహంకలిగింది. అప్పటికి సాయంత్రం గం 4 అయినది. పోలింగ్‌కు ఇంకా రెండుగంటల కాలమున్నది. గ్రామోద్యోగులు ఓటు వేసేయెడల గ్రామానికి ప్రతిష్ఠఉండదు.

అందుకని అప్పుడు గొట్టిపాటి బ్రహ్మయ్య, ఈ రచయిత ఆనాడు జమీందారీ పోరాటాలలో ప్రముఖ పాత్ర వహించిన బాలకృష్ణమ్మగారి కుమారుడును, ఘంటసాల గ్రామ మునసబగు వెంకట నరసింహంగారి వద్దకువెళ్ళి "మన గ్రామానికి గొప్ప పేరు ప్రతిష్టలువచ్చే ఈ సుముహూర్తాన్ని మనం సరిగా ఉపయోగించుకోవాలి. మీరు సాహసించి ఓటు వేయనని ప్రకటిస్తే యితరగ్రామాధికార్లు చేయరు" అని బ్రహ్మయ్య కోరగా ఆయన గ్రామోద్యోగులందరిని ఒకచోట సమావేశ పరచి, ప్రజలందరకు వ్యతిరేకంగా మనం

ఓటు వేయటం ఏమీా న్యాయంగా నాకు కనబడటంలేదు. మనపై ఉద్యోగి ఎవరైనా మనలను పిలిపించి అడిగితే "మాగ్రామస్థులందరు మమ్ములను ఓటు వేయవద్దన్నారు. ప్రభుత్వంవారు ఓటుచేయుమని మాకు సర్క్యులరు పంపలేదు. ప్రజలను ధిక్కరిస్తే ప్రభుత్వపు అండైనా మాకు ఉంటుందనే హామీా ఏ ఉద్యోగస్థుడూ మాకు ఇవ్వలేదు. అందువల్ల ప్రజాభిప్రాయానికి కట్టుబడ్డామని చెబుదాం" అని అన్నారు. ఈ వాదనకు అదివరకే సుముఖంగా ఉన్న కొడాలి మునసబు తుమ్మల సీతారామయ్యగారు బలపర్చటం జరిగింది. అందరూ సరేనని ఓటు వేయకుండా ఖాళీపెట్టెలను జాగ్రత్తగా సీలు వేయించి పంపుటలో ఆఫీసర్లకు తోడ్పడ్డారు.

ఈ ప్రజా విజయానికి తోడ్పడిన గ్రామోద్యోగు లెల్లరు మన్ననలను పొందిరి.

అవకాశాలు అందరికీ వస్తాయి. వాటిని ఉపయోగించు కొనే తెలివితేటలు కొందరికే ఉంటాయి. ఈ అన్ని పోలింగు లలోను ఓట్లుఇవ్వటం, పోలింగునుండి ఖాళీపెట్టెలు పంపటం వల్ల ఘంటసాల పేరు ఆంధ్రదేశ మంతటా వ్యాప్తి గాంచినది. ♦ ఆ సమయమున కొంత కాలమువరకూ

---

♦ అట్లు ఖాళీ పెట్టెలు పంపిన తర్వాత ఈ గ్రామప్రముఖులలో ఒకరగు దోనేపూడి వెంకట్రాయులుగారు జిల్లా కోర్టునకు అసెసరుగా వెళ్ళగా, ఆయనవల్ల జిల్లా జడ్జి గ్రామ సంగతి సందర్భాలు విని ఆశ్చర్యపడ్డారు. పబ్లికు ప్రాసిక్యూటరుగా వున్న శెడింబి హనుమంతరావుగారు ఆ గ్రామ సంగతి సందర్భములన్నీ తమకు తెలుసునని, యీ ప్రాంతంలోకెల్ల చైతన్యవంతమై ఐక్యమత్యముగా మెలుగు గ్రామమని ప్రశంసించారు.

పెద్దలు, పిన్నలు యీ సంగతి చెప్పుకొంటూ ఘంటసాల వారిని అధిక మర్యాదగ చూచెడివారు.

### పన్నులు

1921 లో కాంగ్రెసు పన్నులు ఇవ్వవద్దని ఆదేశించింది. ఆ ఆదేశానుసారము ఈ గ్రామస్థులెవ్వరూ పన్నులు చెల్లించలేదు. ఉద్యోగులు మాగాణికి నీరు ఇవ్వమని భూములను జప్తు చేస్తామని బెదరించారు. అయినా రైతులు పట్టువిడువలేదు. కాంగ్రెసు ఆజ్ఞాపించిన పిమ్మటనే పన్నులు ప్రభుత్వానికిచ్చారు.

### పంచాయితీ సభ

కాంగ్రెసు కోర్టులనుకూడా బహిష్కరించింది. కనుక గ్రామంనుండి ఏ వ్యవహారము కోర్టుకు పోకూడదనుకొని తలంచారు. కాంగ్రెసు యువకులు గ్రామంలోని పెద్దలను కలుసుకొని వారితో ముందు సంప్రదించి ఒక పంచాయితీ సభను ఏర్పాటు చేయతలచారు దానిలో ఒక కార్యనిర్వాహక వర్గం ఏర్పడి నియమావళిని ఏర్పాటు చేసింది. ఈ సభకు గొర్రెపాటి బ్రహ్మన్నగారి కుమారుడు వెంకయ్యగారు అధ్యక్షుడు, గొట్టిపాటి బ్రహ్మయ్య గారు కార్యదర్శి, గొర్రెపాటి వెంకయ్య, యీ సుబ్బయ్య గారలు సహాయ కార్యదర్శులు.

ఈ పంచాయితీ సభలో హరిజనులతోసహా అన్ని వర్ణాలలోను పంచాయితీ చెప్పటకు నూరుగురు వ్యక్తుల పేర్లు గల పట్టీ ఒకటి తయారు చేశారు.

గ్రామంలో ఏదైనా తగాదా వస్తే ఇరుపక్షాలవారు చెరొక మధ్యవర్తిని, ఆ మధ్యవర్తులిద్దరూ కలసి మరొక పెద్దమనిషిని, ఎన్నుకొనడంద్వారా వ్యవహారాలన్నీ పరిష్కారమవుతూండేవి.

ఈ పంచాయితీ సభ 1921_12_12 న ఏర్పాటు కాబడి చాలా కాలంవరకు గ్రామంలోని సివిల్, క్రిమినల్ వ్యవహారాలను పరిష్కరిస్తూ ప్రఖ్యాతి గాంచింది ♦

## మద్యపాన నిషేధం

మద్యపాన నిషేధంలోనూ మంచి కృషే జరిగింది.

1921 లో తాళ్ళు గీతకు పనికిరాకుండా ఆకులన్నీ కొట్టించుట జరిగింది.

1922 లో కల్లు సారా పాటలు ఎవరూ పాడకుండా గ్రామస్తులు గట్టికృషి చేసిరి.

---

♦ ఈ పంచాయితీ సభ బాగా పనిచేస్తున్నందున పోలీసు సర్కిల్ ఇన్స్పెక్టరు వెంకటప్పయ్యనాయుడుగారు 1923 లో చల్లపల్లి క్యాంపునకు దీని కధ్యక్ష, కార్యదర్శులైన గొర్రెపాటి వెంకయ్య, గొట్టిపాటి బ్రహ్మయ్యగార్లను పిలిపించారు. అప్పుడు ఆయన "క్రిమినల్ కేసులు రాకుండా చేస్తున్నారు. మీ పంచాయితీ కోర్టు ఎక్కడ ?" అని ప్రశ్నించాడు. దానికి బదులుగా బ్రహ్మయ్యగారు "మా వ్యవహారాలన్నీ చెట్ల క్రిందనే పరిష్కారం చేసుకొంటున్నాం. సివిలో, క్రిమినలో మా వ్యవహారాలు మేము పరిష్కారం చేసుకోవడం తప్పా ?" అన్నాడు. సర్కిల్ ఇన్స్పెక్టరు బెదరింపులకు బ్రహ్మయ్యగారు లొంగనందున ఆయన, పై వారికి సమాధానం కోసం యేదో రిపోర్టు వ్రాసి పంపారట.

## ఎన్నికలు

1923 లో జరుగు శాసనసభ ఎన్నిక సందర్భములో ఓట్లు ఇవ్వదలచినవారు ఇవ్వవచ్చునని కాంగ్రెసు తీర్మానించింది. శ్రీ వెలమూడి గోపాలకృష్ణయ్య, మాగంటిసీతయ్య కానుమిల్లి సర్వారాయుడు, బొల్లిన నారాయణస్వామి నాయుడు, పెనుమత్స పెద్దిరాజు, కట్టమంచి కోళంద రెడ్డి గార్లు మొదలగువారు అభ్యర్థులుగా నిలబడ్డారు.

కమ్మవారిలో కొందరు పైన పేర్కొన్న నలుగురి కమ్మవారికే ఓట్లు ఇవ్వాలని ప్రచారం సాగించారు. కాంగ్రెసు వాదులగు గొట్టిపాటి బ్రహ్మయ్యగారు ప్రభృతులు కుల తత్వాలు పనికిరావని చెప్పుతూ కాంగ్రెసు సుముఖులైన జాతీయ వాదులగు పెనుమత్స పెద్దిరాజు, మాగంటి సీతయ్య గార్లకు ఓట్లు విధిగా ఇవ్వవలసినదని ప్రబోధిస్తూ కమ్మ సంఘీయుడును, జస్టిసుపార్టీ సభ్యుడును, లోగడ శాసన సభా సభ్యుడును అగు శ్రీ వెలమూడి గోపాలకృష్ణయ్యగారు కాంగ్రెసు సిద్ధాంతాలను ఖండించినందున ఆయనకు సుతరాము ఓట్లు ఇవ్వవలదని హెచ్చరించడమైనది. ఇట్లా ఘంటసాలలోను చుట్టుప్రక్కల గ్రామాలలోను తాలూకాలో గూడ ప్రచారం చేయబడినది. ఘంటసాలలో కాంగ్రెసు సుముఖులకే ఓట్లు ఇచ్చుట జరిగినది.

## ఖద్దరు

గాంధీమహాత్ముడు రాట్నచక్రాన్ని చేపట్టి బ్రిటీషు ప్రభుత్వాన్ని ఢీకొన్నాడు. ఇంతేకాదు, ఇది బీదసాదలకు

శాస్త్ర ఊపిరి సలిపేటట్లుగా ఆర్థిక ఉపశాంతిని కలిగిస్తుంది. అనవసరమైన కాలాన్ని సద్వినియోగం చేస్తుంది. ( From waste to wealth) ఈఖద్దరు కాంగ్రెసువారికి దీక్షావస్త్రాలు. ఇది భాతృభావాన్ని పెంపొందిస్తుంది. సాదా జీవనాన్ని నెలకొల్పుతుంది. ఇవన్నీ గ్రహించి గాంధీమహాత్ముడు ఖద్దరు ప్రచారం సాగించాడు. అడపల పైకెక్కిన రాట్నాల నన్నింటిని గ్రామస్తులు దింపారు.

ఖద్దరు కార్యక్రమములోను ఇక్కడ తక్కువ జరగలేదు. 1924 ఆగస్టు 10 వ తారీఖున బ్రహ్మయ్య, యీ రచయిత, వేమూరి సీతారామయ్య, యీ నాగయ్య, ఈ వెంకటరత్నం, గొర్రెపాటి నరసింహం, యీ వెంకటసుబ్బయ్య, దోనేపూడి సీతారామయ్యగారలు మున్నగువారు కలసి 10,000 ల పెట్టుబడితో దేశోద్ధారక నాగేశ్వరరావు ఖద్దరు సంఘమును స్థాపించి ఖద్దరోత్పత్తికి తోడ్పడుట జరిగినది. ఆనాడు ఈ గ్రామములో ఇంటింటా రాట్నములుండేవి. ఈ సంఘం అఖిలభారత చరఖా సంఘంవారి శాఖను 1929లో స్థాపించే వరకు సక్రమముగా పనిచేసింది.

ఇచ్చట ఖాదీ ఉత్పత్తి ఉన్నతస్థానం ఆక్రమించినది. ఈ నేతపని వారు కల్తీచేయక మర్యాదగా సంచరించుట చేతను, చక్కగా నేయుట చేతను ఘంటసాల ఖద్దరు మన్నికలో మంచి నాణ్యముగలదని ప్రసిద్ధి గాంచెను. బొంబాయి, గుజరాతు మున్నగు ప్రాంతాలవారు ఘంటసాల ఖద్దరును కోరి తెప్పించుకొనేవారు

నేటికిని ఇక్కడ మూడు ఖద్దరు డిపోలుగలవు. దివి తాలూకాలో ఏర్పడిన సర్వోదయ సంఘంక్రింద గొర్రెపాటి సీతారామయ్య, పాపులూరి సుబ్బయ్యగార్లచే రెండూను, మూడవది జ్ఞానోదయ చేనేత సంఘంవారిచే నడుప బడు చున్నవి. ఖద్దరు కట్టువారు అధిక సంఖ్యాకులు కలరు.

## హిందీ

ఇంతవరకు భారతీయులందరు కలసి సభలలోను సమావేశములలోను వ్యవహరించే భాష ఇంగ్లీషు. అది పరభాష. భారతదేశ భాషలలో అధిక సంఖ్యాకులు మాట్లాడే భాష హిందీ. దానిని జాతీయభాషగా గ్రహించి ప్రచారం చేసిన దేశంలో జాతీయ ఐక్యతకు తోడ్పడగలదని గాంధీమహాత్ముడు అభిప్రాయపడ్డాడు. ఉత్తర దేశీయులకు హిందీ అందరకు తెలిసినదే. ఇక దక్షిణ దేశంలోనే అది అధిక ప్రచారం కావలసింది. అందుకుగాను మొట్టమొదట గాంధీ మహాత్ముడు మద్రాసులో తన కుమారుడు దేవదాసు గాంధీని హిందీప్రచారంకొరకు నియమించాడు. అనంతరం మద్రాసులో దక్షిణ భారత హిందీప్రచార సభ ప్రారంభమై దానిద్వారా ఆంధ్రద్రవిడ కర్నాటకాది ప్రాంతాలలో ప్రచారం సాగుతూ వచ్చింది.

హిందీ ప్రచారోద్యమ ప్రారంభకాలంలో ఆంధ్ర పత్రికలో హిందీ పాఠాలను, వ్యాసాలను దేవనాగరి, తెలుగు లిపులలో ప్రచురించి హిందీప్రచారము సాగుతూవచ్చింది. అలాగే కృష్ణాపత్రికలో పండిత హృషీకేశశర్మగారు హిందీ

పాఠాలను ప్రచురిస్తూ ఉండేవారు. అందువలనే గాక ఆంధ్రులు ప్రారంభంనుండి హిందీకి సుముఖులు కాంగ్రెసు అభిమానంగల గ్రామాలలో ప్రచారమునకుగాను హిందీ పాఠశాలలను నెలకొల్పుట ఆనాడు ఆచారమై యుండెను.

ఇక్కడికి 1942లో హిందీనేర్చుకొనుటకుగాను ఉన్నవ రాజగోపాలకృష్ణయ్యగారిని ఆహ్వానించి వారివద్ద హిందీ కొందరు నేర్చుకోవడం జరిగింది. వీరి అనంతరం అయినం పూడి గురునాథరావుగారుకూడా ఉండి కొంతకాలం హిందీ ప్రచారం చేశారు.

అటు పిమ్మట చింతలపాటి లక్ష్మీనరసింహశాస్త్రిగారు హిందూస్తానీ ప్రేమీమండలిని స్థాపించి దానికాయన నూట పదహారు లిచ్చుటేగాక గౌరవ ప్రచారకుడుగా రాత్రిం బవళ్ళు ప్రచారంచేస్తూండడంవల్లనే ఇక్కడ పరీక్షలకు కేంద్రమేర్పడినది. ఈ గ్రామంలో హిందూస్థానీ అధికంగా ప్రచారమవడానికి ఆయన కృషి చేశాడు.

## ఎన్నికలు

1926 లో సభకు ఎన్నికలు వచ్చెను. కాంగ్రెసు అభ్యర్థులుగా అయ్యదేవర కాళేశ్వరరావు, కొల్లిపర సూరయ్యగారలు నిలబడిరి. జిల్లాబోర్డు అధ్యక్షులగు మీర్జాపురం రాజా, అడుసుమిల్లి గోపాలకృష్ణయ్యగారలు జస్టిసు పక్షాన నిల్చారు. కట్టమంచి కోశందరెడ్డిగారు స్వతంత్రంగా నిలబడ్డారు.

మీర్జాపురంవారు తమ ఏజంట్లద్వారా ఈప్రాంతంలో కొందరి ప్రముఖుల పేర్లు తమ మానిఫెస్టోలో ఉదహరించారు. అట్లాగే కొళందరెడ్డిగారునూ చేశారు. ఈ మానిఫెస్టోలో ప్రకటించిన ప్రముఖులద్వారా తమ అభ్యర్థిత్వాలను బలపర్చుకొని ఓట్లు సంపాదింప తలచారు. నిజానికి దానిలో ప్రకటింపబడిన ప్రముఖులలో కొందరికి దానిసంగతే తెలియదు. అందులో కొంతమంది కాంగ్రెసు అనుకూలురు, మరికొంతమంది ప్రముఖులకు ఆ అభ్యర్థులకు ఏ సంబంధము లేదు. ఇందులో మోసాన్ని బ్రహ్మయ్యగారు గ్రహించి ఆయా ప్రముఖులను విచారించగా అందులో చాలామంది తమకు ఆ సంగతే తెలియదని తాము కాంగ్రెసుకు అనుకూలమని తెల్పారు. అంతట ఆయన జిల్లా అంతటా సంచారము గావించి మానిఫెస్టోలోని ప్రముఖుల నిజమైన ఉద్దేశాలను గురించి దానిలోని మోసాన్ని తెలియజేస్తూ వారి స్టేటుమెంట్లతో సహా పత్రికలలో ప్రకటించారు. ఘంటసాల పోలింగులో కాంగ్రెసుఅభ్యర్థులకే హెచ్చుఓట్లు పడినవి.

ఇక్కడ తనకు ఒక్కఓటుకూడా రాకపోవటమేగాక ఈ గ్రామపంచాయితీబోర్డు ప్రెసిడెంటుగు వేమూరి వెంకయ్యగారిచే, తన సంతకమును ఉపయోగించుకో వద్దని మీర్జాపురం వారికి నోటీసు ఇప్పించటంచేత ఈ గ్రామత్యాకాంట్రాక్టు తీసుకొని త్రవ్వించిన చెరువు పని నిమిత్తము రావలసిన రు. 2700-లు ఇవ్వకుండా చేశారు. ఈ చెరువు కాంట్రాక్టుపని గ్రామం తరఫున వేమూరి సీతారామయ్యగారు చేయించెను. ఈ సొమ్ము చాలాకాలం తరువాత

1927లో గొట్టిపాటి బ్రహ్మయ్యగారు తాలూకాబోర్డు ప్రెసిడెంటుఅయిన పిమ్మట గ్రామానికి రాబట్టుకోవడము జరిగింది.

## మహాత్ముని దర్శనభాగ్యం

గాంధీమహాత్ముడు ఖద్దరు నిధికై ఆంధ్రదేశంలో 1924 ఏప్రియల్‌లో సంచారం సాగించారు.

తూర్పు కృష్ణాలో పర్యటన చేసినపుడు గాంధీమహాత్ముని కారులో, పట్టాభి సీతారామయ్యగారు, కస్తూరిబాయి, శ్రీమతి ప్రభావతీదేవి (ఆశ్రమ నివాసిని) మొదలగువారుండిరి. వారి వెనుక కారులో కొండా వెంకటప్పయ్య, కాశీనాధుని నాగేశ్వరరావు, ముట్నూరి కృష్ణారావు, చెరుకువాడ వెంకట నరసింహం, కొడాలి ఆంజనేయులుగా ర్లుండిరి.

దివి తాలూకా పర్యటనలో మహాత్ముని కారులోఉండవలసినదిగా తూర్పు కృష్ణాజిల్లా కాంగ్రెసు అధ్యక్షుడగు బ్రహ్మయ్యగారిని పట్టాభి సీతారామయ్యగారు కోరారు. అదివరకు వారే వుండేవారు. బందరునుంచి బయలుదేరారు. బ్రహ్మయ్యగారు కారులో యెక్కగానే, పేరు, వయస్సు, వృత్తి, గ్రామం, భూవసతి, పంటలు కాంగ్రెసులో హోదా అడిగారు.

ఊరు వెళ్ళేముందు "ఈ ఊళ్ళో కాంగ్రెసు సంఘం వున్నదా? రాట్నాలు పని చేస్తున్నవా? మగ్గాలున్నవా? కల్లుదుకాణం వున్నదా?" అని అడిగేవారు. ఈ ప్రాంతంలో ఏయే పంటలు పండుతాయి? వ్యవసాయం గిట్టుబాటుగా వుందా?" అని అంతా భోగట్టా చేసేవారు మహాత్ముడు.

బందరునుంచి బయలుదేరినవారు వరుసగా దివితాలూకాలోని నిడుమోలు, చినముత్తేవి, కూచిపూడి, శార్లపూడి, నరసంపాలెం, మొవ్వ, కొడాలి, ఘంటసాలపాలెం గ్రామాలలో జరిగిన సమావేశాలలో మహాత్మునకు వారిచ్చిన ఖద్దరు నిధిని అందుకొని; సందేశమునిస్తూ చివరకు ఘంటసాల 1924. 4. 20 ఉదయం 11 గంటలకు చేరారు.

"అనుకొన్న సమయానికంటే ఒక పావుగంటముందు చేరాము. ఇక్కడ తమ రుపన్యసించవలసిన కాలం ఒక పావుగంటమాత్రమే. కనుక మొత్తం అరగంట ఉపన్యసించ వలసినదిగా ప్రార్థిస్తున్నాను' అని పాలెం దాటగానే బ్రహ్మయ్యగారు, మహాత్మునితో మనవి చేశారు.

అంతట మహాత్ముడు, చిరునవ్వుతో "అది మీ గ్రామం కాబట్టా?" అన్నారు.

"కాదు బాపూజీ! అసహాయోద్యమారంభంనుండి, శ్రద్ధాభక్తులతో తమ ఉద్యమానికి పట్టెష్టంగావున్న గ్రామాల్లో ఇదొకటి. తమ ఆదేశాన్ననుసరించి 1920లో ఒక్క ఓటైనా వేయకుండా ఖాళీ పెట్టెలను పంపిన గ్రామం. ఖద్దరు ఉత్పత్తి కేంద్రం. వేలాది రాట్నాలున్నవి. మగ్గాలు వందలాది. ఉదయాన్నుంచి జరిగిన సమావేశాలలోకంటే అధికజనం వేచివుంటారు. ఖద్దరు నిధికి కానుకలుకూడా అధికం లభించగలవు." అన్నారు బ్రహ్మయ్యగారు.

మహాత్ముడు మరల నవ్వుతూ "మీరు చెప్పిన విష యాలన్నీ నిజమైతే తప్పకుండా ఆలోచిస్తాను" అన్నారు.

ఘంటసాల గ్రామానికి ఆనుకునివున్న విశాలమైన ధర్మగోటకభూమిలో ఘంటసాల గ్రామవాసులు, చిలకలపూడి, రుద్రవరం, దేవరకోట, దాలిపర్రు, లంకపల్లి, కోసూరు మొదలగు గ్రామాదులనుండి తిరునాళ్ళకు వచ్చినట్లు బళ్ళు కట్టుకొని, నడిచి, మహాత్ముని దర్శించే భాగ్యం పొందాలని వేలాది జనులువచ్చారు.

ఆదివరకే బాగా ఆలోచించి, అక్కడ చేరిన జన సందోహాన్ని, నిలబడకుండా, నిశ్శబ్దంగా కూర్చునేటట్లుగా, వారిని అదుపులో వుంచుటకుగాను, ఖద్దరు దుస్తులతో గాంధీటోపీలతో, చేతులలో కాంగ్రెసు జెండాలతో ఆరి తేరిన స్వచ్ఛంద సేవకులు శతాధిక సంఖ్య గలవారు అంతటా తామై క్రమశిక్షణతో, నేత్ర పర్వంగా నిలబడి వుండిరి.

కార్లు రావటానికి పోవటానికి దాసాలు పాతి వీధులు తీర్చినట్లుకట్టి ప్రజల నందరిని యెక్కడవా రక్కడే వుండేటట్లు వాలంటీర్లు నిలబడి నిశ్శబ్దముగా వుంచుచుండిరి.

సభాముందు భాగాన దాదాపు వందమంది స్త్రీలు రాట్నాలను వడుకుచుండిరి. ఈ దృశ్యమంతా గాంధి మహా త్ముడు ముగ్ధుడైనాడు.

ప్రప్రథమంలో రెపరెపలాడే కాంగ్రెసుజండా కర్రలను చేబూని క్రమశిక్షణతో నిలచి, నిరీక్షించుచున్న వాలం టీర్లను చూడగానే, ఆనందం పట్టలేక బ్రహ్మయ్యగారితో Is this your national army ?(ఇది మీ జాతీయ సేనా?) అని అన్నారు.

అనంతరం రాట్న చక్రములు కమ్మని ధ్వనితో కనుల పండుగగ వుండుటగాంచి ఆనందించారు.

మహాత్ముడు కారుని జనసమూహం మధ్యకు పోనివ్వమన్నారు. వారు ఖద్దరావశ్యకతనుగురించి హిందీలో కొంత ముచ్చటించగా దాన్ని పట్టాభిగారు తెలుగులో చెప్పారు.

వారి కారుకి యెదురుగా పండంటి వృద్ధబ్రాహ్మణుడు, పేటంచు ఖద్దరు ధోవతి ధరించి ఉత్తరీయం కప్పుకొన్న పిసుపాటి వెంకటాద్రిగారు ఆకర్షించి వుండవచ్చు. అందుచేతనేమో 'హిందూ మతం, బ్రాహ్మణుని విధి' అనే విషయాన్ని గురించి మహాత్ముడు మృదు మధుర స్వరంతో ఒక గంట ఉపన్యసించారు.

తాము నిర్ణయించుకున్న పావుగంట, బ్రహ్మయ్యగారు కోరిన పావుగంట అయ్యేసరికి బ్రహ్మయ్యగారు పట్టాభిగారికి సూచించారు. వారు మహాత్మునకు గడియారం చూపేసరికి 'నాకూ గడియారం వున్నదని' ఛలోక్తి విసిరారు మహాత్ముడు.

ఉపన్యాసం ప్రారంభించగానే వెంకటాద్రిగారు వేసుకు వచ్చిన తాటాకుల గొడుగును బ్రహ్మయ్యగారు తీసుకొని మహాత్మునికి ఎండగా వున్నందున పట్టారు. ఆ గొడుగు తీసుకొని "నాకూ చేతులున్నవని" వారే పట్టుకొన్నారు.

మహాత్మునకు ఖద్దరు నిధికి కానుకగా ఘంటసాలలో ఇంటింట అరకల వెంట, బాడితల వెంట ఇట్లా ఇలువరుస వసూలు చేసిన ప్రతిపైసా చేర్చి రు 501/-లు అర్పించారు.

అక్కడి కొచ్చిన గ్రామాలవారు కూడా యథాశక్తి కొందరు సమర్పించారు.

మహాత్మునకు ఆభరణాలను ఇవ్వవలసిందిగా కోరారు పిల్లికి బిచ్చం పెట్టనివారు కూడా ఆయనకు అర్పించుకొనుట ఆశ్చర్యం వేసింది.

కొందరు స్త్రీలు బంగారపు గాజులిస్తే, కొందరు ముసలమ్మలు గోట్లనిచ్చారు. మరి కొందరు చేతి ఉంగరాలను ఇచ్చి ధన్యతగాంచినట్టు తలచారు.

దారి పొడుగున గాంధీ మహాత్ముని కారువస్తూన్నదని విని స్త్రీ పురుషులు, ఆయన్ని దర్శించాలని కోర్కెతో మైమరచి యెలావున్న వారలా వచ్చారు.

భోజనం చేస్తున్నవారు, తమ పిల్లలకు పాలిస్తూన్న తల్లులు, అలాగే రావడం ఆశ్చర్యం!

ఆనాటి కృష్ణునకు వేణువుండెను. ఆయన నవమన్మథాకారుడు. ఆయన రాకకు గోవులు గోపికలు, గోపబాలకులు వచ్చారంటే వింతేమీకాదు.

శరీర మాత్రవైభవోపేతుడైన ఈ పండు ముదుసలిని చూచి ఏమి బావుకుందామని వచ్చిందీ ప్రజ! సూదంటు రాయిలాగా ఆయన భారతీయులను ఆకర్షించాడంటే ఆశ్చర్యంలేదు. మూగవోయిన ప్రజాకంఠం ఆయన ముఖగహ్వరము నుండి వెలువడింది. ఆయన దరిద్రులకు ప్రతినిధి, దరిద్ర నారాయణుడు ఆయన.

మహాత్ముడు మన సారథి, సచివుడు, మనకష్టముల బాప, శుభముల చేకూర్చ అవనిపై వెలసిన భాగ్యదేవత.

ఆయనను సందర్శించటం మహాభాగ్యం గాక, జీవితంలో మరేది?

## ఆంధ్రుల ప్రశంస

ఘంటసాల వాసులనే గాక, ఆంధ్రులను గాంధీజి ఇలా ప్రశంసించడం గమనించతగినది.

"ఆంధ్రులు పుష్టిగా వుంటారు. వారు శక్తిమంతులు ఉదారస్వభావులు, ప్రేమాదరాలను చూపగలరు. తమ దేశ భవిష్యత్తులో, రాష్ట్రభవిష్యత్తులో వారికి విశ్వాసం వున్నది. ఆడవారేగాక, మగవారుకూడ బంగారు నగలు దండిగా పెట్టుకుంటారు. నా కంటబట్టమే పాపంగా వాటిని నేను స్వాహాచేస్తూ వచ్చాను. తిలక్ స్వరాజ్యనిధికి నాకు కావాలనగా స్త్రీ పురుషులు వాటిని సంతోషంగా యిచ్చివేశారు. ఆరు రోజులలో యాభై వేల రూపాయల నగలను వారు నాకిచ్చారు; మరిన్ని అందజేస్తామని వాగ్దానం చేశారు. కోరుకుంటే ఆంధ్రులే తమ నగలనివ్వడం ద్వారా తిలక్ స్వరాజ్యనిధికి కావలసిన కోటి రూపాయలను బహుశా సమకూర్చగలరు.

"ఆంధ్రదేశం నన్ను సమ్మోహితం చేసింది. చాలా కాలంగా బీహార్ నా అభిమాన రాష్ట్రం. ఆంధ్రదేశం యిప్పుడు నిశ్చయంగా ఆస్థానాన్ని ఆక్రమిస్తున్నది. ఆంధ్రకు దిట్టమైన ప్రజా సేవకులున్నారు. దానికి సాధనసంపత్తి వున్నది, కవిత్వమే వున్నది, దానికి దేశంపట్ల భక్తివిశ్వాసాలున్నాయి. స్వార్థత్యాగబుద్ధి వున్నది. దానికి అనేకమైన జాతీయ విద్యాలయాలున్నవి. జాతీయోద్యమానికి అది పెక్కు-

మంది న్యాయవాదులను సమకూర్చింది. ఖద్దరు పరిశ్రమకు అక్కడ చాలా అవకాశాలున్నాయి. ప్రత్తి పండుతుంది. సాగునీటి వనరుల కూడలిక, రెండు మహానదు లున్నాయి. ఒకనాడు ఎంతో ప్రసిద్ధిగాంచిన ఓడ రేవులు ఎన్నో వున్నాయి." 1921 నాటి ఆంధ్ర పర్యటన.

Collected works of Mahatma Gandhi Vol. 19

## పట్టాభిగారి ప్రశంస

డాక్టరు పట్టాభి సీతారామయ్యగారు యీ గ్రామము కాంగ్రెసు చందాకై వచ్చినప్పుడు జరిగిన సభలో గ్రామస్తులను చూచి ఘంటసాల వారి మాటలోను మర్యాదలోను, పలుకులోను ప్రత్యేకత వున్నదనెను. ధనవంతమగు గ్రామములకు వెళ్ళితే తాను యీ సంవత్సరం పెళ్ళి చేశాను అని ఒకరు; ఇల్లుకట్టుకొంటినని ఒకరు సాకులు చెప్పకొని విడివిడిగా హెచ్చుమొత్తమునే యిచ్చెదరు గాని, ఘంటసాలవారు మేమంతా సంప్రదించుకొని యిచ్చెదమని చెప్పిరని ప్రశంసించెను. ఇక్కడ ప్రాచీన పద్ధతిని అరకవెంట, మగ్గమువెంట, బాడితల వెంట వృత్తుల వారి చందాలు యిచ్చెదరని అట్టిపద్ధతి ఇతరత్రా అరుదని, అట్టిస్థితి, ఐక మత్యము వచ్చినగాని మనకు స్వరాజ్యము రాదని తన పత్రికయగు జన్మభూమిలో ఒక పెద్దవ్యాసము వ్రాసి ఘంట సాల గ్రామస్తులను ప్రస్తుతించెను.

## నల్ల జెండాలు

1929వ సంవత్సరాంతాన కాన్పూరులో జవహర్‌లాలు అధ్యక్షతను కాంగ్రెసు సంపూర్ణ స్వాతంత్ర్య తీర్మానము

ఆమోదించింది. 1930 జనవరి 26 వ తేదీని సంపూర్ణ స్వాతంత్ర్య దినోత్సవంగా నిర్ణయింప బడుటచే దేశమంతటా ఆరోజున సభలుచేసి సంపూర్ణ స్వారాజ్య తీర్మానం చదువ బడెను. నివురు గప్పిన నిప్పువలెనున్న ప్రజల ఉత్సాహ పరంపరలు ఈ ఉత్సవం ద్వారా వ్యక్తమయ్యెను.

దీనితో బ్రిటీషు ప్రభుత్వపు బడాయి బట్టబయలయింది. లోకవంచనకొరకు గవర్నరు స్టాన్లీ వంటి నూాగధుల స్వాగత పత్రాలు పుచ్చుకొని దేశం తమవైపుననే వున్నదని ప్రకటించుటకు సంచారము బయలుదేరెను. ఈ సంచార సందర్భములో నల్లజెండాలు ప్రదర్శించి తమ వ్యతిరేకతను కనపరచ వలసిందని కాంగ్రెసుప్రముఖులగు మోతే నారాయణరావు, ఆత్మకూరి గోవిందాచారిగార్లు పత్రికలలో ప్రకటించారు.

లోగడ జిల్లాకాంగ్రెసు సంఘాధ్యక్షులు బ్రహ్మయ్యగారిని 1930లో తిరిగి అధ్యక్షునిగా ఏకగ్రీవంగా ఎన్నుకొన్నారు. 1930 ఫిబ్రవరి 1 వ తేదీని ఘంటసాలలో జరిగిన 14వ కృష్ణాజిల్లా సహకారసభకు ఆయన ఆహ్వాన సంఘాధ్యక్షత నరసింహదేవర సత్యనారాయణ అధ్యక్షత వహించారు. ఆ సభను పురస్కరించుకొని ఆ తేదీనే తూర్పుకృష్ణాజిల్లా కాంగ్రెసు సభకూడా జరిగింది. ఆ సభలో ఫిబ్రవరి 8 వ తారీఖున బందరు వచ్చు గవర్నరుగారికి నల్లజెండాలు ప్రదర్శనం చేయవలసిందని యేకగ్రీవంగా తీర్మానం చేయబడింది.

సీతారామయ్యగారు బందరులోలేరు, కాంగ్రెసు వర్కింగు కమిటీకి వెళ్ళారు. ఫిబ్రవరి 7వ తారీఖున బందరులో

బహిరంగసభ జరిపి, వ్యతిరేక ప్రదర్శనంలో పాల్గొన వలసిందని ప్రజలకు హెచ్చరిక చేయబడింది. ఆ రాత్రి జిల్లా కలెక్టరు, బందరు మున్సిపల్ చైర్మన్ శీలం జగన్నాధరావు నాయుడుగారు ప్రదర్శనం మానవలసిందిగా బ్రహ్మయ్యగారి వద్దకు కబురుచేశారు. తాము నిశ్చయించుకున్న ప్రకారం నడచుట తప్ప అన్యధా ప్రవర్తించమని ఆయన తిరిగి కబురు చేశాడు. దీనిపైన రెండేసి సంవత్సరాలు కఠినశిక్షకు తయారు కావలసిందని బెదిరించాడు కలెక్టరు. వారు బెదిరించిన కొద్దీ వీరు పట్టుదల చూపిరి.

అనుకున్నట్లుగానే మర్నాడుదయం జిల్లా కాంగ్రెసు అధ్యక్షత క్రింద పెద్ద వూరేగింపు బయలుదేరింది. ముఖ్యులుగా వున్న 11 మందిని అరెస్టు చేశారు. మరి 20 మందిని డిటెయిన్ చేసి తర్వాత విడిచిపెట్టారు.

అరెస్టయినవారిమీద కేసుపెట్టారు. వారిలో ప్రథమ ముద్దాయి గొట్టిపాటి బ్రహ్మయ్యగారు. రోడ్డుమీద ఆప బడిన వారిలో ఘంటసాల వాస్తవ్యులు గొర్రెపాటి వెంకట సుబ్బయ్య (కిసాన్) యీ వెంకట్రామయ్య (మేడ) తుమ్మల వెంకట్రామయ్య (కొండతాత) వేమూరి వెంకట్రామయ్య (ఆఫీసు) అరవపల్లి వెంకటాద్రిగారలు కలరు.

## ఉప్పు సత్యాగ్రహం

గాంధీమహాత్ముడు బ్రిటీషు ప్రభుత్వమువారి అక్రమ చర్యల నరికట్టి స్వాతంత్ర్యమును స్థాపించటానికి అనేకమైన



కృష్ణాజిల్లా సహకార సభ ప్రతినిధులు - వాలంటీయర్లు.

కృష్ణాజిల్లా సహాకార సభా ప్రతినిధులు_వాలంటీయర్లు.

ఎడమనుంచి కుర్చీలమీద కూర్చున్నవారు: గొర్రెపాటి వెంకటేశ్వర్లు, దోనేపూడి రామసుబ్బయ్య, చోడవరపు వెంకటేశ్వరరావు, గొర్రెపాటి బ్రహ్మయ్య, గురుజాడ రాఘవశర్మ, పరుచూరి లింగయ్య, కొడాలి నరసింహారావు, నరసింహదేవర సత్యనారాయణ, గొట్టిపాటి బ్రహ్మయ్య, గొర్రెపాటి వెంకటసుబ్బయ్య (రచయిత), వేమూరి నాగయ్య, గొర్రెపాటి వెంకటసుబ్బయ్య, వేమూరి చినసుబ్బయ్యగారలు.

క్రింద కూర్చున్నవారు: వేమూరి అప్పయ్య, పిఱపాటి సీతారామయ్య, వేమూరి సీతారామయ్య, రాయపాటి సీతారామయ్య, పిఱపాటి సత్యనారాయణశర్మ, పిఱపాటి సత్యం, పిఱపాటి వెంకట్రామయ్యగారలు.

శాంతి సమరాలు సాగించారు. అందులో ఉప్పుసత్యాగ్రహం అగ్రగణ్యమైంది.

భారత దేశానికి అధినివేశ ప్రతిపత్తి నివ్వాలనీ, అట్లా ఇవ్వకపోతే, దేశం మొత్తంమీద సహాయ నిరాకరణ చేస్తామని 1928లో మహాత్ముని అభిమతానుసారం కాంగ్రెసు ఒక తీర్మానాన్ని చేసింది. దీనిని ఆంగ్లేయులు ఆదరించలేదు. అందుచేత లాహోరు కాంగ్రెసులో 1929 డిసెంబరు 31 అర్ధరాత్రివేళ సంపూర్ణస్వరాజ్య తీర్మానం చేయబడింది. • ఆ తీర్మానాన్ని అనుసరించే 1930 జనవరి 26 దేశమంతటా జరిపి స్వాతంత్ర్య ప్రకటన చేయటం జరిగింది.

అనంతరం గాంధీ మహాత్ముడు 1930 ఫిబ్రవరి 25 వ తేదీన వైస్రాయిగారికి జాబు వ్రాస్తూ భారతదేశం కోరిన కోర్కెలు ఆంగ్లప్రభుత్వం ఆదరించని పక్షాన, తాను మార్చి 12 వ తేదీన కాలినడకను బయలుదేరి దండిగ్రామమువద్ద ఏప్రిల్ 6 వ తేదీన సముద్రములోని నీరుతో ఉప్పుచేసి తద్వారా ఉప్పు శాసనాన్ని ధిక్కరిస్తానని తెలియజేశారు. దీనిని వారు పాటించలేదు.

79 మంది శాంతి సైనికులతో 240 మైళ్ళు కాలినడకను గాంధీమహాత్ముడు దండియాత్ర సాగించాడు. అందులో మన యెర్నేని సుబ్రహ్మణ్యంగారు ఒకరు. ప్రతి గ్రామము

---

• అందుచేత ప్రతియేటా జనవరి 26 వ తేదీన స్వాతంత్ర దినోత్సవం (Republic day) జరుపుకొంటున్నాం.

రామదండుగా బయలుదేరి గాంధీగారివెంట నడవసాగింది. ఊరూర ఆయనకు స్త్రీలు మంగళహారతులు ఇవ్వసాగారు.

రథగజ తురగాలు లేని ఈ జైత్రయాత్ర గాంచి ప్రపంచం దిగ్భ్రాంతి చెందింది. యూరోపు, ఆఫ్రికాలనుండి పత్రికా ప్రతినిధులు వారివెంట ఉంటూ ఎప్పటికప్పుడు సమాచారాలను పంపుతూ ఉండేవారు

గాంధీజీ ఏప్రియల్ 5 న దండి గ్రామం చేరారు. ప్రభుత్వంవారు ఆయనను అరెస్టు చేస్తారని అందరు అనుకొన్నారు గానీ అలా జరగలేదు.

ఏప్రియల్ 6 వ తేదీ భారతీయులకు చిరస్మరణీయం. ఆ రోజుననే 1919 లో అమృతసర్‌లోని జెలియన్‌వాలా బాగ్‌లో సభను జరుపుకొంటున్న భారతీయులను డయ్యరు సేనాని చిత్రవధ చేయించాడు. అందుచేతనే మహాత్ముడు 6 వ తారీఖున ఉప్పు సత్యాగ్రహం ప్రథమంగాచేయ నిశ్చయించాడు. సముద్రతీరాన గడ్డకట్టిన ఉప్పును ఆయన తీశాడు. ఆ విధంగా సత్యాగ్రహం జరిగింది.

అంతట మహాత్ముడు లాంఛనప్రాయంగా తాను ఉప్పుశాసన ధిక్కారం చేశానని, ఇక ఇతరులు చేయవచ్చునని ఒకప్రకటన చేశాడు.

దేశపిత గాంధీజీ ప్రకటన భారతదేశమంతటా వ్యాప్తి గాంచింది. భారత ప్రజలంతా తమకు సమీపంలో ఉన్న సముద్రమువద్ద ఉప్పు చేయటం, ఉప్పుకొటారులమీద దాడి చేయడం సాగించారు.

భారత భావిఅంతా ఆ శాంతి యుద్ధంమీద ఆధార పడింది. త్రివర్ణ పతాకాలను చేబూని శాంతి సైనికులు జట్లుగా బయలుదేరి హిందూదేశంలోని అన్ని రాష్ట్రాల లోనూ గ్రామాదులవెంట ఊరేగారు. సముద్ర ప్రాంతాలకు పోయి ఉప్పు చేసి, శాసనోల్లంఘనం గావించారు.

తూర్పు కృష్ణాజిల్లాలో ముఖ్యమైన గ్రామములన్నిటా కాంగ్రెసు సంఘాలు ఏర్పడినవి. ఈ గ్రామములోకూడ అధిక సంఖ్యాకులను కాంగ్రెసుసభ్యులుగా చేర్పించుట జరిగింది.

1930లో ఊరేగింపుచేసి దేవాలయంవద్ద జాతీయ జెండాను ప్రతిష్ఠించి అప్పుడు జరిగిన సభలో సత్యాగ్రహా వశ్యకతను గురించి కాంగ్రెసు సేవకులు ఉపన్యసించిరి.

అనంతరం మరురోజున ఉదయము ఈ గ్రామములో ఉన్నకల్లు సారాయి దుకాణముల వద్దకువెళ్ళి ఈ దుకాణ ములు మూసినగాని భోజనం చేయమని నిరశన వ్రతమును పూనిరి. అంతట గ్రామ పెద్దలు వచ్చి అటులనే చేయగలమని హామీయిచ్చి దీక్షను విరమింప జేసిరి. అంతేగాక వారి మాటనుకూడా నిలబెట్టు కొనిరి.

మరునాటి ఉదయం ఘంటసాలపాలెం ఈ రచయిత నాయకత్వం క్రింద కొందరు వాలంటీర్లు వెళ్ళి సత్యాగ్రహ ఆవశ్యకతను గురించి ఉపన్యసించి కాంగ్రెసు జెండాను ఆ గ్రామకాంగ్రెసు అభిమానులచే ప్రతిష్ఠింపచేసిరి.

పాలెంలో రెండుపార్టీలు ఏర్పడి బహుకాలంనుండి వ్యయ ప్రయాసలకు లోనగుచుండిరి. కాంగ్రెసు కార్యక్రమ

మేదైనా జరగాలంటే గ్రామమంతా ఐకమత్యంగా వుంటే గాని జరగదు. కనుక ఈ రెండు పార్టీలు ఏకమయ్యేవరకు మేము ఇక్కడ నిరశన వ్రతం పూనుతున్నామని ఈ రచయిత వారికి కారుణ్యం కలిగేలాగున మాట్లాడెను. అంతట ఇరుపార్టీల పెద్దలలో సంచలనము కలిగి వారిలో మార్పు కలిగెను. ఒకపార్టీ ప్రముఖులగు వేమూరి వెంకయ్య, మూల్పూరి వెంకయ్యగార్లు, రెండవపార్టీ నాయకులగు వేమూరి రామయ్య, పొట్లూరి వెంకట్రామయ్య గార్లు వచ్చి మీరు చెప్పిన చొప్పున మా తగాదాలను పరిష్కరించుకొంటున్నాం, మేము రాజీపడ్డాం, మీరందరూ కలసి భోజనం చేయవలసిందని వేమూరి రామయ్యగారి ఇంటివద్ద ఈ వాలంటీర్లతో పాటు ఉభయ పార్టీలవారు భోజనము గావించిరి. ఈ విధముగా ఘంటసాల వాలంటీర్లు కొంతవరకు చుట్టుప్రక్కల కాంగ్రెసు ప్రచారంచేసి అనంతరం బందరు శిబిరమునకు అరిగిరి

ఆ శిబిరము అఖిల భారత చరఖా సంఘ ఆంధ్ర శాఖావరణలో స్థాపించబడెను. రసహృదయుడగు పురాణం సూరిశాస్త్రిగారు వాలంటీరుగా చేరుటేగాక శిబిరం ప్రక్కనున్న తమ దివ్యభవనమును వాలంటీర్ల భోజనమజ్జనాదులకు ఒసంగెను. ఒకవారం దినములు ఈవాలంటీర్లకు సత్యాగ్రహం, నేత పరిశ్రమ, కారాగృహ ధర్మములు బోధింపబడెను.

బందరు కెనిమిది మైళ్ళ దూరమున చిన్నాపురమనే గ్రామము కలదు. అది సముద్రమునకు నాలుగుమైళ్ళు.

పరవడి దినములలో సముద్రము పొంగి వచ్చి పల్లపు ప్రదేశ ములందు నీరు నిలువవుండి ఎండి గడ్డకట్టి సహజముగనే ఉప్పు తయారగు చుండును. అందుచేత బందరునుండి శాంతి సైని కులు చిన్నాపురం శిబిరంలో ప్రవేశించిరి. అక్కడనుండి ఉప్పు తీసుకొనిపోకుండా పోలీసులు కాపలాఉండిరి. అందు చేత ఒక చిన్నకారులో కొంత ఉప్పు మూటలు కట్టుకొని ఘంటసాల రాత్రివేళ తీసుకొని వచ్చి ఒకబండిలో దాని నుంచి దానిపైన కొన్ని గడ్డిమోపులు వేసి అనుమానం కలగకుండా గొల్లపాలెం వైపుగా ఘంటసాల వాలంటీర్లగు ఈ రచయిత, దోనేపూడి సీతారామయ్య, వేమూరి వెంక ట్రామయ్యగారలు బందరు చేర్చిరి.

1930 ఏప్రిల్ 15వ తారీఖున చౌకులో ఘంటసాల వాస్తవ్యుడగు వేమూరి నాగయ్యగారు మొదలగువారు ఈ ఉప్పును అమ్మిరి. ఘంటసాల జయరాం విదేశ దహనవస్త్ర విషయమై ఉపన్యాస మిచ్చుసరికి అక్కడ సమావేశమైన వారు కొందరు తమ విదేశ వస్త్రములను వేదికముందు గుట్టగా వేయగా భోగిమంటవలె వెలిగించిరి.

తర్వాత ఘంటసాల వాలంటీర్లగు ఈ రచయిత, దోనేపూడి సీతారామయ్య, గొర్రెపాటి వెంకటసుబ్బయ్య, వేమూరి వెంకటరత్నం, యీ వెంకట్రామయ్య, బోయపాటి వెంకటకృష్ణయ్య, ఘంటసాల జయరాం ప్రభృతులు గోను గుంట్ల వెంకట సుబ్రహ్మణ్యం గుప్తగారి నాయకత్వాన దివిసీమంతా ప్రచారంచేసి, ఇటు ఎస్టేటు గ్రామములో ప్రచా రమునకు వచ్చి కోసూరు గ్రామములో తాటి గెలలను నరి

కించి ఊరేగుచుండగా 1930 మే, లో చల్లపల్లి పోలీసు సబ్ ఇన్‌స్పెక్టరు అరెస్టుచేసి కేసుపెట్టగా ఈ గ్రామ వాలంటీర్లగు ఈ రచయిత, దోనేపూడి సీతారామయ్య, గొర్రెపాటి వెంకటసుబ్బయ్య, బోయపాటి వెంకట కృష్ణయ్య, వేమూరి రత్తయ్యగారి కుమార్డు వెంకట్రామయ్య, యలమంచిలి వెంకయ్యలకు తొమ్మిది మాసములు కఠినశిక్ష విధించిరి. ఘంటసాల జయరాం మైనరగుటచేత బోస్టల్ స్కూలుకు పంపబడెను.

## మద్యపాన నిషేధము

గాంధీమహాత్ముని మార్గమంతా నైతిక పునరుద్ధరణ. ఆయన ప్రభుత్వాన్ని ఎదిరించుటంలో ప్రభుత్వ విధానము దుర్మార్గముగా వున్నదని బ్రిటీషు ప్రభుత్వాన్ని సైతాను ప్రభుత్వమన్నాడాయన.

అలాగే ప్రజలలో నీతిని పెంపొందించుటకే మద్యపాన నిషేధోద్యమం ప్రారంభించాడు.

కల్లు సారాయి గంజాయి ధర్మాచరణకు, ఆత్మోన్నతికి అడ్డుతగిలే మత్తుపదార్థాలు.

గాంధీజీ మద్యపాన నిషేధోద్యమాన్ని నడపినది, సామాన్య జనులలో నైతికభావమును పెంపొందించుటకు, తద్వారా వారి ఆర్థికదుస్థితి తొలగించుటకు ప్రయత్నించెను.

మహాత్ముని కార్యక్రమానుసారము, ఇక్కడ మద్యపాన నిషేధోద్యమాన్ని గమనించుదాము.

ఈ ఉద్యమాన్ని గురించి ఇదివరకు కొంత పాఠకులకు పరిచయమే. ఇక 1931 నుంచి జరిగిన సంఘటనలు...

1931 మార్చి 16వ గాంధీమహాత్మునకు రాజప్రతినిధి ఇర్విన్‌కు సంధి జరిగెను. అందుచేత రాజకీయ ఖైదీల నందరిని విడుదల చేసిరి.

నల్ల జెండాల కేసులో శిక్షింపబడిన గొట్టిపాటి బ్రహ్మయ్యగారువచ్చిరి.ఆయన ఊరచయిత కలసి 1931_4_23న గ్రామ పెద్దలతో మాట్లాడి సారాదుకాణమును మూయించుట జరిగినది.

గొర్రెపాటి నరసింహం డోకిపర్రు గ్రామస్థుడగు కనుమూరి రామిరెడ్డిగార్లు పికెటింగు చేస్తూన్నందున దుకాణములోకి ఎవరును పోకుండా వుండిరి. ఇట్లా వారం రోజులు పికెటింగు జరిగిన పిమ్మట పోలీసు సర్కిల్ ఇన్‌స్పెక్టరు, సబ్ యిన్‌స్పెక్టరు, రిజర్వు పోలీసు, పికెటింగు చేస్తున్న ఇద్దరను బాగా లాఠీచార్జీ చేసిరి. సర్కిల్ ఇన్‌స్పెక్టర్ దీక్షితులుగారు కక్షతో స్వయంగా వీరిద్దరి నోళ్ళలోను కల్లుపోసెను.

ఈ దృశ్యాన్ని కళ్ళారచూచిన కట్టు త్రాగుపోతు వెట్టి సుబ్బడు 'మాబోటి తాగుబోతు లుండబట్టేగద వీరికిట్టి బాధల'ని నాటినుండి మానివేసెను.

ఆ సుబ్బడిని ఆదర్శంగా పెట్టుకొని మరికొందరు మానివేసిరి. ఇట్లా మానినవారు బాగుపడి భూమిబుట్రా సంపాదించుకొని బాగుపడ్డారు. ఆలుబిడ్డలకు అన్నము దొరికినది. దెబ్బలాటలు, ఇళ్ళల్లో ఆలుమగల తగాదాలు తగ్గెను. ఆ

వెట్టి సుబ్బుడు కొంత మాగాణిభూమి కొనుక్కొని 'ఇదంతా మహాత్ముని చలువ' అనేవాడు.

ఇట్లా వారిని 1932 ఫిబ్రవరి 22 న లాఠీచార్జి చేసిన పిమ్మట గ్రామములో చాలా అలజడి కలిగెను. చాలామంది యువకులు వాలంటీయర్లుగా చేరిరి. వీరిని సత్రంలో వుంచి కాపులు కాస్తూ, శుశ్రూష చేస్తూ మరల కొందరు పికెటింగుకు బయలుదేరిరి.

గొర్రెపాటి వెంకటసుబ్బయ్య, దోనేపూడి సీతారామయ్యగారలు మరుసటిరోజున పికెటింగుకు వెళ్ళిరి.

ప్రతిరోజూ యిద్దరుచొప్పున పికెటింగు చేయటానికి నిర్ధారణ జరిగినది.

పోలీసులు వచ్చి వెళుతూవుండిరి గాని, ఎవరినీ అరెస్టు చేయలేదు.

1932_2_29 చల్లపల్లి పోలీసు సబ్ ఇన్స్పెక్టరు వచ్చి గొర్రెపాటి వెంకటసుబ్బయ్య, నరసింహం, వెంకటేశ్వర్లు, దోనేపూడి సీతారామయ్యగార్లను, ఈ రచయితను అరెస్టు చేసెదనని చెప్పి కొంతకాలంవరకు వుంచి, వెంకటేశ్వర్లు కనపడలేదని వదలివెళ్ళెను.

1932_3_1 న ఒక కానిస్టేబుల్ సత్రంలోకి వచ్చి ఈ రచయితను, మరికొందరిని అరెస్టని సాయంకాలంవరకు వుంచి వెళ్ళిపోయెను.

## మద్యపాన నిషేధము

1932-4-13న పికెటింగు చేయుటకుగాను గొర్రెపాటి నరసింహం, అట్లూరి శ్రీరాములు • కనుమూరి రామిరెడ్డి, భట్ల పెనుమర్రు గ్రామస్తులు జగన్నాధం, చలసాని సీతా రామయ్య, నారాయణమూర్తి, దేవినేని భీమయ్య, కాజ కాపురస్తులు పేకేటి వీరారెడ్డి, రంగారెడ్డి, కోనేటి నారాయణ రావు మొదలగువాలంటీర్లు సత్రంలోని శిబిరంనుండి ఊరంతా జెండాలతో, పాటలతో, హెచ్చరికలతో, ఊరేగి జాతీయ పతాకమును ఎత్తిరి.

14న చల్లపల్లి పోలీసు సబ్ఇనస్పెక్టరు వచ్చి జెండాను తీసివేశారు. వాలంటీర్లు రోజూ కల్లుదుకాణాలకు నాల్గువైపుల జెండాలను పాతి పికెటింగు సాగించారు. ప్రతి రోజు ఒక కానిస్టేబులు వచ్చి జెండాలను తీసుకొని పోతూ వుండెను. గుడ్డ జెండాలు అయిపోగానే కాగితపు జెండాలు పెట్టసాగారు. 20న సబ్ఇన్స్పెక్టరు 4 గురు పోలీసులతో వచ్చి జెండాలను లాక్కొనిపోయెను. వాలంటీర్ల చర్యలను కనిపెట్టుటకు కొంతమంది పోలీసులను ఉంచెనేగాని అరెస్టు

• ఈయన గాంధీభక్తుడు. శ్రీకాకుళంలో రథోత్సవంనాడు రథానికి మహాత్ముని పటాన్ని కట్టినందుకు పోలీసులు దారుణంగా లాఠీచార్జి చేసినందున మోకాలుకు పెద్దదెబ్బ తగిలి కుంటివాడయ్యాడు. అయినప్పటికీ కాలు యీడ్చుకుంటూ ఎక్కడకుపడితే అక్కడకే పికెటింగుకు తయ్యారు. ఎన్నోసార్లు లాఠీదెబ్బలు తిన్నాడు. జైలుకు వెళ్ళాడు. కేవలం రైతు, కాంగ్రెసు అభిమాని.

చేయలేదు. ఈ మాదిరిగా కల్లు దుకాణములకు ఎవరూ రాకుండా పికెటింగు చేస్తూ ఉండిరి.

ఇట్లా తీయకుండా పికెటింగు చేస్తూవుండగా 1932_4_30 గొర్రెపాటి నరసింహం, కనుమూరి రామిరెడ్డి, దోనేపూడి సీతారామయ్యగారలను అరెస్టుచేసి డిప్యూటి కలెక్టరు రాజరత్నంగారు విచారించి, వేమూరి లక్ష్మయ్యగారు ఆయనకు స్నేహితులైనందున లక్ష్మయ్యగారి అల్లుడగు దోనేపూడి సీతారామయ్యగారు నిర్దోషని విడిచి మిగతా యిద్దరకు రెండేసి మాసముల శిక్ష అయిదువందల రూపాయలు జరిమానా విధించెను.

నరసింహంగారి భూమి వేలంబెట్టి జరిమానా రాబట్టుకొనుటకు ప్రభుత్వంవారు చాలాపాట్లు పడ్డారు. ఎవరును వేలంలో కొనలేదు. ఆనాడు ఘంటసాల గ్రామ కట్టుబాట్లు అలా వుండెను.

ఈ నరసింహంగారు విడుదలై వచ్చిన పిమ్మట తీవ్రంగా ఈ మద్యనిషేధోద్యమములో రాత్రనక పగలనక కృషిచేసెను. పగలు చుట్టుపట్ల నాలుగుమైళ్ళలో ఎక్కడెక్కడ ఈదులు గీశారో చూచి వచ్చి, రాత్రిళ్ళు గ్రామంలో యువజనులను బాటరీలతోను,నాగటికర్రలతోను తీసుకొనివెళ్ళి గీసే ఈతచెట్లను పొడిచి వచ్చేవాడు. ఈ మాదిరిగా ఈయన పురుగు పుట్రా వుంటుందనిగాని,కలాలీలు కాపలా కాస్తూ పట్టుకొని బాధిస్తారనిగాని భయపడక ఎక్కడ చూచినా తానై వీరవిహారం చేసి ఈతచెట్లనన్నిటిని పొడిచి



గొర్రెపాటి నరసింహంగారు

కల్లుకి పనికిరాకుండా చేసి మద్యపాన నిషేధోద్యమంలో మంచికృషి చేసి కీర్తిప్రతిష్ఠలను గాంచెను.

ఈ విధంగా గొర్రెపాటి నరసింహంగారు తనవెంట జట్టునిపెట్టుకొని విలయతాండవం చేస్తుండగా చుట్టుప్రక్కల కల్లుదుకాణదారులంతా ఘంటసాలవారు తమ తమ గ్రామాల లోని ఈతచెట్లను పొడిచివేస్తున్నారని పోలీసువారికి అర్జీలను దాఖలు చేసుకున్నారు.

దానిపైన పోలీసు సర్కిల్ ఇన్‌స్పెక్టరు, చల్లపల్లి స్టేషన్ పోలీసు సబ్ యిన్‌స్పెక్టరు, మరికొందరు పోలీసు కానిస్టేబుల్సుతో ఘంటసాలవచ్చి ఆక్టింగు మునసబు వేమూరి లక్ష్మయ్యగారి ఇంటివద్ద మకాంపెట్టి ఈదులను పొడిచినవారెవరో తెలుపవలసిందిగా కోరారు. ఈ లక్ష్మయ్యగారుమంచి ఆకర్షణ శక్తిగలవాడు. గవర్నమెంటులోను, గ్రామాలలోను పలుకుబడిగలవాడు. కాంగ్రెసునందు అధిక అభిమాని. ఆయన కాంగ్రెసు యువజనులకు అధిక ఉత్సాహ ప్రోత్సాహ లిస్తూవుండుట ఇక్కడ కాంగ్రెసు ఉద్యమాభివృద్ధికి కారణాలలో ఒకటి. ఆయన మంచి గడుసరి. 'మావూరు వారెవరు ఈ పనులు చేయలేదంటే చేయలేదని' ఆయన సమాధానం యిచ్చాడు.

'నేను ఈ గ్రామస్థులు ఎవరూ కాదని చెప్తున్నాను. కాదంటే నా మునసబీకి రాజీనామా యిస్తాను. ఒక సంగతి మనవి చేస్తాను వినండి. ఈ రాత్రికి మీరిక్కడుండండి. ఈ వూరులోని కాంగ్రెసభిమానులను మా ఇంటివద్దను మీ సమాక్షానే పరుండబెట్తాను. తెల్లవారి

తమకు సర్వం విదితం' కాగలదని వారిని ఒప్పించి రాత్రికి నరసింహంగారితో పాటు మరికొందరిని అనుకొన్నట్లు తమ ఇంటి అరుగులమీదనే పరుండబెట్టెను.

ఆ సాయంత్రం తనమాట సుగ్రీవాజ్ఞగా మన్నించే వేమూరి వీరన్నగారి కుమారుడు సుబ్బయ్యగారు, ఉప్పల కోటయ్యగారు, వడ్లమూడి వెంకయ్యగారు, వేమూరి నాగభూషణంగారు మొదలగు ఇరవైమందిని పిలిపించి, 'అబ్బాయి, ఇదివరకు చేసిందికాదు పని. ఈరోజున మీరంతా వెళ్ళి ఈదులను పొడిచి రావాలి. ఈ పోలీసువారికి మనగ్రామంమీద వుండే దృష్టిని మార్చాలి.' అని హెచ్చరించి చెప్పాడు. అక్కడ తన ఇంటివద్ద పరున్న నరసింహాన్నికూడా లేపి పంపాడు. వీరంతా ఘంటసాల నలువైపుల వున్న గీత ఈదులను అర్ధరాత్రివేళ వెళ్ళి పొడిచివచ్చారు. నరసింహంగారు వచ్చి యథాప్రకారం పండుకొని నలుగురితోపాటు ఏమి తెలియనట్లు వెళ్ళిపోయాడు తెల్లవారి. ఈ పోలీసు ఆఫీసర్లు ఉదయాన లేచి కాఫీ అది పుచ్చుకొని బయలుదేరుదామనే సరికి చుట్టు ప్రక్కల కల్లుదుకాణందార్లు 'రాత్రి మా ఈదులన్ని నాశనం చేశారండి. మే మెట్లా యిచ్చుకోగలం దుకాణపు పన్నని' ఫిర్యాదు.

ఇక లక్ష్మయ్యగారు 'చెప్పలేదండి, ఈ పని చేసేది మా గ్రామస్తులు కాదని, ఎవరు చేసినా మా గ్రామమే చేసిందంటారు. రాత్రి చూచారుగదా అందరు మా ఇంటి వద్దనే వున్నారు,'అని చెప్పివారికి మర్యాదచేసి సాగనంపారు.

1. దోనేపూడి బాలమ్మగారు. 2. గొర్రెపాటి సరస్వతమ్మగారు,
3. గొర్రెపాటి కుటుంబమ్మగారు, 4. గొర్రెపాటి లక్ష్మీకాంతమ్మగారు

ఈ మాదిరిగా ఎంతో సాయసంపత్తులు చేశారు; దేశక్షేమం కొరకు గ్రామప్రతిష్ఠ కొరకు ఈ లక్ష్మయ్యగారు. ఈయన 1932 ఆగస్టు 17న స్వర్గస్థుడు కావటం విచారకరం.

వందేమాతరోద్యమం లోను, అసహాయోద్యమం లోను పురుషులే పాల్గొనిరి. ఈసారి సత్యాగ్రహ ఉద్యమ విశేషమేమున అసంఖ్యాకముగ స్త్రీలును బాలురును పికెటింగు మొదలగు వాటిలో పాల్గొనిరి.

గడపదాటి వెళ్ళని స్త్రీలు ధైర్య సాహసాలతో ముందుకువచ్చి ఉద్యమభారము వహించిరి.

తూర్పు కృష్ణా జిల్లాలో వల్లభనేని సీతామహ లక్ష్మమ్మ, తులశమ్మ, కౌసల్యమ్మ, దిగుమర్తి జానకమ్మ, తంగిరాల సీతారామమ్మ, గోనుగుంట్ల లక్ష్మీనరసమ్మ మొదలగు వీరవనితలు, వాలంటీర్లుగా చేరి విఖ్యాతిగాంచారు.

ఈ గ్రామములోను వల్లభనేని సీతామహాలక్ష్మమ్మ గారితో గొర్రెపాటి కుటుంబమ్మ, సరస్వతమ్మ, లక్ష్మీ కాంతమ్మ, దోనేపూడి బాలమ్మగారలు దివితాలూకాలో పెక్కు గ్రామాలలో కాంగ్రెసు ప్రచారము చేసిరి.

అనంతరం ఈ గ్రామంలోని కల్లుదుకాణంవద్ద పికెటింగు ప్రారంభించిరి. పోలీసువారు వీరిని అరెస్టుచేయుటకు ఇష్టంలేక ఉపేక్షాభావం వహించిరి. చివరకు 1933. 3. 29లో గొర్రెపాటి కుటుంబమ్మ, సరస్వతమ్మ, లక్ష్మీకాంతమ్మ బాలమ్మలను అరెస్టుచేసి, బాలమ్మ లక్ష్మయ్యగారి కుమార్తెని విడిచి మిగతా ముగ్గురకు మూడేసి మాసాలు శిక్ష డిప్యూటీ కలెక్టరు విధించి, నూజివీడు సబ్ జైల్లో వుంచిరి.

## హరిజనోద్యమం

అంటరాన్ని తనాన్ని అంతరింపు చేయాలనే సంకల్పం మనదేశంలో ఎందరకో కలిగింది. కాని దాన్ని సమూలంగా రూపుమాపినది మహాత్ముడే!

ఆయనకు బాల్యములోనే ఇది అమానుషంగా తోచింది. దీన్ని గురించి మహాత్ముడిట్లా పేర్కొన్నారు.

"ఈ బాలుని తాకకూడదు, ఇతడు అస్పృశ్యుడు" అని నా తల్లి చెప్పినది. ఎందుకు అనివెంటనే ప్రశ్నించితిని. ఆనాటినుండే నా తిరుగుబాటు ఆరంభమైనది. నా భార్యను పెండ్లాడుటకుముందే అస్పృశ్యతాకార్యమును పెండ్లాడితిని."

హరిజన నాయకుడగు డాక్టరు అంబేడ్కర్ ప్రభృతులు రెండవ రౌండుటేబుల్ సమావేశములో అస్పృశ్యులకు ప్రత్యేకనియోజక వర్గము కావాలని పట్టుపట్టినందున, మహాత్ముడు దానిని తీవ్రముగా ప్రతిఘటించగా, విభజించి పరిపాలించుటలో ఆరితేరిన బ్రిటీషు ప్రభుత్వం కమ్యూనల్ అవార్డును ప్రకటించింది. మహాత్ముడు ఆ అవార్డును పురస్కరించుకొని ఆమరణాంతం నిరశనవ్రతం పూనటం, ప్రజలలో గగ్గోలు బయలుదేరగా మహాత్ముని పూనా జైలునుండి విడుదలచేసి, ఆ అవార్డును బ్రిటీషు ప్రధాని మాక్డోనాల్డు రద్దుచేసుకొనెను.

అనంతరం గాంధీజీతో అన్ని పార్టీలవారు, సవర్ణులు, అవర్ణులు కొన్ని నిర్ణయాలకు వచ్చారు. దీన్నే పూనా ఒడంబడిక అన్నారు.

అంతట మహాత్ముడు, ఉపవాస వ్రతం చాలించి హరిజనోద్యమాన్ని పటిష్ఠం చేయటానికి ప్రత్యేక నిధులను పోగుచేసి, హరిజన శాఖను ఏర్పాటుచేసి, హరిజన సేవకులను అందుకు నియమించారు.

సవర్ణులకు హరిజనులకుగల సాంఘిక అసమానతను రద్దుచేయటం, ముఖ్యంగా సమష్టిగావున్న చెరువులను బావులను అందరూ ఉపయోగించుకోవటం, దేవాలయాలలో హరిజనులు యథేచ్ఛగా ప్రవేశించి పూజలు చేసుకోవటం వగైరా కార్యక్రమాలు జరిగినవి.

ఇంతవరకు అంటరాని వారనబడేవారిని మహాత్ముడు హరిజనులన్నాడు. హరిజనులనగా హరికి ప్రియమైనవారు.

మహాత్ముడు అంటరానితనాన్ని తుదముట్టించటానికి దీక్షతో పనిచేశాడు. అఖిలభారత హరిజన సేవాసంఘమును స్థాపించి దానికి శాఖలుగా ప్రతి రాష్ట్రమున శాఖాసంఘములను స్థాపించెను. దాని ననుసరించి ఆంధ్రదేశములో 1932.10.16న ఒక సంఘము స్థాపింపబడి దానికి శాఖలుగా జిల్లా సంఘము స్థాపింపబడి హరిజనసేవ, హరిసేవగా చేయసాగెను.

చెరుకువాడ వెంకట నరసింహంగారికి కవుతరం మెట్టిన ఊరైతే ఘంటసాల పుట్టిన గ్రామం—మాతా మహస్థలం.

ఆంధ్రదేశంలో ఆయనపాదం పెట్టని గ్రామంగాని ఆయన వాక్కు విననివారుగాని వుండరంటే అతిశయోక్తి

కాదు. ఆయన ఆంధ్ర డెమాస్తనీస్, ఉపన్యాసకేసరి. ఆంధ్ర దేశాన్నంతా ఉర్రూతలూగించాడు, వూరూరు తిరిగి ఉపన్యాసాలద్వారా.

వారు కడలూరు జైలునుండి విడుదలైన పిమ్మట 1932_11_21న ఈ గ్రామము వచ్చి కాంగ్రెసు సేవకులను వెంటనిడుకొని బావులలో హరిజనులతో నీరు తోడించుటకు గొర్రెపాటి నరసన్నగారి కుమారుడు వెంకయ్యగారితో సంప్రదించుటకు వెళ్ళిరి. ఆయన బహుతెలావ్యుడు. "ఈ గ్రామానికి కాంగ్రెసు నాయకుడు బ్రహ్మయ్య. ఆ బ్రహ్మయ్యకు మేనమామను, మామ, మా కొండపల్లి సుబ్బయ్య బావని మీకు తెలుసు. ఆయన మా అందరిలోకి పెద్ద. ఆయన కిష్టమయితే మాకూ ఇష్టమే." అన్నాడు.

అంతట కొండపల్లి సుబ్బయ్యగారిని కలుసు కొనుటకు వెళ్ళగా, ఆయన ఏ సంకోచమూ లేకుండా 'మీరు అందరినీ కలుపుకొని సాయంత్రం మా దొడ్డివై పుకురండి. మా దొడ్డి ముందు మంచినీళ్ళ బావి ఒకటున్నది. అలాగే తోడిద్దాం' అన్నారు.

నరసింహంగారి ఆధ్వర్యాన ఊరేగింపుతో బయలు దేరి మొట్టమొదట అనుకొన్నట్లు సుబ్బయ్యగారి దొడ్డి వద్దకు వెళ్ళారు. అంతటాయన తమ పాలేరు గొర్రుముచ్చు నరసయ్యను పిలిపించి అక్కడ నున్నటువంటి అక్కల నూతి లోని నీరుతోడించి ఆయన నరసింహంగారితో ఇట్లా అన్నాడు."పంతులుగారూ నేను శుద్ధశ్రోత్రియుడను.అంటూ, ఆచారాలు నిష్ఠ అధికం. కాని నా మేనల్లుని పెంచి పెద్ద

వాడిని చేశాను. పిల్లను కూడ ఇచ్చారు; అతను కాంగ్రె సులో చేరి కాంగ్రెసు చెప్పినట్లు చేస్తున్నాడు. అతను జైలు నుంచి వచ్చిన తర్వాత మంచినీళ్ళు ఎట్లాగు తెప్పిస్తాడు, అతని ఇంటికి నేను వెళ్ళితే ఆ నీళ్ళు త్రాగక తప్పదు. నా ఆచారాలకంటె నాకు మా బ్రహ్మయ్య ఎక్కువ. మా బ్రహ్మయ్య మునిగిందే గంగ నాకు." అని చెప్పి ఆ హరి జనుని చేతినీళ్ళు ఆయన ప్రథమంగా త్రాగాడు. అనంతరం అందరూ పుచ్చుకొన్నారు. తరువాత ప్రతివైపునా ఒక నుయ్యి పూర్వాచార పరాయణులకు వుంచి; మిగతా నూతు లను హరిజనులతో తోడించుట జరిగినది.

మరునాడు దోనేపూడి సీతారామయ్యగారి ఇంటివద్ద ప్రత్యేకం స్త్రీలకొరకు ఒక సభ ఏర్పాటు చేయబడింది. అందులో చెరుకువాడ వారు అశ్పృశ్యతా నివారణను గురించి హృదయాలు ద్రవించేటట్లు ఉపన్యసించారు.

దేశోద్ధారక కాశీనాథుని నాగేశ్వరరావుగారు ఆంధ్ర దేశ హరిజన సేవాసంఘ అధ్యక్షులు. వారు 1932-12-16వ తేదీన ఈ గ్రామము విచ్చేసిఅశ్పృశ్యతా నివారణను గురించి ఉపన్యసించారు.

మానవుని వెలిబెట్టిన దేవుని వెలిపెట్టినట్లే!

—మహాత్మాగాంధీ

ఇక్కడ హరిజనోద్యమముకూడ అధికంగా సాగింది.

ఈ గ్రామములో మార్గశిర శుద్ధ షష్ఠికి సుబ్రహ్మణ్య స్వామికి గొప్ప ఉత్సవం జరుగుతుంది. ఆ ఉత్సవ సమయ

మున హరిజనులతో పాటు సవర్ణులుకూడ ఊరేగింపుగా బయలుదేరి 1932_12_3న గుడి బైటనే పూజచేశారు.

ఈ విధంగా ఆంధ్ర దేశంలో అందరూ చేసిన, హరిజన దేవాలయ ప్రవేశం అనతికాలంలో జరుగగలదని, ఘంటసాల వారిని ఆదర్శంగా ఎంచుకొని కృషి చేయవలసిందని ఆంధ్రపత్రిక సంపాదకీయం వ్రాసి ప్రశంసించినది. ఆ మరుసంవత్సరం హరిజన దేవాలయప్రవేశము ఈగ్రామంలో జరిగింది.

1933లో గొట్టిపాటి బ్రహ్మయ్యగారు కారాగృహము నుంచి విడుదలై గ్రామమునకు వచ్చినప్పుడు ఆయన సన్మానార్ధము ఒక సభ జరిగినది. దానిలో షష్ఠికి హరిజన దేవాలయ ప్రవేశము జరుగని యెడల నిరశన వ్రతము పూనెదనని ఈ రచయిత తన ఉపన్యాసములో చెప్పెను. అందు మీాదట ఆందోళన బయలు దేరినది. బ్రాహ్మణులు మరికొందరు దీన్ని ఆపవలసిందని పోలీసులకు రిపోర్టు చేసిరి. వారు దీన్ని బుట్టదాఖలు చేసిరి.

ప్రజాభిప్రాయాన్ని (ప్లెబిసైట్) తీసుకొనుటకు బ్రహ్మయ్యగారు, ఇతర కాంగ్రెసుఅభిమానులు అధిక కృషి చేసి తీసుకొనిరి.

ప్రజామోదము పొందుటచే 1933_11_19 న శాంఛనముగను, నవంబరు 23వ తారీఖున షష్ఠినాడు సంపూర్ణముగను కాశీనాధుని వీరమల్లయ్య ఆరాధ్యుని ఆధ్వర్యమున హరిజన దేవాలయ ప్రవేశము జరిగినది. ఆ రోజున చుట్టుప్రక్కల

హరిజనులందరు సవర్ణులతో కలసి అధిక భక్తితో అర్చన చేసిరి.

ఆంధ్రదేశంలో హరిజన యాత్ర కార్యక్రమం హరిజన సేవాసంఘ కార్యదర్శి మాగంటి బాపినీడుగారి ఆధ్వర్యం కింద జరిగింది. ఖద్దరు నిధికివలెనే, ఈ హరిజనోద్యమానికి స్త్రీ పురుషులు విరాళాలు, ఆభరణాలు ఇచ్చిరి.

కొందరు ముందుగానే కట్టుదిట్టములు ఏర్పాటుచేసుకొని ఆయా గ్రామాల్లో హరిజన ప్రవేశం గాంధీగారి రాక సందర్భంలో చేయించటం జరిగింది. అట్లు జరిగిన గ్రామాలు సిద్ధాంతం, ముదునూరు వగైరా గ్రామాలు.

ముదునూరులో త్యాగమూర్తి అన్నే అంజయ్యగారి ఆధ్వర్యాన, సిద్ధాంతంలో జస్టిసుపార్టీ నాయకుడు అడుసుమల్లి గోపాలకృష్ణయ్యగారి ఆధ్వర్యాన జరిగినవి.

మహాత్ముని సంచారానికి పూర్వమే దండి సత్యాగ్రహంలో మహాత్ముని నాయకత్వంలో పాల్గొన్న సాధు సుబ్రహ్మణ్యంగారి నాయకత్వంక్రింద దేవాలయ ప్రవేశం దిగ్విజయంగా జరిగింది.

మహాత్ముని ఈ హరిజనయాత్రలో దివితాలూకాను పూర్తిగా వదలివేయటం జరిగింది. ఈ సంచార కార్యక్రమంలోవున్న మాగంటి బాపినీడుగారికి గొట్టిపాటిబ్రహ్మయ్యగారు నచ్చచెప్పి చల్లపల్లిని చివరకు చేర్పించటం జరిగింది.

మహాత్ముని కారులో బ్రహ్మయ్యగారు వుండెను. ఆయన ఘంటసాల గ్రామంలో ప్రజాభిప్రాయం తీసుకొని హరిజన దేవాలయ ప్రవేశం చేసిన సంగతి సందర్భములు

మహాత్మునకు పూసగ్రుచ్చినట్లుగా చల్లపల్లి సమీపంలో చెప్పెను

చల్లపల్లిలో శ్రీమంతు హైస్కూలు ఆవరణలో 1933_12_17 రాత్రి 8 కి జరిగిన సభకు చుట్టుప్రక్కల గ్రామాదులనుండి వేలాది జనం వచ్చిరి.

ఘంటసాలనుండి ఒక వంద వాలంటీర్లువచ్చి, వచ్చిన జనాన్ని అదుపులో పెట్టి శ్లాఘనీయంగా పని చేసిరి.

మహాత్ముడు 15 నిమిషాలు మాత్రమే ప్రసంగించిరి. అంటరానితనాన్ని రూపుమాపుట అవసరమని ప్రబోధించి ఘంటసాల గ్రామాన్ని ప్రశంసించి, దాన్ని అనుసరించవలసి నదిగా హెచ్చరించిరి.

చల్లపల్లి దివాను జంపాల వెంకటేశంగారినుండి వసూలు చేసిన మొత్తము రు. 1000/లు బ్రహ్మయ్యగారు అక్కడ సమర్పించెను. బంగారు నగలు వగైరా కొందరు యిచ్చుట జరిగినది.

• ఖద్దరుయాత్రా సందర్భంవలె గాక, యీ సంచారంలో నిధి వసూలుకంటే హరిజనోద్యమ ప్రచారం అధికంగా భావించబడింది.

మహాత్ముడు ఆసేతు హిమాలయ పర్యంతం సంచారం చేసి, ఈ అంటరానితనాన్ని అడుగంట జేసెను.

## అర్పించిన నిధులు

కాంగ్రెసు తరఫున తిలక్ స్వరాజ్య నిధికి ఒక కోటి రూపాయలు వసూలుచేయుటం జరిగింది. దీనికై వల్లూరి

సూర్యనారాయణరావు, వేమూరి రామచంద్రరావుగారలు ఘంటసాల వచ్చినప్పుడు 1921 లో అయిదువందలు వసూలు చేసి అర్పించడమైనది.

1923 గాంధీ పూజానిధికి, నాగలికి రూపాయి, మగ్గానికి అర్ధరూపాయి, బాడెతకు రూపాయి చొప్పున, ఇతరుల నుండి, హరిజనులనుండి కూడా వారు మనస్ఫూర్తిగా యిచ్చిన మొత్తాన్ని వసూలుచేసి రు 250/లు యివ్వటం జరిగింది.

ఇంత స్వల్పమొత్తమా అని పట్టాభిగారంటే, "అటు గవర్నమెంటుకు యిస్తున్నట్లుగానే, కాంగ్రెసుకు ఎప్పుడుబడితే అప్పుడు ఈ మొత్తాన్ని చెల్లిస్తూ వుండాలిగదా" అని సమయస్ఫూర్తిగా కొండ్రెపాటి వెంకయ్యగారు అంటే పట్టాభిగారు ఆనందంతో స్వీకరించారు.

ఖద్దరు నిధికి గాంధీమహాత్ముని రాక సందర్భంలో 1929 లో రు 501/లు యిచ్చిన సంగతి పాఠకులకు పరిచయమే గదా.

1930 అనంతరం పికెటింగు సందర్భంలో బందరులో శిబిరం పెట్టినపుడు ముట్నూరి కృష్ణారావుగారు కోరగా, బ్రహ్మయ్యగారు వేమూరి లక్ష్మయ్యగారి చేత మిత్రబృందంవద్ద వసూలుచేసిన మొత్తం రు 200/లు ఆయన చేతనే యిప్పించుట జరిగింది.

కృష్ణారావుగారు మహదానందం పొంది, అవసరమైనప్పుడల్లా ఘంటసాల వస్తూవుంటాం అన్నారు.

నాయకులు అడిగినప్పుడు శక్తికొద్దీ ఈ మాదిరిగా ఉడుతా భక్తితో ఇచ్చుకోవటం ఘంటసాలకు ఆనవాయితీ అయ్యింది.

## జాతీయ పతాకము

జాతీయ పతాకము జాతీయతకు చిహ్నము. అది జాతి గౌరవ ప్రతిష్ఠలకు ప్రబల కారణము. మనజాతీయ పతాకము మన గ్రామముదగ్గర కాపురస్తుడగు యార్లగడ్డ గ్రామస్తుడు పింగళి వెంకయ్యగారు మహాత్ముని ఆదేశానుసారము 1921న రూపొందించెను.

ఘంటసాలలో శ్రీ జలధీశ్వరాలయము ముందు ప్రప్రథమంగా జాతీయ పతాకము 1931న ప్రతిష్ఠింపబడినది. పెద్ద ఎత్తైన సరుకుబాదుకు ఈ పతాకము కట్టబడుట చేత రెపరెపలాడుతూ కన్నుల పండుగగా వుండెను. ఆనాడు జాతీయ పతాకమును ప్రతిష్ఠించుట అంటే బ్రిటీషు ప్రభుత్వముపై తిరుగుబాటు అన్నమాట. ఈ పతకాన్ని గురించి అనేక పోరాటాలు జరిగినవి. అందులో నాగపూరు పోరాటము ప్రసిద్ధమైనది.

పోలీసులు యీ గ్రామ మధ్యనున్న జెండాను తీసివేయుటకు చాలాకాలం పట్టింది. చిట్ట చివరకు 1932.1.16న ఒక యూరోపియన్ సార్జెంటు రిజర్వుదళాన్ని తీసుకొని చల్లపల్లి స్టేషను ఇనస్పెక్టరు సీలి వెంకటేశ్వరరావుతో వచ్చి నాలుగు బజారులలో రిజర్వు పోలీసులను కొందరను నిలిపి ఒక పోలీసు గొడ్డలితో పతాక స్తంభాన్ని నరకబోయేసరికి

మళయాళస్వామి వారి శిష్యులు తాడేపల్లి ఆశ్రమంలో వుంటూవున్న కాంగ్రెసభిమాని సాధు సాయం వరదదాసు గారు ఆ ధ్వజ స్తంభానికి దగ్గర చేరి తన రెండు చేతులతో దానిని కాపాడ చుట్టుముట్టెను. అంతట పోలీసులు ఆయనను తీవ్రముగా లాఠీచార్జి చేసి దానిని పడగొట్టిరి.

అక్కడ సమీపముననే వున్న పిసుపాటి కృష్ణమూర్తి గారిని, వేమూరి బ్రహ్మయ్యగారి కుమారుడు వెంకయ్యగారిని బలే గోవిందయ్యగారిని కూడ లాఠీలతో కొట్టిరి.

ఇట్లా రిజర్వువచ్చి ధ్వజస్తంభాన్ని పడగొట్టటం, అనవసరంగా లాఠీచార్జి చేయటం, ఈ అక్రమాన్ని సహించలేక గొర్రెపాటి పట్టయ్యగారు, అయినపూడివారు మరి కొందరు, వీరిని కొట్టుటకు ఆలోచిస్తూ వుండగా, ఆట్టింగు మునసబు వేమూరి లక్ష్మయ్యగారు వారువచ్చి తితిమ్మా చోట్లవలె భీభత్సం చేయకుండా పోతూవుంటే వారిని చెయ్యిచేసు కొంటే గవర్నమెంటువారు వచ్చి గ్రామాన్ని నాశనం చేస్తారని హెచ్చరించినందుననూ, అది కాంగ్రెసు తత్వానికి భిన్నమైనదని మరి కొందరన్నందునను వారు మిన్నకుండిరి.

1932_1_26 తారీఖున జండా వూరేగింపుచేసి ఈసారి గంటలమ్మచింతవద్ద రావిచెట్టుకు కట్టగా రిజర్వు వచ్చి గొర్రెపాటి వెంకటసుబ్బయ్య, త్రిపురనేని రాధాకృష్ణగార్లను లాఠీచార్జి చేసిరి.

1932 జూన్ 2వ తారీఖున కృష్ణాజిల్లా కాంగ్రెసు సభ జరిగినది. దానిని పురస్కరించుకొని జూలై 7వ తేదీన దేవాలయం ముందు దివితాలూకా కాంగ్రెసు సభ జరిగినది.

## మహాత్ముని జన్మదినోత్సవము

మనదేశంలో కృష్ణజయంతి, భీష్మైకాదశి మొదలగు పుణ్యపురుషుల జన్మదినోత్సవములు చేయుట ఆచారము.

దానిని పురస్కరించుకొనే ఈ గ్రామములో గాంధీ మహాత్ముని జన్మదినోత్సవము అక్టోబరు 2 న వైభవముగా జరుగుచుండెడిది. ఒక బండిపై ప్రభగట్టి, దానికి మహాత్ముని చిత్రపటమమర్చి ఒక అర్చకుడు బండిలోవుండి అనేక జతల ఎడ్లను ఆ బండికి పూన్చి గ్రామమంతా ఊరేగింపు చేయుట, ప్రతి ఇంటివద్ద దేవునికిచ్చినట్లు హారతి యివ్వటం జరుగుతూ వుండేది.

1931 నుండి చాల శోభాస్పదముగా జరిగినదన వచ్చును.

ఖద్దరు కార్యకర్త వేమూరి పేరయ్యగారు ఈ ఉత్సవానికి నాయకత్వం వహించి నిష్టతో జరుపుతూ వుండేవారు.

## కాంగ్రెసు కార్యక్రమంవల్ల ప్రయోజనము-ప్రతిష్ఠ

ఈ గ్రామమునకు చుట్టూ గుండేరు కలదు. రైతులు రోజూ అది దిగిపోవలెను. ఆ బురదలో పశువులకు బాధ యెక్కువ. గొట్టిపాటి బ్రహ్మయ్యగారి తండ్రి వీరరాఘవయ్యగారి (50 సం॥లు) కాలమునుండి చప్టాలకై ప్రయత్నములు జరిగెను. (ఆయన స్వదస్తూరితో వ్రాసిన పిటీషను కనుపించినది) కాని కార్యకారిలేదు. మోచర్ల రామచంద్రరావుగారు జిల్లాబోర్డు అధ్యక్షుడుగా వుండగా 1921లో సగం వంతు ఇచ్చేపద్ధతిని, సత్తులదిబ్బ చప్టాయును, శెడింబి హను

మంతరావుగారు తాలూకాబోర్డు అధ్యక్షులుగావున్న సమయమున బోయీలకట్ట చప్టాయును 1/2 సొమ్ము యిచ్చుపద్ధతిని శాంక్షనుకాగా గ్రామత్యాకంట్రాక్టు తీసుకొని స్వంతబళ్ళతో సప్లయి చేసుకొని ఆ కష్టములు నిర్వర్తించుకొనుట జరిగినది.

ఇటుల చప్టాలే గాక గ్రామత్యా ధనముతో శ్రీ జలధీశ్వర ఆలయ ముఖమండపమునకు రైతులందరు బళ్ళతో తోడ్పడుట ఇతరులు ధనసహాయము చేయుటయు జరిగెను.

చుండూరి నాగభూషణంగారిచే కట్టించబడిన సత్రమునకు రైతులందరు కారురాయి, సున్నము తోలుకొనివచ్చి సహాయపడిరి. ఇటుల ఐకమత్యముతో పెక్కుకార్యములు జాతీయోద్యమ ప్రభావమున జరిగి అధికప్రతిష్ఠ గాంచెను.

యుద్ధకాలములో ఉద్యోగులు అనేకులు ప్రతిగ్రామము వచ్చి యుద్ధఫండునకై ప్రజలను పెక్కుయిబ్బందులు పెట్టి పెక్కుసారులు వసూలుచేసినది సర్వజనవిదితము. ఘంటసాల కాంగ్రెసుకు పెట్టనికోట అని ప్రసిద్ధిగాంచుటచే యిక్కడికి పోయినవారివ్వరు, యివ్వకపోయినచో యిది యితరత్రా గ్రామములవారు కూడ విని యిటులనే ప్రవర్తించెదరేమో అని వెరపుచే అధికారులు ఈ గ్రామమునకు అడుగు పెట్టలేదు.

చుట్టుప్రక్కల గ్రామస్థులుకూడఘంటసాలలో దమ్మిడీ వసూలు చేయలేదు, ఎప్పుడు మమ్ములనే బాధపెట్టెదరని పితూరీలు చేసెడివారు. ఇదిగో వెళ్ళుచున్నాము అని వారు చెప్పుచు కాలక్షేపము చేసెడివారు. పాలెంలో పెక్కుసారులు వసూలుచేసిన మొత్తములో కొంతమొత్తము తమ

ప్రతిష్ఠకొరకు అధికారులు ఘంటసాల పేరుతోనే జమ కట్టిరని వినికిడి.

రైతులను బాధపెట్టిన పర్చేజింగు ఆఫీసరు ఇచటకు ఒకసారి మినహా రాలేదు. ఆయనకూడ గ్రామస్తులు చెప్పిన చొప్పున లెక్కతీసుకొని ఆ మొత్తమే యివ్వవలసినదని ఎట్టి యిబ్బంది పెట్టక వెళ్ళిపోయెను.

కాంగ్రెసు నిధులకై అనేకసార్లు తమ శక్త్యానుసారము కానుక లర్పించుకొనుటేగాక, కాంగ్రెసు ఆదేశానుసారము ప్రవర్తించుటచే ఆర్థికముగా కొంత నష్టపడినను, ఎక్కువ పరువు ప్రతిష్ఠ పొందినది. అధికారులకు కూడ ఈ గ్రామము పోయిన తమమాట దక్కదని అనుకొనుట కాంగ్రెసువల్లనే ఇట్టి ఘనత కలిగెనని గ్రహించి, కాంగ్రెసునకు అండగా యికముందు కూడ వుండి ప్రతిష్ఠ ప్రయోజనము పొందును గాక !

ఈ గ్రామము చైతన్యము కలదని చరిత్రవలన పాఠకులకు వేరే చెప్పనవసరంలేదు. అటువంటి స్థితిలో భారత వర్షమునంతను కదలించిన భారత భాగ్య విధాత బాపూజీ ఉద్యమములో ఉత్సాహముతో పనిచేయుట సహజం.

అస్వస్థతచేత ఆంగ్ల విద్యాభ్యాసమునకు స్వస్తి చెప్పిన గొట్టిపాటి బ్రహ్మయ్య, వేమూరి సీతారామయ్య గారలు ఈ రచయిత మున్నగు యువజనులు సాంఘిక, రాజకీయ కార్యకలాపములలో పాల్గొనుచుండెడివారు. అప్పటికే వీరి వయస్సు 20 సంవత్సరముల పైబడెను. గ్రామవ్యవహార

ముంటలో కూడ పాల్గొనుచుండెడివారు. అప్పటికి గ్రామములో పార్టీలు నశించినవి. వీరికృషివలన సఖ్యత పెరిగినవి. వీరు అభివృద్ధిలోనికి రాగల యువకులని గ్రామమునకు ప్రతిష్ఠ, ప్రయోజనము తేగలరని పెద్దలు వీరియందు ఆదరాభిమాన వాత్సల్యములు చూపుచు వీరి కార్యకలాపములకు తోడ్పడెడివారు. అటులనే గ్రామస్థులందరకు వీరియెడల అధిక అభిమానముండెను.

ఘంటసాలలోకంటె యీ జిల్లాలో అనేక గ్రామాలలో అధిక సంఖ్యాకులు కారాగృహమున కరిగినవారు కలరు. అనేక బాధలుపడిన గ్రామములు కలవు. అయినను ఘంటసాలకు కాంగ్రెసులో అధిక ప్రఖ్యాతి వచ్చుటకు కారణము, ఈ గ్రామములో కాంగ్రెసు సభ్యులలో ఎట్టి భేదములు లేక (టీము స్పిరిట్‌తో) జట్టుగా కలిసి పనిచేయుట, గ్రామస్థులందరు అధిక అభిమానముతో పని చేయుట, ఈ గ్రామపూర్వ ప్రతిష్ఠ, కారణములు. ఈ గ్రామవాసి అగు గొట్టిపాటి బ్రహ్మయ్యగారు ఆంధ్ర కాంగ్రెసు రాజకీయ రంగమున ప్రముఖస్థాన మాక్రమించుటకు కూడ ఒక కారణము. ఆయనపేరుతో గ్రామప్రతిష్ఠ, గ్రామప్రతిష్ఠతో ఆయన పేరు అవినాభావముగ ప్రఖ్యాతమయ్యెను.

ఆనాటి జమీందారీ వ్యవహారములలో బాలకృష్ణమ్మగారెటుల నాయకత్వము వహించి రైతులకు అండగా నిలచి ఘంటసాల ప్రతిష్ఠ పెంచెనో, అటులనే గొట్టిపాటి బ్రహ్మయ్యగారు, ఈనాటి జాతీయోద్యమములో ప్రవేశించి నాయకత్వము

వహించి పేరు ప్రఖ్యాతులు పొందుటేగాక ఘంటసాలకు కూడ ప్రతిష్ఠ తెచ్చెను.

## స్వాతంత్ర్య ప్రకటన

ఆహా! మహాత్ముడు మన కళ్ళఎదుట ఎట్టి మహత్తర మార్పులను మనలో కలుగజేసెను! హంసతూలికా తల్పమున తూగుటుయ్యాలలో ఊగు కుసుమ శారీరులను, కర్క శారణ్య భూములకు బంపెను. మదపు టేనుగుల నెక్కి మదాంధతచే మహీ చక్రమును మీటు మహారాజులంతటి వారిని పాదచారులుగ ఒనర్చెను. బంగారు రేకులు భుజించు భాగ్యవంతులను కటిక గంజిపాలు జేసివైచెను. బాలచంద్ర ప్రభల భాసిల్లు బాలభారతులకు బూడిదపూసి కౌపీనము లిప్పించెను. పట్టుదుకూలములు బరువైనవని భావించు భామినులను మోటు ఖద్దరు వస్త్రములను కట్టించెను.

మహాత్ముని బోధవల్ల జైలుయాత్ర తీర్థయాత్ర అయినది. అది శ్రీకృష్ణ జన్మస్థానమని ఖ్యాతిగాంచినది. దేశారాధనకు అది ఒక గీటురాయి అయినది. అనేకమారులు లక్షలాది భారత వీరనరనారీమణులు జైలుయాత్ర చేసి బ్రిటీష్ ప్రభుత్వ నైతిక ప్రతిష్ఠ నాశన మొనర్చి లోకాన్ని విస్మయ చకితం చేశారు.

దేశంకొరకు ప్రాణములను పుష్పములవలె అర్పించిన త్యాగులు తేజరిల్లారు, బాపూజీ బోధనలవల్ల. కర్పూరము స్వరూప నాశనము చేసుకొని నప్పుడే తేజోరూపము బొందగలదు. స్వాతంత్ర్య జ్యోతి ప్రసన్నమగుటకు కర్పూర నీరా

జన మెత్తుటకు అర్హత ఈ భారత జాతికే, ఈ భీష్మ సంతతికే కలదన్న సంగతి ప్రపంచం ఎదుట ఋజువైనది.

"ఇంతేకాదు. I will spread out freedom of India in Jails" భారత స్వాతంత్ర్యం కారాగృహాల ద్వారానే సాధించెదనన్న మహాత్ముని ప్రవచనం అక్షరాలా సత్యమైనది.

గాంధీమహాత్ముడు ఈ బ్రిటీషు ప్రభుత్వంపై అనేక పోరాటములు సాగించాడు. ప్రథమములో సహాయ నిరాకరణము, తరువాత సత్యాగ్రహము, అనంతరం వ్యక్తి శాసనోల్లంఘన, తర్వాత క్విట్ ఇండియా ఉద్యమము.

క్విట్ ఇండియా ఉద్యమము కేవలం ప్రజాపోరాటం. ప్రభుత్వ రైళ్ళను, తంతి తపాలాలను నాశనంచేసి ప్రభుత్వాన్ని స్తంభింప జేసింది.

మరొకవైపున నేతాజీ అజాద్ హింద్ ఫౌజ్ ద్వారా సైన్యంలోకూడా తిరుగుబాటు వచ్చింది.

బొంబాయి మొదలగు ప్రాంతాల కార్మికులలో కూడ గొప్పసమ్మె జరిగింది. ఇదివరకే ఒక బ్రిటీషు రాజ్యాంగవేత్త "మన అధికారాన్ని ఇండియాలో నిలబెట్టేది పోలీసులు, మిలిటరీ, కోర్టులుకావు. ప్రజల సహాయం వల్లనే మన ప్రభుత్వం నిలుస్తుంది. వారెప్పుడు సహాయ నిరాకరణ చేస్తారో అప్పుడు మనం ఇండియానుండి వీడి రావాల"ని చెప్పిన మాట ఋజువైంది.

1947 ఆగస్టు 15వ తేదీన గురుశుక్రవారాల సంధ్యలో త్రయోదశి తిథిలో నవగ్రహాలు చల్లని చూపు చూస్తూండగా నడి నిశీధిని గడియారం గం 12లు కొట్టుతూ ఉండగా జయభేరీ నినాదంతో భారతమాత సంకెళ్ళు తెగిపోయినవి.

నెహ్రూ పండితుడన్నట్లు "అర్ధరాత్రి గం. 12లు కొట్టగానే ప్రపంచమంతా నిద్రిస్తుండగా, భారతదేశం స్వాతంత్ర్య చైతన్యంతో మెలకువ చెందింది. ఇటువంటి సుముహూర్తము మన మింకెన్నడూ చూడలేము."

"యుద్ధము లేని సంధియని" చాలా లోతైన భావంతో అన్నాడు లార్డు మౌంట్‌బాటన్.

ఈ రకము సంధికి ఒక్క మహాత్ముడు మనమే కాదు, ఆంగ్లేయుల రాజకీయ చతురతకూడా.

స్వరాజ్యము రావటానికి దీర్ఘంగా ఆలోచిస్తే చాలా ఎంకు మనపోరాటాలు, ఆంగ్లేయుల ఆర్థిక, సైనిక పతనము, కొంత వారి ఔదార్యము ఇన్ని కలిసిన మీదట ప్రపంచ సంస్కృతి మన విముక్తికి దోహదం చేసింది.

భరత ఖండాన్ని పాకిస్థాన్, ఇండియాగా విభజించుట ఆంగ్లేయుల రాజనీతి.

వారు విభజించి పాలించారు, విభజించి వెళ్ళి పోయారు. మన ఇండియాలోనేగాదు ఐర్లెండు, అమెరికాల లోనూ అంతే. అయినా ఇంత విస్తీర్ణంగల రాజ్యంమనకు ఏనాడూ లేదు. అది వారి ప్రయోజనమే. ఇంతేకాదు, వారి వల్లనే మనం ఏకజాతీయులమని చైతన్యం కలిగి ప్రవర్తించాం. వారివల్ల కీడుతోపాటు మేలుకూడా కలిగింది.

ఆగస్టు 15వ తారీఖున ప్రజలంతా పండుగ చేసుకొన్నారు. ఇక్కడకూడ గాంధీయుగంనుండి స్వాతంత్ర్య సముపార్జనకు గ్రామస్తులు తమ గ్రామము కాంగ్రెసుకు పెట్టని కోటగానుండి నెరవేర్చిన ఉత్కృష్టకార్యకలాపములను స్మృతి పథమునకు తెచ్చుకొని స్వరాజ్యము సురాజ్యము కావాలని అంజలి ఘటించారు.

# సప్త సంతానములు

మన హిందువులలో సప్త సంతానములనే ఆచార మున్నది. వీటివల్ల తమపేరు శాశ్వతముగ వుంటుందని, పుణ్యం కల్గునని వారు భావించారు. దేవాలయ నిర్మాణము, అగ్రహారము, వనముల నేర్పాటుచేయుట, తటాకముల ప్రతిష్ట, ప్రబంధముల కృతిగొనుట, నిధి, పుత్రుడు, వీటినే సప్తసంతానము లందురు.

ఈసప్త సంతానములనే ధర్మ కార్యములను నిర్వహించటంలో హిందూరాజులు ప్రసిద్ధి కెక్కిరి. ధర్మకార్య తత్పరతతోపాటు బహుజన ప్రయోజనముకూడా వీటిద్వారా ఆశించారు! వారి బాటనే ఆనాటి వారైన పెద్దలుకూడ యథోచితరీతిని నడచిరి. అటులనే ఈగ్రామమునకూడ జరిగినది.

ఈ గ్రామములోని దేవాలయములను గురించి, వాటికిచ్చిన దాతలను గురించి కొంతవరకు ముచ్చటించుట జరిగినది. ఇక ఈ గ్రామంలోని సప్త సంతానములను గురించి వరుసగా పేర్కొంటున్నాను.

## దేవాలయములు

వైదిక యుగమునాటి ఆర్యులకు విగ్రహారాధనలేదు. వారికి దేవతార్చన విధిలేదు. వారు తపస్స్వాధ్యాయన జప హోమ తత్పరులు. ఇట్టివారిమధ్య విగ్రహారాధన మొక నూతన సంప్రదాయము వెలసినది. ఈ నూతన సాంప్రదాయ

మున, పూజావిధమున, అగ్నిముఖమున అర్పించు హవిర్భాగ ములు ఇంద్రాది దేవతలు అంతరించి, రాతిబొమ్మలందు మూర్తీభవించు క్రొత్తదేవత లవతరించిరి. ఇది బౌద్ధమతా నంతరం నూతనముగ వెలసిన పూజా సంప్రదాయము.

నేడు దేవాలయముల ప్రాముఖ్యము పోయినది కాని వాటి పూర్వ ప్రసిద్ధినిగురించి (శ్రీ) మల్లంపల్లి సోమశేఖర శర్మగారిట్లు పేర్కొనిరి.

"అగ్రహారములకు పిదప పరిగణింపదగిన ప్రాచీన విద్యాసంస్థ దేవాలయము. పూర్వకాలమున దేవాలయముతో సరిపోల్చదగిన మహాసంస్థ ఇంచుమించుగ లేదనియే చెప్ప వచ్చును. అది మతధర్మముల నుద్బోధించు గురుపీఠము; వేదబోధిత విద్యా ప్రదానముగావించు విద్యానిలయము: మతబోధకు లుపన్యాసములు చేయు నుపన్యాస వేదిక; శాస్త్రజ్ఞులు వాక్యార్థములు గావించు సభాభవనము; పౌరా ణికు లితిహాసములు వినుపించు సత్రశాల; భాగవతోత్తములు పరమేశ్వ రారాధనము గావించు పూజామండపము – అట్టిది పూర్వకాలపు దేవాలయము. సాధ్యమైనంతవరకు ప్రాచీన గ్రామ జీవనము కలక బారకుండ జాగ్రత్తగ కాపాడుచూ వచ్చిన మహాసంస్థ యిదియే."

## జలధీశ్వరాలయం

ఇది ప్రాచీనాలయము. ఎప్పుడు ఎవ్వరు కట్టించిరో తెలియదు. దీనికి ఎఱ్ఱగుడి అనిపేరు. దీనికి గొఱ్ఱెపాటి కృష్ణమ్మగారు సున్నము చేయించారు. తరువాత పురాతత్వ

శాఖవారు దీనిని కాపాడుతూ మరమ్మతు చేయిస్తూ ఉండిరి. ఇటీవల ఘంటసాల గ్రామ సంఘమువారుకూడ కొంత మరమ్మతు చేయించారు.

ఈ జలధీశ్వరస్వామి ప్రహారీగోడ పడిపోగా గొర్రెపాటి కృష్ణమ్మగారు కట్టించారు. వేమూరి రామన్నగారు నూరు రూపాయలిచ్చి, వేమూరి పిచ్చయ్యగారి తండ్రి వెంకన్నగారు తమ పొలములో దొరికిన రాతి అమలో సగంయిచ్చి వీరికి సహాయపడిరి.

దీనికొక మద్దిరథమును కృష్ణమ్మగారు చేయించిరి. దాని కొకవైపున రామాయణ యుద్ధము, మరొక వైపున భారతయుద్ధము వుండెడిది. దేవరకోట జమీందారగు పెద అంకినీడుగారు ఈ రథం బాగుగావున్నదని దానికి కావలసిన యినుప సామానులుకూడ ఇచ్చిరి. ఉప్పెనకు ఈ రథము పోయినది. దేవరకోట జమీందారుగారగు చిన అంకినీడుగారు ఈదేవాలయములోని నంది ముచ్చటగావున్నదని తలచి, తీసుకొని వెళ్ళుటకు ప్రయత్నించగా గొర్రెపాటి కృష్ణమ్మగారి కుమారుడగు సుబ్బయ్యగారు నడుముకట్టి నన్ను చంపి తీసుకొని వెళ్ళవలసినదని సత్యాగ్రహముచేయగా అంకినీడు గారు తన ప్రయత్నమును విరమించుకొనెనందురు. అప్పట్లో కొడమంచిలి లింగయ్య అర్చకుడు. అనంతరం ఘంటసాల పుల్లయ్య, వారి తర్వాత రామయ్య, సుబ్బయ్యలు వరుసగా అర్చకత్వము చేసిరి.

ప్రస్తుతం మేడపట్టు పూర్వం గాలిగోపురం వుండేది. అది వుప్పెనకు పడిపోయినది. దాని పట్టున కృష్ణమ్మగారు

ఒక యజ్ఞశాలను కట్టించిరి. అది శిధిలమైపోగా గొర్రెపాటి బాలకృష్ణమ్మగారు ప్రస్తుతం మేడను ఆ కరువు కాలంలో నాలుగు వందలరూపాయలు వసూలుచేసి దేవుని పవళింపు సేవకుగాను కట్టించెను. వీరి తమ్ముడు రామస్వామిగారు దక్షిణవైపు పునవున్న గాలి గోపురమును కట్టించిరి. మేడ శిధిల మగుచుండగా 1914 వ సంవత్సరమున గ్రామమున్మడి సొమ్మును రు. 800/-లు వెచ్చించి గొర్రెపాటి అప్పయ్య గారు మరమ్మతు చేయించిరి. కొంతకాలం ఇది బాలికా పాఠ శాలకు వుపయోగపడినది. ఆ బాలికా పాఠశాలకు ఇది చాల నందున ఇప్పుడున్న లైబ్రరీ ప్రదేశమున ఒక పూరిపాకను 1918లో వేసిరి. ఆ పాక బాగాలేనందున ఇటీవల ఘంటసాల గ్రామసంఘం తరఫున 1948 లో గొర్రెపాటి నరసన్నగారి కుమార్డు వెంకయ్య (ప్రెసిడెంటు) గొర్రెపాటి వెంకన్నగారి కుమార్డు వెంకటసుబ్బయ్య, (సెక్రటరీ)గారలు ఒక డాబాను కట్టించిరి. ఆ మేడప్రక్కన ఇది అందముగా కనపడనందున దోనేపూడి సీతారామయ్యగారు గ్రామత్య 8 వేలతో, వ్యయ ప్రయాసల కోర్చి పై అంతస్థును కట్టించిరి. ఇదియెంతో నిండు నిచ్చినది. దేవాదాయ ధర్మాదాయ సహకారశాఖామాత్యు లు గౌరవనీయులగు కల్లూరి చంద్రమౌళిగారు 19. 1. 61న ఈ భవనమునకు ప్రారంభోత్సవము చేసిరి. దీనిలో ఇప్పుడు శ్రీ జలధీశ్వర విశాల సహకారపరపతి సంఘము కలదు. పూర్వం మేడ భాగము బాలుర పాఠశాలకు బ్రాంచిగా వుపయోగపడుచున్నది.

## మండపములు

ఈ కళ్యాణ మండపము చాలాఅస్థిరముగా వున్నది. దీనిని గొర్రెపాటి బాలకృష్ణమ్మగారు కట్టించిరి.

జలధీశ్వరాలయ ముఖమండపము శిథిలమైపోయినది. గోడలుమాత్రం నిల్చివున్నవి. అవి నానా వికారముగా వుండుటచేత ఘంటసాల గ్రామ సంఘమువారు పూనుకొని 1929వ సంవత్సరమున 26 వందల రూపాయలతో చక్కని ముఖ మండపమును నిర్మించిరి.

ఈ మండప నిర్మాణమునకు దూబ్రియల్ గారు రు. 1116/-లు, వేమూరి గంగమ్మగారు రు. 700/-లు, ఘంటసాల సూర్యనారాయణగారి కుమారులు వెంకటాద్రి, సత్యనారాయణగారలు రు. 200/లు, తదితర బ్రాహ్మణులు రు. 150/-లు, వైశ్యులు రు. 40/- పద్మసాలీలు రు. 100/-లు, సంకావారు రు. 100/-తదితరులుగా తతిమ్మా మొత్తమును విరాళముగా ఇచ్చిరి.

పూర్వము స్వామికి మూడువందలయకరముల భూమి వుండెడిదట. దానిని జలదాయ పంపు అనెడి వారట. ఆ భూమి జమీందారుగారు తీసుకొని పడమటి పొలము ఏడు ఎకరములు మాత్రం వుంచిరని అర్చకులు చెప్పిరి.

ఘంటసాల బ్రహ్మయ్యగారి కుమారుడు నరసింహారావుగారు ఈ స్వామి కైంకర్య నిమిత్తము గుడివాడ ప్లీడరగు తుమ్మలపల్లి గోపాలకృష్ణమూర్తిగారికి ఏలునామా ద్వారా కొంత ధనమును సమర్పింపజేసి కీర్తిశేషులైరి. గోపాల

కృష్ణమూర్తిగారితో ఉత్తర ప్రత్యుత్తరములు జరిపి ఆ ధనముతో ఎలికిలకుదురు గ్రామంలో 1923 డిశంబరు నాల్గున ఎ. 1-08 శెంట్లు మాగాణీ భూమిని కొనిరి. ఆయన ఒక వెండిపళ్లెము, రుద్రపాదములనుకూడా అర్పించెను. ఈస్వామి వారికి వేమూరి గంగమ్మగారు రుద్రాక్ష మండపమును చేయించెను.

జలధీశ్వరాలయశిఖరములు ఉప్పెనకు పోగా చల్లపల్లి సీతారామయ్యగారు తిరిగి ప్రతిష్ఠ చేసిరి.

ఈ దేవాలయ ధ్వజస్తంభము శిధిలమైపోవుచున్నదని చింతించి గొర్రెపాటి బ్రహ్మన్నగారి కుమారుడు వెంకట్రామయ్యగారు గ్రామములో షుమారు ఆరువందల రూపాయలు వసూలుచేసి ఇత్తడి తొడుగును 1953 లో వేయించిరి.

వేమూరి వెంకటరత్నంగారు (తండ్రి సుబ్బయ్యగారు) కొంతకాలం కార్తీక పూర్ణిమకు వైభవముగా ఉత్సవములను చేయించిరి. కొంతకాలం గ్రామసంఘమువారుకూడ చేయించిరి.

ఇది 1950 నుంచి దోనేపూడి సీతారామయ్య, గొర్రెపాటి వెంకట్రామయ్య, గొర్రెపాటి బాపనయ్యగారల యాజమాన్యమున వున్నది.

మేనేజింగు ట్రస్టీ దోనేపూడి సీతారామయ్యగారు దేవాలయ విమానమును బాగుచేయించిరి. ఆలయమందు కడపరాయి, వేయించి, ఆలయంలో విద్యుద్దీపములు ఏర్పాటు చేయించిరి.

ఈ దేవాలయ శిఖరమున పెట్టిన గొప్ప విద్యుద్దీపము తన కాంతిని ఎంతో దూరము ప్రసరింపచేయుచు కన్నుల పండుగగా వున్నది.

## సుబ్రహ్మణ్యేశ్వరాలయం

ఈ ఆలయమును గొర్రెపాటి వెంచయ్యగారికుమార్తు కృష్ణమ్మను గొప్పభక్తుడు 1813 లో జలధీశ్వర ఆలయ ఆవరణలో కట్టించెను. నాటినుంచి నేటివరకు ఈ స్వామికి మార్గశిర శుద్ధషష్ఠికి అతివైభవముగా కళ్యాణోత్సవములు చేయుచుందురు. ప్రథమ దినమున ధ్వజారోహణ, రెండవ దినమున జగజ్జ్యోతి. ఆ రోజుననే సహస్రదీపారాధన చేయుట వల్ల ఆ ప్రాంగణమంతా నేత్రపర్వముగా ఉండేది. మూడవ రోజున కళ్యాణము♦ ఈ గ్రామములో నివారేగాక, ఈ గ్రామ ఆడబడుచు లెక్కడున్నా వారు, వారి బంధువులు, చుట్టు ప్రక్కల స్త్రీలు బండ్లు కట్టించుకొని వచ్చి సుబ్రహ్మణేశ్వర స్వామికి మొక్కుబడులు చెల్లించుకొనేవారు.

పిల్లలకు తలవెంట్రుకలు ప్రథమంగా ఇక్కడనే తీయించెడివారు. బ్రాహ్మణులకు బియ్యమిచ్చి స్త్రీలు కోకలుతీర్చుకొనేవారు.

---

♦ సుబేదారు బ్రహ్మయ్యగారు ఈ సుబ్రహ్మణ్య స్వామియందు అధికభక్తి తత్పరత కలిగి ఉండేవారు. ఆయన ఎక్కడున్నప్పటికి స్వామి కళ్యాణోత్సవమునకు ప్రతి సంవత్సరము రు. 8/-లు పంపుతుండేవారు. తన రెండవ కుమారునకు ఈ స్వామిపేరే పెట్టుకొన్నారు.

ఈ కుటుంబంలోని వాడగు వెంకయ్యగారు మంచి పలుకుబడి కలవాడు. ఈయన సుబ్రహ్మణ్యస్వామి ఆలయానికి సున్నము చేయించి ముఖమండపం కట్టించాడు. చాలా భక్తిశ్రద్ధలతో స్వామివారి కళ్యాణం ప్రతిసంవత్సరము వైభవంగా చేయించేవాడు.

పదిబళ్ళు తోలిపెట్టి పాగోలునుంచి రధ సామాను తెప్పించి, దానిని అమర్చి రథోత్సవం జేగీయమానంగా చేసేవాడు. హర-హరా అంటూ భక్తులు, రథపు మోకులను లాగేవారు. విలాయకర్రల పెక్కుమంది రజకులు పూని నేత్రపర్వంగా స్వామివారు కనిపించేటట్లు చేసేవారు. ప్రతియింట హారతి అర్పించేవారు.

తర్వాత ఆయన ప్రోత్సాహమున పొన్నపల్లి కోటి సుబ్బయ్య దివ్యమైన రధాన్ని చేయించి యిచ్చి అలంకారమునకు తెరలుకూడ దానమొనర్చెను. ఇది చాలా మహోన్నతమైన రథము. ఇంతగొప్ప రథము అప్పుడు ఈ జిల్లాలో ఎచ్చటనూ లేదు.

ఈ వుత్సవ సందర్భమున వెంకయ్యగారి హయాములో చాకలి మంగళ్ళు తమతమ పనులు చేసేవారు. పద్మసాలీలు మగ్గానికి పావలా చొప్పున వార్షికంగా ఉత్సవానికి యిచ్చేవారు. బ్రాహ్మణ సమారాధన చేసేవాడు. కూచిపూడి వారిచేత నాటకం ఆడించేవాడు. చుట్టుప్రక్కల నుండి వేలాదిజనం చూచుటకు వచ్చేవారు. ఆయన అనంతరం ఆయన తమ్ముని కుమార్డు వెంకటసుబ్బయ్యగారు ఈ ఉత్సవాలు చేయిస్తున్నాడు.

ఈ స్వామికి కృష్ణమ్మగారి కుమారుడు శ్రీరాములుగారు రెండు ఎకరముల భూమినిచ్చెను. ఆయన గొప్ప భక్తుడు. ఆయన మనుమడు గొర్రెపాటి నరసింహంగారు యాబది సెంట్లు భూమిని ఈ దేవునకు దానమిచ్చెను.

ఈ దేవాలయ ధ్వజస్తంభమునకు 1954 వ సంవత్సరమున ధర్మకర్తలు ఇత్తడి తొడుగు వేయించిరి. వంశపారంపర్య ధర్మకర్తల స్వాధీనములో ఈ ఆలయమున్నది.

## వేణుగోపాలస్వామి ఆలయము

దీనికి ఆదిలో చల్లపల్లి గ్రామస్థులగు నంబూరి కృష్ణమూర్తి, పురుషోత్తము గారలు ధర్మకర్తలు. వీరే దీనిని కట్టించిరి. దీనిని నల్లగుడి అనేవారు. ఈ దేవుని కళ్యాణోత్సవము చేయించుటచే నంబూరివారి వంశము క్షీణించినదని తలంచి పాలెపువారికి ధర్మకర్తృత్వం యిచ్చిరి. కళ్యాణోత్సవం అంతకు పూర్వం సామా శ్రీరాములుగారు, గొర్రెపాటి బాలకృష్ణమ్మగారి ద్వారా చేయించెడివారు. దీనికి కళ్యాణమండపము కట్టించినది కొడమంచిలి లింగయ్యగారు. ఒకసిద్ధాంతి వచ్చి ఆగ్నేయభాగమందు కళ్యాణ మండపం వుండకూడదు, అందుచేతనే ఈ స్వామికి కళ్యాణోత్సవములు జరుగవు అనిచెప్పి ఈశాన్యభాగమున కట్టించవలెనని చెప్పెను. షుమారు నూరు సంవత్సరములకు పూర్వం ఈ గుడికి ఘంటసాల పాలెం వేమూరివారు ధర్మకర్తృత్వం వహించి శిఖర ప్రతిష్టచేసి కొంత భూవసతి కూడ కలుగ జేసిరి.

తిరుపతి, శ్రీకాకుళం వెళ్ళజాలని వారు ఈ దేవాలయములో వివాహములు చేసుకొంటూ వుండేవారు. ఈ ఆలయ ధ్వజస్తంభమునకు కొత్తపల్లి గ్రామకాపరస్థుడగు తుమ్మల గోపాలకృష్ణయ్యగారు 1954 వ సంవత్సరమున ఇత్తడితొడుగు వేయించిరి.

బహురమ్యమైన ప్రాచీన మండపము కొద్ది సంవత్సరముల క్రితం దహనమైపోగా 1963వ సంవత్సరమున మరల అటువంటి అపాయము కలుగకుండా వుండగలందులకు ధర్మకర్తలు సిమెంటు మండపము కట్టించిరి.

దేవాలయమును బాగుచేయించి ముఖమండపము శిథిలముకాగా శోభాయమానముగా మరల కట్టించి ఆలయమునకు శోభను చేకూర్చిరి.

ఈ స్వామివారికి కొత్తపల్లిలో పది ఎకరముల భూమి ధర్మకర్తలు ఇచ్చిరి. ధర్మకర్తలు వేమూరి నాగయ్య, ఈ వెంకయ్య, చలమయ్య, ఈ సుబ్బయ్య, ఈ రామస్వామి, ఈ వెంకటేశ్వర్లు గారలు.

## ఆంజనేయస్వామి ఆలయము

వేణుగోపాలస్వామి ఆలయ ప్రాంగణములోనే ఈ ఆలయమును ఈ గ్రామ కాపరస్థులగు వైశ్యులు గెల్లి వెంకట్రామయ్య, చెలమయ్యగారలు షుమారు 90 సంవత్సరముల క్రితం కట్టించి, దీనికి కొంత భూవసతికూడా కలుగ

చేసిరి. వారి సంతతి వారగు గెల్లి నరసయ్యగారి కుమారులు సీతారామయ్య, కృష్ణమూర్తి, వెంకటకృష్ణయ్య గారలు (విజయ వాడ) 1934-1-25వ తారీఖున రు. 1200/- లతో ధ్వజ స్తంభ ప్రతిష్ఠ చేసి రాగితొడుగును వేయించిరి.

ఈస్వామికి రెండెకరాలభూమి చిలకలపూడిలో కలదు.

ఈ దేవాలయముల రెంటికిని నిత్యనైవేద్యము నెర వేర్చే వైష్ణవార్చకులు వంశ పరంపరగా వుంటున్నారు. వారు వైద్యులుకూడా.

సామాన్యముగా ప్రతిగ్రామ దేవాలయ అర్చకుడు అంతోయింతో వైద్యము తెలిసినవాడే.

దీవి నరసింహాచార్యుల కాలమున ప్రతి శుక్రవారము మద్దెల తాళములతో భజనచేసేవారు. అర్చకుడు మృదంగం వాయించేవాడు.

ఈ రెండు దేవాలయములకు నేటి అర్చకుడు దీవి లక్ష్మణాచార్యులుగారు.

## విశ్వేశ్వరాలయము

జలధీశ్వరాలయము తర్వాత విశ్వేశ్వరాలయము ప్రాచీనమైనది. అది శిథిలమైపోగా బోడిలింగం గుంటలోని లింగాకారమును తెచ్చి మట్టి అడుసుతో చిన్న ఆలయమును కట్టించిరి.

అదీ కొంతకాలానికి శిథిలమై పోయెను. రెండు చింతల అచ్చన్నగారు కాశీనుంచి ఒక లింగమును తేగా ఈ అచ్చన్న,



ప్రసిద్ధమైన ఘంటసాల సరస్వతి

వేమూరి ఘంటయ్యగారలు అక్కడనే విశ్వేశ్వరుని పేర ఒక ఆలయమును 1860 సంవత్సరమున కట్టించిరి.

ఈ స్వామికి దేవరకోట కాపురస్థులును, పరగణా పెత్తందార్లలో ఒకరగు దోనేపూడి పెదసుబ్బన్నగారు ధ్వజ స్తంభమును ప్రతిష్ఠించిరి.

ఈ ఘంటయ్యగారి కుమారుడు పట్టాభిరామయ్యగారి అల్లుడైన గొర్రెపాటి బ్రహ్మన్నగారు ఈ స్వామికి మూడు కుంటల భూమిని దానంజేసిరి.

ఒక సత్రమునుకూడ ఆలమునకు సమీపంలో ఆయనే కట్టించెను.

ఈ అచ్చన్నగారి హయాములో ఈ దేవుని కళ్యాణోత్సవము శివరాత్రికి మహావైభవంగా జరుగుచుండేది. బ్రాహ్మణ సమారాధన, తెప్ప తిరణాలు అతి వైభవంగా జరుగుతుండేవి. ఈ ఆలయానికి అనుకొనివున్న ఆళ్ళ వెంకమ్మ చెరువులో ఒక పెద్ద తెప్పకట్టి దానిమీద సానిమేళంతో చెరువులో త్రిప్పుచుండెడివారు.

కొంతకాలానికి ఈ ఆలయం శిధిలమైపోయింది.

1905 ప్రాంతాన వేమూరి వెంకటరత్నంగారు అనాడు దీనికి రు. 300/- స్వయంగా యిచ్చుటేగాక, ఆయన అండ దండలతో వేమూరి పట్టాభిరామయ్యగారి కుమారుడు చలమయ్య, యీ బ్రహ్మన్నగారి కుమారుడు రామస్వామిగారలు చాలా శ్రమపడి తిరిగి ఊళ్ళవెంట సొమ్ము వసూలుచేసి

షర్కృష సాంఘికసోదరుల శ్రమదానంతో దేవాలయ పునర్నిర్మాణము చేయించిరి.

దీనికి వేమూరి వెంకన్నగారికుమారుడు వెంకటరత్నంగారు ధర్మకర్త. ఆయనవారు, దేవరకోట కాపురస్థుడు అగు దోనేపూడి పెదపాపన్నగారు ఇత్తడిరేకుతో ధ్వజస్తంభ ప్రతిష్ఠచేసిరి. ఈయన తండ్రే ఇదివరకు ఘంటయ్యగారి కాలంలో చేసినది.

1920 ప్రాంతమున ఈ దేవాలయ సింహద్వారంపైన గాలిగోపురం వేమూరి పట్టాభిరాముడుగారి కుటుంబంవారి సమిష్టి ద్రవ్య సహాయంతో వేమూరి చలమన్నగారి కుమారుడు సుబ్బయ్యగారి ప్రేరేపణవల్ల నిర్మించబడింది.

1926 ప్రాంతమున వేమూరి పట్టాభి రాముడుగారి కుమారుడు చంద్రయ్యగారు ఇచ్చిన రు 500/-లతో భూమి ఖరీదు చేయుబడెను.

విజయవాడలో వేమూరి వెంకట్రామయ్యగారి పేరున జరిగిన కమీషను వ్యాపారసంస్థ ధనసహాయంతో, సంఘీయుల బండ్లసాయంతో కళ్యాణమండపం, దేవాలయ విమానం, వరుసగా 1925, 26, 29 సంవత్సరములలో నిర్మింపబడెను.

ఈ దేవాలయమునకు మంచి భూవసతి గలదు.

నాటినుండి నేటివరకు శివరాత్రికి ఈ దేవుని కళ్యాణోత్సవము శ్రద్ధగా చేయబడుచున్నది.

ఈ ఆలయమునకు వంశపారంపర్య ధర్మకర్త వేమూరి వెంకట రామకృష్ణయ్యగారు.

కాని ధర్మకర్త బెజవాడలో ఉంచుటచే కళ్యాణోత్సవములు చేయించువారు వేమూరి సీతారామయ్యగారు ప్రత్యేకంగా పేర్కొనదగినవారు. ఆయనకు సహాయకుడుగా వేమూరి వెంకన్నగారి కుమారుడు పట్టాభిరామయ్యగారు, ఆయన అనంతరం ఆయన సోదరుడు రత్తయ్యగారు తదితరులు ఈ ఉత్సవ కార్యములలో శ్రద్ధతో పాల్గొంటున్నారు.

## విశ్వేశ్వర పఠనాలయము

బ్రహ్మన్నగారు కట్టించిన సత్రం పడిపోవుటచేత ఈ దేవాలయమునకు సంబంధించిన మరొక సత్రం కట్టించాలని ధర్మకర్త వేమూరి వెంటరత్నంగారి కాలంనుంచి ఆలోచన కలదు. విశ్వేశ్వరాలయ సమీపములో ఆళ్ళ వెంకమ్మ చెరువు నానుకుని వున్న స్థలమును దేవుని క్రింద కొని దివ్యమైన భవనమును 1948లో రు. 15000/-లతో కట్టించిరి. దీని పేరుతో కొంతకాలము పత్రికలు మున్నగునవి తెప్పించటం జరిగినది.

## అన్నపూర్ణాంబాలయము

ఈ ఆలయమును వేమూరి ఘంటయ్యగారి కృష్ణమ్మగారి కుమారుడు గోపాల్లుగారి భార్య గంగమ్మగారు 1930 – 31 లలో కట్టించి అన్నపూర్ణాంబను ప్రతిష్ఠింపచేసెను. దీనికాకు కొంత భూవసతిని కూడ కలుగజేసెను. విశ్వేశ్వరునితోపాటు ఈ అంబకునూ నిత్య ధూపదీప నైవేద్యములు జరుగుచున్నవి.

## భావనాఋషి ఆలయము

భావనాఋషి 18వ శతాబ్దమునకు చెందిన సంఘ సంస్కర్త. ఈయన పద్మశాలీలకు యజ్ఞోపవీతధారణ చేయించెను. మైసూరు రాజ్యములో కూడా ఆ ప్రయత్నము చేస్తూవుండగా శృంగేరి మఠాధిపతి వర్ణాశ్రమ ధర్మాన్ని ధిక్కరిస్తున్నాడని చెప్పి టిప్పుసుల్తాను మంత్రి పూర్ణయ్య ద్వారా భావనాఋషిని మైసూరునుండి పంపివేసెను.

ఈయన ఉత్సవం పద్మశాలీలు ప్రతిసంవత్సరం జనవరి 15, 16, 17 తేదీలలో చేయుదురు.

ఈ భావనాఋషి విగ్రహాన్ని 1915లో ఒక పెంకుటింట్లో ప్రతిష్ఠించిరి.

తుమ్మలచర్ల గోవిందురాజులు ధర్మకర్త. ఆయన భార్య సీతమ్మగారు సాలెంపాలెంలో య 1. 59 సెంట్లు మాగాణి భూమి దానము చేసినది.

కాజ గ్రామకాపురస్తుడు శ్రీ తిరందాసుగారు ఒక ఇత్తడి పులివాహనమును ఇచ్చిరి.

## రామాలయములు

రాముడు ఆంధ్రులకు ఇష్టదైవం, దేవాలయంలేని గ్రామముంటే వుండవచ్చుగాని రామాలయంలేని గ్రామం లేదనే చెప్పవచ్చును. ఈ భజన కూటముల ప్రాశస్త్యము కొనియాడ తగినది.

మన హిందువులలో పాశ్చాత్యులలోవలె జాతీయతా భావములేదు. దానికి మన మతమే కారణమనవచ్చు. మన

మతము జాతీయాభిమానం పెంపొందించక పోవటమేగాక, స్వాభిమానము కులాభిమానములు పెంపొందించేదిగా వున్నది. దేవాలయములలో మనము చేయించే పూజ లెట్టు వంటివి? అర్చన చేయువారి కులగోత్రములు చెప్పి వారి 'కాయురారోగ్య పౌత్రాభి వృద్ధిరస్తు' అని దేవునకు నివేదించటమే గద!

మహమ్మదీయులు, క్రైస్తవులవలె కలసిమెలసి ప్రార్థన చేయుపద్ధతి మనకు లేదు. సాంఘికదృష్టి మనకు ఎందులోను లేదు. అంతటా మనది వ్యష్టిదృష్టే. అందువల్ల మనం ఎవరికి వారే యమునాతీరే అయినాము. సిక్కులలో అంత ఐకమత్య ముండుటకు వారు కలసి మెలసి చేయు అర్చనా విధానమే.

మనలో ఏదో విధముగ ఈ భజనకూటములలో వచ్చినది సాంఘిక దృక్పథం. ఇందులో జరగవలసినది ఒక్కటే— సమష్టిగా సంకీర్తన. దీనివల్ల సమత్వము వికాజిల్లినది.

సామాన్యముగా ఆంధ్రదేశములో రైతులు వెన్నెల రాత్రులందు వేప చిరతలతో భజన చేసెడివారు. కోపు—కోలాటములు వేసెడివారు. హాయిగా పాడెడివారు. మనదేశములో నలుగురు కలిసి ఆనందించే నృత్యగానములలో ఇదొక్కటే. యువకులు, పెద్దలు అనే భేదములేదు ఇందులో. పల్లెటూరు రైతుల సమష్టి నాట్యగాన కళాక్షేత్రములు ఈ భజన కూటములు.

ఈ గ్రామములో మొట్టమొదటి రామాలయం ముదిరాజులది. దానికి అర్చకుడు వుండేవాడు. తర్వాత వారికి శక్తి

లేక; ధూపదీప నైవేద్యములు మానిరి. రెండుచింతల అచ్చన్న, పిసుపాటి పుట్టంభొట్లుగారలు ఆ శిలా విగ్రహమును తెచ్చి విశ్వేశ్వరాలయము వద్ద పుట్టంభొట్లుగారు కట్టించిన రామాలయములో వుంచిరి. పిసుపాటి పుట్టంభొట్లగారు య 0_50 యిచ్చిరి. ఇది యిప్పుడు వారి మనుమడగు చల్లపల్లి రామ కృష్ణయ్యగారి యాజమాన్యమున వున్నది.

ఈ రామాలయాన్ని, ముఖమండపాన్ని, ధ్వజ స్తంభాన్ని ఘంటసాల వర్నయ్య,, యీ రామారావుగారి భార్య వెంకటసుబ్బమ్మ, చిట్టూరి లక్ష్మీనరసమ్మగారలు బాగు చేయించిరి. ముఖమండపం నీరుకారుట చూచి గొట్టిపాటి బ్రహ్మయ్య, వేమూరి సాంబమూర్తిగారలు ఇటీవల మరమ్మత్తు చేయుట జరిగినది.

అనంతరం ముతరాచులు షుమారు 50 సంవత్సరముల క్రితం మరొక రామాలయమును కట్టించుకొనిరి, చెక్క భజనలో కూడ వీరే ప్రథములు. ధర్మకర్తలు యర్రబోయిన కృష్ణయ్య, యీ వెంకయ్య, కొంకితల రామయ్యగారలు.

అటు తర్వాత వెలసినది తూర్పువైపు రామాలయం. ఇప్పుడున్న డాబా ప్రదేశముననే పూర్వం ఒక పూరిచావిడి వుండేది. 1929లో ఈ తూర్పువైపు డాబా కట్టుట జరిగినది. కొండపల్లి సుబ్బయ్య, వేమూరి వెంకయ్య (షావుకారు) వెంకట్రాయులు, పరమేశ్వరుడు, లక్ష్మయ్యగారలు ఈ రామాలయ నిర్మాణంలో పూనికతో పనిచేసిరి. అటు తర్వాత పది పన్నెండు సంవత్సరములకు పెంకుటివసారా ఏర్పడినది. ఇది ఆ వైపునకు శోభ తెచ్చినది.

దీని అనంతరం రజకులు 1934_7_15న రామాలయ మునకుగాను చక్కని చిన్న డాబాను ఏర్పరచుకొనిరి. వీరు ఏటేటా భక్తి శ్రద్ధలతో వైభవముగా శ్రీరామనవమి రోజున సీతాకల్యాణము చేయుచున్నారు. దీనికి ధర్మకర్తల కమిటీ వున్నది.

అటుపిమ్మట వేమూరివారిలో ఘంటయ్యగారి రామ భజన కూటమునకు గాను వేమూరి చంద్రయ్యగారి భార్య అక్కమ్మగారు ఒక పెద్ద డాబాను కట్టించి యిచ్చిరి.

బండివారు, వడ్లమూడివారు తమ రామునిని పూర్వం ఒక పూరిపాకలోనే వుంచిరి. అనంతరం 1958లో వీరు ఒక డాబాను నిర్మాణం చేసిరి.

వీరుకూడ ప్రతిఏటా శ్రీరామనవమి ఉత్సవములు అతి వైభవముగా చేయుచున్నారు. దీనికి య. 1_65లు భూవసతి గలదు. మొక్కపాటి వీరయ్యగారి అల్లుడు వేములపల్లి రత్తయ్య, ఈయనభార్య సరస్వతమ్మ ప్రతి సంవత్సరం శ్రీరామనవమికి కల్యాణోత్సవము చేసే ఏర్పాటుతో య 0.50 భూమిని ఇచ్చిరి.

1959లో ఎండోమెంటు బోర్డువారు బండి రామయ్య, వడ్లమూడి కృష్ణయ్యగారి కుమారుడు వెంకటసుబ్బయ్యగార లను ట్రస్టీలగా నియమించిరి.

పడమటివైపు దోనేపూడి వారికి రామమందిరములేదు గాని వారును ఉత్సవములు మానలేదు.

1965 వ సంవత్సరమునుండి శ్రీరామనవమికి అతివైభ వంగా ఈ గ్రామ రామభక్తులు వివిధ కార్యక్రమాలతో

కన్నుల పండుగగా జలధీశ్వరాలయమునందు, సత్రమువద్ద చేయుచుండుట ప్రశంసార్హము.

## వెన్నెమ్మ గుడి

ఈ గ్రామానికి పడమర వెన్నెమ్మపాడు అను ప్రదేశము కలదు. ఇచ్చట వెన్నెమ్మ గుడి పూర్వం వుండెడిది. దానికి సాదృశ్యముగా ల్యాండు రిజిష్టరులో కొన్ని భూములు వెన్నెమ్మగుడి పడమరఅని వ్రాయబడుటేగాక, ఈ వెన్నెమ్మ గుడి తాలూకు శిథిలప్రదేశమును, వెన్నెమ్మ గుడి తాలూకు రాళ్ళదిబ్బ 13 శెంట్లుగా గ్రామ కంఠంలో పేర్కొనబడి యుండుటచే, ఈ వెన్నెమ్మను గురించి తెలియజేయడ మైనది.

ఈ వెన్నెమ్మ కథనుబట్టి ఈమెకు గుడికట్టవలసిన ఆవశ్యకత లేదుకాని ఈమె గ్రామదేవతగా పరిగణింపబడి ఆలయ నిర్మాణమై ఆనంతరం శిథిలమైనట్లు యిచట నిదర్శనములు చూపించి యున్నారము.

## పెన్నేరమ్మ గుడి

ఈ దేవతకు గ్రామమధ్య చిన్నగుడి కలదు. 80 ఏళ్ళకు పూర్వము ఈ దేవత కొలువు జరుగుతూ వుండేదట. ఈ ఆలయం పడిపోవుటకు సిద్ధముకాగా గొర్రెపాటి బ్రహ్మన్న గారి కుమారుడు వెంకట్రామయ్యగారు, ఈ పూర్వపుగుడి నామరూపాలు లేకుండాపోవుట మంచిదిగాదని గ్రామంలో 1952 సం॥న చందాలు వసూలుచేసి మరమ్మతు చేయించి,

రెండువైపుల అరుగులను కూడా చక్కగా కూర్చుండుటకు కట్టించిరి.

## ముత్యాలమ్మ గుడి

ఇది కోట దిబ్బలకు వెళ్ళే దారిలో ముత్యాలమ్మ తోటలో కలదు. ఇటీవల యీ గుడికి మరమ్మతు చేసి ముఖ మండపమును కట్టించిరి. ఈ తోట వేమూరివారిలో కొందరికి చెందినది. పూర్వం ఈ దేవతకు ఎట్టుల కొలువు జరిగెడిదో కాని ఇటీవల గ్రామములో పశువులకు గాని, మనుష్యులకు గాని వ్యాధులు కలిగినప్పుడు కొందరు చల్దినైవేద్యములు పెట్టుదురు.

ఈ ముత్యాలమ్మ దేవరకోటవారి గ్రామదేవత.

## వనము తోటలు

పూర్వం భూములు అతివృష్టివల్ల అనావృష్టివల్ల పంటలు పండెడివికావు. భూములకు విలువ లేదు. అంతేగాక ఆ కాలపువారు అధికంగా ఆముష్మిక చింతనాపరులు గాన, ఈ తోటలవల్ల బీదసాదలకు పశుపక్ష్యాదులకు ప్రయోజనము, తమకు ఉత్తమలోకప్రాప్తి కలుగగలదని భావించి ఈ తోటలు వేసెడివారు.

## 1 దేవుని తోట

దీన్ని చెల్లెమ్మతోట అనికూడ అనెడివారు. ఆళ్ళ వెంకమ్మ చెరువు నానుకొని ఈ తోట కలదు. తోటలన్నింటి లోకి పెద్దతోట ఇది. దీనిలో మామిడి, నేరేడు, వెలగ, చింత మొదలగు చెట్లు వుండెడివి. దీనిలో సగం తూర్పు భాగమున

దేవునిక్రింద అగ్రహారముగ ఏర్పాటు చేసిరి. పూర్వము ఎక్కువగా పద్మసాలీ లుండెడివారు. నేడు కమ్మవారున్నారు.

ఈ తోటను కనిపెట్టుకొని గురవడనే హరిజనుడుండేవాడు. అందుచేత దీన్ని గురవడితోటనికూడా అనేవారు. ఈ తోట విశ్వేశ్వరస్వామికి సంబంధించినది. అందువల్ల దీనికి దేవునితోట యనికూడా మరొక పేరు. బహుశః వేమూరివారు దీన్ని దేవునికిచ్చి యుండవచ్చు. ఇటీవల ఈ తోటభాగమును నివేశన స్థలములకు విక్రయించుట జరిగినది.

## 2 గొర్రెపాటివారి తోట

ఇది విశ్వేశ్వరాలయపు వీధికి తూర్పున వుండెడిది. దీన్ని గొర్రెపాటివారి మూలపురుషుడగు గురవన్న మనుమడగు సుబ్బయ్యగారు వేసెను. ఈ తోటలో ఎక్కువగా చింతలుండుటచేత దీనికి చింతలతోటని పేరు వచ్చినది.

ఈ తోటలో ఉత్తరపు వైపున షుమారు ఒక యకరపు భూమిని కాపులకు, దూదేకుల సాయిబులకు ఇండ్లుకట్టుకొనుటకు ఉచితముగ ఇవ్వడమైనది.

1927 లో ఈ తోటలోని చెట్లన్నీ పడిపోయినవి. తిరిగి మొక్కలను పెట్టించిరి కాని అవి వృద్ధిలోనికి రాలేదు. గొర్రెపాటి వారిలో కొందరకు గృహావసతి తక్కువైనందున దీన్ని పంచుకొనుటే మంచిదని యెంచి 1936...లో పంచుకొనిరి. ఆ పంచుకొనే కాలమందు ఇతరులకు గృహావసతికి ఇచ్చిన భూమిని, స్త్రీలకు పసుపుకుంకుమగావున్న భూమిని ధర్మముగా ఇచ్చుట జరిగినది.

## 3 పాపితోట

ఇది ఆళ్ళ వెంకమ్మ చెరువుకు తూర్పుగ బజారునకు ఆనుకొని వుండెడిది. ఇది వేమూరివారి తోట. దీనిలో పాపి అనే ఒక ముసలావిడ ఈ తోట సంరక్షణకై వుండేది. అందు చేత దీనికి పాపితోట అనేపేరు వచ్చినది.

వేమూరి వెంకటరత్నంగారు తతిమ్మావారితో సంప్రదించి దీన్ని విశ్వేశ్వరస్వామిపేర సమోదు చేయించిరి. ఆయనే చాలాకాలము దీనికి ధర్మకర్తగ వుండేవారు. ఈ తోటలో ఉత్తరభాగము షుమారు రెండు యకరములు మడుగుదొడ్డి క్రింద విడిచి మిగతా భూమంతా మాగాణి అయినందున నేడు దేవునిక్రింద పల్లపుసాగు చేయబడుచున్నది.

## 4 కాలిగాడి తోట

ఇది దిరిశంవారి పల్లెను ఆనుకొని ఉత్తరపువైపున వుండెడిది. తోటలన్నింటిలోకి ఇది పెద్దతోట. 12 ఎకరముల తోట. కాలిగాడనే ఆది ఆంధ్రునిది. దేవరకోట ఎస్టేటు జమీందారుగారగు మల్లిఖార్జున ప్రసాద్ నాయుడుగారు గ్రామములో పార్టీని పురస్కరించుకొని కొందరు ఆది ఆంధ్రులచేత తమవద్ద కత్తుకు తీసుకున్నట్లు వ్రాయించిరి. దానిపైన కొంత వ్యవహారకాండ జరిగినది. ఆ కత్తువ్రాసిన వాళ్ళు ఈ పల్లెలో వుండుట కవకాశము లేకపోయినందున ఆ రాజాగారే రామానగరంలో పెట్టి పనిపాటలు చూపుట జరిగినది. జమీందారుగారు, వ్యతిరేకులపై క్రిమినల్ వ్యవహారములు జరుపుచుండెడివారు. జమీందారుగారితో యీ

బీదలు ఎంతవరకు పోరాడగలరు? వేమూరి అప్పన్నగారి కుమారుడు సుబ్బయ్యగారు ఈ బీదలతరఫున జమీందారు గారిదగ్గరకు వెళ్ళి మూడుకుంటలు వారికుండునట్లుగ రాజీ పరిష్కారము చేసిరి. అప్పటినుండి సుబ్బయ్యగారు వున్నంత కాలం ఈ ఆదిఆంధ్రు లందరు వారియెడల ఆదరాభిమాన ములతో వుండెడివారు. ఆయన చేసిన సత్కార్యమునకు కృతజ్ఞతా పూర్వకముగా ఈ ఆదిఆంధ్రులంతా ప్రతిసంవత్సరం ఒకరోజు ఉచితముగ పనిచేసెడివారు. ఈ తోటను శివరామప్రసాద్ గారు అమ్మగా రైతులు కొని, పల్లపు సాగు చేస్తున్నారు.

## 5 కోమట్ల తోట

కోమట్ల చెరువును ఆనుకొని ఈ తోట వుండెడిదని ఇదివరకు చెప్పుట జరిగినది. దీనిలో కొంతభాగము పల్లపు పైరు సాగు చేయబడుచున్నది. మిగిలినభాగంలో తాళ్ళున్నవి.

## 6 పాలీల తోట

ఈ తోట పాలీల చెరువుకు పడమర వైపున కలదు. ఇది కేవలం తాళ్ళతోట.

## 7 ముత్యాలమ్మ తోట

ఇది కోటదిబ్బల వైపున కలదు. దీనిలో ఇదివరకు వివిధ వృక్షములుండెడివి. ఇది తూర్పువైపు వేమూరివారిలో కొందరికి మాత్రమే హక్కుగల తోట. ఇది నేడు పల్లపు సాగుచేయబడుచున్నది.

## 8 రామన్నగారి తోట

ఇది వేమూరి రామన్నగారికి మరికొందరు వేమూరి వారికిని హక్కుగల తోట. దీనిలోను చింతలు మొదలగు చెట్లుండెడివి. క్రమంగా సన్నగిలి, దీనిలో వారి కుటుంబము లోనివారు కొందరును, వారి అంగీకారముచేత మరికొందరును ఇళ్ళు కట్టుకొనిరి. ఇది గొర్రెపాటివారి తోటకు తూర్పు వైపున వుండెడిది. దీనికి సంబంధించినవారు యీ తోటలో వున్నవారికి ఒకవైపున గృహవసతి ఏర్పాటుచేసి మిగతా భాగమును ఇటీవల పంచుకొనిరి.

## 9 వేమూరివారి చింతల తోట

ఇది రావూరినారాయుడు చెరువుకు దక్షిణమున వుండెడిది. ఈనాం డెప్యూటీ కలెక్టరుగారు వచ్చినప్పుడు యీ తోటను గురించి బ్రహ్మన్న, పాపన్నగారలు తమదని, పట్టయ్యగారు వారిదని తగాదా జరిగినది. కలెక్టరుగారు విచారించి ఈతోట పట్టయ్యగారి తెగకే నిర్ధారణ చేసిరి. తోటలన్నిటిలోను ముందుగా స్వంత ఉపయోగమునకు తీసుకువచ్చినది వీరే.

## 10 గొర్రెపాటివారి తాళ్ళతోట

ఇది వెట్టివాని మాలపల్లి నానుకొని వున్నది. ఇందులో తాళ్ళన్నీ హరించినవి. ఇప్పుడు ఆ మాలపల్లివారే ఉపయోగించుకొంటున్నారు.

## 11 దేవుని తాళ్ళతోట

ఇది ఆళ్ళ వెంకమ్మ చెరువునానుకొని దిరిశంవారి

మాలపల్లి దగ్గర వుండెడిది. ఇది షుమారు 20 సంవత్సరముల క్రితం హరిజనులకు నివేశన స్థలముల క్రింద అమ్మబడినది.

## చెరువులు

1. ఆళ్ళ వెంకమ్మ చెరువు:—వాడుక పేరు అలంకమ్మ చెరువు ఇది ఈగ్రామ చెరువులన్నింటిలోకి పెద్దది. ఎ. 21-40 శెంట్లు. దీనిని గొర్రెపాటివారి ఆడబడుచు ఆళ్ళవారి కోడలగు వెంకమ్మ షుమారు 200 సంవత్సరముల క్రితం త్రవ్వించుటచే దీనికి ఆళ్ళ వెంకమ్మచెరువు అనిపేరు వచ్చినది. ఈమె కుమార్తె పేరమ్మను తన మేనల్లుడగు వేమూరి పాపన్నకు యిచ్చుటవల్ల తరువాత యీ చెరువునకు వేమూరివారి చెరువని పేరువచ్చినది.

షుమారు 70, 80 సంవత్సరముల క్రితం లోకల్ ఫండువారు కొంతసొమ్మును, వేమూరి పట్టాభిరాముడుగారి కుమారుడు చలమన్న, యీ నరసన్న, యీ వెంకన్న గారికుమార్డు వెంకటరత్నంగారలు మున్నగువారు కొంత ధనము యిచ్చుటచేత లోకల్ ఫండు వారు దీనిని త్రవ్వించిరి.

1926వ సంవత్సరమున జిల్లాబోర్డువారి కంట్రాక్టు వల్ల వేమూరి సీతారామయ్యగారు రు. 2000/లు పెట్టి చెరువు త్రవ్వించి కట్టలు పోయించిరి. లోకల్ బోర్డు ఆక్టు ప్రకారం ఇప్పుడు ఇది గ్రామపంచాయతీ యాజమాన్యమున వున్నది.

2. దీనిని ఆనుకునే బోయపాటి దేవన్న చెరువు కలదు. దీనిని ఆయన స్వయంగా త్రవ్వించాడు.

3. దీని తర్వాత బోడిలింగం గుంట అనే చెరువు వుండేది. అది నేడు పూడిపోయి బోడిలింగం గుంట అనే పోరంబోకుగా వున్నది

4. గొర్రెపాటివారి చెరువు:— ఇది గ్రామమునకు ఉత్తరవైపున కలదు. పూర్వం ఇక్కడ ఒక గుంట వుండెడిది. దీన్ని మిరాకనివాని గుంట అనెడివారు. దీనిని గొర్రెపాటి బ్రహ్మన్నగారు సగం, తతిమ్మా గొర్రెపాటివారు సగంధనం ఖర్చుపెట్టి పెద్దచెరువుగా త్రవ్వించి చుట్టూ కట్టలుపోయించిరి. అందుచేత దీనికి గొర్రెపాటివారి చెరువు అని పేరువచ్చినది. మొన్నటివరకు వీరి యాజమాన్యములో వుంటూ మరమ్మతు చేయబడుచుండెడిది. ఇటీవల పంచాయితీ యాజమాన్యములోనికి వచ్చినది.

5. రావూరి నారాయణ చెరువు:— ఎ 1-89 శెంట్లు. దీన్ని రామన్నారాయణ చెరువు, కుమ్మరగుంట అనే పేర్లతో పిలవటం కద్దు. రావూరి నారాయణ అనే దానికే రామన్నారాయణ అనేది అపభ్రంశం. దీనిలో మట్టితో చేసిన కుండలు పగిలేవి కావట, అందువల్ల ఈ మట్టి వల్లకమకు ప్రయోజనంలేదని కుమ్మర్లు తర్వాత పాలెం వెళ్ళినట్లు తెలుస్తుంది.

6. సాలీల ధర్మచెరువు:— ఇది రావూరి నారాయణ చెరువుకు కొంచెం అవతలగా తూర్పువైపున కలదు. దీని వైశాల్యము ఎ. 6-64 శెంట్లు. పూర్వం దీనిమీత పెద్దపెద్ద నేరేడు చెట్లుండేవి. ఈ చెరువును ఆనుకొనే పడమరవైపున తాళ్ళతోపు కలదు. దీనిని తుమ్మలచర్ల వెంకటరెడ్డిగారు

సుబేదారు ప్రథమంలో సంపాదించెను. తర్వాత ఇతర పెద్ద శెట్ల సహాయంతో వెంకటాద్రి పెంపుచేసెను.

7. కోమట్ల చెరువు:— ఇది గ్రామమునకు పడమర వైపున గలదు.

8. బోయీల చెరువు:— దీనికి ఘంటా బోయుడు చెరువు అనికూడా నామాంతరము కలదు. దీనిని ఆయన త్రవ్వించి యుండవచ్చును. ఇదికూడా గ్రామానికి ఉత్తరపు వైపుననే వున్నది.

9. చింతల చెరువు:— దీనికి ధర్మకర్త ఎవరో తెలియదు. పూర్వం ఈ చెరువుమీద చింతలుండుటచేత దీనికా పేరు వచ్చి వుండవచ్చు. ఈ చెరువు పూడిపోయి వాలుగా మాత్రం వుండెడిది. ఇది జమీందారుగారి స్వాధీనములోనికి పోయినది. తరువాత దీన్ని జమీందారుదగ్గర గ్రామత్యా తీసుకొని ఘంటసాల వెంకటకృష్ణయ్యగారు కొంత ప్రదేశము చెరువు త్రవ్వించేటట్లును, మిగతా భూమిని సేద్యం చేసుకొనే పద్ధతిని ఆయనకు పట్టా ఇప్పించటం జరిగింది.

10. పెన్నేరమ్మ చెరువు:— ఇది చింతల చెరువునకు పడమర కలదు. పెన్నేరమ్మ ఉత్సవానంతరం ఆ దేవతను ఈ చెరువులో కలిపెడి వారట. అందుచేత దీనికి పెన్నేరమ్మ చెరువు అను పేరు వచ్చినది.

ఈ చెరువు క్రమంగా పూడిపోయినది. అనంతరం జమీందారుగారి అధీనంలోకి పోయినది. ఇది నేడు సేద్యం చేయబడుచున్నది.

11. వైష్ణవుల చెరువు:— ఇది వెన్నెమ్మ పాటిమీద వున్నది. వేమూరి అప్పన్నగారి చాళ్ళు దీన్ని అనుకొనే వున్నవి. పూర్వం ఇక్కడ దేవాలయాలు కూడా వుండేవని ప్రతీతి. ఎవరో వైష్ణవులు దీన్ని త్రవ్వించి యుండవచ్చు. అందువల్లనే దీనికి వైష్ణవుల చెరువు అను పేరు వచ్చినది.

12. కుత్రంగుంట:— ఇది పడమటి పొలాన చిట్టూరు వెళ్ళేరోడ్డుకు ఉత్తరవైపున కలదు. ఇది పూర్వపు చెరువులలో ఒకటై వుంటుంది. ఇది క్రమంగా పూడిపోయినందున సేద్యమైనది. అందుచేతనే దీనికి కుత్రంగుంట చేనని పేరు వచ్చినది.

13. గాజులవారి చెరువు:— ఇది చెరువులన్నింటిలోనికీ చాలా చిన్నది. దీని వైశాల్యము 0_50 సెంట్లుమాత్రమే ఇది గ్రామములో కాపులకు గాజులవారి ఇళ్ళప్రక్కనగలదు. బహుశః కాపులలో గాజులవారు దీన్ని త్రవ్వించి యుండవచ్చును.

14. ముత్యాలమ్మ చెరువు:— ఇది ఇటీవలనే త్రవ్వబడినది. కోటదిబ్బలకు వెళ్లేదారిలో వున్నది. షుమారు ఎ. 2_0 భూమి ఆ ప్రదేశములో రైతులు మట్టి తోలుకొనిపోయిరి. ముత్యాలమ్మతోటమీద వచ్చిన ఆయివేజుతో దీనికి నాలుగువైపుల కట్టలు పోయించి ఒకవైపున చడీలుకూడా కట్టించుట జరిగినది. ముత్యాలమ్మతోటకు సంబంధించిన ఆదాయమునుండి త్రవ్విన చెరువుగాన దానికీ పేరు వచ్చినది. ఈ సత్కార్యము నేమూరి కుటుంబయ్యగారిద్వారా జరిగినది.

## నూతులు

పూర్వకాలంలో పెద్ద పెద్ద రాతి నూతులు కట్టించి నట్లు తెలుస్తున్నది. ఇవి అధికంగా మోటబావులుగా గ్రహించ వచ్చును. ఆ కాలంలో గ్రామం చిన్నదిగా వుండేదేది. ఈ నూతుల నీళ్ళద్వారానే వాసు తవిద, సజ్జ మొదలగు పైరులు, పొగతోటలు వేసేడివారని వినికిడి.

1. లింగం నుయ్యి.— దీనికి పూర్వపుపేరు మలకల నుయ్యి. దీని ప్రక్కన ఒక జమ్మిచెట్టు వుండేదేది. ఆ జమ్మి చెట్టుక్రింద ఒక లింగముండేదేది. ఆ లింగంనుండి నీరు చెమ ర్చుతూ వుండేడిది. దాన్ని ప్రజలు ఆరాధిస్తూండేవారు. ఒక శాస్త్రజ్ఞుడు దీనిని పరికించి దీన్ని పూజిస్తే గ్రామారిష్టము. దీన్ని జలధివాసం చేయువలసినదని చెప్పగా అంతట దీన్ని ఈ నూతిలో పడవేసిరట. అప్పటినుంచి లింగం నుయ్యి అని పిలువబడుచున్నది. ఇది పడమరవైపున వడ్లమూడి పరమేశ్వ రుడిగారి ఇంటిప్రక్కన వుండేదేది. చుట్టూ ఇళ్ళుండుటవలనను ఇది శిథిలమైనందునను ఉపయోగము లేకపోవుటవలన ఈ నూతిని పూడ్చడమైనది.

2. వడ్లమూడివారి నుయ్యి:—పూర్వం వడ్లమూడి వారు దీన్ని పొగతోటలకు మోటనుయ్యిగా ఉపయో గించుకొనేవారు. ఇది బండి రామయ్యగారి ఇంటికి తూర్పు వైపున వున్నది.

3. బండివారి ధర్మగాడి నుయ్యి:— ఇది గోటకము నకు ఆనుకొని బండివారి పాళ్ళమీద వున్నది. ఈ నూతికి

10, 15 గజాల బారు గాడి వుండెడిది. వేసవికాలంలో ఈ నూతిపై ఎప్పుడూ మోట తోలుతూవుండేవారు. మోట తోలే ఎడ్లకు ఎండ తగలకుండా పందిరి వుండేది. జతలను మాత్రం మార్చేవారు. గోటకంలో పశువంతా నీటికి ఇక్కడకే వచ్చేది. పాలెం దేవరకోట పశువులు కూడా వచ్చేవి. బండివారా కాలంలో బలవంతులు.

4. బండివారి నుయ్యి:— ఇది బండివారి, వడ్లమూడి వారి రామాలయపు చావిడి (పూర్వము) వద్ద వున్నది. పూర్వము ఇది సిరిపురపు వారిదట. వీరెవరూ నేడు లేరు.

5. పేరమ్మనుయ్యి:- ఇది గొర్రెపాటి వారి చెరువు మీదకలదు. వేమూరి పాపన్నగారి భార్య పేరమ్మ షుమారు 200 సంవత్సరముల క్రిందట కట్టించుటచేత దీనికి పేరమ్మ నుయ్యి అనుపేరు వచ్చినది. ఈమె ఆళ్ళ వెంకమ్మకుమార్తె. తన తల్లి దక్షిణపు వైపున చెరువు త్రవ్వించగా ఈమె ఉత్తరపు వైపున నుయ్యి కట్టించెను. అప్పటినుండి ఇప్పటివరకు ఇది అధిక జనోపయోగమగుచున్నది.

ఈ చెరువుమీదనే వేమూరి గంగమ్మగారు షుమారు 30 సంవత్సరముల క్రితం ఒక నూతిని కట్టించిరి. అది ఇప్పుడు మంచినీళ్ళ కుపయోగ పడుచున్నది.

6. పెద్దసెట్టి ఇంటివెనుక నుయ్యి:- దీని నెవరు కట్టించిరో తెలుసుకొనటానికి అవకాశాల్లేవు.

7. గాజులవారినుయ్యి:- గొర్రెపాటి పట్టయ్యగారి కుమార్డు వెంకట్రాయలుగారి ఇంటికి తూర్పున కలదు.

8. నాయుడమ్మనుయ్యి:—ఇది తూర్పువైపున మిల్లుకు పడమరగా వున్నది.

దీనిని అక్కలనుయ్యి అనికూడా అందురు. కాని దీనికి తూర్పువైపున అక్కలనుయ్యి వుండెడిది. అవి రెండూ పూడిక పడినవి. అక్కలనుయ్యికి సమీపమున నుండుట చేత దీనిని అక్కలనుయ్యనికూడా పిలవటం కద్దు. ♦

9. వేమూరి జానకిరాముడుగారి నుయ్యి:— వేమూరి పిచ్చయ్యగారి కుమార్డు బ్రహ్మయ్యగారి ఆవరణలోకల పెద్ద నుయ్యి. ఇది వూరి మధ్యలో వుండెడిది. దీనిని ఇటీవల పూడ్చుట జరిగినది.

10. దక్షిణనుయ్యి:— దీనికి గోత్రెపాటివారి నుయ్యని కూడా నామాంతరము. దీనికి చుట్టూవున్నది గోత్రెపాటివారు. వారే దీన్ని కట్టించియుండవచ్చును. ఇటీవల పంచాయితీ వారు దీనిని మరమ్మతు చేయించిరి. పూర్వం చాలా దూరాన్నించికూడా వచ్చి కావిళ్ళతో నీళ్ళు మోసుకుపోతూ వుండేవారు. ఇదికూడా ఒకప్పుడు మోటనుయ్యే.

---

♦ కామవల్లి మహాలక్ష్మికే కామేశ్వరి అని నామాంతరము. ఏడుగురు అక్కలలో చిన్నదైనను కామవల్లి మహాలక్ష్మి ముఖ్యురాలు కావున ఆమెపేరు ప్రధానముగా పేర్కొనబడుచున్నది. తక్కిన ఆర్గురకు వేర్వేరు పేరులు కలవు. మొత్తంమీద వారెల్లరనుకుని అక్కలని పేరు. నేటికిని ఆంధ్రదేశమున బ్రాహ్మణాది వర్ణముల వారికి కామేశ్వరి (అక్కలు) ఇలవేల్పు. అందుచేత ఈ అక్కలపేర్లతో ఎవరైనా ఈ మాతిని కట్టించారేమో!

11. వేమూరి రామన్నగారి నుయ్యి:— ఇది యిప్పుడు వేమూరి గోపాలుడుగారి కుమార్డు వాంచారయ్యగారి ఇంటి ముందు వున్నది. ఇదీ మోటనుయ్యే. అప్పుడు ఆ ఇళ్ళప్రదేశ మంతా పొగతోటలు వేసెడివారు.

12 వేమూరి వారినుయ్యి:— ఇది వేమూరి వెంకయ్య గారి కుమార్డు గోపాలకృష్ణయ్యగారి ఇంటివద్ద చేలో స్థాప మునకు దగ్గరలో వున్నది.

13. అచ్చమ్మనుయ్యి:— వేమూరి సుబ్బయ్యగారి కుమార్తె అచ్చమ్మ దీనిలో పడినందున దీనికీ పేరువచ్చినది. దీనిని పూడ్చివేసిరి. ఇది వేమూరి గోపాలకృష్ణయ్యగారి మేడముందు వుండెడిది.

14. ఘంటయ్యగారినుయ్యి:— ఇది దక్షిణపు వైపున వున్న మిల్లు నానుకొని వుండేది. దీన్ని ఇటీవల పూడ్చిరి.

15. పుల్లయ్య బ్రహన్నగార్ల నుయ్యి:— ఇది యనిగళ్ళ లక్ష్మీనారాయణగారి ఇంటిప్రక్కన వున్నది.

గొర్రెపాటివారి పాళ్ళమీద నూతులు

16. గొర్రెపాటివారి మోటనుయ్యి:— ఇది పడమటి వైపున బ్రాహ్మణుల ఇంటిప్రక్కన దారిలో వుండెడిది. ఇటీవలనే పూడ్చబడినది.

17. దానికి 100 గజములలో మరి యొక బావి యుండెడిది.

18. దానికింకా 200 గజములలో మరి యొకటుండెడిది. ఈ మూడును పూడ్చబడినవి.

19. ఇంకొక నుయ్యి గొర్రెపాటి వెంకయ్యగారి కుమారుడు వెంకటేశ్వర్లుగారి దొడ్డినానుకొని యున్నది. ఇప్పటికీ ఈ నుయ్యి వాడుకలోనే వున్నది.

20. కోమట్ల చెరువుమీద నూతులు:_ చెరువుకు పడమరనున్న నుయ్యి పూర్వపు నుయ్యి. అది బహుకాలం నుంచి గ్రామంలో ప్రజలకు వుపయోగ పడుతూవున్నది. ఆ నీరు చాలా శ్రేష్ఠమని ఆ నీరు త్రాగితే కలరావ్యాధి రాదని శానిటరీ డిపార్టుమెంటు వారు చెప్పుతూ వుండేవారు. ఎవరైనా పొరుగూరువారు ఈ గ్రామంవచ్చి నివాసం ఏర్పరచుకొన్నవారిని, కోమట్ల నూతినీరు వంటబట్టి నట్లుందల్లే వుందే అని పరిహసించటం కద్దు.

21. చెరువుకు దక్షిణమున షుమారు30 సంవత్సరముల క్రిందట ఒక దిగుడుభావి కనబడినది. బౌద్ధయుగమున దిగుడు బావులు ఉండెడివేమో. ఇప్పటికీ రాయలసీమ ప్రాంతమున ఇటువంటి దిగుడు భావులు కలవు. దీనిని ఇప్పటి భావులవలె సంకా వెంకటచలంగారు కట్టించిరి. ఈ రెండునూ కేవలం మంచినీళ్ళ భావులు.

22. లోకల్ ఫండు నుయ్యి:_ఇది లోకలు ఫండువారు ఆళ్ళ వెంకమ్మ చెరువు మరమ్మతు చేయించినప్పుడే కట్టించి యుందురు. దీనిలో నీరు చాలా బాగుగా వుండెడిది. ఈ నూతి నీరును ఎక్కువమంది తీసుకొనిపోవుటవలన నీళ్ళు తరుగుట చేత చెంబులతో కూడ తోడుకొని పోయేవారు. ఈ నూతినీరు సరిగా అందరికి సప్లైకానందువలన సుమారు 40 సంవత్సర

ములక్రితం గొర్రెపాటి బ్రహ్మన్నకుమారుడు వెంకటరత్నం గారు వేరొక సూతిని దీని ప్రక్కనే కట్టించిరి.

## సత్రములు

1. బ్రహ్మన్నగారిసత్రం:— గొర్రెపాటి బ్రహ్మన్న గారు కమ్మవారిలో అధిక ధనవంతుడు, ధర్మిష్ఠికూడా. ఆయన విశ్వేశ్వరాలయమునకు సంబంధించిన తోటలో మాడువా భవంతిని కట్టించెను. ఆ కాలంలో అరదేశి పరదేశీయులకు విశేషంగా వుపయోగ పడుతూవుండేది. విశ్వేశ్వరస్వామి కల్యాణ సందర్భంలో జరిగే బ్రాహ్మణ సంతర్పణ ఇందులో జరిగేది. ఇది కొంతకాలమునకు శిథిలమైపోయినది.

2. వెంకటేశ్వరసత్రం:— ఇది బ్రాహ్మణుల ఇండ్ల నానుకొని అయ్యగారి బ్రహ్మన్నగారి స్థలంలో గొర్రెపాటి అప్పయ్యగారు తమ అన్నకుమారుడు జ్ఞాపకార్థం 1920లో కట్టించిరి. దీనిలో కొంతకాలము ఆస్పత్రి, కొంతకాలము శ్రీరామమోహనపుస్తక భాండాగారము వుంటూవుండేవి. మరి కొంతకాలంనుంచి వారి అనుమతి పొందినవారు వుంటు న్నారు. దీనిలో ఎక్కువకాలం శ్రీరామమోహన పుస్తక భాండాగారముండుటచేత దీన్ని సాధారణంగా క్లబ్ అంటారు.

3. చుండూరి నాగభూషణంగారి సత్రం:— ఇది గ్రామమునకు ఉత్తరమునవున్న గొర్రెపాటివారి చెరువును ఆనుకొని వున్నది. ఈ ప్రదేశమున గొర్రెపాటివారు సత్రమును కట్టించుటకు రాయితీయించుట జరిగినది. ఈ గ్రామ కాపు

రస్తుడగు చుండూరి నాగభూషణంగారు బెజవాడలో నివాస మేర్పరచుకొని వ్యాపారము చేయుచుండిరి. ఆయన తన అంత్యకాలములో ఈ గ్రామములో తనపేరు శాశ్వతముగా వుండగలందులకు ఒక సత్రమును కట్టించదలచిరి. ఈ స్థలం ఇచ్చినట్లైతే ఇక్కడ సత్రం కట్టించెదనని గొర్రెపాటి వారిని కోరినందువ వారు నాగభూషణంగారికి ఇచ్చిరి. ఆయన 6 వేల రూపాయలతో చక్కని సత్రమును 1928వ సంవత్స రములో కట్టించిరి. అనంతరం ఆయన కుమారుడు చుండూరి వెంకటరెడ్డిగారు ఈ సత్రమునకు కొంత మరమ్మతు చేయించి చుట్టూ ప్రహారీకి సున్నము చేయించిరి. ఈ సత్రంవల్ల గ్రామమునకు అందము, ప్రయోజనము కల్గుచున్నవి.

## ఆబోతులు

ప్రాచీన కాలమునుండి భారతభూమిలో గోపూజ వున్నది. గంగా సింధు మైదానములకు ఆర్యులు రాక పూర్వము ఈ దేశములో వర్ధిల్లిన నాగరికత ద్రావిడ నాగరి కత. వారిదేవుడు శివుడు. శివునివాహనము నంది. నందిలేని దేవాలయము పూర్ణార్థ్వముగాదు.

ఎద్దు బసవదేవుని అవతారమని మనవారి నమ్మిక. బస వన్న శివుని పరివారములోని వాడు.

అసలు పృథ్విలోని ఏదేశ నాగరికతయైనా పశుపాలన తోనే ఆరంభమైనదని చెప్పవచ్చును.

నాణెములు చెలామణి లోనికి రాకపూర్వము, పశు వులే ధనముగా వుపయోగించినవి. కొంతవరకు సంఘపు

క్రయ విక్రయోావసరములు వాటిద్వారా తీరుతూ వచ్చినవి.

పశుధనము అన్నప్పుడు, ఎద్లు, ఆవులు మాత్రమేగాక, గొర్రెలు, మేకలు, గుర్రములు, ఇతర పెంపుడు జంతువులను కూడా గణింపవచ్చును.

అయితే మన దృక్పథంలో మాత్రం ఆవుల ఎద్దుల స్థానం వున్నతమైనది. మానవులకన్నా వున్నతమైన స్థానము మన సాహిత్యములో వాటికి కల్పించిరి. ఆవును గోమాత అంటున్నాము. 'గోబ్రాహ్మణేభ్య శ్శుభమస్తు నిత్యం, సర్వేజనా స్సుఖినోభవంతు.' అని మన పెద్దల ఆశీస్సు.

అనగా గోబ్రాహ్మణుల తరువాతనే సకల జనులు గణింపబడిరి. గోవులు సుఖంగావుంటే, ప్రజలు సుఖంగా వుందురని వారిభావము.

అఖిలభారత ఖ్యాతిగాంచిన రచయితలందరూ ఎడ్లను గూర్చిన గొప్పకథలు వ్రాసిరి. ప్రేమచందు, శరచ్చంద్రుడు. కరుణకుమార, మున్షీ అందరూ ఇట్టి కథలు వ్రాసిరి.

ప్రేమచందు గోదాన్ అనే గొప్ప నవలలో పశువులకు కృషికులకువున్న అవినాభావ సంబంధమును అనన్యముగా చిత్రించినాడు.

వేదకాలమునుండి వ్యవసాయ ప్రధానమైన మన దేశంలో గోవులకున్న స్థానము వున్నతోన్నతమైనది. సాహిత్యంలోను మన ప్రజలలోనూ వాటికిగల స్థానమును గురించి వ్రాయాలంటే ఒక గ్రంథమే వ్రాయవచ్చును.

ఇప్పుడుమాత్రం మనము రాతినందులను పూజించి జీవనందులను హింసిస్తున్నాము. మన హృదయాలలో వాటికి

గల పూజ్యత తగ్గినదని అంగీకరించక తప్పదు. మనపూర్వులు మాత్రం సంవత్సరానికొకరోజు ఏర్వాక పౌర్ణమినాడు గోపూజను విధిగా చేసేవారు. ఇప్పుడు ఆ పండుగకూడా తగ్గినదనే చెప్పవచ్చు. యంత్ర వుపయోగమువలన మానవుడున్నూ మరయైనాడు.

దేవాలయములు, చెరువులు, వనంతోటలు, ధర్మ సత్రములు, గోభూములు, చలివేంద్రలు, మఠ నిర్మాణములు ఆదిగా గల్గిన సకల సాంఘిక అవసరమైనధర్మములతో పాటు మన పెద్దలు ఆబోతులను అచ్చువేసి గోజాతిని వృద్ధి పొందించుట ఆ కాలపు ధార్మికులు శ్రీమంతులు తమ కర్తవ్యముగా ఎంచుటయేగాక ప్రతిష్ఠకుకూడా కారణమని తలచిరి. అప్పట్లో వ్యవసాయ భూములలో సగం గోభూములుగా అనగా బీళ్ళుగా వుండేవి. రానురాను ఈ బీళ్ళు తగ్గుటయు డెల్టా గ్రామములగుటయు తటస్థించినది. ఉన్న భూమిఅంతా సాగుచేసినా, పెరుగుచున్న జనాభాకు ఆహారం చాలని స్థితి యేర్పడి, ఆబోతులను తగ్గించిరి. పరిస్థితుల కారణంగా రైతులున్నూ తమచేలలో ఆబోతులు తింటే సహించే ఉదారతను కోల్పోయిరి. ఇప్పటి రైతులు చిన్న చిన్నవారగుట వల్ల వారిలో నూటికి 60_70 మందికి గోవులే లేవు. ఇట్టిమార్పు అతి త్వరగా ముప్పది నలువది యేండ్లలోనే కలిగినది.

ఇప్పుడు ఆబోతులను అచ్చువేయుట పూర్తిగా తగ్గి గిత్తలను దబ్బిచ్చి ఆవులపై వుపయోగించు కుంటున్నారు. కృత్రిమ ఉత్పత్తికూడా జరుగుచున్నది.

మెట్టపెర్లు వుండి, ఆబోతులు స్వేచ్ఛగా తిరిగి నప్పుడు వున్న మేలిరకం పశుజాతి ఇప్పుడు తగ్గినది

దేవాలయములు చెరువులు, వనంతోటలు, వుప యోగ దృష్టితో గాకుండా కళాదృష్టితో చూచినప్పుడు అవి గ్రామ శోభకు యెట్లు తోడ్పడెనో ఆబోతులు గ్రామ నడిబొడ్డున పరుండి యున్నప్పుడు కళాహ్మాదయులకు అది యొక దర్శనీయమైన దృశ్యమై, గ్రామశోభను పెంచ గలిగినది.

ఆబోతుల పోరాటము దర్శనీయమైనది. అంత భీకర పోరాటము మరియొక జంతుకోటిలో లేదు. అందుచేతనే "ఆబోతులపోరు" అన్న మాట నానుడియైనది.

గ్రామంలో ఆబోతు వున్నప్పుడు ఆ గ్రామంవారికే గాకుండా పరిసర గ్రామవాసులకున్నూ ప్రయోజనకరంగా వుండేది. అందుచేత ఆయా గ్రామాలకు వెళ్ళినప్పుడు ఇది ఫలానివారి ఆబోతు అని అంటూవుండేవారు. అంతేగాక, అది ఒక పుణ్యకార్యముగా కూడా వారు భావించి అన్ని శుభాశుభ కర్మలలోను ఆబోతులకును అచ్చుపోసేవారు. పెండ్లిండ్లకు, పెద్దవారి మరణాలకు, తిరుపతి యాత్రలకు, సింహాద్రి యాత్రకు వెళ్ళినప్పుడు ముఖ్యంగా యీ పని జరుగుతూ వుండేది.

సింహాద్రి యాత్రికులు దేవాలయం వద్దనే ఆబోతులను అచ్చువేసి వదిలేస్తూ వుండేవారు. అవి అచ్చటి అడవులలో మేస్తూవుండడము అప్పుడప్పుడు క్రూర జంతువుల వాత బడడము సంభవిస్తుంది. ఆబోతులను అప్పన్నలంటారు.

విశాఖపట్నంజిల్లావారు ఎక్కువగా యీ ఆబోతులను వదలుటయేగాకవారిలో ఎక్కువగా స్త్రీ పురుషుల పేర్లు అప్పన్న, అప్పన్నలు వుండుటకు సింహాద్రి అప్పన్నే కారణం. "సింహాద్రి అప్పన్న చిరుతిండివాడు. లంచమిస్తేగాని సంతానమివ్వడు" అని పాటకూడా కలదు.

పూర్వకాలంలో వేమూరి రామన్నగారి తల్లిగారి పేరుతో ఒక ఆబోతు ఎద్దునూ, యన్నిగళ్ళ శ్రీరాములుగారు ఒక ఆబోతునూ పోసిరిగాని వాటిని గురించి తెలియదు.

తరువాత తూర్పువైపు రామాలయం భజన సమాజం వారు శ్రీరామనవమికి ఒక ఆబోతు ఎద్దును సం||రం 1900 ప్రాంతములో అచ్చుపోసిరి. ఆ దూడను వేమూరి రామన్నగారు ఆ సమాజమువారికి ధర్మముగా యిచ్చిరి. అది రాములవారి యెద్దు అని ప్రసిద్ధి. ఇదే కాలములో వేమూరి రత్నయ్యగారు తన అన్న సుబ్బయ్యగారు కాలధర్మము చేసినప్పుడు ఒక ఎద్దును పోసిరి. ఈ రెండెడ్లకు, చాలా మంచిదూడలు పుట్టుటవల్ల, చుట్టుపట్ల గ్రామవాసులుకూడా తమ ఆవులను ఇచ్చుటకే తోలుకువస్తూ వుండేవారు. అవి గట్లువెంట మేస్తూ పోయేవిగాని చేలో దిగేవిగావు. అందువల్ల రెండూ చాలా బుద్ధిగల ఎద్లు అని పేరు. ఆ రెండూ ఆమరణాంతము కలిసే వుండేవి. ఆబోతులు రెండూ కలిసివుండటము పొడుచుకోకుండా వుండడము చాలా అపురూపమైన విషయము. ఈ రెండవ యెద్దును రత్నయ్యగారి పెదతండ్రి పుల్లయ్యగారి పేరుతో "పుల్లయ్యగారి యెద్దు" అనేవారు. ఇవి మరణించి

నప్పుడు బండిపైనుంచి వూరేగించి, ఉత్సవంతో ఆచార ప్రకారము పాతివేసిరి. గ్రామస్థులందరికీ అది ఒక పండుగగా జరిగింది.

ఈ ఎద్దు రెండూ, కొంచెము ఇంచుమించుగా 1912 ప్రాంతములోనే చనిపోయినవి.

వీటి తరువాత గ్రామంలో బోడి ఆంబోతు అని ఒకటి వుండేది. ఇది ఈ వూరివారిది కాదు. ఈ వూరి రైతు గొర్రె పాటి కృష్ణయ్యగారు దానిని యెవరికో అమ్మిన కారణంచేత యిచ్చట నివసించి యిచ్చటనే చనిపోయినది. ఇది యెప్పుడూ ఒక చేలోనే తినేది. అందుచేత రైతులకు అప్పుడప్పుడు దానిపై కొంత కోపంవున్నా, రైతులు యింకా నన్నకారు రైతులు అవుట కారణంచేతను మెట్టవ్యవసాయం బీళ్ళు వుండుటచేతనూ, కొన్ని ఋతువుల్లో కట్టివేయువలసి వచ్చినా యిచ్చటనే జీవించి చనిపోయింది. దాని కాలము షుమారు 1913_1919 మధ్యగా వుండును.

తరువాత వేమూరి రామన్నగారు చనిపోయినప్పుడు ఆయన కుమారుడు చైర్మను వెంకయ్యగారు ఒక ఆబోతును, వేమూరి రత్నయ్యగారు ఆయన తల్లి రత్తమ్మ పేరుతో,ఇంచు మించు ఒకటి రెండు సంవత్సరముల వ్యత్యాసములతో అనగా 1923 ప్రాంతములో ఒక యెద్దును పోసిరి. ఇందులో రత్తమ్మ గారికి వేసిన యెద్దు 3_4 సంవత్సరములోనే పరిస్థితులు అను కూలించనందుననూ, పోట్లది అని పేరు రావడంవల్లను గంగి రెడ్లవారికి యిచ్చిరి.

రామన్నగారి యెద్దుమాత్రం యీ గ్రామంలోనే ముస లిదై చనిపోయినది. దానికి వడిగల దూడలే పుట్టినవిగాని నాణెములు తక్కువ. అసలు యెద్దులోనే నాణెములుతక్కువ. పూర్వం రాములవారి యెద్దు వారి దొడ్లోది గ్రామానికి బాగా వుపయోగించుటచేతను, అంతకు పూర్వము రామన్న గారి తల్లి పేరుతో పోసిన యెద్దుకూడా వారి దొడ్లోది మంచిపేరు సంపాదించింది అనే అభిప్రాయంతోను దూడను వెతకకుండా వారి దొడ్లోదే అచ్చువేశారు.కాని యిది వెనుకటి ఆబోతంత గొప్పదిగాదు. ఇది షుమారు 1935 ప్రాంతములో చనిపోయి నది. దానిని ఆనాడు వుత్సవముతో వూరేగించిరి.

తరువాత వేమూరి బ్రహ్మయ్యగారు తమ బావగా రైన దోనేపూడి వెంకయ్యగారి పేరుతో ఒకటిన్నీ, వేమూరి వెంకటరత్నంగారు తమ తాత చంద్రయ్యగారి పేరుతో ఒక టిన్నీ రెండాబోతులను కొంచెము యించుమించు ఒకే కాల ములోనే పోసిరి.కాని అవి యెక్కువగా వుపయోగించ లేదు. బ్రహ్మయ్యగారి ఆబోతు పొలంలోని నూతులోపడి దెబ్బలు తగులుటవల్లను రైతుల అసహిష్ణుతవల్లను గంగిరెద్దుల వారికి యిచ్చుట జరిగినది. వెంకటరత్నంగారు పోసిన ఎద్దుకు గాలితగిలి "కసిమెఱ" వ్యాధి రాగా గంగిరెద్దులవారికి ఇచ్చిరి. ఇవి రెండు షుమారు 4 లేక 5 సంవత్సరములు మాత్రమే వుపయోగపడినవి. ఇకనుండి ఆబోతులను విడిచేవారు, వీలు తప్పినప్పుడు తాము స్వంతముగా కట్టివేసి మేపితేనేగాని పూర్వములాగా అవి స్వేఛ్ఛా స్వాతంత్ర్యములతో యధే ఛ్ఛగా తిరుగవీలుగాని కాలము ఏర్పడినది అనే సత్యం అంద

రికి అర్థమైనది. గాని అయినా ఈసారి వ్యక్తులపేరుతో గాక, పూర్వము రాములవారి యెద్దు బాగా పేరు పొందింది అనే వుద్దేశ్యముతో మళ్ళా రాములవారి పేరుతో తుమ్మల వేంకట్రామయ్యగారి ప్రోత్సాహంతో గ్రామంలోని యువకులు చాలామంది కలసి ఒంగోలునుండి ఒక గిత్తను తెచ్చి పూర్వపు రాములవారి పేరుతో అతివైభవంగా సంతర్పణలతో వూరేగింపులతో షుమారు 20 సం॥నాడు ఒక యెద్దును పోసిరి. కాని అది ఆవులను చూడనందున రెండు సంవత్సరములలోనే దుక్కిటెద్దుగా మంత్రిపాలెం రైతుకు అమ్మివేసిరి. ఆబోతు ఎద్దులను హిందూ రైతులు నాగలికున్నుట యిదివరకు పాపమని, సాంప్రదాయ విరుద్ధమని భావించి గంగిరెడ్ల వారికి యిచ్చుటో లేక అట్లుయిచ్చుట యిష్టములేక యెద్దు వుపయోగించేది అయితే ప్రక్కల లేదా బంధు గ్రామాదుల వారికి యెవరికైనా యిస్తూ వుండేవారు. ఈ చుట్టుపట్ల ఆబోతు యెద్దును దుక్కిటెద్దుగా మార్చుట యిదే ఆరంభము అని చెప్పవచ్చును. అయితే ఈ యెద్దును యెవరికైనా యిచ్చుటకు వీలులేదు.పనికిరాదు గనుక. పూర్వ విశ్వాసములు సడలుట చేతను షుమారు వెయ్యి రూపాయల యెద్దును, (ఆకాలంలో) సగం ఖరీదుకు అమ్మిరి. ఇది చాలా అందమైనయెద్దు . మంత్రిపాలెంలో ఉండగా ఈయెద్దు పశు ప్రదర్శనములలో కొన్ని బహుమతులు సంపాదించినది. ఈ యెద్దును పోసిన నాడు జరిగిన వుత్సవ సమారాధనలే యీ గ్రామంలోని ఆఖరు ఆబోతును పోయుట అనిన్నీ యిక యీ ఆచారముయింతటితో అంతమైనదని చెప్పవచ్చును.

కాని ఆనాటి ఆబోతులు, వాటి గాంభీర్యము, రైతులకు వాటియెడగల ప్రేమాభిమానములు, ఇవన్నీ ఒక మధురాను భూతిగా మాత్రమే మిగిలినది. ఒకచక్కని సనాతనాచారము, కాలప్రభావమువల్ల అనివార్యముగా అంత మొందినది. మంచి ఆచారముగానిండు, చెడు ఆచారము గానిండు కాల ప్రభావముముందు నిలువదనుటకు ఆబోతు యెడ్ల చరిత్ర నిదర్శనము.

పూర్వకాలపు వారు మరణానంతర జీవితమే ప్రధాన దృష్టికలవారు. కనుకవారు గుళ్ళు గోపురములు, వనము తోటలు మొదలగు సప్త సంతానములను కోరిరి. వారిది ధార్మిక దృష్టి.

ఈ కాలపువారికి జీవితమే క్లిష్ట సమస్య అయినది. అందువల్ల బ్రదుకుటకు ఆలోచనలే పరమ ధ్యేయమైనవి. వీరిది ప్రయోజన దృష్టి.

# సంస్థలు - సంఘములు

## ప్రాథమిక బాలుర పాఠశాల

ఇది 1885_9_1 తారీఖున స్థాపించబడినట్లు తెలుస్తుంది.

మొదట ఉపాధ్యాయుడు ఘంటసాల వెంకటకృష్ణయ్యగారు. అప్పట్లో యిది బోర్డు పాఠశాలయినా, ఒక విధంగా వీధిబడిగానే నడిచింది. ఎంతో కాలానికి రెండవ ఉపాధ్యాయుడు ఏర్పడ్డారు.

1910 ఆ ప్రాంతాన గోర్తి నారాయణమూర్తిగారు ప్రధానోపాధ్యాయులుగా వచ్చారు. ఆయన కాలంలోనే స్కూలు ఉచ్ఛస్థితికి వచ్చింది. ఆయన గ్రామమంతా తిరిగి హెచ్చుమంది విద్యార్థులను పాఠశాలలో ప్రవేశింపజేశారు. అందువల్ల ఉపాధ్యాయుల సంఖ్య పెరిగినది. పిల్లలకు చక్కగా బోధించి, తోటి ఉపాధ్యాయులుకూడ బోధించేటట్లు చూచాడు. అప్పట్లో నాల్గవక్లాసు పరీక్ష యివ్వటం గొప్పగా పరిగణింప బడేది.

తర్వాత ప్రాథమిక ఉన్నత పాఠశాల అయ్యింది. ఎనిమిదవ క్లాసు వరకు క్లాసులు ఉండేవి. III rd ఫారం వరకు చదవటమన్నమాట. 400 పైగా విద్యార్థులు ఉండేవారు. దివి తాలూకాలో పెద్ద పాఠశాలలో ఇది ఒకటి. ఉపాధ్యాయులందరు ఆదర్శప్రాయంగా ఉండి తమ విధులను నిర్వర్తిస్తూ ప్రశంసలు పొందేవారు.

ఆ కాలంలో ప్రధానోపాధ్యాయులలో పేర్కొనదగినవారు బొడ్డపాటి హనుమంతరావు, పింగళి లక్ష్మీనరసింహాం, ఘట్టి నరసింహాంగార్లు.

ఈ పాఠశాలలో ఎనిమిదవ తరగతి పబ్లిక్ పరీక్షలో కృతార్థులైన విద్యార్థులు హయ్యర్ గ్రేడు ట్రైనింగుప్యాసై చాలమంది ఇప్పటికీ ఉపాధ్యాయులుగా పని చేయుచున్నారు.

1946లో మాధ్యమిక పాఠశాల స్థాపించినందువల్ల హయ్యర్ ఎలిమెంటరీ పాఠశాలను ప్రాథమిక పాఠశాలగా అనగా 5వ తరగతి లో గెలిచిన పిల్లలను హైస్కూలులో చేర్పించుచుండిరి. ఆనాటినుండి ఇప్పటివరకు 1వ తరగతినుండి 5 వ తరగతివరకు 8 మంది ఉపాధ్యాయులతో 305 మంది విద్యార్థులతో విలసిల్లుచున్నది.

## ప్రాథమిక బాలికా పాఠశాల

ఇది 1913 వ సంవత్సరంలో ఏర్పడినట్లు తెలియుచున్నది. దీని ప్రధానోపాధ్యాయుడు ఘంటశాల వెంకటరమణయ్యగారు.

ఇంతకుపూర్వం ఒక బాలికా పాఠశాల ఉండెడిది. దానికి ఉచితంగా బిల్డింగు యిచ్చే ఏర్పాటు జరుగనందున ఆ పాఠశాల ఇచ్చట ఎత్తివేసి భట్లపెనుమర్రులో పెట్టిరి. ప్రధానోపాధ్యాయులుగా అక్కిపెద్ది వెంకటచలం, అయినంపూడి సూర్యనారాయణరావు, రాయపాటి శీతారామయ్య, బి. రామనాథం, ఘట్టి దుర్గాప్రసాదరావుగార్లు పేర్కొనదగినవారు.

వీరు ఆరోగ్యవారం జరిపి బహుమతి లిచ్చేవారు. సభలుజరిపి నాటకాలు వేయించి బహుమతి వితరణ చేయించేవారు.

ఇందులో పూర్వం ఒక కుట్టు మాస్టరు ఉండేవాడు. సంగీతోపాధ్యాయుడు చాలాకాలంనుంచి ఉంటున్నాడు.

1942లో ప్రాధమిక ఉన్నత పాఠశాల అయినది.

హైస్కూలు వచ్చిన తదుపరి పాఠశాలను ప్రాధమికోన్నత పాఠశాలనుండి ప్రాధమిక పాఠశాలగా తగ్గించుటకు విద్యాశాఖవారు ప్రయత్నించగా గొట్టిపాటి బ్రహ్మయ్య, గొర్రెపాటి వెంకటసుబ్బయ్యగారలు, హైస్కూలులో జీతాలు ఉండుటవల్ల స్త్రీ విద్యకు అంత ప్రోత్సాహంగా ఉండదని ఈ పాఠశాలలో ఉత్తీర్ణులైన వారు హయ్యర్‌గ్రేడు ట్రైనింగుకు వెళ్ళుటకు అవకాశం ఉంటుందని కోరినందున దానిని 1957 వరకు అనగా 10 సంవత్సరములు ఉంచిరి.

ఇప్పుడు బాలికా పాఠశాల వాస్తవంగా బాలికా పాఠశాలే! దీనిలో పనిచేయుచున్న 10మంది ఉపాధ్యాయులలో సంగీతం మాష్టరు మినహా అందరూ ఉపాధ్యాయినులే. వీరిలో దాదాపు అందరు ఈ పాఠశాలలో ఉత్తీర్ణులైనవారే. విద్యార్థుల సంఖ్య 341. ఈ బాలికా పాఠశాలకు ఇంతవరకు స్వంత భవనము లేనందువలన చాల ఇబ్బందిగానున్నది. ఎంతో కాలంనుండి దీని కొరకు ప్రయత్నాలు జరుగుచున్నవి గాని ఫలించలేదు.

పాఠశాల భవన నిర్మాణ నిమిత్తం స్థలము, భవన నిర్మాణమునకగు ఖర్చులో $1/4$ వంతు గ్రామస్తులు భరించిన

మిగిలిన మొత్తము సమితివారు భరించే పద్ధతిని శాంక్ష నైనది. దీనిలో స్థలమునకగు ఖర్చు నిమిత్తం వేమూరి రాజ గోపాలస్వామిగారి భార్య వెంకటరమణమ్మగారు రు 3000. విరాళంగా యిచ్చిరి. ఉపాధ్యాయినులు షుమారు రు 3700లు చందాలు వసూలుచేసి యిచ్చుట ప్రశంసనీయమైన విషయం.

## దివితాలూకా ప్రాథమికోపాధ్యాయ సంఘం.

ఇక్కడ ఎలిమెంటరీ బాలికా బాలుర పాఠశాలలో ఉపాధ్యాయులంతా కలసిమెలసివుంటూ దివితాలూకా ప్రాథ మికోపాధ్యాయ సంఘాన్ని స్థాపించారు. ముఖ్యముగా పేర్కొనదగినవారు బుద్దు కుటుంబరావు, ఘట్టి లక్ష్మీ నర సింహం, రాయపాటి సీతారామయ్య, దోనేపూడి రామ సుబ్బయ్యగారలు.

అనవసర బదిలీలు లేకుండా చేయుటకు ఈ సంఘం తోడ్పడింది. వేతనాభివృద్ధికి, ప్రావిడెంటు ఫండుకు, పెన్షన్ కావాలని ఆందోళన చేసింది. ఆనాటి వీరి ఆందోళన నేడు కొంతవరకు అమలులోనికి వచ్చినది. ఉపాధ్యాయుల పిల్లలకు ఉచిత విద్య ఏర్పాటు చేయాలనే ఆనాటి వారి కోరిక ఇటీ వల అమలులోనికి వచ్చింది.

ఉపాధ్యాయుల ఐకమత్యానికి తోడ్పడి వారి కష్టనష్ట నివారణకు కృషి చేసింది.

ఈ ఉపాధ్యాయ సంఘం తరఫున 1930 డిశంబరులో 'ప్రాథమిక పాఠశాల' అనే మాసపత్రిక ఉభయభాషాప్రవీణ,

ఈ గ్రామ ప్రాథమిక పాఠశాలా ప్రధానోపాధ్యాయులైన అయినంపూడి గురునాథరావుగారి సంపాదకత్వమున వెలువడింది. దీనికి ఆంధ్ర విశ్వ విద్యాలయ వైస్ ఛాన్సలర్ కట్టమంచి రామలింగా రెడ్డిగారు తొలిపలుకు వ్రాస్తూ ఆశీర్వదించారు.

ఈ పత్రికా ప్రచురణలో కోట అప్పయ్యశాస్త్రి, రాయపాటి సీతారామయ్య, తంగిరాల సుబ్బారావుగారలు అధికంగా కృషి చేసిరి.

ఈ పత్రికను అన్ని పాఠశాలలకు బోర్డువారు తీసుకొని సప్లయి చేసి, తోడ్పడిరి. ఈ గ్రామమునుండి ఈ 'ప్రాథమిక పాఠశాల, మాసపత్రిక పది సంవత్సరములు జయప్రదంగా నడచినది.

ఇక్కడ ఉపాధ్యాయులే జిల్లా ప్రాథమికోపాధ్యాయ సంఘానికికూడ కృషి చేశారు.

దోనేపూడి రామసుబ్బయ్యగారు చాలాకాలం ఈ జిల్లా సంఘానికి సెక్రటరీగా వుండి సంఘాభివృద్ధికై పాటుపడ్డారు.

## పోస్టాఫీసు

మన దేశములో 1850 ప్రాంతమున పోస్టాఫీసులు ఏర్పడినట్లు తెలుస్తూంది. అవికూడా అధికముగా అప్పట్లో ప్రభుత్వానికి అవసరమయినచోట్ల మాత్రమే స్థాపించిరి. తరువాత పెద్ద పెద్ద కేంద్రాలలో సబ్ ఆఫీసులను ఏర్పాటు

చేసియున్నారు. ఈ ప్రాంతములోకెల్ల ప్రథమముగా చల్లపల్లిలో సబ్ పోస్టాఫీసు ఏర్పాటు అయినది. ఆ పోస్టాఫీసు నుండే ప్రతి బుధవారము, శుక్రవారము టపా బంట్రోతుల ద్వారా వెళ్ళేది. అప్పట్లో కార్డు కానీ, కవరు అణా. ఘంటశాలలో 1902 మార్చిలో బ్రాంచి పోస్టాఫీసు ఏర్పాటుచేయబడినదని పోస్టల్ ఇన్‌స్పెక్టర్ రిమార్కువల్ల తెలియవచ్చినది. పోస్టుమాస్టరుకు జీతము 5-0-0. ఘంటసాల వెంకట కృష్ణయ్యగారు 1902 నుండి 1917 వరకు పోస్టుమాస్టరుగా పనిజేసిరి.

ఈ పోస్టాఫీసు వచ్చుటకు నిలుచుటకు అధికముగా కృషి చేసినది వానపాముల లక్ష్మీనారాయణగారు.

కేంద్రప్రభుత్వ ప్రణాళిక ననుసరించి మనదేశములో బ్రాంచిఆఫీసులు, సబ్ ఆఫీసులు అధికముగా ఏర్పాటు చేసినారు. ఆ సందర్భములో ఈ గ్రామములో 6-2-1956 వ తేదీన ఎక్స్పెరిమెంటల్ సబాఫీసు ఏర్పాటుచేసిరి. తర్వాత పర్మనెంటు సబాఫీసు అయినది. పోస్టాఫీసుకై ప్రయత్నించిన లక్ష్మీనారాయణగారి యిల్లు రామసుబ్బయ్యగారు కొనడం, దానిని పోస్టాఫీసుకి అద్దెగా యివ్వడం ఆలోచిస్తే ఆశ్చర్యంగా వుంటుంది.

ఘంటసాల సబ్ ఆఫీసు ఏర్పడిన తరువాత చల్లపల్లి సబ్ ఆఫీసు క్రిందవున్న కొడాలి బ్రాంచి పోస్టాఫీసును ఈ ఘంటసాల సబ్ ఆఫీసుకు మార్చిరి.

3_1_1957 తేదీన ఘంటసాలపాలెంలోను,

28_1_1957వ తేదీన చిన్నకళ్ళేపల్లిలోనూ,

28_8_1958వ తేదీన వెల్లమల్లి రుద్రవరంలోనూ,

28_2_1960వ తేదీన దేవరకోటలోనూ,

బ్రాంచి ఆఫీసులు తెరచిరి. 1837లో తంతి కనిపెట్ట బడినది. 1853లో మనదేశంలో తంతి సౌకర్యము ఏర్పడినది.

23_1_60వ తేదీన టెలిగ్రాం సౌకర్యమును ఈ గ్రామమున ఏర్పాటుజేసిరి. టెలిఫోనును 1876లో కని పెట్టిరి. ఘంటసాలలో 7_11_62 నుండి పబ్లిక్ కాల్ ఫోను సౌకర్యమును ఈ పోస్టాపీసుకు కలుగజేసిరి.

టెలిగ్రాం ట్రైనింగ్ పొందిన టి. వి. యస్. ఆర్. ఆంజనేయులుగారు (సబ్ పోస్టుమాస్టరు) ఈ ఆఫీసువృద్ధి కొరకు కృషిచేసి, పైన వివరించిన వాటిలో కొన్ని బ్రాంచి ఆఫీసులు తెరపించిరి.

టెలిఫోను ఎక్చేంజి ఆఫీసును ఘంటసాలలో తెర చుటకు కనీసము 8 ఫోనులయినా వ్యాపారస్తులుగాని, ప్రత్యేక వ్యక్తులుగాని పెట్టుకోవలయును. అందుకు ఫోను 1 కి మొదటి సంవత్సరము ప్రతి ఒకరు రూ॥ 290 లు టెలిఫోను డిపార్టు మెంటు వారికి రుసుము చెల్లించవలయును. ఆ తరువాత ప్రతి సంవత్సరం ఫోను 1 కి ప్రతిఒకరు 250 రూ॥లు చెల్లించ వల యును. ఈ రుసుము మొత్తములు కట్టుటకు ప్రజలలో అంత వుత్సాహము చూపనందున పోస్టుమాస్టరు ఆంజనేయులుగారు ఈ ఫోను సౌకర్యము పోవునేమో ననే ఆతురతతో ఘంట

సాలపాలెం, కొత్తపల్లి, కొడాలి గ్రామాలలో కొందరు ప్రముఖులను కలుసుకొని ఫోను లాభములను వారలకు వివరించి ఉత్సాహపరచి పరిమిత సొమ్మును ఆయావ్యక్తుల వద్ద తామే తిరిగి వసూలుచేసి టెలిఫోను ఎక్ఛేంజి అధికారులకు ఆ మొత్తమును చెల్లించిరి.

ఈ విధముగా ప్రజల సౌకర్యములకై పాటుపడిన ఆంజనేయులుగారు ప్రశంసాపాత్రులు.

## శ్రీ రామమోహన పుస్తక భాండాగారము

1908 వ సంవత్సరమున వారణాసి చిన అచ్చన్నగారు ప్రైవేటు మాస్టరుగా వున్నప్పుడు ఇంగ్లీషు స్టూడెంట్సు క్లబ్ అనే పేరుతో ఒక క్లబ్‌ను స్థాపించి కొన్ని గ్రంథాలనుకూడా సేకరించారు. కాని అది చికిత్స అయిపోయినది.

శ్రీరామమోహన పుస్తకభాండాగారము గొర్రెపాటి వెంకటేశ్వర్లుగారుది. 28_9_1914వ తేదీనస్థాపించిరి. ఆయన దేశాభిమాని. అప్పటికే స్వదేశ వస్త్రములు కట్టుచు, సాంఘిక, రాజకీయ కార్యములందు పనిచేయుచుండెను. కమ్మ విద్యార్థి సంఘకార్యదర్శిగా పనిచేసెను. విద్యాభిమాని. ఈ గ్రామమునుండి ఇతర గ్రామములనుండి అనేకులను ప్రోత్సహించి ఆంగ్ల విద్యాభ్యాసమునకు బందరు తీసుకొని వెళ్లెను. ఆయనకాలములో 20 మంది విద్యార్థులు ఈ గ్రామమునుండి ఆయన ప్రోత్సాహమువిూదనే వెళ్ళిరి. ఆయన ఈ పిల్లలందరకు సంరక్షకుడుగావుండి విద్య, ఆరోగ్య



గొర్రెపాటి వెంకటేశ్వర్లుగారు

విషయములు చూచుటేగాక, సరియైన భోజన వసతికి తాను ఒక హాస్టలుకూడ ఏర్పరచెను. మంచి ఉత్సాహము, పట్టుదల కలవాడు. సంఘసేవ, దేశసేవ, గ్రామసేవ చేసిన ఆదర్శ యువకుడు. ఇంటర్ మిడియట్ తప్పుటచే, కలకత్తా వచ్చి ఈ రచయితను అక్కడ స్కూలుఫైనలులో చేర్పించెను. కాని ఆయనకు సీటు దొరకక పోవుటచే నాగపూరు వెళ్ళెను. కాని అక్కడ జ్వరపడి 1913. 8. 30 వ తారీఖున అస్తమించెను. ఈ యువజన సేవకుని గురించి కానూరి వెంకటచలపతయ్యగారు కృష్ణాపత్రికలో 'ఆదర్శ సేవకుడగు ఒక విద్యార్థి అస్తమయము' అనే శీర్షికతో ఆయన గుణగణములు ప్రశంసించుచు ఒక వ్యాసమును ప్రకటించెను.

కాంగ్రెసు నాయకుడుగా విఖ్యాతుడైన మాగంటి బాపినీడుగారు వెంకటేశ్వర్లుగారి సహపాఠి, మిత్రుడు. ఆయనకూడ తన మిత్రుని చరిత్ర ఆయన వర్ధంతికి పంపెను. వెంకటేశ్వర్లుగారు యువజన ఆదర్శ నాయకుడు. ఆయన అడుగు జాడలలోనే ఈ గ్రామ యువకులు పాటుపడిరి. వీరి అభివృద్ధికి ఆయన ఆధారభూతుడు. అట్టి ఆదర్శ సేవకుడు అస్తమించుట వీరికిని గ్రామమునకేగాక దేశమునకూ నష్టమే కలిగెను.

అప్పటి భాండాగార సభ్యులకు ఉత్సాహం తప్ప, కలుకుబడి, శక్తి సామర్థ్యాలు తక్కువ. గ్రామపెద్దల అభిమాన అనురాగాలు, గ్రంథాలయ ఉద్యమం యెడల సహాయ సంపత్తులు పూజ్యం. అయినా విడువని దీక్షతో మొక్కవోని ఉత్సాహంతో కృషి చేశారు. పాడుబడిన పెన్నేరమ్మ ఆల

యము బాగుచేసి, కొన్ని పుస్తకములతో ఈ రామమోహన పుస్తక భాండాగారమును స్థాపించడమైనది. ఆ సంవత్సరాంతమునకు 600 గ్రంథములయినవి.

ప్రథమ కార్యనిర్వాహక సంఘము, గొర్రెపాటి వెంకట్రాయులుగారి కుమారుడు కృష్ణయ్యగారు అధ్యక్షుడు. గొర్రెపాటి అప్పయ్యగారు ట్రస్టీ, గొర్రెపాటి వెంకటేశ్వర్లుగారు కార్యదర్శి, గొట్టిపాటి బ్రహ్మయ్యగారు కోశాధిపతి, గొర్రెపాటి వెంకటసుబ్బయ్య, వేమూరి సీతారామయ్యగారలు సభ్యులు.

ఆ ప్రథమ సంవత్సర వార్షికోత్సవము ఆనాటి ఏకైక రైతు నాయకులగు కానూరి వెంకటచలపతయ్యగారి అధ్యక్షత క్రింద జరిగినది. వారు వీరేశలింగంగారి సంపుటములు బహూకరించిరి.

అటులనే వార్షికోత్సవములు 1920 వరకు బాగుగా జరిగినవి.

ఇటుల వార్షికోత్సవములు చేయుటయేగాక, గ్రామస్థులలో వయోజన విద్యావ్యాప్తికై రాత్రి పాఠశాల నెలకొల్పి, కొంతకృషి చేసిరి.

ఆనాటి గ్రంథాలయ సభ్యుల బాధ్యత అధికం. వారు కేవలం చందాదారులుగా చేరి, గ్రంథములు చదువు పాఠకులే కాదు, దేశహితము కోరి పాటుపడువారు.

అందుచేతనే ఈ గ్రంథాలయ కార్యకర్తలు గ్రామ సౌభాగ్యమునకై పాటుబడుటేగాక దేశహితమునకై అధిక కృషి చేసిరి.

ఆదిలో ఈ గ్రామమునకు పెద్దలను రప్పించి, వారిచే ఉపన్యాసములు యిప్పించి, ప్రజలలో జాగృతి కలిగించుటకు కృషి చేయుట జరిగినది.

శ్రీ అయ్యదేవర కాళేశ్వరరావు, కానూరి వెంకటా చలపతయ్య, చెరుకువాడ వెంకటనరసింహం, పట్టాభి సీతా రామయ్య, ముట్నూరి కృష్ణారావు, ప్రొఫెసరు దామెర్ల వెంకట్రావు, పుచ్చా వెంకట్రావుగార్లను తదితరులను ఆహ్వా నించి ఉపన్యాసములు ఇప్పించి ప్రజలలో చైతన్యము కలిగిం చిరి.

1917లో కాంగ్రెసు లీగు ఒడంబడికకు సంతకములను కాంగ్రెసు ఆదేశానుసారం ఈ చుట్టుపట్ల గ్రామాలలో చేయించిరి.

పంజాబు హత్యలనుగురించి,హంటరు కమిటీ రిపోర్టును గుర్తించుచు చేసిన కృష్ణామండల సభ తీర్మాను గుణ్యాంగా సభ జరిపిరి.

ఎన్నో సభలు సమావేశములు జరిపి, ఈ గ్రామమును కాంగ్రెసుకు అండగా చేసి, పరిసర గ్రామములలో కూడా దీని ప్రభావం పడునట్లు గావించిరి.

ఆనాడు గొట్టిపాటి బ్రహ్మయ్య, వేమూరి సీతా రామయ్య, గొర్రెపాటి వెంకటసుబ్బయ్య, (రచయిత) గొర్రె పాటి వెంకటసుబ్బయ్య (కిసాన్), వేమూరి నాగయ్య, అయినపూడి గోపాలకృష్ణయ్య మొదలగు వారలు విద్యార్థు లుగా వుండి, వివిధ గ్రంథమండలుల నుండి వేరు వేరుగా గ్రంథములను తెప్పించిరి. అనారోగ్య కారణాలవల్ల

వీరంతా పాఠశాలనుండి విరమించవలసి వచ్చినా విద్యనుండి విరమించలేదు. వీరిలో వెంకటేశ్వర్లుగారి అనంతరం, గొట్టిపాటి బ్రహ్మయ్యగారి పెద్దరికాన గ్రంథాలయాభివృద్ధికి, గ్రామసౌభాగ్యానికి దేశ పురోభివృద్ధికి శక్తికొలది పాటుపడిరి.

వీరు ఈ గ్రామములోని పంచాయితీబోర్డు, పరపతి సంఘము, గ్రామసంఘము మొదలగు గ్రామాభివృద్ధికై ఏర్పడిన సంస్థలతో చేరి, పెద్దల తలలో నాలుకగా వుంటూ ఆ సంస్థల పెంపుకై పాటుపడుతూ, తద్వారా తమ గ్రంథాలయ ప్రయోజనాన్ని కూడా సాధించిరి.

సభ్యులవల్ల వచ్చినచందా తక్కువ. అందుచేత గ్రామంలో ప్రతిఇంటికి బుట్టలుకట్టి దానిలో రోజూ చారెడు ధాన్యం పోయుమని చెప్పి, వారాని కొకసారి, ఆ ధాన్యాన్ని తీసుకునేవారు. పరపతి సంఘంనుండి ప్రతిసంవత్సరము సాముదాయక ప్రయోజన నిధి గ్రంథాలయమునకు వచ్చేది. పంచాయితీ బోర్డునుండికూడా ప్రత్యక్షంగాను, పరోక్షంగాను కొంత సహాయం లభించింది. గ్రామ సంఘమునుండి పెద్ద మొత్తం రు. 1200/-లు గ్రంథాలయ భవనానికి సహాయం పొందుట జరిగినది. గ్రంథాలయ స్థలం అద్దెవల్ల రు. 1200-/లు వచ్చినది.

గ్రంథాలయ కార్యకర్తలు కాంగ్రెసువారు కనుక ప్రథమంలో గ్రంథాలయానికి గ్రాంటు గవర్నమెంటునుండి తీసుకొనుటకు అంగీకరింపలేదు. తరువాత 1935 నుండిగవర్న

మెంటునుండి, జిల్లా బోర్డునుండి గ్రాంటును సంపాదించుట ద్వారా గ్రంథాలయాన్ని వృద్ధిచేసిరి.

1935 లో సొసైటీల ఆక్టుక్రింద రిజిష్టరు చేయించి స్వంతస్థలమును, భవనాన్ని రు. 1500/ లతో 1937 లో సంపాదించగలిగిరి.

ఈ గ్రంథాలయ నిర్వహణములో ఈ గ్రామంలో ప్రాథమిక పాఠశాలోపాధ్యాయులగు రాయపాటి సీతారామయ్య, దోనేపూడి రామసుబ్బయ్య ప్రభృతులు, తుమ్మల వెంకటేశ్వర్లు, భాండాగారాధిపతిగానుండి తోడ్పడిరి. గొర్రెపాటి వెంకటేశ్వర్లుగారుఆశించినట్లు కొంతసేవచేసి, ఆయన చలువవల్ల ఇంత వృద్ధిపొందినందుకు సంతోషం.

ఈ గ్రంథాలయమునకు చాలాకాలం భాండాగారాధిపతులుగా వున్నందుననే ఈ రచయితకు గ్రంథరచనాభిలాష, వేమూరి వెంకట్రామయ్యగారికి సాహిత్యములో మంచి ప్రవేశము కలిగినవి.

మనకు స్వరాజ్యము, స్వరాష్ట్రము వచ్చినవి. భాండాగారములకై గవర్నమెంటు, స్థానిక సంస్థలు, ప్రజలనుండి భాండాగారపు పన్నువసూలు చేస్తున్నారు. భాండాగారాల నిర్వహణలకై గ్రంథాలయోద్యమ కర్తల కృషి ఫలితంగా ప్రభుత్వం ఒకశాఖ గ్రంథాలయ స్థాపన పోషణలకు ఏర్పాటు గావించారు. కనుకవారికి అప్పగించుట అన్నివిధాల మంచిదని యెంచి 1956లో కార్యనిర్వాహక సంఘం తీర్మానించింది. కృష్ణాజిల్లా లోకల్ లైబ్రరీ అథారిటీవారు అంగీకరించిరి.

చివరకు బ్రహ్మయ్యగారు ఎమ్. ఎల్. సి. అయిన పిమ్మట ఆయన ప్రాపకం వల్ల కావలసిన పనులన్నీ సత్వరంగా జరిగినవి.

ఆదినుండి దీని అభివృద్ధికై కృషి చేస్తూ, ఇందులో కూడ సహాయ పడినందుకు బ్రహ్మయ్యగారిని స్మరించక తప్పదు.

1959_7_4 వ తారీఖున్న కృష్ణాజిల్లా లోకల్ లైబ్రరీ అథారిటీకి అప్పగించిన నాటికి ఈ గ్రంథాలయమునకు గ్రామ మధ్యన 400 ల గజముల స్థలము, భవనము, 2807 గ్రంథములు; ఇందులో హిందీ, ఇంగ్లీషు, ఆంధ్ర గ్రంథాలు ఉన్నవి. ఇవన్నీ ఉత్తమ గ్రంథములు.

భారతి, గృహలక్ష్మి, స్వతంత్ర, పాడిపంటలు, గోసేవ మొదలగు ఉత్తమ పత్రికలను షుమారు 1250 వరకు రిఫరెన్సు నిమిత్తము అప్పగించడమైనవి.

దీనితో సంబంధించిన తొమ్మిది బీరువాలు, రెండు రాక్కులు, నాలుగు బెంచీలు, ఒక రీడింగ్ టేబుల్, ఒక కుర్చీ, ఒక టేబుల్ వున్నవి. వీరు సేకరించిన శిల్పకళా ఖండాలును గలవు.

లోకల్ లైబ్రరీ అథారిటీఆధ్వర్యము క్రిందకు వచ్చిన తిమహరి 1965_66 రికార్డులను బట్టి పుస్తకములు 6219 వరకు, భారతి, ఆంధ్రప్రదేశ్, రీడర్సు డైజెస్ట్‌మున్నగు మాగజైన్సు 1400ల వరకు పెరిగినవి. వీటితో బాటు ఫర్నిచరు కూడా పెరిగినది. ఒక సీలింగ్ ఫ్యాన్ 48" ను గ్రంథాలయ పాఠకులచే బహుమతిగా నొసంగబడి రీడింగ్ రూమ్‌లో ఏర్పాటు చేయడమైనది. గ్రంథాలయ భవనమునకు గ్రామ

సంఘమువారిచే 1965 ఏప్రిల్ మాసములో కర్రెంటు పెట్టించడమైనది.

ప్రస్తుతము గ్రంథాలయమునకు దినపత్రికలు 5 వార పత్రికలు- 8 పక్షపత్రికలు 8 మాసపత్రికలు 15 త్రైమాస పత్రిక 1 వచ్చుచున్నవి. డిపాజిటుపద్ధతిమీాద ఇండ్లకు పుస్తక ములను తీసుకొను సభ్యులసంఖ్య 168 రోజువారీ గ్రంథా లయమునకు వచ్చి పత్రికలు చదువువారి సంఖ్య 68. మొత్తం ఈ సంవత్సరంలో కన్సల్టేషన్ పద్ధతిమీాద చదువరులు తీసు కున్న పుస్తకములు 5326. డిపాజిట్ పద్ధతిమీాద ఇండ్లకిచ్చిన పుస్తకములు-3560.

ఈ గ్రంథాలయము ప్రస్తుతము ప్రచురణ కర్తలవద్ద, ముద్రణలో లేని విలువైన గ్రంథములతో రిఫరెన్సు గ్రంథా లయముగా విరాజిల్లు చున్నది. కృష్ణాజిల్లా లోకల్ లైబ్రరీ అథారిటీ సెక్రటరీగారైన వేములపల్లి చంద్రశేఖరరావు గారు గ్రంథాలయ తనిఖీ నిమిత్తము వచ్చి గ్రంథములను పరిశీలన చేసినమీాదట వారి ప్రత్యేక ప్రశంసలకు పాత్ర మైనది. ఇతర గ్రంథాలయముల పాఠకుల సౌకర్యార్థము ఈ గ్రంథాలయములోని విలువైన పుస్తకముల జాబితాను పంపవలసినదిగా ఇటీవలనే సెక్రటరీగారు కోరియున్నారు. ఈ గ్రంథాలయము "ఎ" క్లాసు గ్రంథాలయములలో చేర్చబడి నది.

ఈ గ్రామ కాపురస్థుడు కొండపల్లి రంగారావు గారు భాండాగారధిపతిగా నుండి, దీని అభివృద్ధికై పాటుపడు చున్నాడు.

## పంచాయతీ బోర్డు

ఇప్పుడు దివితాలూకాగావున్న ప్రాంతంకూడ బందరు తాలూకాగానే వుండెడిది. దివితాలూకా 1905లో ఏర్పడింది. బందరు దివితాలూకాలు కలసి బందరు తాలూకాబోర్డుగా 1917లో ఏర్పడింది.

1918_14_18 తారీఖునఅప్పటి తాలూకాబోర్డు ప్రెసిడెంటగు వేమూరి వెంకటసుబ్బారావుగారు ప్రధమ పంచాయతీబోర్డును చేతులెత్తుటద్వారా ఎన్నిక జరిపిరి. మొత్తము పంచాయతీదార్లు (మెంబర్లు) 9గురు. ఎన్నికసభ్యులు వేమూరి వెంకయ్య, ఈ రత్నయ్య, వానపాముల లక్ష్మీనారాయణ, ఘంటసాల ప్రతాప నరసింహం, తుమ్మలచర్ల వేణుగోపాలం గారలు,వీరు ఘంటసాలసభ్యులు. వేమూరి సుబ్బయ్య, ఈ రామయ్య తుమ్మల పరశురామయ్య గారలు, ఈ ముగ్గురు ఘంటసాలపాలెం సభ్యులు. ఘంటసాల గ్రామమున్సబుగారగు గొర్రెపాటి వెంకట నరసింహంగారు అధికారరీత్యా సభ్యులు. ఆనాడు గ్రామ మున్సబులు పంచాయతీ సభ్యులుగా వుండాలనే నియమము వుండెడిది.

అప్పట్లో ఇంటి ఖరీదులో మూడవవంతు అనుసరించి పన్ను వేసికొనే అవకాశమున్నప్పటికీ అర్ధరేటు ప్రకారము డిమాండు నిర్ణయించిరి. ఆ మొత్తము 683_4_0.

తిరిగి 14_2_21 వ తారీఖున ఎన్నికలు జరిగెను.

6 వార్డులుగా నిర్ధారణ చేయబడినది. నాటినుండి నేటివరకు ప్రెసిడెంటుల పేర్లు-కాలపరిమితి.

(1) వేమూరి వెంకయ్యగారు 1918 — 31-10-34
(2) వేమూరి నాగయ్యగారు(పాలెం)12-11-34 - 12-9-36
(3) గొర్రెపాటి వెంకట్రామయ్యగారు9-11-38 - 28-10-47
(4) వేమూరి గోపాలకృష్ణయ్య గారు 4-12-47 - 9-2-53
(5) తుమ్మల వెంకట్రామయ్యగారు 9-2-53 - 4-4-5
(6) గొర్రెపాటి మహాలక్ష్మమ్మగారు 31-5-57 - 29-8-59
(7) దోనేపూడి సీతారామయ్యగారు 10-9-59 - 1-6-64
(8) గొర్రెపాటి బుల్లెయ్యచౌదరిగారు 1-7-64 - నేటివరకు.

ప్రెసిడెంట్ల కాలములో జరిగినపనులు:-

(1) వేమూరి వెంకయ్యగారు:- వీరి కాలములోనే వృత్తి పన్నులు, ఇంటిపన్నులు, స్మశానంలో పచ్చగడ్డి వేలంపాట ప్రారంభమయినది. ఈ కాలములో సంప్రదించుకొని ఎన్నుకొనుచుండిరి. ఐకమత్యమునకు ఘంటశాలబోర్డు పేర్గాంచినది. వేమూరి వెంకయ్యగారు ఏకగ్రీవముగా 16 సం||లు అధ్యక్షుడుగా వుండుటచే చైర్మన్ వెంకయ్యగారని వాడుకయైనది. గొట్టిపాటి బ్రహ్మయ్య, వేమూరి సీతారామయ్య, గొర్రెపాటి వెంకటసుబ్బయ్యగారలు మున్నగు యువకులు ప్రవేశించి పంచాయతీపన్నులు వసూలుచేయుట ప్రారంభించిరి. గొర్రెపాటి బ్రహ్మన్నగారికుమార్డు వెంకయ్యగారు ఆనాటి సభ్యులలో వయోవృద్ధులు, గ్రామశ్రేయోభిలాషులు. ఆయన ఆనాడు "గ్రామపంచాయతీ ఇంజనీరు" అని

పిలువబడేవారు. పెద్దదేవాలయము ముందు పల్లముగా వున్నందున ఒక అర్ధగజము ఎత్తున నల్లమట్టి తోలించుటయే గాక గ్రామములోని వాలులన్నింటికి అడ్డకట్టలు వేసి కొంత వరకు రోడ్లు పోయించుట జరిగెను. సభ్యులందరు గ్రామములో నలువైపుల తిరిగి ఎక్కడపని యెంత అవసరమో అది చేయుచుండెడివారు. ప్రతి సభ్యుడు సభకు హాజరగుటయే గాక ప్రజాసౌకర్యముకొరకు పనిజేసెడివారు. పన్నులు చాల తేలికగ విధించబడి ప్రతి పైసా వసూలుచేయబడి సక్రమముగా ఖర్చుపెట్టబడెడిది.

ఆనాటి పెద్దలగు వేమూరి వెంకయ్యగారు చైర్మన్ గను, గొర్రెపాటి వెంకయ్యగారు వైస్‌ప్రెసిడెంటుగా వుండుట వలన తమ పంచాయతీ పనులు శ్రద్ధాసక్తులతో చేయించిన గొర్రెపాటి బ్రహ్మయ్యగారి కుమార్డు వెంకయ్యగారు మెంబరుగా వుండుటవలన, గొట్టిపాటి బ్రహ్మయ్యగారు మున్నగు యువకులు వుత్సాహముతో చేయుటవలన, ఆనాటి బోర్డు ఖ్యాతి గాంచినది. ఈ వెంకయ్యగారి హయాంలోనే గ్రామం సర్వే చేయించుట కేర్పాట్లు జరిగినవి. కాని సర్వే 34-35లో జరిగినది.

1934న ప్రశాంతముగానున్న బోర్డు వేమూరి లక్ష్మయ్యగారి మరణాంతరము వారి ఆస్తి సంబంధమున కక్షలతో వ్యక్తి కక్షలుగా ఏర్పడి ఆసంవత్సర పంచాయతీ ఎన్నికల సందర్భమున రెండు పార్టీలుగా ఏర్పడినవి. ఉభయ పార్టీలు ఫంటసాలపాలెం పెద్దలగు వేమూరి సుబ్బయ్య, రామయ్య గారలను మధ్యవర్తులుగా కోరుకొనిరి. ఆ మధ్యవర్తులు తమ

గ్రామస్థులయిన వేమూరి నాగయ్య, రామస్వామి గార్లను వరుసగా చైర్మన్, వైస్ చైర్మన్‌లుగా నియమించిరి. అశాంతి నిర్మూలమునకు ఏర్పరుపబడిన పంచాయతీ అశాంతికి కారణమయినది. దీనిని పురస్కరించుకొని ఘంటసాల, పాలెం గ్రామములలో తీవ్రమయిన పార్టీ కక్షులు ఏర్పడి రెండు గ్రామములవారు అనేక సివిల్, క్రిమినల్ కేసులకు లోనైరి. పాలెం కలిసి యున్నచో ఈ కక్షలు శాంతించవనే కారణాన 1938 సెప్టెంబరు 21వ తేదీన విడదీయుట జరిగినది.

(2) వేమూరి నాగయ్యగారు:— జిల్లాబోర్డులనుండి గ్రాంటును పొంది వీధిదీపములు ఏర్పాటు జరిగినది.

(3) గొర్రెపాటి వెంకట్రామయ్యగారు:— వీరి కాలములో జిల్లాబోర్డువారు గ్రాంటు యివ్వనందున లాంతరులు తీసివేయబడినవి.

పాతబావులకు కొన్నిటికి పళ్ళెములు కట్టించి సిమెంటు చేయుట, కొన్ని నూతులను కట్టించుట, గ్రామ రేడియో యేర్పాటు చేయుట జరిగినవి.

(4) వేమూరి గోపాలకృష్ణయ్యగారు:— లోగడ ప్రెసిడెంటుగు వెంకట్రామయ్యగారు యుద్ధసందర్భమున యెన్నికలు జరగనందున 9 సం॥లు ప్రెసిడెంటుగా వుండిరి. తరువాత గ్రామములో కక్షలు ఏర్పడినందున వున్న బోర్డునుంచుతూ ప్రెసిడెంటును ప్రభుత్వమువారు తొలగించినందున వారిస్థానే గోపాలకృష్ణయ్యగారిని ఎన్నుకొనిరి. వీరికాల

ములో పంచాయతీ వీధులలో కొంతవరకు మట్టితోలించుట, వీధులలోకి సైడ్డులను త్రవ్వించి, తూములు వేయించి కల్వ ర్టులు కట్టించిరి. గోటకమునందు స్త్రీలకొక మరుగుదొడ్డికూడ కట్టించుట జరిగినది.

(౭) తుమ్మల వెంకట్రామయ్యగారు:— పంచాయతీ వీధులను లెవిలు పెంచుటకు కొంత మట్టికోడ్లు పోసిరి. వీధుల లోని సైడ్లలో తూములు పెట్టి కల్వర్టు కట్టించుట జరిగినది. వీరి హయాంలో పంచాయితీ బోర్డును గూర్చి రెండుదావాలు జరిగినవి. ఎన్నికల సందర్భములో రెండు గ్రామాలలో జరిగిన ఎన్నికలలో పాలెంను ఘంటసాలతో కలిపినపుడు గెజిట్ పబ్లి కేషన్ జరుగనందున ఈ ఎన్నికలు శాస్త్రీయము కాదని ఘంటసాలపాలెం వాస్తవ్యులు శ్రీ వేమూరి వెంకట రామయ్యగారు ఒక దావానువేయగా కోర్టుతీర్పులో ఘంట సాలపాలెంను విడదీయుచూ ఎన్నికలలో ఘంటసాల మెంబర్లు, ప్రెసిడెంట్లు శాస్త్రీయముగా ఏర్పడినట్లు తీర్పు చెప్పబడినది.

పాలెం విడిపోయింది గనుక, ఎన్నికలు జాయింటుగా జరిగినవి గనుకను ఘంటసాల బోర్డు వుండుటకూడ శాస్త్రీ యము కాదని వేమూరి సుబ్రహ్మణ్యాంగారొక దావా వేసిరి.

ఈ రెండు దావాలలోను తుమ్మల వెంకట్రామయ్య గారు బోర్డు తరఫున ప్రతివాదిగానుండి విజయముచు పొందిరి.

(౮) గొర్రెపాటి సీతామహాలక్ష్మమ్మగారు:— ఆ సంవ త్సరము గ్రామములో జరిగిన మార్పువల్ల అదివరకు

కాంగ్రెసు- కమ్యూనిస్టులుగా వున్న పార్టీలు, కాంగ్రెస్, లోక్‌పార్టి కమ్యూనిస్టులు అను మూడుపార్టీలు ఏర్పడినవి. చివరి రెండుపార్టీలు సంయుక్త పౌరసంఘముగా ఏర్పడి కాంగ్రెసుతో పోటీచేసి 9 సీట్లకు 8 సీట్లను గెల్చుకొనిరి. కోఆప్షనువల్ల సీతామహాలక్ష్మమగారు సభ్యులుగా వచ్చి ప్రెసిడెంటుగా ఎన్నికైరి.

ఈమె పరిపాలనా కాలములో పశువైద్య ప్రథమ చికిత్సా కేంద్రము స్థాపించబడినది. మూడు మంచినీటి బావులు, నాలుగు వుప్పునీటి బావులు త్రవ్వబడినవి. ఆళ్ళ వెంకమ్మ చెర్వుకు వుత్తరవైపున రివెట్‌మెంటు చేయించడ మయినది. పెద్దవీధి, వైశ్యుల వీధి కంకర వేయుటకు తీర్మా నములు చేయబడినవి. రెండు మదుగుదొడ్లు ఏర్పాటు చేసిరి.

(6) దోనేపూడి సీతారామయ్యగారు :— వేమూరి వెంకయ్యగారి పరిపాలనానంతరం పంచాయతీ బోర్డులో 20 సంవత్సరాలు అధికారము ఎవరు చేపట్టుగా అనే దృష్టితో ఏర్పడిన ప్రెసిడెంట్లే. కొన్ని అవకాశాలు పరిస్థితులు వారిని పరిలపానలోనుంచి పార్టీదృక్పథముతో మెలగునట్లు చేసినవి. దీనితో ప్రజలు విసిగి వేసారిపోయిరి. రోడ్లకు నల్లమట్టి తోలడంవల్ల నడవటానికే అవకాశం లేకపోయింది. తిరిగి చైర్మన్ వెంకయ్యగారి కాలం మాదిరిగా సంప్రతింపులమీాద అందరి సమ్మతిసీ పొందగల ప్రెసిడెంటుని పెట్టుకొంటే

బాగుంటుందనే ఏకాభిప్రాయానికివచ్చిరి. అందువల్ల సీతా రామయ్యగారు ప్రెసిడెంటుగా ఏకగ్రీవముగా ఎన్నికైరి. ప్రజాశ్రేయస్సునుకోరి ఆయన సర్వవిధములా పాటుపడిరి. రెండు మెటల్ రోడ్లు వేయించుట జరిగినది. గ్రామము శోభాయమానముగా వుండుటకు 120 వీధి కరెంటుదీపములను వేయించిరి. గ్రామములోని వీధులన్నింటికి బురద లేకుండా ఇసుక తోలించిరి. ధర్మగోటకం షుమారు 150 ఎకరాలు ప్రభుత్వముచే పంచాయతీకి వెస్టు చేయించిరి. సదరు భూమిలో షుమారు 15 ఎకరములు పంచాయతీక్రింద గిన్నీ గ్రాసు వేయించిరి. స్మశానములో కాలువ కీవతల వున్న భాగములో రెండెకరములలో ఆదాయము పెంచుటకు కొబ్బరితోట వేయించిరి. వీరి కాలములోనే బోర్డు ఆదాయము అధికమైనది. డైలీ మార్కెట్టు, బస్సుస్టాండు వగైరాలు నోటిఫై చేసిరి. గోటకములో తుమ్మలు పెంచి ఆదాయమును పెంచుటకు ప్రయత్నించిరి. పశువైద్య ప్రథమ చికిత్సా కేంద్రమును, రూరల్ డిస్పెన్సరీగా వృద్ధిచేయించిరి. ఇండస్ట్రియల్ ఎస్టేటు, ఎగ్రికల్చరల్ స్కూలు, కోళ్ళఫారమ్, పశువుల సంత మున్నగువానికి ప్రపోజల్సు పంపిరి. వాటర్ సప్లై కోసము ప్రయత్నము చేసిరి. రాష్ట్రప్రభుత్వంలో పలుకు బడిగల గొట్టిపాటి బ్రహ్మయ్యగారు వీరికి అండదండగా వుండుట చేత ప్రభుత్వమువల్ల జరుగవలసిన పనులలో ఎక్కువగాను, తొందరగాను జరుగు ఏర్పాట్లుండుటచే వీరికాలమున చాలా మంచిపనులు జరుగుట కవకాశము లేర్పడినవి.

## నేటి ఆదాయము

1. ఇంటిపన్ను — రు 10, 500
2. వృత్తిపన్ను — రు 2000
3. బండిపన్ను — రు 1000
4. చేపలపాటలు — రు 4000
5. పచ్చగడ్డిపాటలు — రు 1200
6. స్టాంపుడ్యూటీ — రు 4000
7. సినిమాహాలువల్ల — రు 3000

రు 25,700

ఇందులో సంవత్సరంకు సిబ్బంది ఖర్చు 6, 000

1956 సం॥లో పంచాయతీని బిక్లాసు పంచాయతీగా నిర్ణయించి కార్య నిర్వాహణాధికారిని నియమించిరి. 1960 సం॥ లో విద్యుద్దీపములు వేయించిరి.

ఆదాయము సంవత్సరమునకు రు 27,800 రు ఖర్చు సంవత్సరమునకు రు 25000.

| | |
|---|---|
| 1961 సెన్సను ప్రకారము జనాభా | 6954 |
| ఘంటసాలలో ఇండ్ల సంఖ్య | 1308 |
| దిరిశంవారి గూడెంలో | 165 |
| వెట్టివాని మాలపల్లి లో | 118 |
| పిడుగువాని మాలపల్లి లో | 63 |
| క్రిస్టియన్ పేటలో | 42 |

ఈ గ్రామములో అధిక సంఖ్యాకుల భూమివున్న బొళ్ళపాడు, ఎరికలకుదురు గ్రామములను ఈ పంచాయతీలో

జేర్పుటకు ప్రయత్నములు చేయుచున్నారు. అవి జరిగినచో స్టాంపుడ్యూటీ సంబంధమయిన ఆదాయము అధికముగా రాగలదు.

పంచాయతీబోర్డు చరిత్రలో వేమూరి వెంకయ్య, దోనేపూడి సీతారామయ్యగార్ల నామములు చిరస్మరణీయములు.

పెక్కు కాలం గోగ్రెపాటి వెంకట్రామయ్య గారి కుమారుడు వైసు చైర్మన్‌గావున్నందున వైసు చైర్మన్ పేరు బడసెను. ఈయన మండల కాంగ్రెసు అధ్యక్షుడుగా; కాంగ్రెసు కార్యకర్తగా ప్రసిద్ధుడు.

ఎంతో కాలమునుండి స్మశానములో దహనముచేయుటలో, ఎండ వానలనుండి రక్షణకు రెండు నిర్మాణములు జరుప ఆలోచనలో వుండెను. ఆ కార్యమును తమ తండ్రి దోనేపూడి బాపనయ్య తల్లి శ్రీ రామమ్మగార్ల పేర నిర్వర్తించిన వేమూరి రాజగోపాలస్వామిగారి భార్య రమణమ్మగారు ప్రయోజనమైన కార్యముచేసి ప్రశంసల పొందుచున్నది. ఇవి చూచువారికి కన్నుల పండుగగానుండి గ్రామ ప్రతిష్ఠకు తోడ్పడుచున్నందుకు సంతసింప తగినది.

1964-7-1 తారీఖున జరిగిన యెన్నికలనుబట్టి గోగ్రెపాటి బుల్లెయ్యచౌదరిగారు సర్‌పంచ్‌గా యెన్నుకో బడిరి.

ఈయన కాలములో కూరగాయల మార్కెట్టు, శ్రీ వేణుగోపాలస్వామివారి ఆలయము వెనుక కట్టబడినది.

శ్రీ జలధీశ్వరాలయం ముందుగల ప్లాట్ ఫారము, ఓపెన్ ఎయిర్ థియేటర్‌కు యెస్టిమేటు జరిగినది.

ఇక్కడ బహిరంగసభలు జరుగుతూ వుంటవి. విశాల మైన ప్రదేశము. ఈ కట్టడము గ్రామానికెంతో శోభప్రయోజన కారి కాగలదు.

కొన్ని రోడ్లకు మెటలు వేయుటకు యెస్టిమేట్లుకూడా వేయబడినవి.

## శ్రీ జలధీశ్వర విశాల సహకార పరపతి సంఘము.

1904 లో అఖిలభారత సహకారచట్టము ప్రకారం మనదేశంలో సహకారసంఘాలు ఏర్పడినవి.

ఈ గ్రామములో 1919_12_19వ తారీఖున శ్రీ జలధీశ్వర సహకార పరపతి సంఘము శ్రీ వేమూరి రత్నయ్యగారి ప్రోద్బలమున స్థాపించబడెను. ఈయన ఆ కాలములో రాజకీయములు తెలిసిన ప్రముఖుడు, మంచిమునసర్ది, సలహాదారు, సంస్కారాభిలాషిగా ప్రసిద్ధుడు.

ఈగ్రామంలో మెట్ట మాగాణి యుండుటచే ఎప్పుడూ రైతు చేతిలో ధనం మెదులుచూనే వుండేది. అంతేగాక కొంచెము జాగ్రత్తగా కార్యకలాపములు చేసికొనుట చేతను అప్పులు చేయనవసరము అట్టే వుండదు. అందుచేత ఈ సంఘము అధికముగా అభివృద్ధి పొందలేదు. లావాదేవీలు జరుపుచుండుటలేదని అధికారులు అప్పుడప్పుడు తాఖీదులు పంపుట జరిగెను. కాని అవసరములేని అప్పులు ఎవరు తీసికొందురు?

1930లో ఆర్థిక మాంద్యములోను మరికొన్ని సమయాలలో ఇది బాగుగ ఉపయోగపడెను. ఉత్పత్తి కొనుగోలు

దార్ల సంఘస్థాపన సందర్భములో అధికముగ ఇది ఉపయోగ పడెను.

ఈ సహకార సంఘమువల్ల ప్రజలలో ఐకమత్యము, కార్యనిర్వహణము, సాముదాయక ప్రయోజనాభిలాష కల్గు అవకాశములు గలవు.

ఈ సంఘమువల్ల గ్రంథాలయమునకు కూడ కొంత ఆర్థిక ప్రయోజనము కలిగెను.

దీనికి అధిక కాలము వేమూరి రత్నయ్య, గొర్రెపాటి వెంకటసుబ్బయ్య గారలు ప్రెసిడెంట్లుగాను, గొట్టిపాటి బ్రహ్మయ్య, వేమూరి వీరయ్యగారలు కార్యదర్శులుగా వుండి ప్రశంసార్హముగా పనిజేసిరి.

రిజర్వుబ్యాంకువారి ప్రణాళికల ననుసరించి 1958జూలై 26 వ తేదీన విశాల పరపతి సంఘముగ మార్చి ఘంటసాల, దేవరకోట, బోళ్ళపాడు, చిలకలపూడి గ్రామములు ఇందులో కలపడమైనది. కృష్ణాజిల్లా కలెక్టరు శ్రీ గంగోపాధ్యాయ గారు ప్రారంభోత్సవము చేసిరి. కృష్ణా కో - ఆపరేటివ్ సెంట్రల్‌బ్యాంకు అధ్యక్షులయిన కొల్లిపర వెంకట రమణయ్యగారు (M. L. A.) నాటి సభ కధ్యక్షత వహించిరి. డిప్యూటీ రిజిష్ట్రారు శ్రీ వజీరుద్దీన్ గారు డైరెక్టర్లను నియోగించిరి. దోనేపూడి సీతారామయ్యగారు ప్రెసిడెంటుగను, గొర్రెపాటి వెంకట్రామయ్యగారు వైస్-ప్రెసిడెంటుగను నియమించబడిరి. 29-12-1962న ఎన్నిక జరిగెను. తిరిగి సీతారామయ్య, వెంకట్రామయ్యగార్లు ప్రెసిడెంటు, వైస్ ప్రెసిడెంట్లుగ ఎన్నుకొనబడిరి. ఈ సంఘము చాలా ఐకమత్య

ముతో ప్రజోపయోగకరముగా లాభసాటిగా పని చేయుచున్నది.

14-3-1959 న రిజిష్టరు కాబడినది.

గవర్నమెంటునుండి 1959 వ సం॥లో రు. 10,000 షేరుధనముగా వచ్చినది.

సంఘం రైతులకు అప్పులును, ఎరువులు ఇవ్వడంలో ఉపయోగపడుచున్నది. ముందు ముందు కంట్రోలు సరుకులుకూడా వ్యాపారం చేయాలని గవర్నమెంటువారి ఆలోచనలో వున్నది (ఇనుము వగైరా).

ఎరువులు అమ్మకం ప్రతిసంవత్సరం పెరుగుచున్నది.

62-63 ఆడిటు పూర్తికాలేదుగాని అంచనా 3103-68 రావచ్చును. ప్రతి సంవత్సరము ఆడిటునందు 'B' Class వచ్చుచున్నది. ఉలవలు, పంచదార, ఎండ్రిన్, కాఫీపోడి, స్ప్రేయరు వగైరాలు తెప్పించి రైతులకు అధికముగా సహాయపడుచున్నది. 2 లక్షలు అప్పులు 3 లక్షలు ఎరువులు మొత్తం 5 లక్షలు టర్నోవరు జరుగుచున్నది.

దీనికి గోదాములు కట్టబడినవి.

దీని ఆధ్వర్యముక్రింద ఒక రైసుమిల్లు కట్టబడుచున్నది.

ఈ విశాల సహకార పరపతి సంఘము బ్లాక్ మార్కెట్టు లేకుండా సక్రమముగా జరుగుచున్న సంఘము లలో ఒకటి. దీని ప్రెసిడెంటు దోనేపూడి సీతారామయ్య గారు, తన కాలమంతా దీనికై ఉపయోగిస్తూ ప్రజోపకార

మునకై పాటుపడుచుండుట చేతనే ఇది క్రమాభివృద్ధిపొందు చున్నది.

పదవులు కొందరకు అలంకారమైపోతే, కొందరు పదవులకే అలంకారము. సీతారామయ్యగారు ఉత్పత్తి కొను గోలుదార్ల సంఘానికి, పంచాయతిబోర్డుకు, విశాల సహకార పరపతి సంఘానికి, అధ్యక్షుడై. ఆ పదవులకే అలంకారం తెచ్చెను.

ఆయన యెట్టి ధవళవస్త్రధారుడో, అట్టి పరిశుద్ధ వర్తనుడు, సౌమ్యుడు, దాతృత్వముగలవాడు. పట్టు పట్టడు, గాని పట్టినా భల్లూకపట్టు. స్ఫురద్రూపి, మంచి ఆకర్షణకలవాడు. అందరిచేతను మంచివాడని అనిపించుకున్నవాడు. అయితే దోషాలు లేవా అనవచ్చును. దోషరహితులు మానవులలో ఎవరునూ వుండరు. ఎక్కువ మంచివుండుటవల్లనే మంచివాడనేది. మంచితనమునకు మించినదే మున్నది ? 'మంచి యున్నది పెంచుమన్నా'

## ధర్మగోటకపు సంఘం

వల్లూరి సూర్యనారాయణరావుగారు సంపాదనలోను ధనమును సద్వినియోగము చేయుటలోను అందరకు ఆదర్శ పాత్రుడు. ఆయన తన ఆస్తిని అందరకువలె పుత్రులకు పంచి యివ్వక దేశ శ్రేయస్కరమైన పనులకై ఉపయోగించుటకు ఇచ్చిన దాత. తన శేష జీవితమును దేశకల్యాణమునకై వినియోగించిన దేశాభిమాని.

ఈ గ్రామ గోటకపు కేసులో ఆయన పనిచేయుటే గాక దాని యందధిక అభిమానం కలవాడు. కాన, 1921లో

## గ్రామసంఘం

ఈ సంఘమునకు జనకుడు గొట్టిపాటి బ్రహ్మయ్య గారు. ఆంధ్రకాంగ్రెసు ప్రముఖులలో ఒకరు. రాష్ట్ర కాంగ్రెసు సేవలో ఆయన అగ్రగణ్యత గాంచాడు. ఆయన ఆంధ్ర రాష్ట్రీయ మహాసభకు అధ్యక్షత వహించిన ప్రథమ రైతుబిడ్డ. ఆంధ్రరాష్ట్ర కాంగ్రెసు కార్యదర్శిగా మూడు సంవత్సరముల కాలము అతినిపుణతతో పనిచేసి ప్రస్తుతించ బడిన ప్రజాసేవకుడు.

గ్రామ ప్రజల, ఆరోగ్య నైతిక విద్య మొదలగు విషయములకొరకు, గ్రామసంఘం డాక్టరు పట్టాభిగారి సలహా సంప్రదింపులతో 1925_12_2 తారీఖున ఏర్పడెను. ఇది కంపెనీల ఆక్టుక్రింద రిజిష్టరు చేయబడి నాటినుండి మొన్నటి వరకు గ్రామవ్యవహారములు నడపి, ఇదివరకు వ్యక్తిగతముగా ఈ రచయిత మరికొందరి ద్వారా వున్న గ్రామ ఉమ్మడి సొమ్ము దీనికాతాకు జమ కట్టబడి, ఆధనంతో ఒక పెంకుటి భవంతి గ్రామసంఘ ప్రయోజనమునకు వేయబడెను. కాని అది మారుమూల వుండుటచే అమ్మివేయబడి, ఆ ధనంతో జలధీశ్వరాలయము ముందు మేడకు ఉత్తరముగావున్న పూరి పాకను తీసివేసి దానిపట్టు ఒకడాబా కట్టబడినది. అందులో లోకల్ లైబ్రరీ నడపబడుచున్నది. అది వారికి యివ్వబడినది.

జలధీశ్వరాలయము ముందు చక్కని విశాలమైన మంటపము మూడువేలతో కట్టబడినది. ఇంకను గ్రామానికి అవసరమగు అనేక వ్యవహారములు నిర్వర్తించినది. అప్పటప్ప

టికి అవసరమగు గ్రామకార్య కలాపములు నలుగురు సంప్రదించుకొని సక్రమముగ వ్యవహరించుటకు ఈ సంఘమెంతో ప్రయోజనకారి అయినది.

కాల మెల్లప్పుడు ఒక్కరీతిని వుండదు కద. పంచాయతీ బోర్డు యెన్నికలలో తగాదా వచ్చినటులనే గ్రామసంఘ యెన్నికలలోను తగాదాలు వచ్చినవి. ఈ సమయము గమనించి చల్లపల్లి యెస్టేటు దివానగు జంపాల వెంకటేశంగారు గ్రామగోటకమును స్వాధీనం చేసుకొన సంకల్పించి, పూర్వపు అడివి 'ఘోటకము'గా పిలవబడుచున్న య270లు వి స్తీర్ణము గల అనాది బంజరై యెస్టేటువారికి సంపూర్ణ హక్కు భుక్తములు కలిగి వారి కాపలాలోయున్న భూమిని యెస్టేటువారి పర్మిషను లేకుండా పశువులను తోలినందుకు రు. 200/-లు నష్టపరిహార మివ్వని యెడల కోర్టుద్వారా రాబట్టుకొందునని 1934-12-4 తారీఖున్ను ప్లీడరు ద్వారా ఘంటసాల, పాలెం గ్రామస్తులలో 45 గురకు నోటీసులు ఇప్పించెను.

అంతట గ్రామస్తులందరు తమ కలతలసర్దుకొని ఏకీభవించి 1934-12-20 తారీఖున్ను గ్రామసంఘ అధ్యక్షు డొక్కడే నోటీసులకు సమాధాన మిచ్చుటకు అంగీకరించి అనుమతి నిచ్చిరి. గోటకపు రక్షణకు గోటకము సంఘము నేర్పరచిన వకీలు వల్లూరి సూర్యనారాయణరావుగారిని సంప్రదించి వ్రెసి డెంటు ప్రత్యుత్తర మిచ్చెను. అంతట అందరూ ఏకీభవించుటచే ఆయన ఆటసాగదని దివాను ఏమీతోచక వూరుకొనెను. ఆ కార్యమునకే ఆయన ఉద్యోగం ఉధ్వాసనకూడ అయినది. ఆ సంగతి పాఠకులకు పరిచయమే.

అనంతరం గ్రామస్థులు ఆక్రమించిన, లేక చిరకాలము నుండి వారి స్వాధీనములో వున్న భూములన్నీ 1945తో మహాయతు చేయబడి, ఆక్రమింపబడిన భూములు విడగొట్టబడి సరిహద్దుల్లో దిమ్మలుకూడా కట్టబడెను. గ్రామసంఘమునకు గొర్రెపాటి బ్రహ్మన్నగారికుమార్డు వెంకయ్యగారు కొంత కాలము అధ్యక్షుడుగావుండి సక్రమముగా వ్యవహరించెను. ఆయన మరణానంతరం గొర్రెపాటి నరసన్నగారి కుమార్డు వెంకయ్యగారు అధ్యక్షత వహించి దేవాలయమండపము, డాబా మొదలగు కట్టడముల కట్టించి, ఆయనగురువు బాల కృష్ణమ్మగారి వలెనే స్థిరమైన కార్యములు చేసెను. అనంతరం గొట్టిపాటి బ్రహ్మయ్యగారి అధ్యక్షత కాలములో గోటకపు ఆక్రమణలన్ని తీసివేయబడినవి. ఆయన తండ్రి మొదలగువారు తలపెట్టిన ధర్మకార్యము చెడగొట్టుటకు దివాను చేసినప్రయత్నాలను విఫలీకృతం చేయుటేగాక, గ్రామస్థు లందరిచేత సంతోషముతో ఆక్రమణలు తీయించుటలో ఆయన చాతుర్యం చెప్పతగినది.

ఇటీవలనే మరల సుమారు రు. 400/ల వ్యయముతో బాలకృష్ణమ్మగారు కట్టించిన మేడ, వెంకయ్యగారి ఆధ్వర్యములో కట్టించిన డాబా బ్రహ్మయ్యగారి ఆధ్వర్యాన మరమ్మతు చేయబడి మంచి స్థితిలోకి తేబడెను. గ్రామసంఘమే లేనిచో ఇట్టి గ్రామఉమ్మడి భవనములు, మరమ్మతులు, గ్రామ సమిష్టి కార్యములు సాగుట సులువుకాదు కద! గ్రామసంఘం ఉండుటచేతనే జలధీశ్వరాలయమునకు ఘంటసాల నరసింహారావుగారు యిచ్చిన యకరము సక్రమముగ ఆయన సంక

ల్పించిన కార్యములు నెరవేరుటకు అవకాశము కలిగినది. గ్రామ చరిత్ర వ్రాయుటకు రు 200/లు యిచ్చి ప్రోత్సహించింది. శ్రీరామమోహన పుస్తక భాండాగారమునకు రు. 1200/లు విరాళమిచ్చి గ్రంథాలయమునకు సహాయపడినది. ఈ విధంగా గ్రామసంఘంవల్ల పెక్కు విధముల ప్రయోజనం కలిగింది.

ధర్మగోటకము నుండి 1941_9_21న ఘంటసాలనుండి కొడాలివరకు వేసిన రోడ్డుకు య 13. 35 సెంట్లను యిచ్చుటకు తీర్మానించబడెను.

దీనినుండే 1946. 12. 18 హైస్కూలుకు బిల్డింగుకుగాను పది యకరములు యిచ్చుటకు ఏకగ్రీవముగ తీర్మానించబడినది.

అనంతరం విత్తనముల కేంద్రము క్రింద 76 యకరములు, వ్యవసాయ పాఠశాలకు 30 యకరములు యివ్వబడినది.

జమీందారుల పాలబడకుండా కాపాడిన గోటకమును ఇటుల ప్రజాప్రయోజనముల క్రింద నూటముప్పది యకరములు యివ్వగా మిగిలిన నూటనలుబది యకరములు పంచాయతీ బోర్డుకు వశపరచ బడినది.

1948 నుండి గ్రామ సంఘమునకు దోనేపూడి సీతారామయ్య, వేమూరి పేరయ్యగారలు అధ్యక్ష కార్యదర్శులుగావుండి కార్యకలాపములు జరుపుచున్నారు.

## పంచాయతీ సమితి డిస్పెన్సరీ

1924 వ సంవత్సరంలో పానుగల్లు రాజాగారు మద్రాసు ముఖ్యమంత్రిగా ఉన్నప్పుడు గ్రామసీమలలో ఉచిత వైద్య సౌకర్యములు కలిగించుటకు శాసనము చేసిరి. దానిననుసరించి బందరు తాలూకాబోర్డు సభ్యుడుగా వేమూరి వెంకయ్యగారు వున్నప్పుడు ఇక్కడ 1926 లో ఒక రూరల్ డిస్పెన్సరీ నెలకొల్పబడినది. అప్పటి డాక్టరు మరుగంటి శేషాచార్యులుగారు యం. బి, బి. ఎస్.

ఈ డాక్టరుగారు వైద్యంలో నిపుణులైనా పట్టణ పద్ధతుల కలవాటు పడిన వారగుటచేతను, గ్రామస్తులు బహుకాలంనుండి ధనరూపేణాగాక తదితరంగా వైద్యులకు వారి సేవలకుగాను ఇచ్చే అలవాటు పడుటచేత ఈ కాలంలో ఈ వైద్యం వృద్ధిగాంచలేదు.

1930 లో కానుకొలను వెంకట సుబ్బారావుగారు యల్. యం. పి. వచ్చిరి. వీరు 1942 వరకు ఇచ్చటనే వుండి ఈ గ్రామములో అల్లోపతి వైద్యాన్ని వ్యాప్తిలోకి తీసుకొచ్చెను. ఈయన బీదలకు ఉచితముగాను, ధనవంతులదగ్గర తగినట్లుగాను తీసుకొంటూ మంచిడాక్టరని ఖ్యాతిగాంచెను. అదివరకు, డాక్టరుకూడా వచ్చాడు అంటే అన్నివైద్యాలు అయిన తర్వాత ఆఖరి క్షణంలో ఆయనను పిలవటంగా ఉండేది. ఈయన వచ్చిన తర్వాత తారుమారైనది. ప్రథమంగానే ఈయనచేత వైద్యం చేయించుకొనుటకు అలవాటు పడ్డారు. ఈయనకు గ్రామంలోని రీతి రివాజులు తెలుసు.

వైద్యంలోకూడ మంచి నిపుణుడు. మంచి మాటకారి. ఈ కారణాలచేత ఈయన అధికంగా రాణించటానికి అవకాశం కలిగింది.

రూరల్ డిస్పెన్సరీకి కాంపౌండరు వుండేవాడుకాడు. డాక్టరే పెట్టుకోవాలి. మందులుకూడా సప్లై తక్కువే. ఇలా వుండగా ఇది పెద్దగ్రామము, రెగ్యులర్ డిస్పెన్సరీ వుండుట అవసరమని గొట్టిపాటి బ్రహ్మయ్యగారు తగు ప్రయత్నములు చేయగా 12_10_1949 న రెగ్యులర్ డిస్పెన్సరీ అయినది. అప్పట్లో కలెక్టరుగా మలయప్పన్‌గారు జిల్లాబోర్డుకు స్పెషల్ ఆఫీసరుగా వుండిరి. వారు హైస్కూలు సందర్భంలోను, రెగ్యులర్ డిస్పెన్సరీ విషయంలోను చాలా సహాయపడ్డారు దీనికి ఒక కాంపౌండరు, ఒక మెటర్నిటీ అసిస్టెంటు మరికొంత సిబ్బంది ఏర్పడి డిస్పెన్సరీ అన్నమాటకు అర్థం వచ్చింది.

శర్మగారు 18_9_60నుండి 15_1_62వరకు పనిచేసిరి. ఈయన అన్ని హంగులుగల వ్యక్తి, రాజకీయాలలోకూడా నేర్పరే.

తర్వాత అట్లూరి వెంకటేశ్వరరావుగారిని(G. L. I. M) 7_2_62 తేదీన నియమించిరి.

వీరు ఆపరేషను చేయుటయందు ఆసక్తిగలవారు.నిపుణులుకూడా. కుటుంబనియంత్రణకు స్త్రీ పురుషులకు ఆపరేషన్ ఈ కాలములో వీరిచేతనే అధికంగా చేయించుకొన్నారు. వీరు వచ్చినతర్వాత డిస్పెన్సరీ అన్నివిధాల అభివృద్ధి చెందినది.

రెగ్యులర్ డిస్పెన్సరీ అయినప్పటినుండి సంవత్సరానికి రు 800/లు మందులు మాత్రమే యిచ్చేవారు. 1960 నుండి రు 1200/లకు పెంచిరి.

దీనికి మందులను పెంచవలసిన ఆవశ్యకత అధికంగా కలదు.

## విజయలక్ష్మి చేనేత సహకార సంఘం

మనదేశము వ్యవసాయిక దేశమే కాదు, పరిశ్రమలన్నిటికి ఇది పుట్టినిల్లె. అందులో వస్త్రపరిశ్రమకు వన్నెయు వాసియు గాంచినది. క్రీస్తుకుపూర్వమే మన నేతపరిశ్రమ ఎంతో నిపుణతగా నిర్వహింపబడుచు, వివిధ దేశములకు మన దేశమునుండి వస్త్రములు రవాణా అగుచుండెను. అందులో విశేషముగా రోముతో వ్యాపారము సాగుచుండెడిది. ఆనాటి రోమను నాణెములే నేటికిని ఘంటసాల అమరావతి మొదలగు చోట్ల దొరుకును. ప్లయినీ అనే రోమను చరిత్రకారుడు హిందూదేశ వస్త్రములను కొనుటచేత, బంగారమంతా భారతభూమికి పోవుటచే దేశము దరిద్రమగు చున్నదని విచారపడెను.

ఈస్టిండియా కంపెని కాలుపెట్టి, మనవస్త్ర పరిశ్రమనంతా నాశనం చేసినసంగతి సర్వజనవిదితం. అయినా నేటికీ చేనేత పారిశ్రామికులు మనదేశంలో కోట్లాది వున్నారు. వీరి అధోగతి ఆలోచించినవారే లేరు. ప్రభుత్వమునారు మిల్లుల్లో పనిచేసే కార్మికులను గురించే శాసనాలు చేశారుకాని, వీరి అభివృద్ధికై ఎట్టికార్యము చేయలేదు. కార్మికులకంటే కష్ట దశలో వీరున్నారు.

ఆచార్యరంగా మనదేశంలో పీడిత ప్రజ- రైతులు, వ్యవసాయ కూలీలు, చేనేత పారిశ్రామికులుగా తలచి వారందరి క్షేమానికై పాశ్చాత్యపద్ధతిని సంఘములు స్థాపించి వారిలో రాజకీయ చైతన్యం కలిగించిన మహానుభావుడు.

ఆయన 1935లో వృత్తిసంఘాలు పెట్ట ప్రోత్సహిస్తే ఆయన మాటను మన్నించక కులసభలు పెట్టుకుని దానివల్ల ప్రయోజనం పొందజాలక చివరకు ఆయన ఆధ్వర్యాన్నే వృత్తిసంఘాలద్వారా ఉన్నతి పొందుచున్నారు. నేడు చేనేత వారికి ఆయన ఆందోళన చేతనే ప్రభుత్వంవారు కొంతవరకు ప్రయోజనం కలిగించుచున్నారు. సాధారణంగా రైతులవలెనే వీరును అమాయకులు, అవిద్యావంతులు, దరిద్రులు. అందు చేత వీరీ వృత్తికిగాను వ్యాపారస్తుని ఆశ్రయించక తప్పింది కాదు. అతడు ఈ నేతగాని రెక్కలకష్టం అంతా గుంజుతూ, యితడిని దరిద్రంలోనే ఉంచాడు. గిరాకీవుంటే నేయించటం, లేకపోతే నేతకు నూలు యివ్వకుండా వుండటం, నేసినగుడ్డ తానుచెప్పినట్లు నేయలేదని, గట్టిగాలేదని ఏదో సాకులుచెప్పి మజూరి తెగ్గోసి నేతగాడిని నానా బాధలు పెట్టేవాడు.

ఈ చేనేతవారి కష్టాలు గట్టెక్కించుటకు 1935 లో చేనేత సహకార సంఘాలు స్థాపింపబడినవి. సహకారసంఘం వారి తనిఖీక్రింద యిది నడపబడుతూ నేత నేయువారికి యిది అమితలాభం కలుగచేయును. అయినా ఇంకా వీరు దీని ప్రయోజనం గమనించలేదు.

ఇక్కడ తాలూకా చేనేతసంఘ సభ పెండెం వెంకట్రాములుగారి ఆధ్వర్యతను జరుపబడెను. చేనేత ప్రముఖు

లగు ప్రెగడ కోటయ్యగారు ప్రభృతులు ప్రబోధముచేశారు. ఈ కారణాలవల్ల ఈ గ్రామములోకూడ చేనేత సహకారసంఘం స్థాపించుటకు సంకల్పం జరిగినది. ఈ సభకు సంఘానికి గొర్రెపాటి వెంకటసుబ్బయ్యగారి సంప్రదింపులు వీరికి అధికంగా తోడ్పడినవి. టంటం శ్రీమన్నారాయణగారు కూడ సంఘస్థాపనకు సహాయపడెను. అదివరకే వారిలో స్థానికంగా పార్టీలున్నా, వృత్తిసంఘాలను సంఘీభావంతో పనిచేసుకొందామని అంగీకారానికి వచ్చి, డిపాజిట్లుచేసి 1943_3_11 తారీఖున శ్రీ విజయలక్ష్మి చేనేత సహకార సంఘమనే పేరుతో సంఘాన్ని రిజిష్టరుచేయించి, మే 3 వ తారీఖున పని ప్రారంభించారు.

ప్రథమ సంవత్సరం అందరి ఆమోదంమీద అంది జలధిలింగం ప్రెసిడెంటుగను, తుమ్మలచర్ల వెంకటసుబ్బయ్య సిద్ధాంతి శెక్రటరిగను యెన్నుకోబడ్డారు. కాని వారిలో వైరాలు పోలేదు. ఏకారణంచే నైతేనేమి మళ్ళా కలహం పొసగింది, సంఘం ప్రయోజనకరంగా పనిచెయ్యలేదు.

యెన్నికలో ఒక పార్టీవారిదే మెజారిటి అగుటచే డైరెక్టరులందరు వారే ఎన్నుకోబడిరి. ఆ డైరెక్టరులలోనుండి పోలన బాపనయ్య ప్రెసిడెంటుగను తుమ్మలచర్ల శ్రీరాములు కార్యదర్శిగను యెన్నుకొనబడిరి.

అనంతరం రెండవపార్టీవారు, తగాదాలు పడుటకంటె దీనిలోనుండి వైదొలగితే, అన్నివిధాల మంచిదని యోచి సంఘమునుండి విరమించుకొన్నారు.

234 సభ్యులతో సంఘం పనిచేసింది. ఈ సంఘం 44_45 లో రు 7000/ 45_46 రు 20,900/ 46_47 లో రు 2500౦లు లాభాలు సంపాదించింది.

జిల్లాలోకల్లా అధికోత్పత్తి చేసిన సంఘమిదే. సభ్యుల సంఖ్యలోను ఉత్పత్తిలోను ఇది ప్రథమ స్థానము వహించి నది. తగాదాలు పడకుండా అందరూ కలిసివుంటే ఇంతకంటే అధికంగా వుండేది. ఘంటసాల చేనేతగుడ్డ మన్నికకు మంచి దని, రంగులు నమ్మకమైనవని ప్రఖ్యాతిగాంచుటచే దీనికి మార్కెట్టులో మంచిపేరుండి త్వరలో విడుదలగును.

ఈ సంఘం లాభంతోనే పనిచేసింది. కాని ధరలు పడి పోవుటవల్ల, సంఘసభ్యులలో ఐకమత్యం లేనందువల్ల, నష్ట పడినందున ప్రభుత్వంవారు దీన్ని తీసివేసిరి.

## భారతీరంగా చేనేత సహకార సంఘము

మొదటి సంఘములోనుంచి రాజీనామా నిచ్చినవారు పై పేరుతో ఒక సంఘాన్ని స్థాపించారు.

అది కలతలవల్ల కొద్దికాలంలోనే అంతరించింది.

## ది ఘంటసాల జ్ఞానోదయ చేనేత పారిశ్రామిక సంఘం లిమిటెడ్

పైన పేర్కొనబడిన సంఘములు రెండూ రద్దయిన కొంతకాలమునకు చేనేత పారిశ్రామికులు చాలా బాధలు పడిరి. వారికి గంజికేంద్రములుకూడ ఏర్పడెను.

ఈ బాధలు పడలేక మరల సంఘమును స్థాపించు కొనిన కొంతమేలు కలుగగలదని తలచి, గొట్టిపాటి

బ్రహ్మయ్యగారిచుట్టూ తిరుగసాగిరి. ఆయన 'నాయనా, మీలో ఐకమత్యములేదు. సంఘం లేకపోతే బ్రతకలేరు; వుంటే దానిని నాశనం చేసేవరకు మీకు నిద్రపట్టద'నిఎన్నో విధాల మందలించెను.

'మేము పూర్వంవలే ప్రవర్తించమ'ని ఆయనకు బాసట నిచ్చిరి. అంతట ఆయన మీకు ఇక జ్ఞానోదయం అయినట్లేనా అనెను. వారు ముమ్మాటికిని అనిరి. అప్పుడా యన అధికారులతో మాట్లాడి ఈ సంఘానికి తత్సూచనగా, ది ఘంటసాల జ్ఞానోదయ చేనేత పారిశ్రామిక సంఘమని పేరు పెట్టెను.

ఈ సంఘం 1952_7_2 తేదీన 59 మంది సభ్యులతో షేర్ల ధనము రు 1855/ తో రిజిష్టరు కాబడి 52_8_17 న ప్రారంభించబడినది.

ఈ సంఘం గవర్నమెంటుగ్రాంటు పొందుతూ, అప్పులను తీసుకొంటూ సకాలమున యిస్తూ సక్రమముగ పని చేస్తూ, దినదినాభివృద్ధి పొందుచున్నది.

1964_65 సంవత్సరములో ఉత్పత్తి రు 327:57.91 అమ్మకం ఇతరులకు రు 50392.88 ఆంధ్ర చేనేత సహకార సంఘం విజయవాడవారికి రు 28629_62 జరిగినది.

ఈ సంవత్సరములో రు 26296_28 నికర లాభము. రిజర్వుఫండు రు 3064_79 బిల్డింగుఫండు రు 5944_43ధరలు సమత్వ నిధి రు 2426_02 మజూరీల సమత్వనిధి రు 763_12 184 మెంబర్లు రు 19487_00 షేరు ధనము కలిగి యున్నది.

ప్రారంభింపబడి, ఐకమత్యముతో మెలగి అభివృద్ధి గాంచు గాక !

## ది ఘంటసాల జ్ఞానోదయ హేండు పౌండింగు ఆఫ్ రైస్ వర్కర్సు కోఆపరేటివ్ కాటేజిఇండస్ట్రియల్ సొసైటి లిమిటెడ్

ప్రభుత్వము గృహ పరిశ్రమలక్రింద దంపుడుబియ్యపు సరఫరాకుగాను సంఘాలను స్థాపించి వాటికి గ్రాంటు లిస్తు న్నారు. తత్సంబంధమైనదే ఈ సంఘం.

ఈ సంఘంవల్ల స్వచ్ఛమైన దంపుడుబియ్యం దొరుకుటేగాక దంచే వారికి ప్రతిరోజు పని కల్పించ గలుగుచున్నది.

ముఖ్యముగా చేనేత పారిశ్రామికులకు సరియైన ధరలకు బియ్యం అందుటేగాక,బియ్యం ముందుగా ఎడ్వాన్సుగా యిచ్చి, జ్ఞానోదయ చేనేతసంఘం యిచ్చే మజూరీలనుండి తీసుకొని ఈ సంఘానికి వసూలు చేయుబడుతున్నది.

ఈ సంఘమునకు ముడిబియ్యం తయారు చేయుటకు హేండుపౌండింగు మిషను రు 2364.80లుకు సంఘప్రారంభ కాలమున కొనబడినది. సదరు మిషను అరుగుదల క్రింద రు 1938.15లు రిజర్వు చేయుబడినది.

ఈ సంఘమునకువచ్చిన లాభమునుండి రు 4740/లతో స్వంతభవనము వర్కుషెడ్ నిర్మించుకొనబడినది.

దీనికి ప్రెసిడెంటు బండారు వెంకట్రామయ్య సెక్రటరి బండారు సుబ్బారావుగారలు.

# ది ఘంటసాల జ్ఞానోదయ ఖాదీ హేండు స్పిన్నర్సు అండ్ వీవర్సు కో ఆపరేటివ్ ప్రొడక్షన్ అండ్ సేల్ సొసైటి లిమిటెడ్ No 90 N

ఇది ఖద్దరు నూలువడుకువారు నేత పారిశ్రామికుల సహకార సంఘం.

ఈ సంఘం 1959. 12. 1 న 29 మెంబర్లతో రు1905/ల షేరు ధనముతో రిజిష్టరు కాబడి 1958. 1. 21 తేదీన శ్రీ గొట్టిపాటి బ్రహ్మయ్యగారి అధ్యక్షతను శ్రీ ప్రగడ కోటయ్యగారితో ప్రారంభోత్సవం చేయబడినది.

ఈ సంఘమునకు ఆంధ్రప్రదేశ్ ఖాదీ అండ్ విలేజి ఇండస్ట్రీస్ బోర్డువారు రు 10, 000/లు అప్పుగా యిచ్చారు.

1964_65 సంవత్సరములో కాజసెంటరులోను, ఘంటసాలలోను వడుకువారినుండి రు 24083_51లు నూలుఉత్పత్తి చేయబడి రు 12689_81 లు బట్ట తయారుచేసి, ఖాదీ అండు విలేజి ఇండస్ట్రీటును కమీషను వారినుండి రు 1661, 18 ల బట్ట కొనుగోలు చేసి, చిల్లరగా రు 1184_12లు కాజ, ఘంటసాల డిపోలకు అమ్ముట జరిగినది.

ఈ సంవత్సరం రు 1751_24లు నికరలాభం వచ్చినది. సంవత్సరాంతమునకు 383 నేతవారు, వడుకువారు గలరు. మెంబర్ల షేరు ధనము రు 2442 ఆంధ్రప్రదేశ్ ఖాదీ అండ్ విలేజి ఇండస్ట్రీటుబోర్డు హైదరాబాదు, బిల్డింగు నిమిత్తం రు 5000/లు అప్పుగాను రు 5000/లు గ్రాంటుగాను యిచ్చిరి. సదరు ధనమున్ను సొసైటి రిజర్వుఫండు

రు 6000/లును మొత్తం రు 16000/లతో స్వంత భవనమును నిర్మించి ఆంధ్రప్రదేశ చేనేత కాంగ్రెసు ప్రధాన కార్యదర్శి ప్రగడ కోటయ్యగారిచేత ప్రారంభోత్సవం గావింపబడినది.

దీనికి రు 3522-13లు రిజర్వు ఫండున్నది. సంఘమునకు మాచర్ల పెద్దిరాజు, గుత్తికొండ వీరరాఘవయ్యగారలు, ప్రెసిడెంటు, వైసు ప్రెసిడెంటు.

ఈ సంఘభవమునకు అనుకొని మెంబర్లలో కొందరు కలసిమెలసి కడు ఉత్సాహముతో వుండుట హర్షనీయము.

## మహాత్మాగాంధీ జిల్లా పరిషత్ ఉన్నత పాఠశాల

ఈ గ్రామము విద్యావంతమైనది గాదని యిదివరకే తెలిపితిని. అంతమాత్రమున ఈ గ్రామస్తులకు విద్యయందభిరుచి లేదని అనుకొనరాదు. విద్యయందభిమానమున్నను అది అభ్యయోగ్యత అనేక కారణములవల్ల లేకపోయినది.

అయినను నేటికి 80 సంIIలకు పూర్వమే ఘంటసాల తారక బ్రహ్మంగారి కుమారుడు శేషయ్యగారు బి. ఎ. పరీక్ష గెలిచి ఉపాధ్యాయ వృత్తిలో ప్రవేశించి కొద్దికాలముననే మృతిచెందెను. అటులనే గొట్టిపాటి బ్రహ్మయ్యగారి పినతండ్రి సుబ్రహ్మణ్యేశ్వర స్వామిగారు పట్టపరీక్షయందు తీర్ణుడై, ఆరుమాసములు ప్లీడరీ చేసిన అనంతరము అసువులుబాయుట జరిగెను.

అనంతరము అభివృద్ధిలోకి రాతగిన గొర్రెపాటి చంద్రయ్య చనిపోవుట, కొందరకు జబ్బు చేయుట తటస్థించినది.

ఇటుల విద్యాభ్యాసము చేసినవారు వృత్తిలోనికి రాక పోవుటేగాక మరణించుట, అనారోగ్యము నొందుటచూచి గ్రామస్థులలో ఆంగ్ల విద్యాభ్యాసముమీద అభిరుచి తగ్గెను. ఇంతేగాక సహాయ నిరాకరణోద్యమమునందు అధిక అభిమానముగల గ్రామమగుటచే ప్రభుత్వ పాఠశాలలయందు చదువుటకుకూడ యిష్టము లేకపోయినది.

అటు తర్వాత గోగ్రెసాటి బాలకృష్ణమ్మకూడ స్కూల్ ఫైనల్ చదువుతూ చనిపోవుట తటస్థించినది.

ఆర్య నాయకముగారు ఈ గ్రామమువచ్చి యిక్కడ ఆంగ్ల విద్యావంతులు లేనందున సంతసించిరి వారందరు స్వార్థ పరులని ఆయన భావము. బ్రహ్మయ్యగారు వగైరాలు పట్ట భద్రులైనచో, ప్రభుత్వసేవకులై పరులవలెనే యుండెడివారు కాని దేశసేవ చేసెడివారు కాని ఆయన అనెను. కాని ఆ కాస్త ఆంగ్ల విద్యాభ్యాసము వల్లనే యీ మాత్రమైనా సేవ చేయుట తటస్థించినది. అది లేనిచో అందరిరైతుల వలెనే యుండుట జరిగెడిది. కనుక ఆంగ్లవిద్య అవసరమే.

విద్య విశేషముగా అభివృద్ధి పొందుటకు పాఠశాలలు సమీపములో వుండవలెను. చల్లపల్లిలో రాజాగారు ఉన్నత పాఠశాల పెట్టిన తర్వాత ఈ యెస్టేటులో విద్యాభ్యాసము హెచ్చినటులే యీ గ్రామమునకూడ పెరిగెను.

ఇచట మాధ్యమిక పాఠశాల పెట్టిన విద్యార్థులకను కూలముగ నుండునని ఈ రచయిత జిల్లాబోర్డు సభ్యుడుగ

వున్నప్పుడు 1933లో మాధ్యమిక పాఠశాలకై ప్రయత్నించగా, ఆచార్యరంగా ప్రభృతులు, హైయ్యరు ఎలిమెంటరీ పాఠశాల వున్నదిగాన, అనవసరమని బీదసాదల విద్యాభివృద్ధికి ఆటంకకరమని చెప్పుటచే ఆ ప్రయత్నము విరమించుట జరిగినది. ఈ కాలములో ఈ గ్రామమున బోర్డు బాలుర, బాలికా పాఠశాలలో 700 విద్యార్థులుండి తాలూకాలో కెల్లా పెద్దదిగా నుండెను.

ఇటీవల తాలూకాలో పెక్కు మాధ్యమిక పాఠశాలలు నెలకొల్పబడుటచేతను, కాలపరిస్థితులు మారుట వల్లను 1946_8_24 తేదీన మాధ్యమిక పాఠశాల, గ్రామస్థులు పదియకరములభూమి, పదివేల రూపాయలు ఇచ్చే పద్ధతిని ప్రారంభింపబడెను. ఈ పాఠశాల ఆగస్టు ఆఖరు వారంలో ఆరంభించినా 250మంది విద్యార్థులు ప్రవేశించుట ప్రశంసార్హము. ఇంకను పెక్కుమంది విద్యార్థుల అప్లికేషనులు స్థల సంకోచముచే త్రోసివేయడమైనది. నేడు విద్యాతృష్ణ విశేషముగా నుండుటే దీనికి కారణము.

ఈ పాఠశాలలో ఈ గ్రామ విద్యార్థులు 180ఇతరులు 70 ఇందులో విద్యార్థినులసంఖ్య 50. ఇంత హెచ్చుసంఖ్య గల మాధ్యమిక పాఠశాలగాని, ఇంత బాలికల అధికసంఖ్య యీ జిల్లాలో ఆనాడు లేదు.

1947 సం॥న నాల్గవఫారమునకు, క్రమముగా తరువాత సంవత్సరములలో 5, 6 ఫారములు తెరచుటకు అంగీకారము పొందుట జరిగినది.

మూడు సంవత్సరములు అద్దెఇంటిలో నడుపబడిన ఈ పాఠశాల 1950వ సంవత్సరమున ధర్మ నోటకములో లక్ష రూపాయలతో నిర్మింపబడిన దివ్యమైన భవనమున 8తరగతు లుండుటకు అనువుగా శ్రీ గొట్టిపాటి బ్రహ్మయ్యగారు మున్నగు పెద్దలకృషి ఫలితముగా నిర్మింపబడినది. ఈ పాఠ శాల భవనమునకు గొట్టిపాటి బ్రహ్మయ్యగారు 20-8-48వ శంకుస్థాపన చేసిరి. వారి చేతనే ది 19-4-50వ తేదీన నూతన భవన ప్రారంభోత్సవము చేయబడెను. ఈ బిల్డింగు బాగా వుండగలందులకు గ్రామం తరఫున కంట్రాక్టు తీసుకొని సక్రమముగా త్వరలో నిర్మించిరి. పదియకరముల వైశాల్యము గల సువిశాలమైన ఈ ప్రదేశంలో ప్రశాంత వాతావరణ ములో ఇది క్రమాభివృద్ధి పొందుచున్నది.

రాయసం సుబ్బారావుగారు ప్రథమ ప్రధానోపా ధ్యాయులు, ఈ పాఠశాలోన్నతికి పాటుపడిరి. శ్రీ యన్.టి జి. రంగాచార్యులుగారు ఈ పాఠశాల ప్రధానోపాధ్యాయులుగా 7 సంవత్సరములుండి పాఠశాల పురోభివృద్ధికి అధిక కృషి చేయుటచేత పాఠశాల చరిత్రలో వీరి నామములు చిరస్మర ణీయములు.

ఈ పాఠశాల భవనము పదేసిగదులు చొప్పున రెండుగా నిర్మింపబడినను చాలనందున వేరే పాకలు వేయ వలసివచ్చినది. ఈ పాకల మరమ్మతుకు బోర్డువారు సహాయం చేయరు కనుక ఇందుకు చాలా ఇబ్బందిపడుట జరిగినది.

ఈ పరిస్థితులు ఇలావుండగా ఘంటసాలపాలెం కాపురస్థుడగు వేమూరి సుబ్బయ్యగారి కుమారుడు వెంకట్రామయ్యగారు వ్యాధిగ్రస్తులై తన జీవితకాలంలో ఉత్తమ ధర్మకార్యము చేయ నిశ్చయించుకొని తమ బంధువులగు తుమ్మల వెంకట్రామయ్య, గొట్టిపాటి బ్రహ్మయ్యగార్లతో సంప్రదించగా వారు ఉన్నతపాఠశాల భవనాభివృద్ధికే ఉపయోగించ సలహా ఇచ్చిరి. అంతట బ్రహ్మయ్యగారు కృష్ణాజిల్లా పరిషత్ ప్రెసిడెంటు మాగంటి అంకినీడు గారితో సంప్రదించగా ఇప్పటి భవనముపై నిర్మించే గదులకు అయ్యే ఖర్చులో సగం వెంకట్రామయ్యగారిచ్చే పద్ధతి అంగీకరించెదనని చెప్పిరి. ఆ విధముగానే అంగీకరించి అయిన మొత్తములో సగంవంతు రు 28,000/లు ఇచ్చిరి. ఈ ఉన్నత పాఠశాల భవనములపైన ప్రాసాదముల నిర్మాణమునకుగాను 1962. 8. 27న గొట్టిపాటి బ్రహ్మయ్య గారు ఎం.ఎల్.సి. గారు ఆంధ్రప్రదేశ కాంగ్రెసు సంఘాధ్యక్షులు, శ్రీ మాగంటి అంకినీడుగారు ఎం. పి. కృష్ణాజిల్లా పరిషత్ అధ్యక్షులు శంఖుస్థాపనలు చేసిరి. తూర్పు వైపు ప్రాసాదము వెంకట్రామయ్యగారి పేరునను, పడమటి ప్రసాదము ఆయన భార్య వెంకటరమణమ్మగారి పేరునను నిర్మాణము కాబడినవి.

వెంకట్రామయ్యగారు ఈ ధర్మకార్య నిర్వాహణము పూర్తికాక పూర్వమే కీర్తిశేషులైనప్పటికీ ఆయన భార్య, భర్త సంకల్పించిన కార్యము పూర్తిఅగుటకు దీక్షతో కృషి చేసి చరితార్థురాలగుట ప్రశంసనీయము.



మహాత్మా గాంధీ జిల్లాపరిషత్తు ఉన్నత పాఠశాల భవనములు.



కీ. శే. వేమూరి వెంకట్రామయ్యగారు

ఉన్నత పాఠశాల భవనానికి రు 28000/లు యిచ్చిన దాత.

ఈ ప్రాసాదములు వారి ధర్మ నిరతికి శాశ్వత చిహ్నములై ఇతర ధనవంతులకు ఒక ఉత్తమమార్గమును చూపుచున్నవి.

పాఠశాలలో బాలబాలికల సంఖ్య 450. అందు బాలికల సంఖ్య 150. ఈనాడు విద్యయొక్క అవసరాన్నేగాక, స్త్రీ విద్యావశ్యకతనుకూడా గుర్తించుట సంతసింప దగిన విషయం.

నేడు పాఠశాలలో నిరీక్షకులులేని పరీక్షలు నడుపుట, Watcherless examinations ఆదర్శతపాలా Honest post office కార్డులు కవరలు ఒకచోట వుంచెదరు. కావలసినవారు కావలసినవి తీసుకొని ఆ మొత్తాన్ని వుంచెదరు. యూరపులో కొన్నిచోట్ల, వార్తా పత్రికలుంచి వెళ్ళెదరు. పత్రికలు తీసుకొని, తీసుకొన్న వాటికి ఖరీదువుంచి వెళ్లెదరు. ఆ పద్ధతి రావాలి మనకు.

N. C. C. స్కౌటు మున్నగు క్రమశిక్షణ, శిక్షణప్రదేశమందేకాదు, జీవితములో అలవడాలి. పోలీసులుంటేనే మనకు 'క్యూ' నిలుస్తుంది.

The organised life of a nation is politics జాతిక్రమశిక్షణే రాజకీయాలు.

రాజకీయాలంటే రంగులు మార్చటంకాదు. క్రమశిక్షణలేని జాతివృద్ధి గాంచలేదు. కనుక ఉపాధ్యాయులు, విద్యార్థులు, ఇతరులు ఇది గమనించి, నిత్యజీవితంలో వర్తించినపుడే మన స్వరాజ్యం నిలుస్తుంది. సురాజ్యం వస్తుంది.

## తెలుగు విద్యార్థి

నేడు తెలుగువిద్యార్థి, వైజ్ఞానికమాసపత్రికగా అందచందాలతో, ఆకర్షణలతో సక్రమముగా ప్రకటింప బడుచు, విద్యారంగములో పేరుమిగిలి, తన పేరును సార్థక పరుచు కొనుచున్నందుకు ఆంధ్రులందరు హర్షిస్తున్నారు.

మనదేశంలో ఎన్నో పత్రికలు మఖలోపుట్టి పుబ్బలో గిట్టుచున్నవి.

ఇల్లుగట్టిచూడు, పెళ్ళిచేసిచూడు, అనే సామెతకు పత్రిక పెట్టిచూడు అనేమాటకూడ కలపాలి నేడు.

నేటికి తెలుగు విద్యార్థికి పదమూడు వసంతాలు గడిచినవి. చాలా రిష్టాలన్నీ తీరినవి. తన కాళ్ళమీద తాను నిలువగలుగుచున్నది.

ఎవరీ పత్రిక సంపాదకుడు? ఘంటసాలకు ఈ పత్రికకు సంబంధ మేమిటి ? అని ఎరిగిన వారెందరో లేరు.

ఈ పత్రిక సంపాదకుడగు కొల్లూరి కోటేశ్వరరావు గారు సామాన్య రైతుకుటుంబంలో ఘంటసాలకు రెండు మైళ్ళ దూరంలోగల కొత్తపల్లిలో జన్మించాడు. (8-10-1933)పువ్వు పుట్టగానే పరిమళించునుకద. ప్రాథమిక విద్య చదువుచున్నప్పుడే పత్రిక చదివి ఇతరులకు చెప్పు చుండేవాడు. రాజకీయాలపట్ల ఆసక్తి అధికంగా వుండేది. ఎక్కడ బహిరంగసభ జరిగినా ప్రత్యక్షమయ్యేవాడు ఆ ఉపన్యాసకులకు ఏవో ప్రశ్నలు పంపేవాడు.

ఘంటసాల మాధ్యమిక పాఠశాలలో చేరాలని అభి లాష కలిగింది. వెళ్ళేసరికి ప్రధానోపాధ్యాయుడు పాఠశాల ప్రారంభించి రెండు నెలలయినది. ఇప్పుడు చేర్చుకోనేది లేదన్నాడు.

విద్యాతృష్ణగల కుర్రవాడికి విఘ్నం కలిగేసరికి కన్నీ టితో బ్రహ్మయ్యగారింటికి చేరి నమస్కరించి జరిగినసంగతి చెప్పాడు కోటేశ్వరరావు. ఆయన చేరతీసి, ఉత్సాహపరచి, ప్రధానోపాధ్యాయునికి చీటి వ్రాసేసరికి ఆ హెడ్‌మాష్టరు పరీక్షించి చేర్చుకున్నాడు.

"ఆనాడు బ్రహ్మయ్యగారి రికమండేషన్ లేకపోతే నేడు నేను పత్రికా సంపాదకునిగా వుండే అవకాశం వుండేది కాదేమో! ఆనాడు ఆయన చేసిన ఆ మహోపకారమును జీవి తములో నేను మరువరానిది" అంటాడు కోటేశ్వరరావు గారు.

ఈయనకు కాంగ్రెసు ధోరణి మితవాద ధోరణిగా కనపడింది. అందుచేత సోషలిస్టుపార్టీ సిద్ధాంతాలపట్ల ఆద రాభిమానాలు కలిగి ఆ పార్టీ యీ ప్రాంతంలో నిర్మాణా నికి కృషి చేశాడు. 1952 జనరల్ ఎన్నికలలో ఒక సోషలిస్టు అభ్యర్థిని నిలబెట్టి, చదువు సంధ్యలు కట్టిపెట్టి రేయింబవళ్ళు ప్రచారం తిరగడంవల్ల స్కూల్ ఫైనలు పరీక్షలో తప్పాడు. 1955లో మరల చదివి ఉత్తీర్ణుడయ్యాడు.

"నా జీవిత మార్గాన్ని రాజకీయ బాటనుండి మరల్చి సాహిత్య ధోరణిలోనికి ప్రవేశపెట్టినవారు, మా ప్రధానోపా ధ్యాయులు, పితృతుల్యులు శ్రీ యస్. టి. జి. రంగాచా

ర్యులుగారు. పుట్టినది కొత్తపల్లి అయినా విద్యాబుద్ధులు సంతరించుకున్నది ఘంటసాలలోనే అనడానికి సందేహం లేదు. రాత్రింబవళ్ళు ఘంటసాలలోనే వుండేవాణ్ణి. భోజనానికి వెళ్ళి ఉదయం ఒకగంట, మరల సాయంత్రం ఒకగంట మాత్రమే వుండేవాణ్ణి.

'ఆ రోజులలోనే' సామ్యవాద సిద్ధాంత భావాలతో 'సమతా గేయాలు' అనే ఒక గేయ సంపుటిని తీసికొని రావడానికి రూపురేఖలు దిద్ది, ప్రచురణకు ప్రోత్సహించింది, మా హిందీ మాష్టరు చింతలపాటి లక్ష్మీనరసింహా శాస్త్రి గారు. అనంతరం విద్యార్థులకొరకు ఒక పత్రిక పెట్టాలనే సంకల్పం 1953 జనవరిలో కలిగినది. మిత్రులతో సంప్రదించగా, సహకరిస్తామని వాగ్దానం చేశారు.

'డిక్లరేషన్ తీసుకొని 1954లో బందరులో స్కూల్ ఫైనలు పరీక్షకువచ్చి పత్రిక ప్రారంభించాను.

'ఘంటసాల, ఘంటసాలపాలెం, కొత్తపల్లి, కోసూరు గ్రామాలలోని పెద్దలు నాపైవున్న ప్రేమతో చందాదారులుగా చేరి ప్రోత్సాహించారు. ఒక దేశమ్మకాకిగా రాజకీయాలలో తిరిగే వ్యక్తిని పత్రికా సంపాదకునిగా తీర్చిదిద్దిన ఘనత ఘంటసాల హైస్కూలుదే, అనడంలో అతిశయోక్తి లేదు,' అంటాడు కోటేశ్వరరావుగారు.

"పత్రికా నిర్వహణలో పడి ఉన్నతవిద్యకు స్వస్తి చెప్పిన నన్ను చూచి, నీవు పత్రిక యెంతబాగా నిర్వహించినప్పటికి 'నీవు డిగ్రీ తీసుకోకపోతే నీ పత్రిక రాణించదు' అని కనిపించినప్పుడల్లా (శ్రీ) గొట్టిపాటి బ్రహ్మయ్య, పండిత

శ్రీ గొర్రెపాటి వెంకటసుబ్బయ్యగార్ల హెచ్చరిక వలననే కళాశాలలో ప్రవేశించి, బి. ఎ. చదివి ఉత్తీర్ణుడను కాగలిగాను. తర్వాత ఎం. ఎ. డిగ్రికూడ తీసుకోవడానికి సంకల్పించాను. ఇన్ని విధముల ఘంటసాలలోని పెద్దలు, ఘంటసాల ఉన్నత పాఠశాల (1946_53) ఏడు సంవత్సరాల నా విద్యాభ్యాస కాలములో నా జీవితపథమునకు గట్టిపునాదులు వేయడము జరిగినది. అక్కడనుండే 1953 మే 1 వ తేదీన ప్రథమ సంచిక వెలువరించడము జరిగినది." అంటా డాయన.

ఎన్నో పత్రికలు విద్యార్థి లోకంకొరకు పుట్టినవి. కొన్ని పురిటిలోనే సంధికొట్టి పోయినవి. మరికొన్ని చాలా రిష్టములతో.

'తెలుగు విద్యార్థి' అన్ని అరిష్టాలను దాటి, అందరి అభిమాన పత్రికగా అలరారుచున్నదంటే అది కోటేశ్వరావుగారి ప్రతిభ.

ఆయన మంచి మాటకారి, సౌమ్యుడు, పెద్దల వాత్సల్యం పొందుటే భాగ్యంగా భావించువాడు. అందరకు తలలో నాలుకలాగు మెలగు మెలకువగలవాడు.

పత్రికా సంపాదకునికి కావలసిన అన్నిగుణాలు ఆయనలో వున్నవి.

ముక్కుపచ్చలారని దశలోవున్న కోటేశ్వరరావు ఒక కుగ్రామంనుండి, ప్రారంభించిన పత్రిక నేడు విద్యార్థిలోక ప్రశంసేగాక, విద్వల్లోక అభినందనలు అందుకొనటం భాగ్యం గాక మరేమిటి ?

తెలుగు విద్యార్థి, ఇతోధిక సేవ చేసి వర్ధిల్లుగాక !

## ఉత్పత్తి కొనుగోలుదార్ల సహకార సంఘం

భారతదేశం వ్యావసాయక దేశం. అందుచే అధిక సంఖ్య రైతాంగం. అధిక సంఖ్యేగాదు, నూటికి 80 మంది రైతాంగం. అన్నదాతలు వారే, అన్ని వృత్తులకు మూలం అదే. భారతదేశ భాగ్య భోగ్యములు వారిమీదనే ఆధార పడి యున్నవి. కృషీవలుని స్వేదబిందువే ఈశ్వరోద్దిష్టమైన ధనం. 'Sweat is devine currency' ఇదే అర్థశాస్త్రానికి మకుట ప్రాయమైన సూత్రమని అర్థశాస్త్రానికి ఆదిపురుషుడైన ఆడం స్మిత్ అన్నాడు. ఈ సత్యాన్నే 'నహిధాన్య సమోర్థనః' ధాన్యముతో సమానమైన ధనము లేదని సూత్రకారుడు పలి కాడు. అయినా కర్షకులకు సంఘంలో స్థానంలేదు. సాహి త్యంలో చోటులేదు. ప్రభుత్వంలో పలుకుబడిలేదు. అతనిని గురించి మొసలికన్నీరు కార్చేవా రనేకం. కాని యథార్థంగా కర్షకాభి వృద్ధికి పాటుపడు వారెందరున్నారు ? హితముగోరు వారు లేకున్నా ఇతడిని దోచనివాడు ఉన్నాడా ?

భారత రైతు అవిద్యావంతుడు. అమాయకుడు. అతని దారిద్ర్యానికి కారణం అతడు వ్యవసాయంలో చేసే లోటు వల్లకాదు. పండిన పంటను లాభసాటిగా అతడుఅమ్ము కొనలేడు. వ్యవసాయమంటే కేవలం పండించటమేకాదు, వర్తకంకూడా.ఇంతేగాక ప్రతిదీఅతను చిల్లరనుకొన్నిటోకుగా అమ్మును. అందుచే అతనికి అమ్మటలో అడివి, కొనుటలో కొరివి.

వివిధ దేశములలో రైతులు సహకారోద్యమంద్వారా సర్వవిధాలా బాగుపడుతుంటే, మనము అది అధిక ప్రయో-

జన కారిగా లేదు. ప్రభుత్వం వారి బ్యాంకులు రైతులకు అనుకూలంగా లేవు. రైతులు బ్యాంకుల వారి విధానానికి లోబడి వున్నారుగాని, రైతులకు కావలసిన బ్యాంకువిధానం ఏర్పడలేదు.

నేడు ఆహారం యొక్క అవసరం అందరకు తెలిసి వచ్చింది అందుచే అధికోత్పత్తి చేయుమని అందరు అంటు న్నారు. ఆ పంటలు పండించేవాని స్థితి అరసినవారు లేరు. వానిస్థితినిబట్టి పంటలు పండుతవి. దీనిని గురించి లోగడ కేంద్ర అసెంబ్లీలో జనాబ్ ఖాన్ అబ్దుల్ ఖానీ ఇట్లా అన్నాడు "ప్రభుత్వోద్యోగులు, విద్యాధికులు గమనించవలసింది మంటే, పంటలు పండించేది భారతదేశపు భూములు కావు, ఆ భూములు దున్నే వ్యవసాయదారుడు. అతని సంగతి అంద రము మరచిపోయాము అతని సమస్య పరిష్కారమైతే సర్వము పరిష్కారమగును."

ధరల నిర్ణయంలో ప్రభుత్వానికి కొనుగోలు దారులు దృష్టిలో వున్నారు కాని ఉత్పత్తిదారులు లేరు. రైతుపండిం చిన పంటకు గిట్టుబాటగు ధరలు నిర్ణయించేవారు లేరు. ప్రభుత్వం ధర పెరిగితే కంట్రోల్ చేస్తుందిగాని తగ్గినప్పుడు కంట్రోల్ చేయదు. ఇవన్నీ పరమ సత్యాలు.

రైతు నిత్యజీవితంలో కావలసిన వస్తువుల ధరలన్నీ అమితంగా పెరిగిపోయినవి. రైతులెంతగోల పెట్టినా కేంద్ర ప్రభుత్వం ధాన్యం ధరలు పెంచుటకు అంగీకరించుట లేదు. దళారీలు పొందేలాభం లేకుండా ఉత్పత్తిదారుడు కొనుగోలు దారుడు వ్యవహరించుకొనుటకు అనుకూలంగా ప్రకాశం

ప్రభుత్వం ఉత్పత్తి కౌనుగోలుదారుల సహకార సంఘాలను పెట్టింది. ఇది ఉభయులకు లాభప్రదమైనదే. దీనివల్ల సరియైన సరుకు సక్రమమైన ధరలకు లభించును. ఉభయ గోదావరి, కృష్ణా, గుంటూరు మండలాలలో ఇవి స్థాపింపబడి సక్రమముగా పనిచేసినవి. అట్లాగే ఇక్కడ పాలెం, కొత్తపల్లి, దేవరకోట, దాలిపర్రు, లంకపల్లి, చిలకలపూడి, రుద్రవరము గ్రామాలను చేర్చుకొని ప్రభుత్వోద్యోగుల ప్రమేయం లేకుండ నే బ్రహ్మయ్యగారు,ఆయన మిత్రబృందము ఎట్టి రసీదులు ఇవ్వకుండానే రెండు రోజులలో రు. 50 వేలు పోగుచేసి బ్రహ్మయ్యగారి పేరుతో ఆంధ్రాబ్యాంకులో కట్టారు. 1946-7-6 తారీఖున్ను ఈ సంఘం స్థాపించబడినది. దీనికి దోనేపూడి సీతారామయ్యగారు అధ్యక్షుడు. దీనిద్వారా ఆయన ప్రజాసేవ చేయగలడని, నమ్మకస్తుడని భావించి ఆయనను అందరూ ఏకగ్రీవముగా ఎన్నుకొన్నారు. ఆయన అహర్నిశలు కృషిచేసి ఆ సంఘాభివృద్ధికి పాటుపడ్డారు. వేయి బస్తాలు పెసలు కొన్నారు. దానివల్ల మంచిలాభం వచ్చింది. ఎరువులు, బండి పట్టాలు మొదలగు రైతుల కుపయోగపడునవి తెప్పించి రైతులకు ఆనాడు లభించని రోజులలో సరసమైన ధరలకు సప్లయి చేయబడినవి. ఈ సంఘాలు చాలా సక్రమంగా పనిచేసినవి. కాని ప్రకాశం మంత్రిత్వం పోయి రామస్వామి రెడ్డియార్ మంత్రిత్వం వచ్చినందున ప్రభుత్వ విధానంలో మార్పు వచ్చింది. ఈ సంఘాలు సరిగా ధాన్య సేకరణ చేయుటలేదని మిల్లర్లకు లైసెన్సులు ఇచ్చారు. అందు

వల్ల ఈ సంఘాలు ఎత్తివేయవలసి వచ్చింది. ఇవి కొద్దికాలం లోనే సంఘసభ్యులకు డివిడెండుకూడ పంచిపెట్టుట జరిగినది.

తిరిగి వాటిని నేటి పరిస్థితులకు అనుగుణ్యాంగా స్థాపించవలసిన అవసరం అధికంగా ఉన్నది

పాలఘాట్ ఛాంబర్ ఆఫ్ కామర్స్ వార్షికోత్సవంలో డాక్టరు అలగప్ప చెట్టియార్ అధ్యక్షోపన్యాసంలో యిలా అన్నారు: "ఆంధ్ర దేశంలోని డెల్టా జిల్లాలలో ప్రకాశంగారి ప్రియతమ సంస్థలైన ఉత్పత్తి కొనుగోలుదార్ల సహకార సంఘాలను ప్రస్తుత మంత్రులు తిరిగి తలెత్తకుండా పూడ్చిపెట్టి వర్తకులకు ఎంతో ఉపకారం చేశారు మాస్టరు మన్ నివేదిక ఇందుకు ఆధారం."

ప్రజల జీవితానికి రాజకీయానికి ముడిపెట్టగూడదు.

వినియోగదారుల సహకార సంఘాలకు రాష్ట్రముఖ్య మంత్రులు పూర్తి సహకార మివ్వాలని ప్రణాళికా సంఘం హెచ్చరించింది. కనుక ప్రభుత్వమువారు తిరిగి ఈ సహకార సంఘాలను స్థాపించి తోడ్పడవలసిన అవసరం అధికంగా వున్నది.

ప్రైవేటు వర్తకు లున్నంతవరకు కంట్రోల్ వస్తువు లేవీ, నిర్ణయించిన ధరలకు దొరకటం దుర్లభం.

ఎందుచేతనంటే వర్తకులు వర్తకులే. మంచి వర్తకులు చెడువర్తకులనేవారుండరు. వర్తకమంటేనే లాభసాటి బేరం. సక్రమంగా పంపిణీ చేయకపోవటం చేతనే వస్తువులు దొరకవు, వస్తువులు లేక కాదు. వారు దాచివేయటం వల్లనే

కొరత ఏర్పడుతున్నది. కనుక దేశం బాగుపడాలంటే మళ్ళా ఉత్పత్తి కొనుగోలుదారుల సహకార సంఘాలను స్థాపించాలి.

## ది. ఘంటసాల భూమి తనఖా బ్యాంకు లిమిటెడ్ ఎల్. బి. నెం. 3

భారతదేశంలో సహకారభూమి తనఖా బ్యాంకు పంజాబులోని ఝూంగ్ అనుచోట ఏర్పాటు కాబడింది.

1922లో ఆంధ్రదేశంలో మొట్టమొదటి భూమి తనఖా బ్యాంకు గుడ్లవల్లేరులో స్థాపించారు. అందుకు ముఖ్య కారకులు డాక్టర్ భోగరాజు పట్టాభి సీతారామయ్య, గుడ్లవల్లేటి వెంకటరత్నం పంతులు, వల్లూరి సూర్యనారాయణ రావు గారలు.

ప్రత్యేకంగా భూమి తనఖా బ్యాంకుల చట్టం అవిభక్త మదరాసు రాష్ట్రానికి 1934లో వచ్చింది. దానికిముఖ్య కారకులు మోచర్ల రామచంద్రరావు పంతులు, వేమవరపు రామదాసు పంతులు, కూర్మా వెంకటరెడ్డి నాయుడుగారలు వగైరాలు. మొట్టమొదటి కేంద్ర భూమి తనఖాబ్యాంకు మదరాసులో 1930లో ఏర్పడింది. దానికి ప్రథమ అధ్యక్షుడు మోచర్ల రామచంద్రరావు పంతులుగారు.

1937_4_26 న చినకళ్లేపల్లిలో దివితాలూకా తృతీయ రైతు మహాజనసభ కల్లూరి చంద్రమౌళిగారి అధ్యక్షతను జరిపినపుడు, దీర్ఘవాయిదా అప్పులకై మొస్టేటులో భూమి తనఖాబ్యాంకు ఒకటి అవసరమని తీర్మానము చేయబడినది.

అప్పటినుండి యెస్టేటులో ఒకదానిని యేర్పాటు చేయుటకు గొట్టిపాటి బ్రహ్మయ్యగారు చాలా కృషి చేస్తున్నాడు. కల్లూరి చంద్రమౌళిగారు ఈ బ్యాంకు స్థాపనకు తోడ్పడినందులకు అభినందనీయులు.

ఈ బ్యాంకునకు సంబంధించిన గ్రామాలు.

దివి, వల్లమన్నాడు, గుడ్లవల్లేరు, ఉయ్యూరు సహకార భూమి తనఖా బ్యాంకులకు సంబంధించిన గ్రామాలు.

(1) దివి:- (1) వేములపల్లి (2) తాడేపల్లి (3) శ్రీకాకుళం (5) కొడాలి (6) తెలుగురావు పాలెం (7) చిన కళ్ళేపల్లి (8) కూడపాడు (9) వక్కలగడ్డ (10) కూచిపూడి (11) చిలకలపూడి (12) రుద్రవరం (13) బోళ్ళపాడు (14) దేవరకోట (15) కొత్త పల్లి (16) కొండవరం (17) మంత్రిపాలెం (18) ఘంటసాల పాలెం.

(2) వల్లమన్నాడు:- (1) ఘంటసాల (2) మల్లంపల్లి (3) రామన్నపేట (4) యండకుదురు (5) పూషడం (6) చిట్టూరు (7) లంకపల్లి (8) దాలిపర్రు (9) వేములమడ (10) కోసూరు (11) పాలంకిపాడు (12) పెద ముత్తేవి (13) కాజ (14) మద్దిపట్ల

(3) గుడ్లవల్లేరు :- (1) అవురుపూడి (2) చినముత్తేవి (3) పెడసనగల్లు (4) అయ్యంకి (5) భట్ల పెనుమర్రు.

(4) ఉయ్యూరు :_ (1) యద్దనపూడి (2) పెదపూడి (3) బొర్లపూడి (4) మొవ్వ.

ఛీఫ్ ప్రమోటరు_శ్రీ దోనేపూడి సీతారామయ్యగారు.

28_5_62 తేదీన సహకారభూమి తనఖా బ్యాంకుల డిప్యూటీ రిజిష్ట్రారు (విజయవాడ) గారిచే రిజిష్టరు చేయబడినది.

ప్రారంభంలో

| షేరు ధనం | మెంబర్లు |
|---|---|
| 5000 | 49 |

మహాజనసభ 9_6_62

శ్రీ దోనేపూడి సీతారామయ్యగారి అధ్యక్షతను మహాజన సభ సమావేశమై ఈ దిగువ డైరెక్టర్లను ఏకగ్రీవంగా ఎన్నుకొనినారు.

(1) దోనేపూడి సీతారామయ్యగారు (ఘంటసాల)
(2) శ్రీ మండవ వెంకటబసవకుటుంబరావుగారు (మొవ్వ)
(3) శ్రీ గుత్తికొండ వెంకటేశ్వరరావుగారు (చినకళ్లేపల్లి)
(4) శ్రీ యార్లగడ్డ వెంకటకృష్ణారావుగారు (పెదసనగల్లు)
(5) శ్రీ వెనిగళ్ళ అప్పారావుగారు (రుద్రవరం)
(6) శ్రీ కామినేని వెంకటగంగారావుగారు (పెదముత్తేని)
(7) శ్రీ యడ్లపాటి రమణయ్యగారు (దాలిపర్రు)
(8) శ్రీ దాసరి నాగయ్యగారు (వక్కలగడ్డ)
(9) శ్రీ గొట్టిపాటి వీరరాఘవేంద్రరావుగారు (ఘంటసాల)

## డైరెక్టర్ల సమావేశము 9-6-62

శ్రీ దోనేపూడి సీతారామయ్యగారి అధ్యక్షతన డైరెక్టర్లు సమావేశమై ఈ దిగువ కార్యనిర్వాహక వర్గమును ఏకగ్రీవంగా ఎన్నుకొనిరి.

శ్రీ గొట్టిపాటి వీరరాఘవేంద్రరావుగారు ప్రెసిడెంటు
శ్రీ మండవ వెంకటబసవకుటుంబరావుగారు వైస్‌ప్రెసిడెంటు
శ్రీ గుత్తికొండ వెంకటేశ్వరరావుగారు శెక్రటరీ
శ్రీ దోనేపూడి సీతారామయ్యగారు ట్రెజరరు.

ది 31-12-64వ తేదీన వేమూరి వెంకటేశ్వర్లు గారిని Presiding officer గా ఎన్నుకొనగా వారి అధ్యక్షతన మహాజనసభ సమావేశము అయి యీ దిగువ డైరెక్టర్లను పోటీ లేకుండా ఏకగ్రీవముగా ఎన్నుకొనటమైనది.

1. శ్రీ యడ్లపాటి రమణయ్యగారు (దాలిపర్రు)
2. శ్రీ దోనేపూడి సీతారామయ్యగారు (ఘంటసాల)
3. శ్రీ దాసరి నాగయ్యగారు (వక్కలగడ్డ)
4. శ్రీ యార్లగడ్డ రామారావుగారు (మొవ్వ)
5. శ్రీ పోతుల వెంకటపూర్ణబ్రహ్మరామశాస్త్రిలు గారు (చినముత్తేవి)
6. శ్రీ యనిగళ్ళ అప్పారావుగారు (రుద్రవరం)
7. శ్రీ తాతా తాతయ్యగారు (కాజ)
8. శ్రీ గొట్టిపాటి వీరరాఘవేంద్రరావుగారు (ఘంటసాల)
9. శ్రీ తుమ్మల వెంకటరత్నంగారు (ఘంటసాల పాలెం)

ది 31_12_64 డైరెక్టర్ల సమావేశము

శ్రీ యార్లగడ్డ రామారావుగారి అధ్యక్షతన సమావేశమై యీ దిగువ కార్యనిర్వాహక వర్గమును ఏకగ్రీవముగా ఎన్నుకొనిరి.

శ్రీ గొట్టిపాటి వీరరాఘవేంద్రరావుగారు ప్రెసిడెంటు
శ్రీ తుమ్మల వెంకటరత్నంగారు వైస్ ప్రెసిడెంటు
శ్రీ దోనేపూడి సీతారామయ్యగారు ట్రెజరరు

ది 30_6_65 నాటికి యీ బ్యాంకులో 470 మంది "ఎ" తరగతి మెంబర్లును, 705 మంది "బి" తరగతి మెంబర్లును గలరు.

"ఎ" తరగతి మెంబర్ల షేరు ధనం రు 69,980/ "బి" తరగతి మెంబర్ల షేరు ధనం రు 705/ లును గలదు. ఈ బ్యాంకు కేంద్రభూమి తనఖా బ్యాంకునకు రు 10,47,207_36లు చెల్లించవలసి వున్నది. అందుకు మించు వలె నెం. 308 అప్పులక్రింద రు 10,58,534_32 బ్యాంకు మెంబర్ల వద్దనుండి రావలసి వున్నది.

ఈ బ్యాంకు కేంద్రభూమి తనఖా బ్యాంకునకు వాయిదా మీరకుండ చెల్లించవలసిన వాయిదా మొత్తం అంతయూ చెల్లించినది. మెంబర్ల వద్దనుండికూడ ఈ బ్యాంకునకు వాయిదామీరిన బాకీలు ఏమియులేదు. ఇంకను 156 అప్పు దరఖాస్తుల క్రింద రు 6,19,500/లు బ్యాంకులో నిల్వ వున్నవి. ఈ బ్యాంకునకు 1964_65 సం॥లో రు 6,552_27లు నికర లాభం వచ్చినది.



గొట్టిపాటి వీర రాఘవేంద్రరావుగారు

| మెంబర్లు. | నేటికి షేరు ధనం. | బట్వాడా అయిన మొత్తం | నిల్వ దరఖాస్తుల మొత్తం |
|---|---|---|---|
| 470 | రు 69,480/ | రు 10,68,584-32 | రు6,19,500/ |

ఆంధ్రదేశంలోనేగాక, భారతదేశములో ఏలూరు భూమి తనఖాబ్యాంకు, ఆదర్శమైనదిగా ఖ్యాతిగాంచినది.

కలగర నాగభూషణం చౌదరి, మాగంటి సీతారామదాసు గారలు మొదలగు అనుభవజ్ఞులు, పలుకుబడిగలవారలు అధ్యక్షులుగను, సేవాధర్మముతో బ్యాంకి అభివృద్ధికి జీవితాన్ని అంకితమిచ్చిన వేగుంట రామబ్రహ్మంగారు కార్యదర్శి అగుటే కారణము.

మనదేశములో సంఘము, సంఘముగా పనిచేయదు. ఎవరో ఒకరు దానికి అర్పించుకొంటేనే అది అభివృద్ధి పొందేది.

దీని నాదర్శముగా పెట్టుకొని అందరు పనిచేయుట అవసరము.

గొట్టిపాటి వీరరాఘవేంద్రరావు గారికి కావలసినంత వంశప్రతిష్ఠ కలదు. ఆయన బ్యాంకు ప్రెసిడెంటేగాక, ఆంధ్రప్రదేశ భూమి తనఖాబ్యాంకు కార్యనిర్వాహక సభ్యుడు. పైగా పట్టభద్రుడు.

అందువల్ల స్వీయశక్తి సామర్థ్యాలను పలుకుబడిని ఉపయోగించుకొని, దీని అభ్యుదయమే తన అభ్యుదయముగా భావించి, ఇతోధిక కృషి చేసి, సహకార రంగములో ప్రసిద్ధి పొందుగాక !

## మహిళా సంఘము

గొర్రెపాటి శకుంతలాదేవిగారు శారదానికేతనమున చదువుకొని వచ్చిన పిమ్మట మహిళా సంఘములో చేరి పని చేస్తూ వచ్చినది.

దానిని పురస్కరించుకొని ఈ గ్రామములోకూడ ఒక మహిళా సంఘమును స్థాపించవలెనని ఈమెకు, గొర్రెపాటి మహాలక్ష్మమ్మగారికి సంకల్పము కలిగినది.

ఆ కాలములో కృష్ణాజిల్లా మహిళా సంఘాధ్యక్షురాలగు వల్లభనేని సీతామహాలక్ష్మమ్మ గారిని రావించి, ఆమె అధ్యక్షతను ఒక సభచేసి, మహిళాసంఘావశ్యకతను బోధించి గొర్రెపాటి లీలాకృష్ణయ్యగారి భార్య బాపనమ్మ గారు ప్రెసిడెంటుగా సంఘమును స్థాపించిరి.

పక్షమున కొకసారి మహిళలు సమావేశమై, ఉపన్యాసములు జరుగుచుండెడివి. అప్పుడప్పుడు సీతామహాలక్ష్మమ్మ గారు కూడ వచ్చి ఉపన్యాసము లిచ్చుచుండెడిది. ఇటుల కొంతకాలము గడచినది.

**1946_4_15** న మహాత్మాగాంధీ విగ్రహమును ప్రతిష్ఠించవలయునని సంకల్పముతో ఈ గ్రామమహిళలు, స్త్రీల వద్దనే సేకరించి, శ్రీ జలధీశ్వరాలయము వెలుపలనున్న బహిరంగ స్థలములో స్థాపించిరి.

గొర్రెపాటి సీతారామయ్యగారి భార్య తులశమ్మ గారు కస్తూరిబాయి విగ్రహమును గాంధీజీ విగ్రహము ప్రక్కనే ప్రతిష్ఠింపచేసినది.

# కృష్ణాజిల్లా రాష్ట్ర మహిళాసభలు.

కూర్చున్నవారు ఎడమనుండి కుడికి: 1. గొర్రెపాటి మహాలక్ష్మమ్మ. 2. గోగినేని భారతీదేవి. 3. కె. లక్ష్మీరఘురామ్. 4. కడప రామసుబ్బమ్మ. 5. లక్ష్మీరెడ్డి. 6. పిన్నమనేని లింగయ్య గారి భార్య. 7. సూర్యదేవర అన్నపూర్ణమ్మగారు. 8. ఈడుపుగంటి రత్నమాంబ. 9 సూరపనేని మనోరమగార్లు.

పైన నిలబడినవారు: ఎడమనుండి కుడికి: గొర్రెపాటి లక్ష్మీకాంతమ్మ. వేమూరి సరోజమ్మ. గొర్రెపాటి సరస్వతమ్మ. సూరపనేని నవరత్నం. అయ్యదేవర మాలతీదేవి. చివరకొండపల్లి యశోదమ్మగారలు.

ఆ పైన ఎడమనుండి కుడికి: గొర్రెపాటి తులశమ్మ. దోనేపూడి ద్రౌపతమ్మ. దామలూరి లక్ష్మీశ్వరమ్మ. వేమూరి ప్రసన్నమ్మ. ఎనిగళ్ళ వెంకటరత్నమ్మ. దోనేపూడి సీతామహాలక్ష్మమ్మ. వేమూరి చంద్రావతమ్మగారలు.

క్రింది కూర్చున్నవారు. ఆహ్వానసంఘ కార్యదర్శులు. వరుచూరి అన్నపూర్ణమ్మగారు. గొర్రెపాటి సుగుణకుమారిగారు. ఇంకను వాలంటీర్లలో లీల. (వేమూరి పేరయ్యగారి కుమార్తె)ను ఇంకా గ్రామములోగల బాలికలను చూడవచ్చును.



కృష్ణాజిల్లా రాష్ట్రీ మహిళా సభలు.

ఈ రెండు పర్యాయములు ఈ గ్రామమహిళలు ఊరేగింపుతో వచ్చి, భక్తిశ్రద్ధలతో వారిని పూజించుట జరుగుటే గాక, కొందరప్పుడప్పుడు వచ్చి పుష్పమాల లర్పించి, టెంకాయలు కొట్టుదురు.

తర్వాత 1955లో కృష్ణాజిల్లా, ఆంధ్రరాష్ట్ర మహిళా సభలు జరుపుటకు మహిళా సంఘములో చాలా కాలము నుండి పనిచేయుచున్న సూరపనేని మనోరమాదేవిగారి ప్రోత్సాహముచే ఏర్పాటు కాబడినవి.

దీనికి గొర్రెపాటి మహాలక్ష్మి, యీ సరస్వతమ్మ, యీ లక్ష్మీకాంతమ్మ, వేమూరి చంద్రమ్మ, యీ సరోజినీ దేవి, దోనేపూడి లక్ష్మీకాంతమ్మ, కొండపల్లి యశోదమ్మ గారలు మొదలగు మహిళలు చందాలు వసూలు చేసిరి.

అనంతరము ఆహ్వాన సంఘాధ్యక్షురాలుగ గొర్రెపాటి మహాలక్ష్మమ్మ, ఉపాధ్యక్షురాలుగ గొర్రెపాటి సరస్వతమ్మ, గొర్రెపాటి సుగుణకుమారి, పరుచూరి అన్నపూర్ణమ్మలు కార్యదర్శులుగను, వేమూరి చంద్రమ్మ కోశాధ్యక్షురాలుగను ఎన్నుకోబడిరి. వేమూరి సరోజినీదేవి, దోనేపూడి సీతామహాలక్ష్మమ్మ, యీ ద్రౌపదమ్మ, దావులూరి లక్ష్మీశ్వరమ్మ, గొర్రెపాటి లక్ష్మీకాంతమ్మ, యీ తులశమ్మగారలు సహాయకులుగా వుండి తోడ్పడిరి.

కృష్ణాజిల్లా మహిళాసభ 1953-4-4 న జరిగినది. ఆహ్వాన సంఘాధ్యక్షురాలు గొర్రెపాటి మహాలక్ష్మమ్మ, ఆహ్వానోపన్యాసమున వచ్చినవారికి సుస్వాగతము పలికెను.

అనంతరం శ్రీమతి భారతీదేవిగారు అధ్యక్షతవహించి తన మృదుమధురోపన్యాసముచే సభ్యులను పులకాంకితులను చేసెను.

మరునాడు ఆంధ్రరాష్ట్ర మహిళాసభ జరిగెను. పెక్కుండ్రు మహిళా మణులు వచ్చిరి. ఈడుగంటి రత్నమాంబ, శ్రీమతి సూర్యదేవర అన్నపూర్ణమ్మ, కడప రామసుబ్బమ్మ, కె. వి. లక్ష్మీరెడ్డిగారలు మొదలగువారు వచ్చిరి. దీనికి శ్రీమతి కొత్త లక్ష్మీరఘురామ్‌గారు అధ్యక్షత వహించిరి.

ఈ గ్రామ మహిళా మండలి 1963_8_3న కూచిపూడి సమితి అధ్యక్షులు మండవ వెంకటేశ్వరరావుగారిచే పునః ప్రారంభోత్సవము జరుపబడినది. 51 సభ్యురాండ్రు గల ఈ మహిళామండలికి శ్రీమతి గొర్రెపాటి మహాలక్ష్మమ్మ అధ్యక్షురాలుగను, వేమూరి ప్రఫుల్లాదేవి ఉపాధ్యక్షురాలుగను, శ్రీమతి అట్లూరి విజయలక్ష్మి కార్యదర్శిగను, శ్రీమతి అయినపూడి సీతామహేశ్వరి సహాయ కార్యదర్శిగను, గొర్రెపాటి కరుణ కోశాధికారిగను ఎన్నుకోబడిరి.

63_10_2 న ఈ మండలి తరఫున కుట్టుమిషన్ తెప్పించి టీచరును ఏర్పాటుచేసి 20మంది మహిళలకు కుట్టు శిక్షణ యిప్పించడమైనది.

## మహిళా ఆధ్యాత్మిక జ్ఞానసమాజము

"పదువన్నెత్తురు పూరుషుల్బలెన్ శాస్త్రంబుల్ పఠింపించుచో
నదమన్నెత్తురు శత్రుసేనల ధనుర్వ్యాపారముల్ నేర్పుచో
ముదితోత్సాహముతోడ నేలగలరీ యుర్విన్ ప్రతిష్ఠించుచో
ముదితల్ నేరగ రానివిద్య గలదే ముద్దార నేర్పించినన్"

— చిలకమర్తి.

భరతఖండమున పురుషులలో కవులు, గాయకులు, యోగులు, తత్వవేత్తలు, భక్తులు, వీరులు మొదలగువారు ఉద్భవించినటులనే స్త్రీలలోను జన్మించిరి. మన వేద పురాణేతిహాసములనుండి ఇందులకనేక నిదర్శనము లున్నవి.

ఋగ్వేదమునందు విదుషీమణులుగా అనేక స్త్రీలు పేర్కొనబడిరి. గార్గి, మైత్రేయి, ఘోషాదేవి, వాగ్దేవి, లోపాముద్ర, మమత, అపాల, సూర్య, ఇంద్రాణి, విశ్వవీర, శశి మొదలగు వారెందరో గలరు.

అటులనే మధ్యయుగమున అనేక విదుషీమణులు; భారతీదేవి, లీలావతి, ఖానా, సంగమిత్ర,హరివిద్యాలంకారి, వైజయంతి మొదలగువారు అవతరించిరి.

స్త్రీలలో ఆధ్యాత్మికజ్ఞాన మభివృద్ధి గాంచినగాని దేశము బాగుపడదని తలచి 1955-12-1 ఈ ఆధ్యాత్మిక జ్ఞానసమాజమును చిన్నరామదాసుచే (తాడేపల్లి ఆశ్రమ వాసులు) ప్రారంభింపబడి, విద్యానందస్వామి, కమిలీబాబాల సలహాలతోను, ఉపన్యాసములతోను పెంపొందుచు అవిచ్ఛిన్నముగ సాగుచున్నది. నిత్యము దైవపూజ దీపారాధన

జరుగుచుండును. రు 2500/లు స్వయముగా చందాలు వసూలు చేసి దీనిని పేరు ఒకస్వంత భవనమును ఏర్పాటు చేసుకొనిరి.

1956న గీతాజయంతి జయప్రదముగ జరిగినది.

1957 ఏప్రియల్ నెలలో శ్రీ మళయాళ స్వామివారిని ఈ సమాజ భవనమునకు ఆహ్వానించి, వారి ఉపన్యాసామృతమును గ్రోలిరి.

శ్రీ జలధీశ్వరాలయము ముందు బహిరంగసభయేర్పాటు చేసి, స్వాములవారిచే ఉపన్యాసము ఇప్పించిరి.

బందరు గాంధీమహాత్ముడు వచ్చినపుడు గొర్రెపాటి బ్రహ్మయ్యగారు మళయాళస్వామి వారిని యెరుకపరచిరి. ఆనాటి నుండి మళయాళ స్వాములగారు ఖద్దరుధారులు,

ఈ పరిచయాన్ని పురస్కరించుకొని బ్రహ్మయ్యగారు స్వాములవారిని దర్శించి, వారికి కానుకలర్పించి, బహిరంగ సభలో పాల్గొని, స్వాములవారినిరప్పించి, అందరకు వేదాంత ఉపన్యాసము లిప్పించి, భక్తి ప్రవృత్తులను కలుగజేసినందులకు సమాజమువారిని, మళయాళ స్వాములవారిని అభినందించెను.

అప్పుడప్పుడు విద్యానంద స్వాములవారు విచ్చేసిన సందర్భములోను బహిరంగసభలు ఏర్పాటు చేయబడును.

ఇటుల ఈ సమాజమువారు గీతాజయంతులు, చాతుర్మాస వ్రతములు జరుపుచు ఆధ్యాత్మికజ్ఞాన ప్రబోధము చేయుచుందురు.

ఇటీవల విమలానంద స్వాములవారు వచ్చినప్పుడును బహిరంగోపన్యాసము లిప్పించిరి.

1966న మతమతాంతర సభలు ఈ సమాజమువారు కమలీబాబాగారి ఆధ్వర్యమున గావించిరి.

ఈ సమాజమువారు పర్వదినములలో ఉపవాసము లుండి, ఉపన్యాసములు, భజనలు ఆశ్రమములో జరుపు కొందురు.

ఏ ఆధ్యాత్మికవేత్తవచ్చినా ఆదరించి వారిచే ఉపన్యాసము లిప్పించెదరు.

ఇటుల వీరు ఆధ్యాత్మిక జ్ఞాన ప్రచారము చేయు చుందురు.

ఒక సమాజము సక్రమముగ నెరవేరవలెనన్న ఎందరి తోడ్పాటో అవసరము

మహిళలు ఒక సమాజమును స్థాపించుకొని సక్రమముగ నెరవేర్చుకొనుట ప్రశంసనీయము.

తల్లే ప్రధమగురువు, ఇల్లే ప్రధమ పాఠశాల. కనుక మహిళల అభివృద్ధే దేశాభివృద్ధి. ఈ సమాజమునకు గొర్రెపాటి సీతామహాలక్ష్మమ్మగారు ప్రాణము. దీనికి అండ దండగవున్న వారిలో కంఠంనేని లక్ష్మీకాంతమ్మగారు మొదలగు వారెందరో గలరు.

## ఘంటసాల వర్తకసంఘం

ఈ గ్రామములోని వైశ్యులంతా ఐకమత్యంగావుండి వ్యాపారం చేసుకొనుటకు ఈ సంఘాన్ని 1961 5. 1 స్థాపించిరి.

ఈ సంఘనిబంధనల ప్రకారం ప్రతిఆదివారము చిల్లర దుకాణములు బట్టలషాపులు మూయబడుబచున్నవి.

ప్రతి ఆదివారం పాడి ఎవరో ఒకరు తీసుకున్నవారు మాత్రం దుకాణాన్ని తీసి వుంచుదురు.

సంకా సాంబశివరావుగారు ప్రెసిడెంటు.
వేముల హనుమంతరావుగారు వైసుప్రెసిడెంటు.
గెల్లి రాధాకృష్ణమూర్తిగారు శెక్రటరి.
గెల్లి రామారావుగారు సహాయకార్యదర్శి.

## ప్రభుత్వ విత్తన ఉత్పత్తి క్షేత్రము

ఇటీవల వ్యవసాయ శాస్త్రజ్ఞులు సాధించిన గొప్ప విజయం మిశ్రమ జాతి విత్తనములను రూపొందించటం. ఈ విత్తనాలు రసాయనిక ఎరువులకు అనుకూలమైనవి. పంటలు మిశ్రమజాతిగా వుండును. పంటరాలుబడి బాగా వుండును.

మిశ్రమ మొక్క-జొన్న, జొన్న సంగతి అందరకు తెలిసినదేగద. అవియెంతో బాగాపండుచు ఆశ్చర్య చకితులను చేస్తున్నవి. ఇవి అమెరికానుంచి వచ్చిన విత్తనాలు. అలాగే వడ్లలోను వస్తున్నవి.

ఈ శతాబ్దారంభంలో రసాయనిక యెరువులు యెలా వ్యవసాయంలో విప్లవాన్ని తీసుకొని వచ్చినవో, అలాగే ఇప్పుడు విత్తనాలు ఈ రంగంలో అంతగొప్ప మార్పు తీసుకొస్తున్నవి.

మానవులు నేడు, ఒకరికొకరు పరాయివాళ్ళుగా వుండలేరు. నేడు ప్రపంచంలో ఎక్కడ ఏది జరిగినా సరే, తెలుసుకోక అజ్ఞానంగా వుండలేడు. అందుచేత పరాయితనం అన్నది అడుగంటింది.

అమెరికావారి ద్వారా మన వ్యవసాయ రంగంలో నేడు అనేక మార్పులు వస్తూవుండటం ముదావహం. వారు మనకెంతో తోడ్పడుతున్నారు. వ్యవసాయానికి అమెరికా వారి లక్ష్యం స్వయం సమృద్ధి.

ఈ గ్రామమున ప్రభుత్వ విత్తనాభివృద్ధి క్షేత్రము 1959 సంవత్సరమున ప్రారంభింపబడినది. దీని విస్తీర్ణము 76 ఎకరములు.

ఈ క్షేత్రము యొక్క ప్రధానోద్దేశము మేలురకపు విత్తనములను ఉత్పత్తి చేసి జిల్లాయందలి వివిధ సమితుల ద్వారా రైతులకు అందజేయుట.

ప్రస్తుతము M. T. U 3. S. L. O 13. G. E. B. 24 అను మూడు మేలురకపు విత్తనములను ఉత్పత్తి చేయుచున్నారు.

ఈ విత్తన ఉత్పత్తి క్షేత్రమునకే గాక, యీ వృత్తి విద్యా వ్యవసాయ పాఠశాలకు ధర్మగోటకములో 30 యకరముల భూమి మెరక పైరకుగాను యివ్వబడినది.

## వృత్తి విద్యా వ్యవసాయ పాఠశాల

(Vocational Agricultural school)

ఆంధ్ర ప్రదేశ్ ప్రభుత్వము వ్యవసాయ శాఖవారి ఉత్తరువు నెం 2440 తేదీ 27-11-1963 ప్రకారము ఇక్కడ

వృత్తి విద్యా వ్యవసాయ పాఠశాలను స్థాపించుట జరిగినది.

వ్యవసాయము మీదనే ఆధారపడుటకు నిర్ణయించుకొనిన యువరైతులకు దేశములో ముఖ్యవృత్తి అయిన వ్యవసాయమునకు సంబంధించిన శాస్త్రీయ పద్ధతులను బోధించుటయే ఈ పాఠశాలయొక్క ప్రధానోద్దేశము.

ఈ పాఠశాలయందు ఒక సంవత్సరకాలముపాటు శిక్షణ ఇవ్వబడును. ఇందు (1) వ్యవసాయము. (2) పశుపోషణ (3) గ్రామీణ పరిశ్రమలు (4) సహకార సంఘములు (5) ప్రజారోగ్యము మొదలగు విషయములను బోధించెదరు.

ప్రతి సంవత్సరము 25 మంది విద్యార్థులను చేర్చుకొనుట జరుగుచున్నది. శిక్షణ కాలమందు ప్రతి విద్యార్థికి నెః కి రు. 50/- లచొప్పున స్టైఫండు ఇవ్వబడుచున్నది.

ప్రథమముగా ది. 20-5-1964 నుండి ఈ పాఠశాలలో విద్యార్థులు చేర్చుకొనబడిరి. అనగా ఒక బ్యాచీ విద్యార్థులు తమ శిక్షణాకాలమును పూర్తి చేసిరి.

రెండవ బ్యాచీ విద్యార్థులను ది.1-5-1965న చేర్చుకొనడమైనది.

పాఠశాల ఉపాధ్యాయులు

1. ఫారం సూపరింటెండెంటు—(గెజిటెడ్)

2. వ్యవసాయ బోధకులు—2

3. పశుపోషణ బోధకుడు—1

ఇటువంటి పాఠశాల ఆవశ్యకతను గురించి దివి తాలూకా రైతుతృతీయ సభలో ఇలా తీర్మానించబడినది. 'కనీసం జిల్లా కొకటియైననూ వ్యవసాయ పాఠశాల ప్రత్యేకముగనుండి, వ్యవసాయ విషయక శాస్త్రజ్ఞానమును అనుభవమును పొందుటకు అవసరమైన వసతు లేర్పడ వలయునని ఈ సభవారభిప్రాయ పడుచున్నారు.'

1937లో చేసిన తీర్మానము యిప్పటికైనాఅమలులోనికి వచ్చినందుకు సంతసింపవలెను.

ఇప్పుడు భారతదేశంలో అమెరికావారి సహాయ సంపత్తివలన వ్యవసాయ విశ్వవిద్యాలయాలు యేర్పడినవి. తదనుగుణ్యంగానే మన ఆంధ్రప్రదేశ్ లో ఒకటి రాజేంద్ర నగరులో యేర్పడినది.

దానికి అనుబంధముగా ఈ పాఠశాల నెలకొల్పబడినది. దీనిలో రైతు యువకులు విశేషంగాచేరి ప్రయోజనం పొందుదురు గాక !

## ప్రాంతీయ పశుగణాభివృద్ధి ఉపకేంద్రము

మనదేశము వ్యావసాయక దేశము. పశుగణమే మన వ్యవసాయమునకు మనకును ఆధారము.

ఈ పశుగణాభి వృద్ధికై ప్రభుత్వమువారు అనేక కేంద్రములను, ఉపకేంద్రములను స్థాపించిరి.

మొవ్వ ప్రాంతీయ పశుగణాభివృద్ధి కేంద్రమునకు అనుగుణంగా ఇక్కడ ది8-5-65న ఒక ఉపకేంద్రమును స్థాపించుట జరిగినది.

## దీని ముఖ్య ఉద్దేశములు

1. జాతిలేని నాటు ఆ బోతులను, దున్నపోతులను విత్తులు నొక్కి వేయుట.

2. పశు అభివృద్ధికి కృత్రిమ పశుసంపర్క విధానమును అవలంబించుట.

3. పశువులను ఆధునిక పద్ధతులలో పెంపొందించు విధానమును వ్యాప్తి నొందించుట.

5. రైతులందరిని సహకార సంఘములలో జేర్చి పాలు పెరుగు వెన్న మొదలగు పదార్థములకు సక్రమమైన వ్యాపారపద్ధతుల నేర్పరచుట.

5. పశువులలో గొడ్డుమోతు తనమునకుగల కారణములను కనుగొని తగువైద్యము చేయుట.

6 పశువులకు, కోళ్ళకు వచ్చు అంటు వ్యాధులకు ముందుగా టీకాలు వేయుట.

7. పశువులకు వచ్చు వ్యాధులకు చికిత్స చేయుట.

8. పశువులకు చూలు పరీక్ష చేసి తగిన చికిత్స నిచ్చుట.

## కృత్రిమ పశుసంపర్కము

ఎదలోనున్న ఆవు (గేదె)కు పోషక పదార్థములతో కలసిన వీర్యమును గాజుగొట్టముతో యోనిలోనికి ఎక్కించుటయే కృత్రిమ సంపర్కము. ఒకసారి తీసిన వీర్యమును 100 అంతకుపైగా ఆవు (గేదె)లకు ఉపయోగింప వచ్చును.

ప్రతి అంశములోను పారిశుద్ధత మొదలగు వానికి అత్యంత ప్రధాన్యత నిచ్చుట వలన దూడలు బాగుగా నిలచి మంచి సంతతి కలుగుచున్నది.

## వీర్యము తీయుట, నిల్వచేయుట

ఆబోతు దాటునపుడు కృత్రిమ యోని సహాయముతో వీర్యము గాజు గొట్టములోనికి తీయబడును. ఈ వీర్యమును వివిధరకములుగా పరీక్షచేసి గుణ నిర్ణయము చేయబడును. తదుపరి దీనికి ఇతర పోషక పదార్థములను 10నుండి 30 రెట్ల వరకు కలిపి రెఫ్రిజరేటరులోగాని ఐస్‌లోగాని నిల్వచేయబడును. ఈ విధముగ కనీసము రెండురోజులు నిల్వచేయవచ్చును.

## లాభములు

1. శ్రేష్ఠమైన ఒకే ఆబోతుచే ఫలింప జేయుబడగల ఆవుల సంఖ్యను మిగుల హెచ్చించుట.

2. జాతి విలువలేని పోతులను ఏరివేయుట ద్వారా మేలుజాతి పశుగణాభివృద్ధి.

3. సైజు, వయస్సు భేదములను పాటింప నక్కరలేకయే ఒకసారి తీసిన ఇంద్రియంతో మొదలోనున్న ఎక్కువ పశువులను కట్టించి సంపర్కముద్వారా వ్యాపించి వ్యాధులను అరికట్టుట.

4. ఒకే పొర్లుతో కట్టించు సదవకాసమును కల్పించుట.

5. ఆవు (గేదె)ను పోతువద్దకు తీసుకొనిపోవు శ్రమ లేకుండుట.

7. ఆబోతులను మితముగ నుపయోగించి వాని జీవితకాలమును పొడిగించి పశుసంపదను అభివృద్ధి పరచుట.

8. ఆర్థికముగా రైతునకు మిగులలాభము.

పశుగణాభివృద్ధి

1. రైతులకు సగము రేటుకు మినరల్ మిక్చర్ సప్లయి చేయుట.

2. పాడి పశువుల ఆహార పథకము క్రింద ప్రపంచ ఆహార పథకమువారిచే నొసంగబడిన ముడి ఆహారపు గింజలతో దేశవాళీ ఆహారపు పదార్థములు కలిపి కృష్ణాజిల్లా బుద్ధవరం గ్రామమందున్న మిశ్రమ ఆహార కర్మాగారమునందు తయారుచేయబడిన అత్యధిక శక్తి నొసగు సమీకృత పశుపోషక ఆహారమును తగ్గింపు రేటుకు సప్లయి చేయుట.

3. కాఫ్‌సబ్సిడీ Calf subsidy పథకం ద్వారా ఈ గ్రామములోని రెండు మేలు జాతి పెయ్యదూడలకు నెలకు రు. 10/- చొ॥న వీటికి 6 నెలల వయస్సునుండి మూడవ సంవత్సరం వరకు సబ్సిడి నిచ్చుటద్వారా రైతులను ప్రోత్సాహ పరచుట.

4. సంవత్సరమునకు ఒకసారి పశు ప్రదర్శనము, మరియు పాలపోటీల నేర్పాటుచేసి రు. 300/- నుండి రు. 400/-ల విలువగల బహుమతులను పంచిపెట్టుట ద్వారా రైతుల నుత్సాహపరచుట.

5. సబ్సిడీ రేటుకు రైతులకు పాలకాన్‌లను సప్లయి చేయబడినవి.

6. పశుశాలను ఆధునికముగా అభివృద్ధి చేయుటకు రు. 200/ల గ్రాంటు నిచ్చుట.

## పాల సరఫరా కేంద్రము

ప్రపంచంలో మనము అయిదవ వంతున్నాము.

ప్రపంచ పశుగణములో మన దేశములో మూడవ వంతున్నది.

మనకు పశువు లెక్కువే. ఇవికూడ మన రైతులకు బాధాకరమే.

మన పశు సంఖ్యకు తగిన పాలు మనకు లభించుట లేదు.

దీనికి మన మతదృక్పథమే కారణము.

ప్రపంచంలో అందరు పశుజాతిని వృద్ధిపరచుకొని బాగుపడుచుంటే మనం గోరక్షణశాలల స్థాపించి, గోవధ నివారణకు కృషి చేస్తున్నాము.

పశువులు మనకొరకా? మనం పశువుల కొరకా ?

మనము పశుగణాన్ని లాభదృష్టితో పెంచుకొని వాటి వల్ల ప్రయోజనం పొందాలి.

వాటికి పుష్టికరమైన మేత వేసి, అధికంగా పాలిచ్చే జాతిని పెంచుకోవాలి.

అమెరికావారు ఈ విషయంలో మనకు తోడ్పడుచున్నారు.

పాలు సంపూర్ణాహారం. వెన్న, జున్ను మొదలైనవాటి నెక్కువగా వుపయోగించే కెనడా, న్యూజిలాండు, అమెరికా, ఆస్ట్రేలియా, యూరపులలోని ప్రజల సగటాయుర్దాయం 75 సంవత్సరాలైతే, మనదేశ ప్రజలజీవితం మొత్తం మీద 23 సంవత్సరాలు. నేడు కొంత పెరిగిందంటున్నారు. అయినా వారి ఆయుర్దాయంలో సగం వంతే.

గోపూజ మినహా గోగణాన్ని పెంచుకొని వృద్ధిపొందుదామనే ఆలోచన మనకు లేదు. ఉత్తమజాతి గేదెలను, ఆవులను అభివృద్ధి చేయగలందులకు; వేడినీళ్ళకు చన్నీళ్ళు తోడన్నట్లు ప్రభుత్వంవారు ఈ పాలసరఫరా కేంద్రాలను ఏర్పాటుచేశారు. బీదరైతులు ఆవులు, గేదెలు కొనుక్కొని, పాలద్వారా కాస్త ప్రయోజనం పొందుటకు ప్రభుత్వంవారు ఋణసహాయాన్ని కూడా చేస్తారు.

ఈ ఉద్దేశంతో పాలసరఫరా కేంద్రాన్ని ఇక్కడ 1966_5_2న స్థాపించారు.

కేవలం పిల్లలనోట గడ్డకొట్టి అమ్ముకొనక, తాము అనుభవించగా మిగిలినవి అమ్ముకొనటం మంచిది. లేకపోతే రోగాలకు దారితీస్తుంది.

పాలకు గేదెలు ఉత్తమం, ఢిల్లీ ముర్రాజాతిగాని, దాని సంకరంగాని మేలు.

ఆవు జాతిలో జార్సిజాతి సాంప్రదాయం ఉత్తమం. ఒంగోలు జాతి మంచి అందమైనది. వ్యవసాయానికి బాగా పనికివస్తుంది. ఈ జాతిలోను కొన్ని మంచిపాలిచ్చేవి లేకపోలేదు.

మంచి పశుజాతిని వృద్ధిపరచుకొని పాలు పొంగినట్లు వృద్ధి పొందెదము గాక! పాడితో పంట ఓపదు.

కసవే బసవన్న. మేపే రూపు.

## కోళ్ళ పెంపకము

కోళ్ళ పెంపకము ప్రతివారికిని అందుబాటులోనున్న పరిశ్రమ. మన దేశము కోళ్ళ పెంపకములో చాలా వెనుక బడి ఉన్నది. పాశ్చాత్య దేశాలలో అత్యున్నతాభివృద్ధిని చెందుటేగాక ఒక లాభసాటి వృత్తిగా వున్నది.

కోళ్ళను పెంచితే అనేక ప్రయోజనాలు పొందవచ్చును. గ్రుడ్లు తినడానికి ఉపయోగించవచ్చును. గ్రుడ్లలో పుష్టికరమయిన ప్రొటీన్లు (మాంసకృత్తులు) ఉంటాయి. కోడి మాంసము కూడా ఆహారంగా ఉపయోగించవచ్చును. ఈ రెండును ఎంతో బలవర్ధకమైన ఆహారములు. ఆరోగ్యరక్షణకు అత్యావసరమైన విటమినులు, ఖనిజములు, మాంసకృత్తులు గ్రుడ్లలో గల పోషక పదార్థముల శాతము ఇతర ఆహార పదార్థములతో పోల్చిచూచిన ఈ క్రింది విధముగా నున్నది.

| గ్రుడ్లు | పాలు | మాంసము | గోధుమలు |
|---|---|---|---|
| 93 | 85 | 69 | 67 |

గ్రుడ్లు అందరకు అందుబాటులో నున్న ఆహారము. కాబట్టి ప్రతిదినము కనీసము ఒక గ్రుడ్డన్నా తినవలెను. కాని మనదేశములో సంవత్సరమునకు సగటున మనిషి ఒక్కింటికి 50 గ్రుడ్లు మాత్రమే తినుచున్నారు. అమెరికా, యింగ్లండు ఆస్ట్రేలియా దేశాలలో సగటున సాలునకు ఒక్కొక్కరు

400 గ్రుడ్లు తినుచున్నారు. మన ఆహార సమస్యను, ఆరోగ్య సమస్యను పరిష్కరించవలెనన్న ఈ పరిశ్రమను పెంపొందించుట అత్యావసరము.

కోళ్ళను స్వేచ్ఛగా తిరుగనివ్వడంవల్ల వాటికి వ్యాధులు సంక్రమించే అవకాశా లున్నాయి. అందుకని కోళ్ళను గదులలో పెంచే విధానం "డీప్‌లిట్టర్ పద్ధతి" (చీకుడు పెంట పద్ధతి అనికూడా అంటారు) ప్రస్తుతము అమలులో ఉన్నది.

3 వందల చదరపు అడుగుల వైశాల్యముగల ఒక గదిలో 6 అంగుళాల నుండి 9 అంగుళాల మందాన వరిపూక పరుస్తారు. దీన్ని 9 మాసాల వరకూ కదిలించవలసిన అవసరం లేదు. కోళ్ళు 24 గంటలూ ఈ గదిలోనే ఉంటాయి. ఇక్కడే తింటాయి. యిక్కడే పడుకొంటాయి. ఈ గదిలో 100 కోళ్ళను పెంచవచ్చును. "డీప్‌లిట్టర్" పద్ధతిలో కనక 20 కోళ్ళను పెంచితే వాటివల్ల వచ్చే ఎరువు రైతుకు అర ఎకరం వరిపొలానికి గాని, పావు ఎకరం కాయగూరల తోటకుగాని అవసరం అయిన దానికంటే ఎక్కువగానే సరిపోతుంది.

కోళ్ళజాతులు :— పాశ్చాత్య దేశాలనుండి దిగుమతి చేయబడి స్థానిక పరిస్థితులకు అలవడిన మేలురకపు జాతులున్నవి. ఇది మనదేశీయ కోళ్ళకన్న సైజులోను, అండోత్పత్తిలోను చాలా ఉన్నతమైనవి. ఇవి సాలునకు దాదాపు 200నుండి 250వరకు పెద్దసైజు గ్రుడ్లు పెట్టును. వీటికిగాను

తెల్ల తోళ్ళాకారి (White leghorns) ఎఱ్ఱబొంత (Ruoge Island Reds) కోళ్ళు జనసమ్మతముగా నున్నవి.

శాకాహారపు గ్రుడ్లుగలవు. వీటిలో ప్రాణం ఉండదు. పుంజుతో సంపర్కం లేకుండా ఉండే పెట్టలు ఇలాంటి గ్రుడ్లు పెడతాయి. అవి చాలారోజులవరకు చెడిపోకుండా ఉంటాయి. జీవహింస యనునది లేక శాకాహారులు కూడా వాడ వచ్చును.

విదేశ పుస్తకాలనుంచి కొంతజ్ఞానం సంపాదించి వాటి నన్నిటిని సమన్వయ పర్చి ది 9_7 65వ తేదీన "గ్రేస్‌పౌల్ట్రి ఫారం" అనే పేరుతో 30 ' X 12' వి స్తీర్ణములో ఆధునికమైన "డీప్‌లిట్టర్" పద్ధతిలో ప్రారంభించడమైనది. ఇందు 25 వైట్ లెగ్ హారన్, 35 రోజ్ ఐలాండ్ రెడ్స్ (గ్రుడ్లు పెట్టునవి), 100 R. I. R· పిల్లలను ఆధునిక ఆహారపద్ధతులతో పోషించుట జరుగుచున్నది. మొవ్వ సమితి ఏరియాలోని అన్ని గ్రామములకు మేలుజాతికోళ్ళ విస్తరణకై సబ్సిడీ రేటుమీద గ్రామసేవకుల ద్వారా యిచటి గ్రుడ్లను సప్లయి చేయుచున్నారు. 1965_66 సంవత్సరమునకు మొవ్వ సమితివారు కోళ్ళ పెంపకమునకు గాను రు 600/లు గ్రాంటును యీ గ్రేస్ పౌల్ట్రి ఫారమునకు మంజూరు చేసియున్నారు. దీనంతటికి తగిన పరిశుభ్రత, ముఖ్యమైన శ్రద్ధ వహించి యుండి, ప్రభుత్వముయొక్క సహాకారముకూడా వున్నట్లయిన కోళ్ళ పెంపకము లాభదాయకమైన వృత్తియే నని ఈ ఫారమ్ మేనేజరైన బి. జి. వి. ప్రకాశరావుగారు ఋజువుచేయుచున్నారు.

కోడిగ్రుడ్డు చాలా పుష్టికరమైన ఆహారమని అందరికీ తెలుసు. కనుక గ్రుడ్డును ఆహారంగా స్వీకరించే వారంతా, ఎవరి పెరటిలో వారు తమ కవసరమయిన కూరగాయలను కాయించుకోవడానికి ప్రయత్నించినట్లే తమ దొడ్లో కొద్ది కోళ్ళను పెంచితే తమ అవసరాలు తీరుతాయి. ఇంట్లో యిల్లాలుగాని, పిల్లలుగాని ఎవరయినా సరే కోళ్ళ ఆలనా పాలనా సులభంగా చూచుకోవచ్చు. అసలు ఆహారంమాట అటుంచి కోళ్ళ పెంపకం ఎంత సరదాగా వుంటుందనీ! కొంచెం శ్రద్ధ వహిస్తే, జాతికోళ్ళను పెంచి "వేన్నీళ్ళకు చన్నీళ్ళగా నాలుగు డబ్బులుకూడా చేసుకోవచ్చును!

గ్రామములలో ప్రైవేటు వ్యక్తులచే ఆధునిక పద్ధతులతో నడపబడు కోళ్ళ పరిశ్రమలు చాలా తక్కువ. ఈ 'గ్రేస్ పౌల్ట్రి' ఆదర్శవంతముగ నడుపబడుచున్నందునను, చూచుటకు ఆహ్లాదకరమేగాక లాభదాయకముగా నున్నందున వాటి లాభమును గుర్తించి కోళ్ళ పరిశ్రమయందు ఉత్సాహము కనబరచి అభిమానులందరు తమ కనుగుణ్యముగా ఈ పరిశ్రమను అభివృద్ధిచేయుదురు గాక!

కోళ్ళను అమితంగా చంపే వ్యాధులలో కోళ్ళ పేల జ్వరం ఒకటి ప్రతి సంవత్సరం ఈ జ్వరం ఎన్నో కోళ్ళను చంపుతున్నది. ఇటువంటి దారుణమైన దానినుండి కోళ్ళను రక్షించటానికి 'వేక్సిన్' ఒక దానిని పంజాబు వ్యవసాయ విశ్వవిద్యాలయం వారు కనిపెట్టారు. దీనిని వాడిన ఒక సంవత్సరం వరకు ఆ వ్యాధి రాదు. దీనివల్ల ఇతర ఇబ్బంది ఏమీ వుండదు.

జపానులో కోడిని బీదల ఆవు అంటారు. కోళ్ళను అధికంగా పెంచిన కోటిలాభాలు పొందవచ్చును.

## గ్రామాధికారులు

రాజులు రాజ్యాలుమారినా కరణాలు వంశపారంపర్యంగా ఉంటూవుండేవారు. 1803 లో కరణం రెగ్యులేషన్ పుట్టిందని పాఠకులకు విదితమే.

ఈ గ్రామములో ఘంటసాల రామయ్యగారు తద్రీత్యా ప్రథమ కరణంగా నియమింపబడ్డారు. అనంతరం ఘంటసాల బాపిరాజు రిజిష్టర్డు కరణంగా కనబడతారు. బాలకృష్ణమ్మగారికి సమకాలికుడైన కరణం తారక బ్రహ్మంగారు మినహా అంతకుముందు విశేషాలు వివరంగా తెలియవు.

1910కి పూర్వం ఘంటసాల, దేవరకోట, బొళ్ళపాడు ఈ మూడు గ్రామాలకు ముగ్గురు కరణాలు సమిష్టిగా వుండేవారు. ఘంటసాల పున్నయ్య, యీ పెదపేర్రాజు, యీ రత్తం.

వీరి దరిమిలా వీరి కుమారులు ఘంటసాల నరసింహాం, యీ సీతారామయ్య, యీ సుబ్రహ్మణ్యం సమిష్టిగా కరణీకం చేసేవారు.

1910లో ప్రత్యేక అరేంజిమెంటు జరిగి ప్రతివూరికి కరణములను విడివిడిగా ఏర్పాటుచేయడం జరిగింది. సదరు అరేంజిమెంటులో ఘంటసాలకు, ఘంటసాల నరసింహాం, దేవరకోటకు యీ సీతారామయ్య, బొళ్ళపాడుకు యీసుబ్రహ్మణ్యంగారలను కరణములుగా నియమించడం జరిగినది.

వీరిని (శ్రీ) చల్లపల్లి రాజాగారు నామినేషన్ చేయగా బందరు డిప్యూటీ కలెక్టరుచే అంగీకరించడమైనది. కరణములను ఏర్పాటుచేసే హక్కు, దీర్ఘకాలపు శలవులు ఇచ్చే హక్కు జమీందారుగారి చేతులలో వుండేవి. 1932 వరకు ఘంటసాల నరసింహంగారు చేసియుండిరి. వీరి అనంతరం వీరి కుమార్డు రామారావుగారు చేయుచున్నారు.

హిందూ రాజులకాలంలో ప్రతి గ్రామమునకు పెదరెడ్డి లేక పెదకాపు అనే ముఖ్య పరిపాలకులు ఒకరు వుండేవారు. మహమ్మదీయుల పరిపాలనా కాలమందు వీరు పటేలుగాను ఆంగ్లేయుల కాలంలో మునసబుగాను మార్పు చెందినారు.

1816 లో మునసబి ఏర్పాటు జరిగినట్లు తెలియుచున్నది. గొర్రెపాటి సుబ్బయ్యగారు మొదటి మునసబు. ఈయన కాలంలోనే బందరులో ప్రసిద్ధ వర్తకులగు పిళ్ళారిశెట్టివారితో స్నేహ మేర్పడినది. ఈయన అనంతరం వీరి తమ్ముడు చంచయ్యగారు మునసబి చేశారు. చంచయ్యగారి అనంతరం వారి మూడవకుమారుడు వెంకయ్యగారు. ఈయన తర్వాత ప్రఖ్యాతుడైన బాలకృష్ణమ్మగారు. అటు పిమ్మట ఆయన జ్యేష్ఠకుమారుడు వెంకట నరసింహంగారు. ఈయన అనంతరం ఈయన కుమారుడు లీలా కృష్ణయ్యగారు.

# సాంఘిక చరిత్ర

## భూ మి క

సాంఘిక చరిత్రంటే రాజకీయాలతో సంబంధం లేనిదని అనుకుంటారు కొందరు. రాజకీయాలతో సంబంధం లేకపోతే సాంఘిక చరిత్ర వుండనే వుండదు. చాలామంది దేశ చరిత్రకారులు సాంఘిక సంబంధాలు విస్మరించి వ్రాశారు. దానివల్ల ఏమీలాభంలేదు. ఇవిరెండూ ప్రయోజనంలేని పద్ధతులు. నేడొక నూతన పద్ధతి వచ్చినది. ఆర్థికమునకు అధిక ప్రాముఖ్యమిస్తూన్నందున సాంఘిక చరిత్ర కరతలామలకంకాగలదు. సాంఘికపరిస్థితులననుసరించే ఆర్థికపరిస్థితులు ఏర్పడుతవి అట్లాగే సాంఘికపరిస్థితులనుబట్టి రాజకీయపరిస్థితులేర్పడతవి. అలాగే రాజకీయాల ప్రభావాలవల్ల సాంఘిక మార్పులు వస్తవి. కనుక సాంఘిక చరిత్ర లేనిదే, ఆర్థిక చరిత్ర శూన్యం; రాజకీయ చరిత్ర తెలియదు.

కాని సాంఘిక చరిత్ర ఆర్థిక రాజకీయ చరిత్రలకు అను బంధాన్ని మాత్రమే చెప్పదు. అదితన విశిష్టమార్గాన్ని విశదం చేస్తుంది. పూర్వకాలంలో ప్రజల నిత్య జీవితమెలాంటిది? ఏకులము ఎలా జీవించిందో, వారికి ఇతరులకుగల అనుబంధాలు, సాంఘిక సంబంధాలనుకూడా చెప్పుతుంది. ఇంతే కాదు, వారి కుటుంబచరిత్ర, గృహజీవితము వారెలా పని చేశారో, ఎలా ఆనందించారో, ప్రకృతికి వారికిగల సంబంధం. ప్రతికాలంలోను సంస్కృతి వీనినుండి ఆవిర్భవించి మతాన్ని,

సంగీత సాహిత్యాలను, శిల్పాన్ని, విద్యని, ఆలోచనా విధానాన్ని మారుస్తుంది.

సాంఘిక చరిత్ర వ్రాయటం చాలాకష్టం. లభించిన కొద్ది ఆ ధారాలను పట్టుకొని అల్లుకుని రావాలి. సత్య సమ్మతమైన జ్ఞానతృష్ణ, ఉత్తమ నాగరికత లక్షణములు సాంఘిక చరిత్రకు దోహదం చేస్తుంది. సరైనచరిత్ర చదువుతూంటే భూతకాలం వర్తమానంగానే తోస్తుంది.

స్త్రీల చరిత్రే అనగా స్త్రీలయెడల పురుషుల దృష్టే మానవ చరిత్ర అన్నారొకరు.

'భావగమనచరిత్రే మానవచరిత్ర, భావాలు మినహాయిస్తే మానవజాతికి ప్రత్యేకంగా చరిత్రంటూ ఏమీ లేదంటూ, మానవజాతి చరిత్రంటే తత్వశాస్త్ర చరిత్రే' అన్నాడు హెగెల్.

దానిని త్రిప్పి, ఆర్థిక చరిత్ర మానవజాతి చరిత్ర అన్నాడు మార్క్స్.

'చరిత్రగతిని నిర్ణయించేది, మానవుల ఆలోచనలు గావు, మహా పురుషుల కార్యకలాపాలుకావు. సమాజంలోని ఆర్థికవిధానం మారితే సంఘం మారుతుంది.

'ఆర్థిక విధానాన్ని బట్టి, రాజకీయాలు, న్యాయ చట్టాలు, మతం, విద్యావిధానం మొదలైనవన్నీ పరస్పరాధారంగా ఏర్పడును. సమాజంలోని ఉత్పత్తి విధానాన్ననుసరించి, సామాజిక వ్యవస్థ నిర్మింపబడుతుంది. మానవుని జీవనం ఆనాటి ఉత్పత్తివిధానంమీాద ఆధారపడి వుంటుంది." మార్క్స్.

ఒకనాడు చరిత్రఅంటే రాజుల చరిత్రగా పరిగణింప బడినది.

అనంతరం మహాపురుషుల చరిత్ర, చరిత్రగా గుర్తింప బడినది.

కాని నేడు సాంఘిక చరిత్ర చరిత్రగా యెన్నబడు చున్నది.

అందుచేత పాశ్చాత్యులు సాంఘిక చరిత్రకు అధిక ప్రాధాన్యమిస్తున్నారు.

మన తెలుగులో ఆంధ్రుల సాంఘిక చరిత్ర వ్రాసిన శ్రీ. శే. సురవరము ప్రతాపరెడ్డిగారు సాంఘిక చరిత్రంటే ఇలా వ్రాశారు.

"సాంఘిక చరిత్రలు మనకుపూర్తిగా సంబంధించి నట్టివి. అవి మన పూర్వుల చరిత్రను మనకు తెలుపును. మన తాతముత్తాత లెట్టివారై యుండిరో, మన అవ్వలు ఎట్టి సొమ్ములు దాల్చిరో, యెట్టి అలంకరణములతో నుండిరో, మనపూర్వులే దేవతలను గొలిచిరో, ఏ విశ్వాసములను గలిగియుండిరో, ఏ యాట పాటలతో వినోదించిరో, దొంగలు, దొరలు దోపిడీలు చేసినప్పుడు, క్షామాదీతి బాధలు కలిగినప్పు డెటుల రక్షణము చేసుకొనిరో, జాడ్యాలకే చికిత్సలు పొందిరో, ఎట్టి కళలందు ప్రీతికల వారై యుండిరో, ఏయే దేశాలతో వ్యాపారాలు చేసిరో, యివన్నీ తెలుసుకొనవలెనని మనకు కుతూహాలముండును. అదే విధముగా మన తరమునుగురించి ముందువచ్చువారు తెలుసుకొన

నభిలషింతురు. తేలిన సారాంశ మేమన సాంఘిక చరిత్రమన చరిత్రయే! మనముకూడ చరిత్ర కెక్కదగినవారమే!

'సాంఘిక చరిత్ర మానవచరిత్ర– ప్రజల చరిత్ర. అది మన సొంతకథ' అది జనుల జీవమును ప్రతి శతాబ్దమందెట్లుండెనో తెలుపునట్టిది. అది మన తాత ముత్తాతల చరిత్ర! వారియిండ్లు, వారికట్టు, వారితిండి, వారి ఆటలుపాటలు, వారు పడిన పాటులు, వారు మనకిచ్చిపోయిన మంచిచెడ్డలు, ఇవన్నీ తెలిపి మనకు సహాయపడును.

'రాజుల చరిత్ర వ్రాయుట కష్టముకాదు. కాని సాంఘిక చరిత్రవ్రాయుట కష్టము. దీని కాధారములు తక్కువ.'

రెడ్డిగారొక బాటవేసి పథ ప్రదర్శకులైనందుకు పూజనీయులు.

వారి మార్గానే పోవాలని ఆశ. అయితే ఆసక్తేగాని, శక్తి లేదు.

అయినా పెద్దలవల్ల విన్నది, ఇతరగ్రంథాలవల్ల, ఏదో ఒక విధముగా వ్రాయ తలచాను. మిత్రుడు వేమూరి వెంకట్రామయ్యగారు వ్రాయాలని పట్టుపట్టారు, తప్పిందికాదు.

ఏమీ లేకుండా వుండేకన్నా, ఏదో ఒకటి వుండటం మంచిదిగదా అని యెంచి వ్రాశాను.

మనము మతరీత్యా నాలుగు యుగాలున్నవని వింటున్నాము. ధర్మబద్ధమైన కృతయుగమునుండి క్రమముగా పత

నము చెందుతూ ఘోరమైన పాపపు కలియుగములోకి వచ్చి నామని మతరీత్యా చెప్పూట వింటున్నాము.

అర్థశాస్త్రజ్ఞులు ఏమంటున్నారో గమనించటం అవసరం. మృగయాయుగం, పశుపాల్యాయుగం, వ్యవసాయ యుగం, పారిశ్రామికయుగం అని నాలుగు యుగాలు చెప్పి, మానవ క్రమాభివృద్ధిని చెప్పేరు.

యూరపు, అమెరికా మొదలగు ఖండాలు సైన్సును అభివృద్ధి చేసుకొని, యంత్రాలను నిర్మించుకొని, పరిశ్రమలలో అభివృద్ధి గాంచినవి. వారు పారిశ్రామిక యుగంలో వున్నారు.

మనం వ్యవసాయంమీద ఆధారపడి, వారికంటె వెనుకబడియున్నాం. కొద్దిగా పరిశ్రమలు నెలకొల్పకపోలేదు. ఇది యంత్రయుగం. యంత్రాలవల్ల మన చేతిపనులన్నీ నాశనమైనందున మనం బీదస్థితిలో వున్నాం.

ఈ సంగతి గ్రహించక ఈనాడుకూడ వ్యవసాయాన్ని, చేతిపనులను, వస్తుమార్పిడినీ, స్వయంపోషకత్వాన్ని గొప్పగా భావించి, అది అవసరమనేవారు మనలో లేకపోలేదు. వారు కాలజ్ఞాన తత్వాన్ని తెలియని అభివృద్ధి నిరోధకులు. మారెడి కాలపరిస్థితులనుబట్టి మనం మారాలి గాని, కాలాన్ని మారమంటే మారుతుందా ?

మానవసంఘాన్ని వ్యవసాయం ప్రథమంగా మార్చింది. తర్వాత పారిశ్రామిక విప్లవం.

ఇవి రెండూ సాంఘిక జీవితంలో మానవుడు కని విని యెనుగనంత మార్పులు తెచ్చినవి.

పరిశ్రమ అంటే పని. చేతితో చేసేపని యంత్రాల ద్వారా చేయటం విప్లవం. పారిశ్రామిక విప్లవం సైన్సు ద్వారా వచ్చింది.

ఇదివరకంతా స్వభావజన్యంగా నడిచేదని, అంతా ఈశ్వరమయం అనుకున్నారు.

ఇప్పుడు సైన్సుద్వారా ఇదివరకు అనుకొన్నవి కొన్ని ఊహాగానాలని తెలిసిపోయింది.

ఈ పరిశోధనలన్నీ ప్రయోగాత్మకాలు. అందుచేత పూర్వ ప్రపంచంవేరు, ఆధునిక ప్రపంచం వేరు.

పారిశ్రామిక విప్లవంవల్ల మానవకోటిలో విపరీతమైన మార్పులు వచ్చినవి. వేరే పనిలేక వ్యవసాయాన్ని అంటుకొని వున్నవారు పరిశ్రమలకు పోయారు.

ప్రస్తుతకాలమున, కాలమును, స్థలమును అద్భుత విధమున లోబరచుకోగలుగు రైలు మార్గములు, బస్సులు, నావలు, విమానములు, టెలిగ్రాఫులు, టెలిఫోనులు, వార్తా సహాయ యంత్రములు, అచ్చు యంత్రములు భావ వినిమయము అన్నీ లోకమునంతటిని ఒక ఇంటివలె చేసినవి. పరివర్తనానికి కారణమైనవి.

యాన సౌకర్యాలు,సౌలభ్యాలు లేక మనము స్థాణువు స్థితిలో వుంటిమి.

గత ముప్పైనలభై ఏళ్ళనుంచి మన సంఘం స్థాణు దశనుంచి చలనస్థితికి వచ్చింది.

విడిపోతున్న రెండు సంస్కృతులు

వ్యవసాయ నాగరికత ఒకచోట అంటిపెట్టుకొని కూర్చుండ నిచ్చేది.

పారిశ్రామిక నాగరికత ఒకచోట వుండనివ్వదు. ఇది కులాన్నిబట్టిగాక వృత్తినిబట్టి వుంటుంది.

వ్యవసాయ నాగరికత ఆనందింపజేసేది. పారిశ్రామిక నాగరికత ఆలోచింపజేసేది. అది కళ, ఇది శాస్త్రము. ఒకటి విశ్వాసానికి సంబంధించింది. మరొకటి హేతువాదానికి సంబంధించింది.

జాతి వికాసం పొందనప్పుడు కవిత్వము, వికాసము చెందినపుడు విజ్ఞానము.

19 శతాబ్దము వరకు మన సాంఘిక స్థితులు ప్రధానముగా కులము కుటుంబము, స్వయంసంపూర్ణ గ్రామ వ్యవస్థ ఆధారముగా గలవి.

19 శతాబ్దం చివరిభాగంనుండి అది పోసాగింది. ఇరవయ్యో శతాబ్దంలో విశేషించి ముప్ఫైఏళ్ళలో వూహించలేనంతగా మారిపోయింది. దీనికి పైన చెప్పిన కారణాలే.

సంప్రదాయం మానవుడిని మతైక పశువుగా మార్చుతుంది.

మార్పుల కనుగుణంగా సంప్రదాయాన్ని ఛేదించటానికి, విజ్ఞానశాస్త్రం (సైన్సు) శాస్త్రీయ దృక్పథంమాత్రమే తోడ్పడగలవు.

ఆధునికం అంటే యంత్రంకాదు. పారిశ్రామికీకరణ

వలన కొత్తరీతులు ఏర్పడ్డాయి. మానవునిలో చలనం కలిగింది. నవ్యత్వానికిది అవసరం.

కాని మానవుడిని పారిశ్రామికీకరణవలననే నవీనుడిగా చేయజాలం.

అందుకే పాశ్చాత్య ప్రపంచమంతా అధునాతనం కాదు. ప్రాచ్యప్రపంచమంతా సంప్రదాయబద్ధంకాదు.

శాస్త్రీయ విద్య, నవ్యత్వానికి, ఆధునికీకరణకు రాచబాట.

జీవిత విధానాలను సరిదిద్దటంలో ఇదివరకు మతానికి అధికప్రాధాన్యత వుండేది. ఆ స్థానం ఇప్పుడు రాజకీయాలు ఆక్రమించినవి. రానురాను రాజకీయాలుకన్నా ఆర్థిక విధానాల ప్రభావం అధికమవుతున్నది.

ఈ జీవిత సత్యమే ప్రపంచ మానవాళి చరిత్రలో అడుగడుగున ద్యోతకమగుచున్న కమ్యూనిజం, సోషలిజం.

గమ్యస్థానం ఒకటే. అదే ప్రజా సంక్షేమ సాధన.

## ఆనాటి పరిస్థితులు

1600 సంవత్సరమున కుంఫిణీవారు ఇంగ్లాండులోని ఎలిజిబెత్తురాణివల్ల హిందూదేశములో వర్తకము చేసుకొనుటకు అనుమతి పొందిరి. దేశంలో అల్లకల్లోలము అధికముగా వున్నందున తమ వ్యాపార రక్షణకు సిపాయిలనుంచుకొనిరి. అనంతరం రాజుల అంతఃకలహములలో పాల్గొని రాజ్యాన్ని వశము చేసుకొనిరి.

1601లో బందరులో కుంఫిణీవారు ప్రవేశించారు. 1759లో బందరును స్వాధీనం చేసుకొన్నారు. 1796 నుంచి కలెక్టరుండేవాడు. 1859లో బందరు గుంటూరు జిల్లాలు కలిసి కృష్ణాజిల్లా ఏర్పడింది. ఆ కాలంలో నేతగాళ్ళకుకూడా పన్నుండేది. రెవిన్యూకు మహల్ అనేవారు. సాయిర్ అంటే వాణిజ్యపు పన్ను. మహాసూల్ ఎగుమతి దిగుమతి పన్ను.

కుంఫిణీవారు తమ వ్యాపారమునే అధికంగా చూచుకొనుచుండిరిగాని తిరుగుబాటుదారులను దుండగులను అణచలేకపోయిరి. 17, 18 శతాబ్దములలో దేశములో శాంతిలేదు. మరాటీదండులు, పిండారీలు, మహమ్మదీయులు ముఠాలుగా బయలుదేరి దేశముపైబడి అల్లకల్లోలము గావించుచుండిరి.

దీనికి సాదృశ్యముగా 1785 మే 10 తేదీన దేవరకోట సంస్థాన జమీందారగు కోదండ రామన్నగారు బందరు కలెక్టరు స్కాట్‌కు ఇలా వ్రాశారు.

"సయ్యాఫ్ జంగను అతడు నాలుగువేల గుర్రపు దళముతోను, అయిదారువేల కాల్బలముతోను, లంబాడీల తాలూకు పదిపదునైదువేల యెద్దులతోను, మున్నూరొంటెలతోడను, అయిదేనుగులతోను, నా దేశములోనికి బలత్కారముగా ప్రవేశించి శ్రీకాకుళ పరిసరమున, దండు విడిసి పంటలను కొల్లపెట్టుటేగాక, అమితముగు అల్లరి సాగించెను."

పుట 18 దేవరకోట సంస్థానచరిత్ర

1815లో 25 వేలమంది పిండారీదండు, తెలుగుదేశము మీదపడి 300 గ్రామాలను దోచుకొన్నది. వీరు రెండేసి వందలమందిగా విడిపోయి దివిటీలతో గ్రామాలమీదపడి, స్త్రీల మానభంగంచేసి, దోచుకొని పోయేవారు. వీరినే సామాన్యముగా దివిటీదొంగలనేవారు.

అలాగే మరాటీదండు గ్రామాలపైబడి కొల్ల గొట్టేవారు.

ఎరుకలు, యానాదులు కన్నములువేసి దోచుకొని పోయేవారు.

ఈ దోపిడీలు దొంగతనాలు విక్టోరియారాణి పరిపాలన 1858 లో వచ్చిన అనంతరం తగ్గినది.

## కరువులు - కాటకాలు

దేశంలో అంతటాగాని కొన్ని ప్రాంతములలోగాని తిండి గింజలు దొరకక ప్రజలు నానా బాధలు పడటాన్ని కరువు అంటారు. కరువు రావటానికి అతివృష్టి అనావృష్టి వలనగాని ఈతి బాధలవల్ల అనగా భూకంపాలు,తుపానులు, ఉప్పెనలు,క్రిమికీటకాల బాధలు, ఇవి మొదలుగాగల పంటలు చెడిపోవటం కారణం. ఈ విధమైన ప్రకృతి సంబంధమైన కారణాలేగాక రవాణా సౌకర్యాలు లేకపోవటం, యుద్ధాలు మొదలగు వాటివల్ల.

కృష్ణాజిల్లాలో 1633 లో ఒక కరువువచ్చింది. దీనిని బందరుకరువు అన్నారు. ఆకలి బాధవల్ల చచ్చినవారు

చావగా బ్రతికినవారు ఆ శవాలను పీక్కు-తిన్నారట. ఇతర ప్రాంతాలవారు ఇక్క-డకి రావడానికి భయపడ్డారని ఈస్టు ఇండియా కంపెనీ రికార్డులలో వివరించారు.

1792 లో ఒకపెద్ద కరువు వచ్చింది. దీన్ని పుర్రెల కరువు అన్నారు. చచ్చిపోయిన వాళ్ళ శవాల పుర్రెలతో దేశంవిడిచి పోయినందున చరిత్రకారులు దీనిని పుర్రెలకరువు అన్నారు. కృష్ణాజిల్లాలో ఈకరువు అధికమట. జమీందారులు పేష్కష్ కట్టలేక పోయారట. కంపెనీ ప్రభుత్వము గంజి నీళ్ళుకూడా పోయ లేక పోయిందని కంపెనీ రికార్డులు చెపు తున్నాయి.

1832 _ 33లో కరువువచ్చింది. అప్పుడు చాంద్ర మాసంలో నందన సంవత్సరం గడుస్తున్నది. అందు చేత దీన్ని నందన కరువు అన్నారు. దీన్ని గురించి ఘంటసాల పెద్దలు చెప్పేవారు.♦

1831 లో వానలు లేవు ఇది చాలా పెద్ద కరువు. కృష్ణా, గుంటూరు, నెల్లూరు, పశ్చిమ గోదావరి జిల్లాలో దాదాపు 50 లక్షలమంది నశించారు.

1876_78 లలో దక్షిణదేశంలో పెద్ద కరువువచ్చింది. అప్పుడు ధాత నామ సంవత్సరం నడుస్తున్నది. అందు చేత దీన్ని ధాతుకరువు అన్నారు. దీనివల్ల 45 లక్షలు నశించారు.

---

దీన్నే డొక్క-లకరువు అనేవారు. దీనిని పోలిన కరువు ఇదివర కెన్నడూ రాలేదు. ఈ కరువు సమయమున జనులు పచ్చిమాంసముకూడ తిన్నందున డొక్క-ల కరువు అనే పేరు వచ్చింది.

కరువు రాగానే కొంతమంది పంటలు పండిన ప్రాంతాలకు వెళ్ళేవారు. మళ్ళా వర్షాలుపడితే కొందరు తమ గ్రామాలకు చేరేవారు. ఈ విధంగా ఆ కాలంలో క్షామాలు అధికంగా వుండేవి.

అప్పట్లో ఇప్పటివలె భూములను అమ్మేవారు లేరు కొనేవారు లేరు. ఇళ్ళూ వాకిళ్ళు విలువ గలవికావు. ఏమైనా పశువులుంటే వాటిని తోలుకొని పోయేవారు.

ఉత్తరచూచి ఎత్తరగంప– ఉత్తరకార్తె, రైతుకార్తె. రైతుతో ప్రమాణం చేసిందట. ఇతర కార్తెలలో వర్షం పడక పోతే తాను ఈ కార్తెలో కురిసి పంటలు పండేటట్లును, ఇతర కార్తెలలో కురిస్తే ఈ కార్తెలో కురవకుండా ఉండే టట్లును చెప్పిందట! అందువల్ల ఉత్తరవరకు ఉపేక్షించే వారు.

కరువులు కాటకాలవల్ల ఆనాడు ప్రజలుచాలా బాధ పడేవారు. పచ్చి కరువేగాని యెండుకరువు తక్కువ. అనగా ఆ కాలంలో వర్షాలువల్ల పైర్లు వేయటానికి అవకాశం తక్కువ. ఈ పద్ధతి నూరేళ్ళ క్రితంవరకు వుండేది.

అమడకాయ పేలాలు వేయించుకొని తినేవారు. నల్ల రేగడలో పెరుగు కలుపుకొని తినేవారు. రక్కసకాయలు, తాటికాయలు తినేవారు. ఏదో విధంగా కాలే కడుపుకు గంజే పరమాన్న మన్నట్లు వుండేది.

జొన్నపంట ఆనాడు. జమీందారు నౌకరులు చేలకు కాపలా వుండేవారు. ఒక్క కంకికూడ కొయ్యటానికి వీల్లేదు.

అందువల్ల అప్పుడప్పుడు రాత్రిళ్ళు ఒక గిత్తను వదిలేవారు. ఆగిత్త జొన్న కంకిలను తిని వచ్చిన పిమ్మట, అది పేడవేస్తే, ఆ పేడలోని జొన్నలు కడుక్కొని, ఆ జొన్నలు గుగ్గిళ్ళు వండుకుని తినేవారు.

గుమ్మడితోట లెక్కువ. అందువల్ల గుమ్మడికాయ తినేవారు.

## ఆ న క ట్ట

18వ శతాబ్దంలోనే మైకేల్ టాసింగ్ ఆనకట్ట కట్టితే బాగుంటుందని సూచించాడు.

1841లో సర్ ఆర్థర్ కాటన్ భగీరథ ప్రయత్నం చేయసాగాడు. కుంఫిణీవారు సుముఖులుగా లేరు. ఎప్పుడూ నీతల నీళ్ళలోనే ఊరుతుందని ఆక్షేపించారు. అందుకాయన ఆర్థికాభి వృద్ధికేగాక మానవత్వానికైనా చేయాలని కృషి చేశాడు. ఆయన చాల భక్తుడు, మానవతావాది. అందుచేత ఈ పని మనం నెరవేర్చి నట్లయితే భగవంతుడు మనలను మెచ్చుతాడు. మన జాతిపేరు శాశ్వతంగా నిలుస్తుందని ఆయన హెచ్చరించాడు.

ఈ కరువులు కాటకాలు ఆయనను కలతపెట్టినవి. అందుచేత ఆయన ప్రభుత్వంతో పోరాడి కృష్ణా గోదావరి ఆనకట్టలను కట్టించి అపర భగీరథుడని పేరు గాంచాడు.

1852 వ సంవత్సరంలో ఆనకట్ట పూర్తయింది. కాని రైతులు పల్లపు సాగుకు చాల భయపడ్డారు. అప్పటి తీరువ రు. 2/-లు.

## వ్యవసాయకుడు

ప్రపంచ ప్రఖ్యాత రచయిత సోమర్‌సెట్‌మామ్, భారతభూమిలో తనకు నచ్చిన సంగతి ఇలా పేర్కొంటు న్నాడు.

"నన్ను నిజంగా కదల్చింది తాజ్‌మహల్, కాశీ, మధురలో ఆలయం, తిరువాంకూరు పర్వతాలూ, ఇవేవీ కావు.

"నన్ను కదల్చింది భారతీయ కర్షకుడు. చిక్కి శల్యా గతమై, తను దున్నే నేల రంగుగల గుడ్డపేలికను నడుం చుట్టూచుట్టి, తెల్లరగట్ల, చలిలో వణుకుతూ, ఎండలో చెమట కారుస్తూ, ఎండిన పొలంపై, ఎర్రటిసంధ్య పడేవరకు కష్టపడే కర్షకుడు. ఉత్తరాన, దక్షిణాన, తూర్పున, పడమట సువిశాలమైన భారతభూమి అంతటా, తన తండ్రివలె, తాత వలె, ముత్తాతవలె, మూడు వేల సంవత్సరాల వెనుక, ఆర్యులు ఈ దేశానికి వచ్చినకాలంనుండీ కష్టించి, ఆ కొద్దిపంటతో, పొట్టపోసుకునే రైతు హిందూదేశంలో, ఉద్రేకంతో నన్ను కదల్చివేసిన దృశ్యం అదే.

"లోకంపట్ల ఆయనకుగల అనురాగానికి,ఆయన కంటి వెంట కాస్త తడి వుంటుంది."

## కమాన్ బళ్ళు

పూర్వకాలంలో వర్షాలు అధికం కావడంచేత పంటలు పండేవికావు. అసలు దున్నటానికే అవకాశము తక్కువగా ఉండేది. అందుచేత ఆనాడు పచ్చికరువేగాని ఎండుకరువుం

డేది గాదు. భూమి ఎంతవున్నా శిస్తు యివ్వలేని స్థితిలో వుండేవాడు రైతు. నాణెములు అధికంగా చెలామణిలేని ఆ రోజుల్లో వస్తు మార్పిడే అధికం గావడంవల్ల పంటలు పండినా కొనేవాళ్ళుండేవారు కారు.

రైళ్ళు రస్తాలు లేనందున వ్యాపారం హెచ్చుగా వుండేదిగాదు. ఉన్నకొద్ది వ్యాపారం బళ్ళమీద, గంతావుల మీద, సాగుతూవుండేది. ఆ కాలంలో భూమికి విలువే లేదు. యకరం రెండుమూడు రూపాయలుండేది. పశువులే ధనం. పంట తక్కువైనా పాడి పుష్కలంగా వుండేది. శిస్తులుచెల్లని ఆ రోజుల్లో రైతులు ఒక ప్రాంతంనుంచి మరొక ప్రాంతానికి కిరాయి తోలుకుని శిస్తు డబ్బులు సంపాదించుకుంటూ వుండేవారు. ఈ కిరాయి బళ్ళను తోలడానికే ఆ రోజుల్లో "కమాన్ తోలుడు" అనేవారు. ఇట్లా కమాన్ తోలేబండ్లు ముఠాలుగా వుండేవి. ముఠాకు 20 బళ్ళుండేవి.

ఈ గ్రామంనుంచి 60 బళ్ళు బయలుదేరేవి. ఆ బళ్లకు బలిష్టమైన పెద్ద పెద్ద ఎడ్లను కట్టేవారు. వాటికి పెద్దబునుగులు, గంటలు కట్టేవారు. జగ్గయ్యపేటనుండి హైదరాబాద్ వైపుకు కొన్ని, మరికొన్ని నాగపూర్, షోలాపూర్ వైపుకు వెళ్తుండేవి. జగ్గయ్యపేట ఆనాడు వాణిజ్య కేంద్రము. దీని అసలుపేరు బేతవోలు. వాసిరెడ్డి వెంకటాద్రినాయుడు గారు తనతండ్రి జగ్గయ్యగారి పేరను జగ్గయ్యపేటగా మార్చెను. ఆయన దీన్ని చాలా అభివృద్ధిలోనికి తీసుకు వచ్చెను. 1881 సం॥లో దీని జనసంఖ్య 10072. ఇది ఆనాడు

బెజవాడకంటే పెద్దది. (బెజవాడ జనసంఖ్య 9336) రైలు వచ్చిన తర్వాత(1897_7_15) బెజవాడ పెరిగినది. జగ్గయ్య పేటనుంచి కొబ్బరి, బెల్లం, ఉప్పు వగైరా బళ్ళమీద వేసు కొని పోయేవారు. హైదరాబాదునుండి కలప, చింతపండు మున్నగునవి తెచ్చేవారు.

ఘంటసాల గిలకలదొడ్డి పొగాకు చాలా ప్రసిద్ధిగాంచి అక్కడ అధికంగా అమ్ముడు పోయేది. కావలసిన సంబార ములు ఒకబండిలో వేసుకొనేవారు. ముందు వెనుక డప్పుల వాళ్ళుండేవారు. కోయవాళ్ళు ముందు దారిచూపిస్తూ నడిచే వారు. అడవిపాలకర్ర పచ్చిదైనా కాలేది. ఆ కర్రను వెలి గించుకొని పులుల భయం లేకుండా ముందుకు సాగిపోయే వారు.

అచ్చమ్మగారి నారాయుడు తండ్రి చంద్రయ్య పైపంచి పడిపోగా దిగినప్పుడు పులి అతనిని ఎత్తుకుపోయింది. ఇలా బళ్ళు వెళ్ళి తిరిగిరావటానికి ఆరుమాసములు పట్టేది. ఇందుకు ప్రతిఫలము బండికి పదివరహాలు అనగా రు 40/_లు లభిం చేవి.

దీన్నిబట్టి ఆనాడు వారు ఎన్ని కష్టాలనో ఎదుర్కొని జీవయాత్ర చేస్తుండేవారని తెలుస్తున్నది.

## వ్యవసాయము

వ్యవసాయమంటే కేవలం పంటలు పండించటంకాదు, పశుపాలన, వాణిజ్యంకూడ. కాని ప్రథమములో పశుపాలనకే ప్రాధాన్యత ఉండేది. 'పాడితో పంట పోపదు' అనే సామెత. కదురాడినా కవ్వమాడినా కరువులేదని దీనికి నిదర్శనం.

ఆ కాలంలో బీళ్ళు విశేషంగా ఉండేవి. అందువల్ల పశుసంపదే సంపదగా భావింపబడినది. పెద్దపెద్ద ఎడ్లు, ఆవులు కోడెలు విశేషంగా ఉండేవి. వాటిని బిడ్డలవలె చూచుకొనే వారు. గొడ్డు- బిడ్డ అనే సామెత గమనించతగినది. వాటికి రాముడు, లక్ష్మణుడు, సీత అని పేర్లుకూడా పెట్టేవారు. వాటి నెంతో ప్రేమతో చూచేవారు. అప్పట్లో బండిపని లేనేలేదు. నాగలి పనికూడా తక్కువ. కొద్దిగా సేద్యం చేసేవారు. జన సంఖ్య తక్కువగనుక. పశువులకు చావిళ్ళుకూడా ఉండేవి కావు. రాత్రులందు ఒకదొడ్లో తోలేవారు. ఎంతవర్షం కురి సినా మోరలెత్తుకొని నందులవలె అలాగే నిలిచి ఉండేవి. పెంటపోగు తోలేవారే గాదు.

అప్పుడు భూమి చాలా సారవంతంగా ఉండేది. ఎందు చేతనంటే మధునాపురంవద్ద కృష్ణకు గండిపడినందున మన గ్రామానికి వరద ఏడుసార్లు వచ్చేది. ఆ వరదవల్ల ఒండు మట్టితో సారవంతమయ్యేది. చివరకు ఎప్పుడో జొన్న వేసిడి వారు. అప్పుడు బళ్ళు లేవు. సలుగుళ్ళు అనేవి ఉండేవి. వాటి మీదవేసి జొన్న అది తోలేవారు.

పెద్దపెద్ద రైతులకు పశువులతోపాటు గుర్రాలుకూడా ఉండేవి. ఆ గుర్రాలనెక్కి బంధువుల ఇళ్ళకు వెళ్ళేవారు. గుర్రాల మాదిరిగనే కొన్ని గిత్తలమీద ఎక్కి స్వారీచేసే వారు యువకులు. వాటిని ఎగిరింత గిత్తలు అనేవారు.

ఆడపిల్లల వివాహములందు పాడిఆవులను అరణముగా ఇచ్చెడివారు. బ్రాహ్మణులకు గోదానా లిచ్చేవారు.

సుమారు వంద సంవత్సరముల క్రితం కృష్ణానదికి కట్టలుపోసి కాపాడుచుండుటచేత వరదభయం పోయినది. జన సంఖ్యనుబట్టి వ్యవసాయం పూర్వంకంటే అవశ్యకత అయినది. వ్యవసాయమనగా అది ఒక జీవిత విధానము. అదొక వృత్తి. ఇంటెల్లపాదీ పనిచేసెడివారు. పిల్లలు గొడ్లకాస్తే, యువకులు నాగళ్ళు దున్నేవారు. కొందరు చేలు కాయవలసి వచ్చేది. ఇంకొందరు పైపనులు చేయ వలసి వచ్చేది.

వ్యవసాయం మూడురకాలు. చేయుదాం రమ్మన మనేది. చేయుదువుగాని రమ్మనమనేది. చేసి రమ్మనమనేది. ఆనాటి వ్యవసాయం ప్రథమ తరగతికి చెందినది.

ఈ గ్రామస్థులకు ఈ గ్రామమునందేగాక బోళ్ళపాడు, మల్లంపల్లి, చిట్టూరు, కాజ, దాలిపర్రు, పూషడం, ఎలికల కుదురు, బిరుదుగడ్డ, దేవరకోట, లక్ష్మీపురం, చిలకపూడి, రుద్రవరం, చింతలమడ మొదలగు గ్రామాలలోకూడా భూములు కలవు. ఆ కాలంలో దూరపుభూములను బీళ్ళుగా వదిలారు. దగ్గరవున్న భూములలో కొంత గ్రామానికి ఆను కొనివున్న పాళ్ళమీద, తవిద ఊడ్చి మోట నూతులక్రింద పండించేవారు.

తర్వాత ఈ నూతులను ఆధారము చేసుకొనే పొగాకు వేసెడివారు. దీనివల్ల ఎక్కువలాభం వచ్చేది. ఈ పొగాకు పరప్రాంతాలుకూడా పోయేది. అందులో గిలకల దొడ్డి పొగాకుకు విశేష నాణ్యతవుండేది.ఇది నాగపూరులో ప్రసిద్ధి గాంచినది. ఆముదాలుకూడా విశేషంగా వేసేవారు. అప్పుడు

ఆముదమునే ఇంట్లో దీపములకు ఉపయోగించేవారు. మొక్క-జొన్న, పైరు మొక్క-జొన్న, బుడమవర్రి, మిరపతోటలు విశేషంగా వేసేవారు. చిలకడపూడి పొలాన బుడమలో కలిపిన కంది వృక్షముగా పెరిగేది. పూర్వం ఆ కందికంప కొట్టిన తర్వాత వాములేసి తగులబెట్టేవారు. ఆనాడు వారికి వీటిని వంట సరుకుగా వాడుకునే అవసర ముండేదికాదు. అందు చేత తగలబెట్టేవారు నువ్వుకూడా వేసేవారు. ఆ నువ్వు కట్టలుకట్టి ఎండబెట్టేవారు. పొడిచి నిలబెట్టడం తర్వాత వచ్చింది. తర్వాత వేరుశనగ వచ్చింది. గుమ్మడికాయలు మనిషి మోయలేనంత పెద్దవిగా ఉండేవి.

1890 ఆ ప్రాంతాల భీమనదీ ఛానల్ వచ్చి, దానికింద బోళ్ళపాడు, మల్లంపల్లి, చిట్టూరు, ఎలికల కుదురు, దాలిపర్రు, కాజ మొదలైన గ్రామాలకు మాగాణి వచ్చినది. అప్పట్లో గవర్నమెంటు కంపెన్సేషన్ కాలవకింద పడిన భూములకు తీసుకోవలసిందని నోటీసు ఇచ్చినప్పుడు గవర్నమెంటు దగ్గర మేము ప్రతిఫలం తీసుకొంటామా అని మానివేశారు. ఆకాలంలో బందరు వెళ్ళటమంటే తగని భీతి. ఎర్రటోపీవాడు వస్తే (పోలీసు) ఎర్రగుడ్డనిచూసి ఎద్దు బెదిరినట్లు బెదిరేది రైతాంగం. కాలవరాగానే పల్లపు సాగు చేయటానికి జంకారు. కొంతకాలానికిగాని చేయలేదు. ఈ పల్లపు సాగుదూరాన ఉండుటవల్ల మెట్టభూములు దగ్గర వుండిఅధికప్రయోజనకారిగాఉండుటచేత మెట్టమీదేఅధికశ్రద్ధ చూపుతుండేవారు. కుప్పలు ఎప్పుడో సంవత్సరానికి నూర్చేవారు. ఇప్పటికీవలె కొట్టుడుగాక గొడ్ల పెట్టి తొక్కించేవారు.

ఆ కుప్ప నూర్పిడిలో పాలేళ్ళకు, కూలీలకు కావలసినంత కల్లు. ఆ కల్లు త్రాగి వాళ్ళు ఏల పాటలుపాడుతూ కోలాహలంగా ఉండేవారు. పొలియ పొలియో అంటూ పొలి కేకలు వేసేవారు. ఊడ్పులలో ఊడ్చిన మొట్టమొదట ముత్తైదువకు రవికగుడ్డ ఇచ్చేవారు.ఆమెపంట బాగాపండాలని దేవునికి మ్రొక్కి కొబ్బరికాయలు కొట్టేది.పూర్వపు వారిదంతా దైవ బ్రాహ్మణ భక్తి. వారు ప్రతి కార్యకలాపమునందు అదే.

ఆకు మడిలో విత్తులు పోసినపుడుకూడ విఘ్నేశ్వరుని పూజించి విత్తులు జల్లేవారు.

ఆనాటిరైతు తన జీవనాధారములగు నందులవంటి వృషభ రాజములను, కామధేనువులు వంటి ధేనువులను పోషిస్తూ,ఆ ఎడ్ల రంకెలను, కోడెల ఆర్భాటములను, ఆవుల అంభారవమును, లేగల గంతులనుగాంచి ఆనందిస్తూ, భూదేవిని భజిస్తూ, పంటపొలాలను ప్రేమిస్తూ, పాలేళ్ళ పొందుతో, కూలీల సహవాసముతో, తోటిరైతుల ఆదరముతో ఆనందిస్తూ వుండేవాడు.

## రైతూ-పాలేరు

పాలేరు అనగా భాగస్వామి. పండిన పంటలో పుట్టి తీరులని అతనికి భాగంక్రింద యిచ్చేవారు. ఈనాటి వాడు జీతగాడు. పాలేరు పెళ్ళికి రైతు మంగళసూత్రం చేయించి యిచ్చేవాడు. అతనిభార్య ప్రసవిస్తే, గుడ్డా గోచి కొన్ని

పాతవడ్లు యిచ్చేవాడు. అతన్ని తన కుటుంబములోని వానిగా చూచుకొనేవాడు. అన్నదమ్ముల సంసిటిలో పాలేళ్ళను కూడా పంచుకొనేవారు.

కమాన్‌బళ్ళు తోలుకుని వెళ్ళేటప్పుడు పాలేళ్ళకు తలంటించి, కొత్త పంచెలిచ్చి, భోజనం పెట్టి సాగనంపేవారు.

అతను 'దొరా' ! అని సంబోధించినా, అన్యోన్యత వుండేది. అంటుకోనక పోయినా, నా పాలేగాని రైతుకీ, నా దొరని పాలేరుకి ఆప్యాయత వుండేది.

రైతూ పాలేళ్ళ సంబంధాన్ని గురించి వ్యత్యాయము అనే కథలో వేలూరి శివరామశాస్త్రిగారు చక్కగా ఇలా చిత్రించారు.

నరసింహులు అనే అగ్రహారికుని వద్ద కాటమనే గవ జాతివాడు పాలేరు. వారిద్దరకు వృద్ధాప్యము వచ్చినది. ఇరువురు ఇహలోకయాత్ర ముగింపనున్నారు. వారి అన్యోన్యతని వెల్లడించే ఘట్టాన్ని ఇట్లా చెప్పుచున్నారు.

"దొర అచటనే గూర్చుండి పలుమారు ఆవలించెను. నరసింహులకు అదియే తుదిసెలవుగా కానుపించెనా ? అతడు నిట్టూర్చి ఆకాశము చూచుచు కూర్చుండెను. అతనికి ఏమియు తోచలేదా ? ధనముకన్న విలువగల పదార్థమేదైన పోవుచున్నదా ? అవును. తానును అతడును, ఒకరి వెనుక నొకరు దున్నిరి. పాండ్రపొలములను సుక్షేత్రములుగ మార్చిరి. రాత్రి చేనిగట్లమీద ఒకరి వెనుకొకరు పరుండిరి.

నీరు కట్టిరి; కోసిరి; కుప్పల వేసిరి, నూర్చిరి. అక్కలలో సంచులు సాయముపట్టి బండ్ల కెక్కించిరి. వారికి ఇండ్లదగ్గరనే దవ్వు, పనిలో ప్రేమలో ఒకటే చెయ్యి, ఒకటే మనస్సు."

అది ఆనాటి దొర పాలేరులకుగల సంబంధము. అయినను వారు దొర పాలేరులవలె సంచరించలేదు. సాటి భాగస్వాములవలె సంచరించిరి. ఏకకుటుంబీకులవలె మెలగిరి. అందుచేత వారి సంబంధం ధనధాన్యాదుల కతీతమైనది. అది హృదయ సంబంధము. హృదయం స్పందించేటట్లు వ్రాశారు శాస్త్రిగారు.

మరల వారిపుర సంబంధాన్ని కథకుడు కళ్ళకు కట్టినట్లు కమనీయముగా చెప్పుచున్నాడు.

"కాటని బాహు బలమును, దానికన్న మిన్నయగు విశ్వాసమును, తన భాగ్యమునకు కారణము. ఆభాగ్యము చేతనే తాను భవంతి కట్టెను. కాటనికి పూరిల్లు వేయించెను. తాను పెండ్లాడెను. కాటనికి పెండ్లి చేయించెను. ఆ భాగ్యము చేతనే తన కుమారునకు చదువుచెప్పించెను. రాముని కిరస్తాని బడిలో చదివించెను. అట్టి కాటడు తనకడనే గాక ఇహలోకముకడ సెలవుగొని పోవుచుండుగా, ధనముకంటె విలువ గల ఒకానొక పదార్థము తనను మఱపించిపోవుట లేదా ?" అదీ ఆనాటి వారి సంబంధము.

దొర ఏది తింటే పాలేరూ అదే తిన్నాడు, అదే కట్టాడు, అదే అనుభవించాడు. అది పరస్పర సంబంధము. అందుచేతనే పాలేరేడ్చిన పంట, ఎద్దుఏడ్చిన వ్యవసాయము పనికిరాదన్నారు.

ఈ విషయాన్నే గొట్టిపాటి బ్రహ్మయ్యగారు తన స్మృతులలో తన మేనమామ కొండపల్లి సుబ్బయ్యగారికి ఆయన పాలేరు పేరయ్యకుగల సంబంధాన్ని ఇలా వ్రాశారు.

"కమానువెళ్ళిన బండ్లు వస్తున్నవని తెలుసుకొని, కొత్తగి త్తను తోలిపెట్టామని ఎల్లావున్నదో అని చూద్దామనే ఆకాంక్షతో మా మేనమామ యెదురేగి ధర్మఘోటకం లోకివెళ్ళి గవిసెన తీయమంటే "యిట్లావచ్చావు రెండుకు;గి త్త చిక్కి సగమైపోతే, యాతనపడి వచ్చింది. యింటికి వెళ్ళిన తరువాత చూడవచ్చులే" అని కసిరిపంపించాడు, ప్రేమభక్తు లకు నిలయమైన పాలేరు. అట్టి పాలేరును కాదనడానికి సాహసం యజమానులకు యెక్కడనుంచి వస్తుంది? భోజన మైన తరువాత 'నీ యింటికివెళ్ళి నీ భార్యను బంధువులను చూచుకోరా'అంటే; "సరేకాని యీ రెండునెలలు యిక్కడి వాళ్ళచేత యేమి చేయించావు? మోకులేమైనా వేయిం చావా? వలితాళ్ళు పగ్గాలు వేయించావా? భోంచేయగానే నీవు నిద్రపోవడం, వాళ్ళు యిష్టం వచ్చినట్లు తిరగడం, జరి గిందా?"అని సణుగుతూ సతాయించుతూ ప్రొద్దుపోయేవరకు వుండేవాడట. ఆఖరుకు కొంతకాలానికి అతనికి సుస్తీచేసి పని చేయలేని స్థితిలో పాలేరుతనం మానుకొని వెళ్ళేటప్పుడు "యిదుగోనయ్యా సుబ్బయ్యా! యీ కర్ర యేడు యేళ్ళు వాడాను. యెడ్లను యెట్లా మేపానో, యెట్లా పాటుపడ్డానో, యిక ఎట్లా వ్యవసాయం చేసుకుంటావో జాగ్రత్త" అని హెచ్చరించిపోయాడు.

తర్వాత ఒకటి రెండు నెలలకు అతను స్వర్గస్థుడయ్యాడు. రైతూ పాలేరు సంబంధం అట్టిది. ఆ రోజులలో ఆయనవద్ద పాలేళ్లు చేసినవారి కుమాళ్లు, మనుమలు మొడ తెగకుండా యిప్పటికీ నావద్ద వున్నారు."

## 19 వ శతాబ్దపు పెద్దల భావాలు

ప్రజల ధనమాన ప్రాణరక్షణలేని ఆరాచరికం అస్తమించింది. సుస్థిరమైన ప్రభుత్వం ఏర్పడింది. రైళ్ళు, రాకపోకలకు రోడ్లు ఏర్పడ్డవి. నదులకు ఆనకట్టలు కట్టి దేశం మీద పడకుండానేగాక, మాగాణికి అనుకూలముగా వసతులను ఏర్పాటుచేయుట జరిగింది. ప్రజలు కడుపులో నీళ్ళు కదలకుండా, కంటినిండా నిద్ర పోసాగారు.

అందువల్ల అప్పటి ఈ గ్రామ పెద్దలు ఇలా అనుకొన్నారు.

చల్లని రాణీప్రభుత్వం వచ్చింది. చల్లగా వుంటున్నాము.

తెల్లవాడి మాయ, వడకని బట్ట కట్టాము, వండని అన్నం తిన్నాము. పులిని మేకను ఒక రేవున త్రాగిస్తున్నాడు.

పూర్వం రామరాజ్యం అనటం విన్నామే గాని, నేడు ఈ రాజ్యమే రామరాజ్యమని అనుకొనేవారు.

ఆహా ఎటువంటికాలం చూశాము అని ఆశ్చర్యానందాలు పొందేవారు.

## ప్రకృతి భీభత్సములు

1779 లో గొప్ప తుపాను వచ్చింది. బందరుచుట్టు ప్రక్కగ్రామాలలో 20 వేల జనం నశించారు.

1864 నవంబరు 1 తారీఖున, దీపావళీ అమావాస్యకు గొప్ప ఉప్పెన వచ్చింది ఆ రోజున పగలు 12 గంటలనుంచి కుండపోతగా వానకురిసింది. 3 గంటలనుంచి పెనుగాలి వీచింది. సముద్రము పదమూడడుగుల యెత్తున పొంగింది. బందరులో 30 వేల జనం నశించారు. బందరుని ఆనుకొని వున్న శివగంగలో 700 మందికి 70 మంది మాత్రమే బ్రతికారు.

బందరు చల్లపల్లి రోడ్డుకు దక్షిణానవున్న పల్లపు గ్రామాలన్నీ నాశనమైనవి. ♦

ఘంటసాలవారు భయభీతులతో ఇళ్ళల్లోని అడప లెక్కారు. సముద్రపునీరువచ్చింది. కర్ర కంప శవాలు కొట్టు కొచ్చినవి. ఇక్కడవారికి నష్టం కలగలేదు.

దీపావళికి ఏమాత్రం గాలివేసినా, ఉప్పెన వస్తుందేమోనని, నాటినుండి నేటికీ భయమే.

చిత్రభానుసంవత్సరం అనగా 1822 సంవత్సరంలో పెద్ద వరదవచ్చి 21 రోజులున్నది. ప్రజలందరు భయభీతులు చెందారు.

---

♦ "1863 అంకినీడుగారు ముంగనూరి అనంతలక్ష్మి నరసింహం పంతులుగారికి పరగణాను కవులికిచ్చారు. ఉప్పెనవల్ల నష్టపడ్డా ఆయన మీద దావావేసి రాబట్టు కొన్నారు."

దేవరకోట సంస్థాన చరిత్ర. పుట 36

1922 నవంబరు 22న ప్రళయమగు గాలీవానవచ్చి, చెట్లూ చేమలన్నీ పడిపోయినవి. పశునష్టంకూడా కల్గింది. పర గణా అంతటా మెరకపల్లపు పైరకు చాలనష్టం కలిగింది.

1925 మే 16న రోహిణీకార్తెలో పట్టపగలు పెద్దగాలీ వానవల్ల చెట్లు చాలా పడిపోయినవి. పశునష్టం కలిగింది. పూరిళ్ళు పశువుల చావిళ్ళు పడిపోయినవి, పెంకుటిళ్ళ పెంకంతా ఎగిరిపోయింది.

1926_11_16న వానాగాలీ వల్ల పశునష్టం, పైరుల నష్టం కలిగింది.

## మతము

మనకు మతము ప్రధానమైన విధానము. ఏపని చేసినా ఈశ్వరార్చన చేసిచెయ్యాలి. హరినామస్మరణతో లేవటం, మళ్ళా హరినామస్మరణచేసి నిద్రించటం.

మనది ఆధ్యాత్మిక నాగరికత, పాశ్చాత్యులది భౌతిక నాగరికత అనటం పొరపాటు, అహంకారము, అవివేకము. ఆదిలో అందరిదీ ఆధ్యాత్మిక నాగరికతే.

17 శతాబ్దంలో ఇంగ్లాండు ప్రజల్లోను మతసంబంధ మైన నమ్మకం అధికంగా వుండేది. గ్రహణాలు తుపానులు దైవనిర్ణయంగా జరుగుతాయని, జబ్బులు క్రూర పిశాచాల ఫలితాలని, పిచ్చి, దయ్యంపట్టడంవల్ల వస్తుందని ప్రజలు మూఢంగా నమ్మేవారు.

క్షయవ్యాధి, మసూచి, ప్లేగు, కలరా ఇవన్నీ వాటి సంబంధమని భయపడేవారు. కుష్టువ్యాధి, మలేరియా విశే

షంగా వచ్చేది. జిల్లా కేంద్రాల్లో చాల తక్కువగా డాక్ట ర్లుండేవారు. మూలిక సంబంధమైన మందులు అధికంగా వుండేవి.

ప్రకృతి శాస్త్రజ్ఞానం పెరిగిన తర్వాత మందులు కని పెట్టి చికిత్సలు చేయటంవల్ల ప్రజల్లో మార్పువచ్చింది. భౌతికవాదు లయ్యారు.

ఆధ్యాత్మికవాదం అనంతరం వచ్చేది, భౌతిక వాదమే.

పూర్వము వారూ మనవలెనే మరణాంతర జీవితమే ప్రధానంగా భావించారు.

పారిశ్రామిక విప్లవంతో వారి భావాలన్నీ మారినవి.

ఈ దేవుళ్ళు, దేవతలు, దయ్యాలు భయం వల్ల వచ్చినవి.

మానవ సంస్కారాన్నిబట్టి మతముంటుంది.

మతమంటే ఆంతరంగిక శాభివృద్ధి.

వ్యక్తి వికాసం చెందితేగాని యీ ధోరణికిరాడు.

అంతవరకు బాహ్యపూజ, పురోహితులు, అర్చ కులు అవసరం. ఆత్మవిశ్వాసం సన్నగిల్లితే, అంతా అర్చనే.

మనవారు నాడూనేడు ఆధ్యాత్మిక వాదులే.

అందుచేత దైవ బ్రాహ్మణభక్తి, దేవతారాధన మన మనుగడకు నెలవైనది.

## బ్రాహ్మణ భక్తి

బ్రాహ్మణులు రాజులకు మంత్రులై, సేనానులై, దీక్షాగురువులై, బోధకులై, పురోహితులై తమ అగ్ర

స్థానాన్ని స్థిరపరచుకొన్నారు. అందుచేత వీరిని ఎదిరించే వారులేరు. వీరుచెప్పింది వేదవాక్యం. పురోహితుడు లేకుండా పుడమిని పడిన లగాయతు కాటిలోకి వెళ్ళేవరకు ఏ పనీ జరగదు. షోడశ కర్మలు విధించారు. బిడ్డ పుట్టినా, పేరు పెట్టవలసివచ్చినా, బడికి పంపించవలసివచ్చినా, పెండ్లి మొదలగు శుభకార్యములకు, అశుభకార్యములకు అన్నింటికీ ఆయన సలహా లేనిదీ సాహసించి ఎవరూ ఏమీ చేసేవారు కారు. నేడూ అంతే.

అందుచేతనే వారియందు భక్తి భావం అధికమైనది. ఈ భావంచేతనే ఆవు యీనితే జున్నుపాలు బ్రాహ్మణులకు పంపేవారు. దీనివల్ల ఆవుకు దూడకు ఏ దోషంలేక పాలు బాగా ఇచ్చునని నమ్మకం ఉండేది. అలాగే ఏకూరగాయ కాసినా మొట్టమొదటి కాయలను పురోహితునికి, పంపేవారు. పురోహితుడు భుజించినందువల్ల కాయలు పుచ్చక సమృద్ధిగా కాయునని వారి విశ్వాసము.

## గురువులు

శంకచార్యులవారి పీఠమునకు గురుపరంపర యెలా వున్నదో, అలాగే ప్రతివంశానికి గురువు వుండేవారు.

పూర్వకాలంలో గుర్రాలతో వచ్చేవారు. తర్వాత బళ్ళమీదవచ్చి, ఒక మాసంరోజులుండేవారు. రోజూ ఏదో కొంత బోధ, సాయంకాలం జరిగేది. గురువుగారికి సాష్టాంగ దండ ప్రణామం, పైపంచె నడుముకు కట్టుకొని చేసేవారు. మంత్రతీర్థం తీసుకొనేవారు.

కొందరు చక్రాంకితులయ్యేవారు. అనగా ఆ గురువు శంఖుచక్రాలు వేడిచేసి భుజాలను వేసేవాడు. చక్రాంకితులైన వారికి స్వర్గానికి పాస్‌పోర్టు (ప్రవేశపత్రం) లభిస్తుందని విశ్వాసం.* ఆ గురువుని ఒకపల్లకీలో కూర్చుండబెట్టి శిష్యులు మోసేవారు, ఆయన కాళ్ళు కడిగిన తీర్థం చల్లుకొనేవారు. ఆయన ఉచ్ఛిష్టాన్ని తినేవారు. ఇవన్నీ స్వర్గానికి సూత్రాలని ఆ గురువులబోధ, ఈ శిష్యుల విశ్వాసము.
చివరకు అందరు గురుకట్నాలు చెల్లించుకొనేవారు.

ఈ గురువువద్ద శిష్యుల వంశవృక్షము వుండేది. అదే వారికి సనదు.

క్రమంగా ఆ కాల్పులు, అవి తగ్గినవి. అప్పుడప్పుడు రావటం, మామూళ్ళు స్వయం పాకం పుచ్చుకొని వెళ్లుతూవుండేవారు.

చివరకు బోధగురువులుగాక, బాధగురువు లయ్యారు.

1920 వరకు ఈ గురువులు వస్తూనే వుండేవారు. వారికి తగిన మర్యాద మన్నన జరగనందున, శిష్యులు తెలివిమీరినందున గురువులు పలాయనం చిత్తగించారు.

## లింగ బలిజీలు

వీరు వివాహాలైన తర్వాత వీరభద్రపళ్ళెం పట్టేవారు. అనగా ఒకపళ్లెంలో వీరభద్రునివుంచి, రాత్రిపూట వూరేగింపు చేస్తూ గ్రామమంతా తిరిగేవారు. ఆ వీరభద్రునికి

* అందుకనే తాతాచార్యులగారి ముద్ర భుజం తప్పినా వీపు తప్పదని సామెత కలిగింది.

బాగా సాంబ్రాణివేసి వీరంగం వాయిస్తూవుంటే శరీరంజలదరిస్తూ వుండేది. ఒక్కొక్కచోట ఆపి ఖడ్గాలు పలికేవారు. ఖడ్గాలనగా వీరభద్రునియొక్క గొప్పతనాన్ని స్తుతించటం.

ఖడ్గాలు పలుకుతూంటే, మధ్య, మధ్య భక్తులు, అశ్శరభ, అశ్శరభ అంటూ నారసాలు వేసుకొనేవారు.

ఖడ్గాలు గమనించండి:—

"పచ్చని గురువేరు పైనున్న విభూతి,
వన్నెవస్త్రము చేత వీరపల్క, కుడిచేతి
నరకంగ, పెడబొబ్బ లెట్టంగ, దక్ష
యాగంబెల్ల తల్లడిల్లె.
దక్షయాగానికి వచ్చేరా చేటనుచు,
చచ్చేర దేవతల్ కోటాను కోట్లు
ఏటుబడె నరకంగ, వరదలై రక్తంబు
వాగులై పారె, ఔర వీరంగమా
డితివి, ఔర శరభవినుత, చతుర
రౌద్ర పరమకృపా సముద్ర, ప్రళయ
తలయ రౌద్ర శ్రీ ఘంటసాల వీర
భద్ర నమస్తే, నమస్తే......

శైవులు వీరభద్రం పట్టితే, వైష్ణవులు ఆంజనేయ పళ్లెం పట్టటం రివాజు.

## గ్రామ దేవతలు

పూర్వకాలంలో ప్రతిగ్రామానికి ఒక గ్రామదేవత, ఇతర వంశాలవారికి వేర్వేరుగా దేవతలు ఉండేవి. ఈ దేవతలకు ఏటేట కొలుపులు కొలుస్తూ ఉండేవారు. మశూచికము, కలరా, ఆటలమ్మ మున్నగు అంటు రోగములు వచ్చి మరణిస్తూ ఉండేవారు. అలాగే పశువులకుకూడ వ్యాధులు వచ్చి నశిస్తూ ఉండేవి. అప్పట్లో వీటికి మందులు మాకులు ఏమీ లేవు నేటివలె. ఇవన్నీ దేవతల క్రోధరూపమని నమ్మి దేవతలను కొలిచి ఆ దేవతల ప్రీత్యర్థము జంతువులను బలి ఇస్తూ ఉండేవారు.

ఏదైనా వ్యాధి రాగానే వీధులలోను ఇంటింటికీ వేప తోరణాలను కట్టేవారు. వేపచెట్టుగాలి, మశూచికమును నిరోధిస్తుందని భావించేవారు. అది కొంతవరకు నిజమే.

దేవతనునిల్పి రోజూ ఉదయము ఘటపు కుండను ఒక చాకలి నెత్తిన పెట్టుకొని మరొకరు అలంకరించిన ఒక పెద్ద గడను పట్టుకొని కాళ్ళకు గజ్జెలు, చేతిలో పట్టాకత్తెలు, వేపమండలు పట్టుకొని గణాచారులు వాల, వాల అంటూ గంతులువేస్తూ ఇల్లిల్లూ తిరిగేవారు. వీరివెంట పంబలవాళ్ళు పంబవాయిస్తూ ప్రజలలో ఉద్రేకమునుకలిగించేవారు. అది ఆనాడు ప్రజలలో ఒకవిధంగా భయభీతులను పోగొట్టుటకు కొంత దోహదం కలిగించేదేమో !

ఈ గ్రామంలోకూడ పెన్నేరమ్మ అనే గ్రామదేవత ఉండేది. ఇప్పటికీ ఆగుడి ఉన్నది. ఆ దేవతకు ఒక పెద్ద

దున్నపోతు, పందలాది గొర్రెలు, మేకలు,కోళ్ళు బలియిచ్చే వారు.

1884 వ సం॥ రంలో పందిరి, పాకలువేసి దేవత కొలుపుసాగిస్తూ ఉండిరి. 11 రోజులు పూజ జరిగింది. 12 వ రోజున బలియివ్వనున్నారు. ఈ కొలుపులో పశుహింస లేకుండా చేయాలని గొర్రెపాటి బాలకృష్ణమ్మగారు పూను కొన్నారు. బలియివ్వాలని ఆయన తమ్ముడు రామస్వామి గారు పట్టుబట్టాడు. వీరుభయులకు తమ్ముడైన వెంకట్రాయులు పెద్దన్నగారి పక్షమువహించి విగ్రహాన్ని తీసి పందిరిపైన పార వేశాడు. అంతట రామస్వామిగారు కోర్టుకు వెళ్ళగా ఎవరి మామూళ్లు వెంటవారు పూజచేసుకోవచ్చునని తీర్పు ఇవ్వడ మైనది.

మరికొంత కాలానికి గంగానమ్మను నిలబెట్టిరి. చల్ది నైవేద్యాలతోనే పూజలు సరిపెట్టవలసిందని గొర్రెపాటి వారంతా తలచారు. గొర్రెలను బలి యివ్వవలసిందని గొట్టిపాటి వీరరాఘవయ్య, దోనేపూడి వెంకట్రాయులు, గొర్రెపాటి రంగన్నగారి కుమారుడు రామస్వామిగార్లు వేమూరి ఘంటయ్యగారి తెగ వీరంతా పట్టుబట్టారు.

ఈ దేవతల కొలుపులవల్ల కలహాలు పెరిగి కొట్లాటలు జరుగుతాయని పోలీసుకురిపోర్టుయిచ్చారు. దానిమీదట వారు వచ్చి ఉభయులు అంగీకరిస్తేగాని యీ జాతర జరగటానికి వీల్లేదని ఆపివేశారు. అప్పటినుంచి గ్రామత్యా దేవతా కొలుపులేదు.

వడ్లమూడివారు మరికొందరు వారి దేవతలను అప్పు డప్పుడూ కొలుస్తూ ఉండేవారు.

గంగానమ్మ గ్రామదేవత. పోతురాజు గంగానమ్మ భర్త.

గంటలమ్మకూడ ఒక దేవత. పూర్వం అక్కడొక చింతచెట్టు ఉండేది. దానికి గంటలమ్మ చింత అని ప్రసిద్ధి.

గ్రామ మధ్యనున్న ఆ ప్రదేశమున మరొక రావి చెట్టును చింతను పెట్టిరి. కాని అవిరెండూ గాలివానకు పడి పోయినవి.

## కొర్లబండి

రావి కర్రలతో అప్పటికప్పుడు బండి మాదిరిగా చేసి రక్తపు గుడ్డలతో పంబలవాడు దానిలో కూర్చొని పంది పిల్లను ఒకదాన్ని ఆ బండికి గుచ్చి పంబలవాళ్ళు కథ చెపుతూ కొర్లంక అనే దేవతను కొలిచేవారు. ఈ కొర్ల బండి, ఈ పందిపిల్లను హింస చేయటం ఎంత అపమార్గమని జీవ కారుణ్యముతో గొర్రెపాటి బ్రహ్మన్నగారి కుమారుడు వెంకయ్యగారు నిరోధించెను.

## తొక్కుడు

పశువులకేదైనా వ్యాధులువస్తే నివారణకొరకుతొక్కు డు తొక్కించేవారు. గ్రామానికున్న పొలిమేరల మధ్య గొయ్యితీసి ఒక పందిపిల్లను తల కనబడేటట్లుగా పెట్టి పూడ్చి దానిమీద ఒకదీపపు ప్రమిదపెట్టి గ్రామములోని పశువుల నన్నింటిని తోలుకొనిపోయి ఆ ప్రదేశంలో తొక్కించెడి

వారు. ఈ తొక్కిడివల్ల పశువుల వ్యాధులు నివారణగునని విశ్వాసము.

ఇటువంటి విశ్వాసాలు గలవారు ఇప్పటికీ లేకపోలేదు.

రైతాంగమంతా ఇప్పటికికూడ కుప్ప వేసి పైన గొబ్బి ముల్లు గుచ్చుతారు. ఈ గొబ్బిముల్లువల్ల పొలిగాడు పోకుండా ఉంటాడని నమ్మకం.

## మూఢ నమ్మకాలు

1 నేటి నాగరిక జాతులన్నీ ఒకప్పుడు అనాగరికంగా ఉండేవి. ఆ స్థితిలో కొంతజ్ఞానం సంపాదించాయి. ఆ జ్ఞానం పరంపరగా వచ్చినందువల్ల అది ఇప్పటికీ నిలచియున్నది. అందుచేత ఈ జ్ఞానానికి సాంప్రదాయక విజ్ఞానం అనవచ్చు.

సంఘం శైశవస్థితిలో ఆర్జించిన ఈ జ్ఞానంలో కార్య కారణ సంబంధం ఉండదు. ఆనాడు వారికి విశ్వాసమేగాని ప్రకృతి శాస్త్రాదుల విషయమైన జ్ఞానం అల్పం. అది అధికంగా ప్రకృతాతీత కారణాలతో నిండి వుండేది.

ఈ సాంప్రదాయక విజ్ఞానం మనలోవలే నాగరికత చెందిన జాతులలోకూడ ఇంకా లేకపోలేదు. దానికి కారణం జాతి అంతా నాగరికత పొందక పోవడమే. నాగరికతపొందిన కొద్దీ అది నశించుతుంది. మనం పాతకొత్తల మధ్యలో ఉన్నాం.

---

1 ఏకుమళ్ళ కామేశ్వరరావుగారి సాంప్రదాయక విజ్ఞానం ఆధారంగా.

ప్రతి జాతికి కొన్ని విశ్వాసాలుంటాయి. అవి ఆ జాతిని పట్టుకు పీడిస్తూ ఉంటాయి. మానవుడిలో ప్రథమంలో ఆవిర్భవించింది విశ్వాసమే. ఇటీవల వచ్చింది ప్రకృతి శాస్త్రం, రీజను. మనం ముందుకు పోవాలనుకుంటే తరతరాలనుండి మనలో వ్యాపించియున్న వెర్రి వెనక్కు లాగుతున్నది. ఇక నమ్మకాలు, మూఢవిశ్వాసాలు, అజ్ఞానపు అలవాట్లు, ఆలోచన రహితములైనవి మనకెన్నో ఉన్నవి.

1. జడ ప్రకృతికి సంబంధించినవి.

తోకచుక్క కనపడితే ఎవడో గొప్పవాడు మరణిస్తాడు. అమావాస్యనాడు బచ్చలికూర కోయకూడదు. అమావాస్య నాడు పుడితే దొంగ అవుతాడు. మూలనక్షత్రాన జన్మించ గూడదు. ద్వాదశి దగ్ధయోగము. స్వాతివానకు ముత్యాలు తయారవుతాయి. అర్జునుని పదిపేర్లు వల్లిస్తే పిడుగుపడదు. మేఘ ఘర్జన ఇంద్రుని రథధ్వని.

2 చెట్లు మొక్కలకు సంబంధించినవి.

రావిచెట్టుకు ప్రదక్షిణాలు చేస్తే స్త్రీలు గర్భిణులు అవుతారు. చింతచెట్టుమీద దయ్యాలుంటాయి. తులసిచెట్టుకు పూజచేస్తే కోరికలు సిద్ధిస్తాయి. ఇంటిలో మొండిచెయ్యి మొలిస్తే ఇల్లు విడిచిపెట్టాలి.

3 జంతువులకు జీవులకు సంబంధించినవి.

ఇంట్లో రోగి ఉండగా పులుగుపిట్ట అరిస్తే రోగి మరణిస్తాడు. కాకి ఇంట్లో ఎగిరితే ఇల్లు వదలాలి. గ్రద్ద ఇంటిమీద వాలినా అంతే. కాకి అరిస్తే ఇంటికి బంధువు వస్తాడు.

కాకుల మైథునంచూస్తే తాను చచ్చినట్లు బంధువులకు ఉత్తరం రాయాలి. ప్రొద్దున్నే పిల్లిని చూడగూడదు. బల్లి పతనమువల్ల కలిగే లాభనష్టాలు పంచాంగం చూస్తే తెలుస్తుంది.

తూనీగలు ఎగిరితే వాన కురుస్తుంది. కాకులు గూళ్ళు కడితే వానలు రావు. పాలపిట్ట దర్శనమైతే పరమాన్నం దొరుకుతుంది.

## 4 భూతాలు

దయ్యానికి మడమలుముందు, వ్రేళ్లు వెనుకకు ఉంటాయి. ఊరూర దయ్యాల నూతులు ఉంటూనే ఉంటాయి.

## 5 మాయ

ప్రయోగం, చాతబడి, దిష్టి మొదలైనవి ఈ శాఖలోనే వస్తాయి.

## 6 మంత్రాలు, తంత్రాలు

పాముకాటు, తేలుకాటు, చప్పి, ఇరుకు, వెక్కిళ్లు మొదలైనవాటికి మంత్రాలు, ప్రయోగాలకు విరుగుళ్లు మొదలైనవి, రక్షలు, తాయెత్తులు మున్నగునవి ఇందులో చెప్పబడతాయి.

## 7 గారడీ, భవిష్యత్ సూచన

ఈ శాఖలో సోది, పూనకములు, కలలు, శకునములు మొదలైనవి వస్తాయి.

8 స్వర్గం, నరకం, పుణ్యపాపాలను గురించి
9 ఇతర మూఢ విశ్వాసాలు, ఆచారాలు

గడపమీద కూర్చుని తుమ్మగూడదు. తుమ్మితే గడవని గండాలు. అందుచేత తుమ్మితే చిరంజీవి, శతాయుస్సు, మార్కండేయుడంత ఆయుస్సు అనాలి. రాత్రిపూట ఉప్పు దీపానికి చూపిస్తేనేగాని వేయగూడదు. ఎవరైనా ఎక్కడికైనా వెళుతుంటే ఎక్కడికని అడుగకూడదు. రోలుమీద కూర్చోరాదు. వాల్చినరోకలి దాటకూడదు నడుస్తూ పండ్లు తోముకుంటే అంతమేర చెరువు త్రవ్వించాలి. క్రొత్తగుడ్డకు పసుపు పెడితేగాని కట్టగూడదు. రాత్రిపూట ఈలవేస్తే పాములు వస్తాయి. మోకాలుమీద తలవంచుకొని కూర్చోరాదు. భోంచేస్తున్నప్పుడు ఎడమపాదం పట్టుకొంటే దరిద్రం. మగవాడు ఎక్కువసేపు భోజనంచేస్తే దరిద్రం. కోఅ అంటే పిల్లలు ఎదగరు. ఉప్పు చేతిలోవేస్తే కయ్యం వస్తుంది. అలాగే పందుముపుల్ల వేసినా.

రాగి రాకోరుతుంది. వెండి వెళ్ళకోరుతుంది. బంగారం బాగుకోరుతుంది. ఈ మాదిరి నమ్మకా లిప్పటికీ వున్నవి. మన జీవితమంతా నమ్మకాల పుట్ట.

ఘంటసాల బ్రహ్మాం అనే అతను ఘంటసాలలో వుండేవాడు. అతను సంతానంకొరకు వచ్చినవారికి విభూతిని యిచ్చేవాడు. కాని అతనికి మాత్రం సంతానంలేదు. ఆ సంగతి ఎవరూ ఆలోచించరు. నాకు అర్ధశేరు బియ్యంఇయ్యి నీకు ఆకలిలేకుండా చేస్తానంటే అందరు ఇచ్చేవారేగాని ఆకలి లేకుండాచేసే నీకు అర్ధశేరు బియ్యం ఎందుకని అడిగేవారు

లేరు. దున్నపోతు ఈనింది అంటే దూడను కట్టేయమనేవారే అంతా.

పూర్వం వర్షాలులేకపోతే నీళ్ళు పోంగించేవారు. కుంభాభిషేకాలు చేయించేవారు. నందిత్రిప్పేవారు. విరాట పర్వం చదివేవారు. వీటికి వర్షానికి ఏమీ సంబంధం లేదని భూగోళశాస్త్రం చెపుతుంది.

యిటువంటి నమ్మకాలు ప్రపంచంలో అన్ని జాతుల కును వుండేవి. మానవ స్వభావమంతా ఒకటే.

జ్ఞానము వేరు, విశ్వాసము వేరు, జ్ఞానము పెరిగినకొద్దీ విశ్వాసము తగ్గును.

## ఇళ్ళు-వాకిళ్ళు

పూర్వం ఇళ్ళు వాకిళ్లు యీ మాదిరిగా ఉండేవికావు. ఆనాడు అతివృష్టి అనావృష్టి దోషాలవల్ల కాటకాలు వచ్చి బాధలు పడేవాళ్ళు. చేతిలో పైసా ఉండేదికాదు. అంతా వస్తుమార్పిడో లేక పరస్పర సహాయమో. అందుచేత తాటా కుల ఇళ్ళేఉండేవి. పెంకుటిల్లు సుమారు 150 సం॥ల క్రితం ఏర్పడినట్లు తెలుస్తుంది.

ఘంటసాల లక్ష్మీనరసింహంగారిది మొదటి పెంకు టిల్లు. అందుచేతనే వారిని మొదట పెంకుటిల్లు వారనేవారు. ఇది ఇప్పటి కరణంగారింటి యెదుటున్నయిల్లు.

పెంకుటిళ్ళు ప్రథమంలో మకరాలుపెట్టి తర్వాత మట్టిగోడలుపెట్టి వేసేవారు. అతి వృష్టివల్ల గోడలుపోయినా మకరాలవల్ల నిలుస్తవని అలా చేసేవారు.తరువాత పచ్చిరాతి

గోడలు, లోపల పండురాతిగోడలు, వెలుపల కట్టడం జరిగింది. అటు పిమ్మటఅంతా పండురాతిగోడలె.

ఆ తర్వాత కట్టినఇళ్ళు యజమాని చేయి ఎత్తితే దూలాము అందాలని, యజమాని పడుకుంటే వసారా స్థంభము కాళ్ళకు ఆనుకొనే టట్లుండాలని అంటే ఇంటికి గాలి దెబ్బ తగలకుండాను, వసారా క్రుంగకుండాను ఉండాలని అట్లా కట్టేవారు. మొదట్లో కట్టిన ఇళ్ళకు బొంగులులేక తాటివాసము వేసేవారు. అప్పట్లో ఇనుపమేకు దొరికేది కాదు. అందువల్ల ఆ వాసానికి తడిక అల్లేవారు. దానిపైన పెంకు నేసేవారు.

పూర్వకాలపు ఇండ్లకు ఇనుపచువ్వలు లేనందునను, దొంగలభయము వలనను కిటికీలు ఉండేవికావు. ఇప్పటివలె రెక్క తలుపులుకాదు. ఏకాండపు తలుపులు వుండేవి.

అప్పట్లో సమిష్టి కుటుంబాలు వుండేవి గనుకమండువా ఇళ్లు కట్టేవారు.అదికూడ మధ్యభాగాన వేయక,ఒక గోడైనా కలసి వస్తుందని ఉత్తరపు సరిహద్దు గోడమీద వేసేవారు.

ఈ మండువా ఇండ్ల శ్రేష్టతను గురించి ఒకరు ఇలా వ్రాస్తున్నారు. ఇది గమనించ తగినది. "మనదేశంలో సంవత్సరానికి 9 నెలలు దక్షిణమునుండి గాలి వీచుచున్నదిగాన పడకగదులు దక్షిణ భాగమునందుంచ బడినవి. వంటిల్లు, నట్టిల్లు పడమర. తక్కిన లోపలిభాగము, చావడి, ఇందు మధ్యస్థముగ లోపలికంతకు వెలుగు వచ్చునందుకుగాను విశాలమైన మండువా. పైనుండి సూర్యచంద్రాదులు ఇంటి

లోనికి ప్రవేశించుదురు. ఇంటికి నాలుగువైపుల ద్వారములు, వసారాలు, అరుగులు. ఎండవాన లోపలికి పడకుండా నివారించుటకు వసారాలు,అరుగులు చిన్నపిల్లల ఆట పాటలందు దవిలి విశాలముగ దిరుగుటకును, రోగులు, వృద్ధులు స్వేచ్ఛగా నుండుటకు, పరదేశీయులు స్వేచ్ఛగా విశ్రమించుటకు ఈ దేశమున తలుపు తట్టనక్కర లేకుండగనే ఆతిథ్యము దొరుకును."

మండువా ఇండ్లలో పాతదిగా కన్పట్టేది అయినపూడి సుబ్బన్నగారిది. ఈ మధ్య అమెరికానుంచి వచ్చిన ఆనంద కుమారస్వామిగారి భార్య చూచి చాలా ఆనందించినది. ఆమెకు మన పాతఇండ్లన్నా, ఆచారాలన్న చాల ఇష్టము. తలంటుపోసికొనే ఉత్తమ ఆచారము సన్నగిల్లు తున్నందుకు ఆమె చాల బాధపడింది.

మండువా ఇండ్లలో వేమూరి రామన్నగారి ఇల్లూ పురాతనమైనదేగాక, విశాలమైనది. గొర్రెపాటి బాల కృష్ణమ్మగారి మండువా ఇల్లు అనంతరం కట్టబడినది. ఆయన ఎంత అందమయినవాడో ఆ ఇల్లు అంతే అందమైనది. ఆయన హృదయము ఎంత విశాలమైనదో ఆయన కచేరి చావిడి అంత విశాలమైనది. దానిలో పంకా అదీ ఉండేది. అది ఆనాటి సంస్కృతీ నిలయం. ఆయన గొప్ప వేదాంతి. ఈ గ్రామంలోకల్లా గొప్పవాడు. పదిమందికి చెప్పనేర్చిన వాడు. పదిమందిచేత ప్రశంసింప బడ్డవాడు. ఆయనకీర్తి హైదరాబాదు వరకు వ్యాపించింది. కొందరు తెలియనివారు ఆయన యిల్లే ఆయనకు ఖ్యాతి తెస్తున్నదని అనుకునేవారు. ఆయన

సంస్కారాన్నిబట్టే ఆయన అటువంటి ఇల్లు కట్టారని ఆలోచించేవారు కాదు.

బొంగులు, తాటివాసాలు తర్వాత టేకువాసము వచ్చింది. ఇప్పుడు ఈ గ్రామములో పెంకుటిండ్లు అధికంగా ఉన్నా, పూర్వం హెచ్చుగా తాటి ఆకులవి,తుంగవి,రెల్లువి.

ఈ గ్రామములో ప్రత్యేకించి పేర్కొన తగిన ఇళ్ళలో బారకీచుగా పోలీసులైను మాదిరిగా ఉన్న పెద్ద శెట్టిగారి ఇల్లు. వారు ఎంతో ఐకమత్యంతోను, అనురాగంతోను వుంటేనేగాని వారు ఆ ఇంట్లో ఉండలేరు.

పూర్వకాలంలో ప్రహారీలు ఇంత అందచందంగా వుండేవికావు. మట్టిగోడలు పెట్టి మిరపకంపతో మదురు వేసేవారు. అతివృష్టికి అవి పడిపోయేవి. ప్రహారీ గోడలున్నా ప్రహారీకి దరవాజా లుండేవి కావు.

సుమారు 50, 60 సం॥ల క్రిందట ఇండ్లకు చుట్టూ రాతి ప్రహారీ గోడలు దానిని ఆనుకొని వున్న అరుగులు గ్రామానికి శోభ చేకూర్చినవి.

పూర్వపు ఇండ్లలో తనాబి, సింహద్వారము ప్రత్యేక పనితనము కలిగి సౌందర్య విలసితముగా వుండేవి. తనాబీకి నాము తీసి మధ్యభాగమున పద్మం చెక్కేవారు. పద్మము పవిత్ర హృదయమునకు, మానవునిలో భగవత్సంబంధమైన ఉత్తమ ఆలోచనలకు చిహ్నము.

అదిఎంతో అందంగాను ఆకర్షవంతంగాను ఉండేది. తనాబీక్రిందనుండే నదరు స్తంభములు ఎనిమిది పలకలగా

చెక్క పైన పీటలక్రింద ఎంతో నగిషీపని చేసేవారు. ఆ పీటలుకూడ సాదాగా ఉండక కళాన్వితముగా ఉండేవి.

ప్రతి యింటికి సింహద్వారాన్ని వండ్రంగి తన కళా కౌశలం అంతా చూపించి నేర్పుగా చేసేవాడు. వాటి మధ్య భాగాన పద్మములు, తతిమ్మా భాగమంతా లతలుతోను నింపేవారు. క్రిందిభాగాన పసుపు కుంకుమ పెట్టుకొనుటకు గాను కప్పులు తీసేవారు. సింహ ద్వారంపైన గుర్రపు పీట లుండేవి. దానిమీద గుర్రపు ముఖం కలిగి పనితనమును కలిగిఉండేవి. అందుచేతనే వాటికి గుర్రపు పీటలనేపేరు వచ్చినది. సింహద్వారమునకు రెండువైపులా ఇవి ఉండేవి. ఆ గుర్రపు పీటలమీద గోడుగుబల్ల, ఆ బల్లమధ్య భాగాన పద్మము ఉండి ఇటు అటు లతలు, చిలకలు వగైరా ఉండేవి. ఈ గోడుగుబల్లమీద యజమాని బొట్టుపెట్టి, పాతకాలపు భారత భాగవతములు ఉండేవి.

సంపన్న గృహస్థులు తలచావిడి, లేకకచేరీ చావిడి ఇంటిముందు వేరుగావేసేవారు. దానిలో ఈనాటి కుర్చీలవలె తక్తాబల్లలుండేవి.

ఈ మండువా ఇళ్ళ పంపిణీకాలములోనే రెండు మేడలు కట్టబడినవి. ఒకటి గోరెపాటి చినశ్రీరాములుగారిది, రెండవది సుబేదారు బ్రహ్మయ్యగారిది.

పూర్వకాలంలో పంటలు పండకపోవటం, పండిన వాటికి ధరలు లేకపోవటంవల్ల అంతా కలిసిఉండేవారు. విడిపోవటానికి ఇష్టపడేవారుకాదు. ఆ నాడు అంగ బలానికి

ప్రాముఖ్యత. నలుగురు కలసిఉంటేనే సుఖము, ప్రతిష్ఠగా భావించబడేది.

గత 40 ఏండ్లలో సుభిక్షమేర్పడి ధరలు పెరిగినవి. దీని వల్ల పంపిణీలు చేసుకొంటే సుఖ సంతోషాలతో బ్రతక వచ్చునని అపేక్ష ఏర్పడినది. అందువల్ల ముందువా పంపిణీ పోయి చిన్నసైజులో ఒంటిళ్ళు వెనకముందు వసారాలతో కట్టుచున్నారు.

అనంతరం కొందరు డాబాలుకట్టడం ప్రారంభించారు, మరికొందరు మేడలు.

పూర్వం గృహాలలో ఉండేవైశాల్యం, నగిషీ నేడు పోయి, సాదాతనము వచ్చింది.

## గృహాలంకరణ

పూర్వపు తలుపులకు, దరవాజాలకు కావిరాయి రాసేవారు. గడపలకు, దరవాజాలకు క్రిందభాగములకు పసుపురాసి కుంకుమ పెట్టేవారు. గోడలకు సున్నము, కావిరాయి పట్టీలు వేసేవారు.

దరవాజాలకు వేసిన కావిరాయి స్థానే వార్నీషు, గడపలకు పసుపు, ఎరుపు కాగితములు అంటిస్తుండేవారు. ఆకుపచ్చ రంగుకాగితము కత్తిరించి తోరణములు కట్టేవారు. నేడు అనేక రకములైన వార్నీషులు, ఆయిల్ పెయింటింగ్‌లు అమలులోనికి వచ్చినవి.

పూర్వం ఇళ్ళు అలికినప్పుడు మామూలా ముగ్గులేసే

వారు. అవి తుడిస్తే తేలికగాపోయేవి.ఇప్పుడు వాటిస్థానే పిండి ముగ్గులు వచ్చినవి. ఎక్కువకాలం వుంటున్నవి.

ఇంట్లో అలంకరణ నిమిత్తము గోడలకు అంగుళం వెడల్పుగల రంగురంగుల గుడ్డసంచులు వేసేవారు. గుడ్డతో కుట్టిన చిలకలు దూలాలకు కట్టేవారు. కృష్ణుడు, ఆంజనేయుడు మొదలగు పౌరాణిక చిత్రపటములు గోడకు తగిలించేవారు. వీటి అద్దాలకు వెనుకవైపున రంగులతో చిత్రింపబడివుండేవి. అనంతరం రాజా రవివర్మ పౌరాణిక చిత్రాలు గోడల నలంకరించినవి. తర్వాత దేశనాయకుల, జాతీయ వీరుల చిత్రపటాలు వాటిస్థానంలో ఆక్రమించినవి.

## గృహోప కరణములు

పూర్వకాలంలో ధనికులు దరిద్రులు అనే భేదం లేకుండా అందరు అన్నింటికి మట్టిపాత్రలనే వాడేవారు. నేటికీ శుభాశుభ కార్యాలకు వాటినే వాడటం. భోజనం చేయుటకు కంచం, మంచినీళ్ళు త్రాగుటకు కంచుచెంబు, ఇతర వుపయోగానికి మాత్రం ఇత్తడిచెంబు వుండేది.

కంచుతో చేయబడినదిగనుక కంచము, కంచుచెంబు అనుపేరు వచ్చినది. కంచాలు రెండు రకాలుగా వుండేవి. అంచున్నదానిని కంచం, అంచు లేనిదానిని బోడికంచం అనేవారు. ఆనాడు కంచరులు విశేషంగా వుండేవారు.

తర్వాత అనేక విధాల రాగిచెంబులు వచ్చినవి,కుంభకోణంచెంబు, నిలువుచెంబు, దోసకాయచెంబు. ఈ చెంబులు విశేషంగా వ్యాప్తిలోవుండేవి.

సుమారు 50 ఏండ్ల క్రితం రమణక్కపేట నుండి కంచర మాణిక్యం అనే అతను గంటలమ్మ చింతదగ్గర డేరావేసి ఒక నెలరోజులువుండి రాగిపాత్రలను అరువుగా యిచ్చి కవిలితెర (తాటాకులపైన) పద్దులు వ్రాసుకొని వాయిదా బందీమీద వసూలు చేసుకొనేవాడు.

భోజనపాత్రలలో కంచాలు, కంచుచెంబులుపోయి, పింగాణీవివచ్చినవి. వాటిని జర్మను సిల్వరు పాత్రలు నెట్టినవి.

స్టెయిన్ లెస్ స్టీలు పాత్రలు అటుపిమ్మట అనగా నేడు వచ్చి వెండిపాత్రల ప్రాముఖ్యతను తగ్గించినవి.

నేటిసామగ్రి వ్రాయాలంటే ఒక గ్రంధమగుతుంది.

పూర్వం మేదరుపెట్టెలు, తట్టలు అల్లించి వాటికి తోలుమూయించి పంచెలు అవి పెట్టుకొనేవారు. వీటిని బోణపు పెట్టెలని, బోణపు తట్టలని అనేవారు. నగలుకూడ చిన్న బుట్టల్లోనే పెట్టుకొనేవారు. బుట్టెడు నగలుపెడ్తారు ముసలివాడైతేం, చేసుకోమని పిల్లలను హెచ్చరించేవారు. తర్వాత కావిడిపెట్టెలు వచ్చినవి.

అటుపిమ్మట ట్రంకులు అనంతరం యిప్పుడు ఇనుప పెట్టెలు, గాడ్రేజ్ పెట్టెలవలె పూర్వం భోషాణం వుపయోగ పడేది. దానిలో విలువగల వస్తువులన్నీ పెట్టి దానిమీద పండుకొనేవారు; ఆ కాలంలో దొంగలభయం అధికమైనందున.

ఈ భోషాణంలో చిన్నపెట్టె ఒకటివుండేది. దానిని సందువాపెట్టె అనేవారు. సందూక్, అనగా చిన్నపెట్టెని అర్థం. దీనిలోనోట్లు వగైరా వుంచేవారు.

## వేష భూషణాలంకరణములు

ఇప్పటివలెగాక మనవారి కట్టు, బొట్టు, జుట్టు కులం వారీగా వుండెడివి. మనిషిని చూడగానే కనుక్కొనటానికి వీలుగా వుండేది.

నలభై ముప్ఫైయేళ్ళనుండి మారిపోయినవి. సంఘ కట్టుబాట్లు సడలటం, మిల్లువస్త్రాలు రావటం, ఇంగ్లీషు చదువులు, రోడ్లు రవాణాలువచ్చి పల్లెల్నే మార్చినవి.

ఇరవయ్యో శతాబ్దమువరకు శిల్పము, అదినేతగాని, మరొక పనిముట్టుగాని సాధారణ మానవుని జీవితానికి సంబంధించినదిగా వుండేది.

అమ్మేవారు కొనేవారు చేతిపనులను అభిమానించే వారు కనుక అభివృద్ధిగాంచినవి.

Life and art were still human, not mechonical and quality still courts for morc than quantity.

స్థానికంగా నేసిన, లేక నేయించుకున్న వస్త్రాలనే ధరిస్తూవుండేవారు.

ఆ కాలంలో ఇంటింట రాటములుండేవి. ప్రతి రాటములుండేవి. ప్రతి ఏకి ఏకులుచేసి నూలు వడికేవారు స్త్రీలు. ఆ నూలుతో బట్టలు నేయించుకొనేవారు.

మాల నూలు చాలా శ్రేష్ఠముగావుండేది. 60, 70 నెంబరున ఉండేది. వారు ఏకుకి బొక్కెనపెట్టి వడికేవారు బొక్కెనంటే నేటి బొక్కెనకాదు సన్ననితోలుది.

నేత, మాలలు, సాలీలు నేసెడివారు కనుకనే, సాలి

నేత, మాలనేత అని వచ్చింది. మాలలకంటే సాలీలు బాగా నేసెడివారు.

సాలీలకు కూలియిచ్చి పురమాయింపుగా నేయించుకునేవారు. గంజికిగాను చలికూడు గింజలని అడ్డెడు యిచ్చేవారు. మూరకు అర్ధణాకూలి యిచ్చేవారు.

ధోవతులు తొమ్మిది మూరలుండేవి, ఉత్తరీయాలు ఆరుమూర లుండేవి. చీరలు 16 మూర లుండేవి. రెండు చీరెలు రెండు సంవత్సరముండేవి.

చీరెలు

చిలక ముక్కులుకోక, మైజారుకోక, కాట్టెడుకోక, రక్తకాట్టెడుకోక, కూళంకోక, నాగులుకోక, ఎఱ్ఱనాగులు కోక, తోపుకోక, జిల్లాలుకోక, ముదురు చెంగావికోక, పాల చెంగావికోక, చుట్టుచెంగావికోక, బొమ్మంచుకోక, నీలికమ్మి కోక, జలతారుకోక, మొదలగు చీరెలను ధరించెడివారు.

కొత్తకోకలు, కట్టుకొనేముందు ఒకతంతు వుండేది. బ్రాహ్మణునకు బియ్యమడియిచ్చి కోక కట్టుకొనేవారు. దీనికే కోక లెక్కించుకోవటమని, కోకలు తీర్చుకోవటమని అనే వారు. సుబ్బారాయుడి షష్ఠికి ఇది అధికంగా జరిగేది.

రవికెలు

అరటిగెల, సందేళ్ళు, సన్నమొగలు, కవలాలు, పీపు సేర్లు, ఓమనగుంట పట్టెలు, బాజీబందు.

రోజువారి తొడుగుకొనే రవికెలు అర్ధణా యిస్తే కుట్టేవారు. పూసలువేసి కుట్టినవాటికి అణా. తెల్లు, మంద్ర

గబ్బలు, పక్షులు వీటిబొమ్మలు వేసికుట్టితే రెండణాలు. ఈ గ్రామంలో బోయీలు, పాలెపు జంగాలు వృత్తిగా కుట్టే వారు. ఆకాలంలో అందరకు కుట్టే నేర్పు ఉండేది కాదు. కుట్టనేర్చినవారు కొందరే ఉండేవారు. వారికి వడ్లు దంచ టంగాని నూలు వడకటంగాని ప్రత్యామ్నాయంగా చేసి కుట్టించుకొనేవారు.

## సాదా రవికెలు

నల్లతోపు,బొంబాయి,ఉగ్గడపు సూచీలు, మోజాలు మొదలగు గుడ్డలతో రవికెలు కుట్టబడేవి.

## పురుషులు

చెంగావిపంచెలు విశేషంగాఉండేవి. చుట్టి చెంగావి, జలతారు, జాఫరావిత్తుల రంగుపంచెలు ధరించేవారు. రోజు వారీ కట్టుకొనేవాటిని నీరుకావి పంచెలనేవారు. ఇప్పటి ఇస్త్రీ వలెనే పూర్వము నానుపువేసేవారు.వాటిని దాపుడు పంచెలు లేక నానుపుపంచెలు అనేవారు. పొరుగూరు వెళ్ళేటప్పుడు, పండుగ పబ్బాలకు వాటిని కట్టుకొనేవారు.

పిల్లలు కొంతకాలం అనగా బడి వయస్సు వచ్చే వరకు దిశమొలతో ఉండేవారు. ఆడపిల్లలకు మదుగుబిళ్ళ లుండేవి. తర్వాతగోచి, అనంతరం మట్టలాగు, తరువాత శారులాగు, ఆ పిమ్మట అంగవస్త్రము.

పెద్దలు మూరెడువెడల్పు,ముప్ఫైమూళ్ళ పొడుగుగల తెల్ల నితట్ట తలగుడ్డచుట్టుకొని, ఉత్తరీయం మడత వేసుకొనే వారు. చేతిలో పన్నుకర్ర కాళ్ళకు చెప్పులువుండేవి.

కొందరు బొందుల అంగరకాలు తొడుక్కునేవారు.

వైదికులు ఒక అంగవస్త్రం కట్టుకొని మరొకటి పైన వేసుకొనేవారు. సంధ్యావందనం తప్పకుండా చేసి విభూతి దాల్చేవారు. భోజనం చేసేముందు గంధాక్షతలు పెట్టుకొనేవారు.

వైష్ణవులు గండభేరుండ అంచులుగల వస్త్రములు ధరించేవారు.

శైతాంగమంతా ఒకేమాదిరి గోరంచు ధోవతులు కట్టుకొని చెంగులు పైకి దోపుకొనేవారు. కుచ్చుతలగుడ్డలు చుట్టుకొనేవారు. పాటకజనం కుచ్చులేని తలగుడ్డలు చుట్టేవారు. గొల్లలు, స్త్రీలు పురుషులుకూడ ఎర్రంచు(లక్కంచు) దుస్తులను ధరించేవారు. వారిలో స్త్రీలు రవికెలను ధరించేవారు కారు. శ్రీ కృష్ణుడెత్తుకొని పోయాడట !

మాల మాదిగలు మరీ పూర్వకాలపు వారు కట్టు పంచెను గోచిగాపెట్టి మొలచుట్టూ చుట్టేవారు

బ్రాహ్మణ స్త్రీలు కొప్పు పెట్టుకొనుట, కచ్చపోసి చీరె కట్టుకొనుట మర్యాదగా భావించుచుండిరి.

వైష్ణవులు, వైశ్యులు గోచిపెట్టుకొని చీరెలు ధరించేవారు. వైశ్యులుకూడా నేటికిని పెద్దవారు కచ్చపోసి చీరె కట్టుకొనుట మర్యాదగా భావిస్తున్నారు.

చంద్రవంక, మొగలిరేకు, సిగబిళ్ళ, తమలపాకు, తిరుగుడుపువ్వు తలకు స్త్రీలు ధరించేవారు.

కమ్మలు, గూబాణీలు, పచ్చలు, బావిణీలు, రావి ఆకులు, కుచ్చులు, పోగడులు, కత్తెర బావిణీలు, జంపులు చెవులకు ధరించేవారు.

ముక్కుకు బులాకి, కుందనపు కాడలు, పుడకలు ధరించేవారు.

దండకడియం, బాజీబందులు, కుచ్చులు, పోగడులు, తాబేదులు, వంకీలు చేతులకు ధరించేవారు.

ఉత్తండాలు, కుదిగంట్లు, కట్ట అడ్డిగెలు, గోధుమ పూసలు, గల్లాపట్టెడ మెడకు ధరించేవారు.

పుదుచ్చేరీనాను, పుదుచ్చేరీపట్టెడ, కంటె, కాసుల పేరు, మురుగులు, పోచీమురుగులు, తర్వాత ఆభరణ ములుగావచ్చి అంతరించినవి.

నడుముకు సాధారణస్త్రీలు వెండి వడ్డాణము, భాగ్యవంతులు బంగారపువడ్డాణం ధరిస్తూండేవారు. వీటిలో గజ్జెల వడ్డాణం ఒకటి.

పై కడియాలు, క్రిందకడియాలు ఇవి ప్రాచీనమైనవి. ఇటీవల గజ్జెలు, గొలుసులు, పావడాలు, పాంజేబు పట్టాలు, వచ్చినవి.

కాళ్ళవేళ్ళకు మట్టెలు, పిల్లెళ్ళు ధరించెడివారు.

పూర్వకాలంలో అలంకరణే తమ ఆధిక్యతగాభావించే వారు.

'ఎరువులసొమ్ము బరువుల చేటు, తియ్యాపెట్టా తీపుల చేటు.'

'పెళ్ళికి పెట్టుకుపో, తీర్థానికి తీసిపో.'

ఈనాడు ఆభరణములలో అనేక మార్పులువస్తూ ఉన్నాయి. ఒక బంగారపు పనివాడు ఈ విధంగా అన్నాడు. బంగారంమూది, శృంగారంమీాది అని. పూర్వం ఏ విషయం లోను మార్పులేదు. నేడంతా మార్పే.

పూర్వం బ్రాహ్మణులలో పెండ్లికూతురు ఆభరణములకై సంబంధములు కుదుర్చుకొనేవారు. ఎందుచేతనంటే బ్రతికుంటే ఆభరణం, చనిపోతే భరణంగా ఉండేది.

సాధారణ స్త్రీలు, ముసలివారు కొప్పుపెట్టుకొనేవారు. పిల్లలు కొండెసిగ వేసుకొనేవారు. కొండె చుట్టుకొనేవారు.

వాలుజడ, ముచ్చటముడి, వేలుముడి, బర్మాముడి, రింగుముడి తర్వాత వచ్చినవి.

స్త్రీలు అలంకరణ నిమిత్తము ఎంతో బాధపడి ముఖమున, కుడిబుగ్గన, దండచేతిమీాద పచ్చపొడిపించు కొనేవారు.

ముఖమునకు పసుపురాసుకొని కుంకుమబొట్టు ధరించుచుండిరి. కాళ్ళకు పసుపు, పారాణి పెట్టుకొనుట శుభప్రదముగ ఎంచుచుండిరి. కళ్ళకు కాటుక,పళ్ళకుకప్పుతోము కొనేవారు. ఇవన్నీ ఆనాడు అందమునకు ఆరోగ్యమునకు ఉపకరించేవి.

గోరింటాకు వేసుకొనేవారు. దానితో కాళ్ళకు పారాణీలు, రకరకాలుగా చేతులకు వేసుకొనేవారు.

దేహాలంకరణకు మానవుడు మొదట ప్రాముఖ్యత ఇచ్చాడు. సంఘంలో అలంకరణ సాధనలకున్నంత గౌరవము కేవల ముఖయోగకరమైన వస్తువులకు లేదు.

స్త్రీలు పురుషులకన్న అన్నిరంగములలోను సౌందర్యమునే గమనింతురు.

నాగరికత అభివృద్ధి చెందినకొద్దీ పురుషులలో వస్త్రధారణ, సౌందర్యముకంటే సౌఖ్యము, అధిక దృష్టిలోకి వచ్చినది.

పురుషులుకూడ ఆనాడు అధికంగా అలంకరణయందు అనురాగము చూపేవారు. చెవులకు పోగులు, దిమ్మెలు, నడుముకు సాధారణులు తాయెత్తులు, కొంచంబాగా ఉన్నవారు బిళ్ళల మొలత్రాడు, ఇంకా ధనవంతులు గోవ మొలత్రాడు, మరీ ధనవంతులు బంగారు గోవమొలత్రాడు ధరించెడివారు. ధనవంతులలో పెద్దవాళ్ళు చామపువ్వ కడియం (బంగారపుది) ధరించేవారు. ఇది చాలా అందమైనది.

అనంతరం అంగుళీవు వెడల్పు బంగారపు మురుగులు, మురుడీ గొలుసులు, ఏడురాళ్ళ పోగులు పెట్టుకొనేవారు,

సాధారణ జనుల మగపిల్లలు వెండి మురుగులు, మొలబిళ్ళలు, తాయెత్తులు, కాళ్ళకు కడియాలు, చెవులకు పోగులు, మెడకు కంటె ధరించేవారు.

పూర్వం చిన్నపిల్లలకు జుట్టు, జులపాలు ఉండేవి; కణతలవద్ద జులపాలు, మధ్యన జుట్టుఉండేది.

మధ్య వయస్సువారు తలమధ్యన పిడికెడు జుట్టు ఉంచుకొనేవారు.

కొంచెము నాజూకు వారు కణతలవరకు జుట్టునంతా ఉంచుకొని జులపాలు ఉంచేవారు.

మరికొందరు పాయ్యిలు పెట్టించుకొనేవారు. కొంత కాలానికి కొందరు సగం అంట కత్తెరింపు వేయించుకొని సగం క్షవరం చేయించుకొనేవారు. దీన్ని స్వదేశీ అని గుండు అని ఆ కాలంలో అనేవారు. మరికొందరు గిరజాలు పెట్టుకొనేవారు. పురుషులలో కూడ కొందరు వేలుముడి, ముచ్చటముడి వేసుకొనేవారు.

ఇప్పుడు పురుషులలో చాలమంది పెద్దవారు గోచి చెంగును జారవిడిచి కుచ్చెళ్ళుపోసి కట్టుకొంటున్నారు. యువకులు కొందరు గూడకట్టు కట్టుతున్నారు. కొందరు షర్టును, మరికొందరు లాల్చీని మరికొందరు ఆఫ్‌షర్టును ధరిస్తున్నారు. కొందరు ఉత్తరీయమును వేసుకొంటున్నారు. యువకులలో కొంతమందికి ఉత్తరీయము వేసుకొనే అలవాటులేదు.

పూర్వకాలంలో జుట్టు, మీసం తీయించటం పౌరుష హీనంగాను; నామర్దాగాను ఉండేది. మీసం పౌరుషమునకు చిహ్నంగా ఉండేది. బుగ్గమీసం, పుస్తిమీసం, కోరమీసం, మొదలగు మీసాలను అందంగా పెంచేవారు.

ఇప్పుడు అందరూ క్రాపు చేయించుకొనేవారే. ఇప్పుడు కొద్దిమంది మాత్రమే మీసములను ఉంచుకొంటున్నారు. యువకులు కొంతమంది హిట్లరు మీసమును పెట్టున్నారు.

పూర్వపు పెద్దలు పంగనామములు పెట్టుకొనేవారు. మధ్యకారువారు తిరుచూర్ణముతో బొట్టు పెట్టుకొనేవారు. ఎవరైనా బొట్టుపెట్టుకోకపోతే ఆక్షేపించేవారు. సాధారణంగా రైతాంగం భోజనానికిముందు బొట్టు పెట్టుకొనేవారు. బొట్టు పెట్టుకొంటే భోజనము చేసినట్లు గుర్తు. నేడెవరూ బొట్టు పెట్టుకొనడం లేదు.

కొందరు యువకులు పంట్లాము బుష్‌షర్టులు ధరిస్తున్నారు

పూర్వం స్త్రీలు, చిన్నపిల్లలు కాళ్ళకు చెప్పులు వేసుకొనేవారుకారు. ఇప్పుడు అందరూ వేసుకొంటున్నారు.

పూర్వం పొలంవెళ్ళే వారందరూ తగరంవేసిన కిర్రు చెప్పులు తొడుక్కునేవారు. ఇప్పుడు అన్నీ పైనుంచి వచ్చినవే. కొందరు సాధారణ చెప్పులును, మరికొందరు స్పాంజి, మరికొందరు బూట్లు వాడుచున్నారు.

ఈ కాలమున స్త్రీలు చాలమంది రకరకాలైన చీరలను, జాకెట్లను, నగలను ధరిస్తున్నారు. సినిమాలలో కనపడు వేషభూషణా లంకరణములను అనుకరించుటకు ఆతుర్దా పడుతున్నారు.

కొంతమంది యువతులు వాయిలు, సాటిన్, జార్జెట్, ట్వింకిల్ సాటిన్, రేయాన్, నైలాన్, టెరిలిన్ మొదలగు వస్త్రములను, మరికొందరు ఖద్దరు, ఇంకాకొందరు నేతబట్టలను ధరిస్తున్నారు.

పూర్వపు రవికెలు ధరించువారు అరుదు. రవికెలు తరువాత కొంతకాలమునకు గుండీరవికె వచ్చినవి. అదీ అంత

రించినది. నేడు బాడీవేసుకొని దానిపై జాకెట్టును వేసుకొంటున్నారు. ఇదే విధంగా లంగామీద చీరె ధరిస్తున్నారు.

చెవులకు చిత్ర విచిత్రమైన దుద్దులను, కమ్మలను, షోగులను, లోలకులను ధరించేవారు. ఒకప్పుడు ఏడురాళ్ళ షోగులు ఫ్యాషన్ అయినది. అదీ అంతరించింది.

నేడు పెద్దవారు షోగులను, విద్యార్థినులు రింగులను పెట్టుకొంటున్నారు.

మెడలో నెక్లేస్, నానుతాడు, అడ్డిగలు ధరిస్తున్నారు.

చేతులకు కొందరు బంగారపుగాజులు, మరికొందరు వివిధములైన రబ్బరుగాజులను వేసుకొంటున్నారు.

చాలామంది నల్లపూసలు నాశనము చేయటంలేదు. కొందరు మంగళసూత్రం బానిసత్వానికి గుర్తుగా భావిస్తున్నారు.

ముక్కుపుడకలను, బేసరులను ధరించెడివారు నేడు లేరు.

నేటి స్త్రీలలో కొందరు ముఖమునకు రకరకములైన పౌడరులను వాడుతున్నారు. తమ శిరోజములను వింత చుట్టలుగా చుట్టుచున్నారు. బడికిపోయే పిల్లలు రెండుజడలు వేసుకొంటున్నారు. కొందరు పెద్దవారు జడచుట్టలు వేసుకొని పిన్నులను ధరిస్తున్నారు.

స్త్రీలు ఇప్పుడు కాళ్ళకు కడియాలు, అందెలు మానివేసిరి. కాలివ్రేళ్ళకు మట్టెలు పారాణి పెట్టుకొనుట మోటుగా భావించిమానిరి.

నేడు ధనవంతులు తమపిల్లలకు తలకు పాపటి చేరు, జడబిళ్ళ, చేతులకు రాళ్ళవంకీలు పెట్టున్నారు.

వేషభూషణాలంకరణములలో పూర్వకాలమునకును నేటికిని చెప్పరానంత మార్పు వచ్చినది.

పూర్వము నగలకు ప్రాధాన్యమిచ్చేవారు. నేడు వస్త్రములకిస్తున్నారు.

పూర్వంకంటే అందరూ శుచీ శుభ్రంగా వుంటున్నారు.

పూర్వకాలములో ఎవరైనా స్త్రీలు అలంకరణకై ప్రయత్నిస్తే, నీవు సానివా సంసారివా ? అని మందలించేవారు.

నేడు మందలించేవారు లేకపోగా శుచీ శుభ్రముగా వుండగలందులకు హెచ్చరిస్తున్నారు.

నేడు కుల విచక్షణలేకుండా అందరూ చీరెలు ధరిస్తున్నారు. అలాగే పురుషుల వస్త్రధారణ. నేడు అందరకు ఒకటే కూడు, గుడ్డ.

## తిళ్ళూ - చిరుతిళ్ళు

బౌద్ధయుగము నాటి రాయి పద్దాలుగు వీసాల బారు అడుగు వెడల్పు వుండేది. దానిలో ధ్వాక కనపడుతుంది. కనుక ఆనాడు వరియన్నము తిన్నట్లు కనపడుతుంది.

రెండువందల సంవత్సరాలకు పూర్వం, అన్నానికి గుడ్డకుకూడా చాలా బాధపడట్టు తెలుస్తుంది.

ఆనాడు అధికంగా జొన్నన్నమే వాడుకలో వుండెను.

"జొన్న కలి జొన్న యంబలి
జొన్నన్నము జొన్నపిసరు జొన్నలెతప్పన్
సన్నన్నము సున్నసుమీ
పన్నుగ పల్నాటనునున్న ప్రజలందరకున్."

పల్నాడులోనేకాదు దేశమంతటా అంతే. అందు చేతనే 'ఆశపడి ఆరు లంకణాలుచేస్తే ఆనాడూ జొన్నకూడే' అని సామెత. వరి అన్నానికి వాసిపోయేవారు. సజ్జ, వరిగ, తమిద, మొక్క-జొన్న అన్నాల తర్వాత బుడమవచ్చింది. గుమ్మడితోటలు విశేషంగా వేసేవారు. గుమ్మడితోప, అనగా గుమ్మడికాయ పెద్దపెద్ద ముక్కలుగాకోసి వుడకేసుకొని తినే వారు. ఎక్కడో సకృతుగా వడ్లు పండేవి. ఏటిలో గోంగూర, కొరవి కారము అధికముగా ఆనాటి ఆధరువులు.

పాడి విశేషముగా వుండేది గాన అట్టే బాధవుండేది కాదు.

ఏదిపండితే అది తినేవారు. ఆనాటి జనులు చాలా ఆజాను బాహువులు, బలిష్టులు. వారి భోజనపద్ధతి అట్టిదే.

ఘంటసాలలో బలిష్టులని చెప్పబడే వారధికంగా దేవరకోట దోనేపూడివారి మేనళ్ళు, తత్సంబంధీకులే.

వేమూరి చలమన్నగారు, ఆయన మేనల్లుళ్ళు; దోనే పూడి కృష్ణమ్మ, గొర్రెపాటి వెంకయ్య, అప్పయ్యగారలు ఆజాను బాహువులు, దృఢకాయులు; అలాగే గొర్రెపాటి

వెంకట్రాయులు, గోపాలుడు, లక్ష్మీనారాయణ, కోటయ్య గారలు మంచిబలిష్టులు.

వీరిని మించినవారు, వేమూరి పట్టాభిరామయ్య, వెంకన్న గారలు—

పట్టాభిరామయ్యగారు భీమబలుడు, ఫిరంగిని కాళ్ళతో లేపినవాడు.

ఆబోతు పారకుండావుంటే దానికి మందు పెట్టటానికి గాను, దాన్ని మెక్కేసి, పట్టినబలశాలి పెద్దకాపు వెంకన్న గారు.

వీరంతా కసరతు చేసేవారివలె తిన్నవారుకారు. జొన్నన్నము, గోంగూర, గుమ్మిడితోప తిన్నవారు.

అటువంటి భీమబలులు వారు. ఆ వెంకన్నగారిది పెద్ద గళము. ఆయన మాట ఆమడదూరం వినపడేది. ఆయన రామభజన చేస్తూవుంటే ఎంతోదూరం వినపడేది. ఆయన కుమారులు, పట్టాభిరామయ్య, రత్తయ్యగారల గళాలూ అంతే.

ఆనాటివారు అంతాదృఢకాయులు. వారు భూపుత్రులు, ప్రకృతిబిడ్డలు. వారిదంతా వాత తత్త్వం. ఎన్నాళ్ళు లంకణా లున్నా వుండేవారు. వారు ఆకలైనపుడు తిన్నారు, నిద్ర వచ్చినపుడు పరున్నారు. అందుచేత వారారోగ్యవంతులు.

నేటివారంతా కాఫీగత ప్రాణులు. నానాటికి పుష్టి, శక్తీ తగ్గిపోతున్నది.

వెంపలి చెట్టుకు నిచ్చెనవేసుకుని యెక్కేవారు పుట్టారని అంటే ఆశ్చర్యపడ నక్కరలేదు.

## చిరుతిళ్ళు

పూర్వకాలంలో ప్రొద్దున చద్ది అన్నము, లేక తరవాణి తినేవారు. దీనినే తెలంగాణములో నాస్తా అంటారు.

ఉదయము భోజనము చేసినపిమ్మట మధ్యాహ్నము ఇప్పటివలె ఏమీ తినెడివారు కారు. వారసలు ఇంటివద్ద వుంటే గద. పనిపాటలు చేసుకొంటూ పొలాన వుండేవారు. సాయంత్రం నాగళ్ళు విడిచిన తర్వాత ఇంటికి వచ్చినపుడు చిరుతిళ్ళేమన్నా తిని, కాసేపు మంచాన వరిగి తర్వాత వేడినీళ్ళ స్నానం చేసి భోజనము చేసెడివారు.

ఆనాటి చిరుతిళ్ళు ఇంట్లో చేసినవే. కుడుములు అంటే ఎక్కువ ఆప్యాయతగా కనిపిస్తూంది. కనుకనే కుడుమిస్తే పండుగ అనె సామెత పుట్టివుండవచ్చు.

గుగ్గిళ్లు అనేక రకాలుండేవి. మొక్కజొన్న గుగ్గిలు అధికం. మొక్కజొన్నలు శనగలు కలిపి వేరే వండేవారు. అలాగే అనప గుగ్గిళ్ళు. శనగపప్పు చిన్నపిల్లలకు పెట్టేవారు.

పేలాలు - వడ్లపేలాలు, మొక్కజొన్న పేలాలు - మొక్కజొన్న పేలాలలో బాగా వేగనివాటిని మొటిమలనే వారు, అవంటే మరీ యిష్టంగా తినెడివారు.

రొట్టెలు- రొట్టెలు అనేకరకాలు చేసెడివారు. జొన్న రొట్టె, తమిదరొట్టె, బియ్యపురొట్టె, తెపాలారొట్టె.

వేయించిన శనగలు యెక్కువగా తినెడివారు. అధికంగా గట్టిపదార్థాలు తినటంవల్లనే వారిపళ్ళు వూడకుండా నూరు సంవత్సరాలవరకు గట్టిగా వుండేవి.

జంతికలు, జిల్లేడుకాయలు, పాలతాలికలు, బొబ్బట్లు, తిరుగమోతపిండి.

అటుకులు చాలా ప్రాచీన కాలమునుండి వస్తూవున్న చిరుతిండి. కుచేలుడు తన చిన్ననాటి సఖుడగు శ్రీకృష్ణున కిచ్చినసంగతి అందరెరిగినదే గద.

పండుగలకు

తొలి ఏకాదశినాడు పేలపిండి తినేవారు. తొలి ఏకాదశికి పేలపిండి తినకపోతే రాకాసులై పుట్తారనేడివారు.

దీపావళికి అట్లుపోసెడివారు.

సంక్రాంతికి అరిసెలు చేసెడివారు. ఆ కాలంలో ఈ అరిసెలుకూడా అందరుకు చేతయ్యేది కాదు. ఎవరినో ప్రతిమాలి చేయించుకొనేవారు.

పెళ్ళిళ్ళకుకూడ పంక్తులమీద అరిసెలే వడ్డించెడివారు.

క్షీరాన్నాన్ని పరమాన్నమనెడివారు. పాలల్లో బియ్యం పోసి వండటమే పరమాన్నము. పాలతాలెకలని వేరుగా వండేవారు.

గారెలు ఆంధ్రులకు అభిమానమైన పిండివంట. అందు చేతనే తింటే గారెలు తినాలి—అలాగే భారతం అభిమాన గ్రంథం, వింటే భారతం వినాలి, అలాగే పుత్రసంతానమం దభిమానం. అందువల్ల కంటే కొడుకును కనాలనే సామెత.

తింటే గారెలు తినాలి, వింటే భారతంవినాలి, కంటే కొడుకును కనాలి.

# ఆ ట లు

ప్రాచీన కాలమునుండి గ్రామీణక్రీడలు అభివృద్ధి పొందుతూ వచ్చినవి. నవనాగరికతవల్ల అవి అంతరించినవి. వాటిలో కొన్నింటిని పేర్కొంటున్నాను.

మరీ చిన్నపిల్లలాట తాటాకులతో బొమ్మలు చేయించుకొని, వాటికి కొన్ని గుడ్డపీలికలుకట్టి, బొమ్మలాటలాడేవారు. బొమ్మల పెళ్ళిళ్ళు, గుజ్జెనగూళ్ళు రుక్మిణీ కల్యాణములో చూస్తాము.

ఆడపిల్లలు, చెమ్మచెక్క, నాలుగు స్తంభాలాట, కోకు, చెండాట, కాళ్ళాగజ్జి, ఒప్పులకుప్ప, గుడుగుడుగుంచం, చింతగింజలు, గవ్వలాట, అచ్చంగాయలు,పచ్చీసు, ఓమనగుంటలు, వైకుంఠపాళి, దాగుడుమూతలు.

మగపిల్లలు కథలు చెప్పటం, పొడుపుకథలు. అవ్వా-అప్పచ్చి, పుల్లాట, దొంగాట, తొక్కుడుబిళ్ళ, చెండాట, కోకు,కుందికోకు, గోలీలు, దేకులాట, దెబ్బకు గోలిఆట, కోతికొమ్మచ్చి, గోడుబిళ్ళ, ఉప్పుపట్టి, చెరపట్టి, చెడుగుడి.

పెద్దలు, పులిజూదము, చదరంగము; ఈ రెండూ ఆడటంలో గొర్రెపాటి రామయ్యగారు పట్టుపట్టేవాడు. తాను ఓడితే గెలిచేవరకు నిద్రపోయేవాడుకాడు.

రాత్రిళ్ళు, 9 గంటలవరకు బాలురు వీధులలో ఆడుతుండేవారు.

యువకులు చెడుగుడి 11, 12 గంటలవరకు ఆడుతుండేవారు.

చెడుగుడి తెలుగువారి జాతీయక్రీడ. ఈ ఆటలో వేమూరి పట్టాభిరామయ్యగారు ప్రసిద్ధుడు. ఆయన అంకినీడు (1791_1831) జమీందారుగారితో ఆడి, ఆయనను ఓడించిన ఆటగాడు.

జమీందార్లుకూడా ఆ కాలములో చెడుగుడి ఆడే వారు. పట్టాభిరామయ్య మంచి ఆటగాడని జమీందారు పిలిపించి, తానొక బద్దిలో వుండి కొందరిని తీసుకొని, పట్టాభిరామయ్య నొకవైపున వుంచి, ఆయనకు కొందరినిచ్చి ఆడసాగిరి. రెండుఆటలూ అంకినీడుగారే గెలిచిరి. అంతటాయన ఈయనను బావమరది వరుసను సరాగమాడి, 'నీ కుట్టికాల! నీ ఆట ఇంతేనటోయ్' అని హేళన చేసెను.

అందుకు పట్టాభిరామయ్య 'అది కాదండి! మీరు ప్రభువులు! కాలే తగులునో చెయ్యే తగులునోనని సందేహించాను' అన్నాడు.

'ఆటలో అదేమిటి? ఆడు, నీ యిష్టమొచ్చినట్లు' అన్నాడాయన.

'సరే! కాచుకొండి' అని హెచ్చరించాడు పట్టాభిరామయ్యగారు.

జమీందారుగారు కూతయిచ్చి వెళ్ళిన తర్వాత పట్టాభిరామయ్య కూతయిస్తూ ఒక్కతన్ను తన్నేసరికి జమీందారుగారు బిళ్ళంగోడువలె పైకి ఎగిరాడు. పైకి ఎగిరిన వాడిని క్రిందపడకుండా బంతిని పట్టుకున్నట్లు పట్టుకున్నాడు పట్టాభి.

అప్పుడు జమీందారు ఆశ్చర్యపోయి 'మంచి ఆటగాడి వోయ్‌' అని ప్రశంసించాడు.

ప్రక్కనవున్న ఆయన పినతండ్రి నరసన్న 'అయ్యా! ఆటలో నేగాదు, మావాడు మంచిబలిశాలి, సెలవైతే ఫిరంగి లేపిస్తా' నన్నాడు.

అంకినీడుగారు మంచి ఆటగాడేగాక, బలవంతుడు కూడ! ఆయన తన బలాన్ని చూచుకోవటానికి ఫిరంగి ఎత్త ప్రయత్నించాడు, కాని అది కదలలేదు. కనుక ఫిరంగి యెత్తి స్తాననేసరికి ఆశ్చర్యపోయాడు. అందుచేత 'ఎత్తించు నర సన్నా' అన్నాడు.

నరసన్న పట్టాభిరాముడిని వెంటపెట్టుకొని ఫిరంగి దగ్గరకు తీసుకొని, 'చూపరా బాబు నీ బలము' ని హెచ్చ రించాడు.

అంతట పట్టాభి క్రిందపరుండి రెండుకాళ్ళతో తన్ని పెట్టి లేపాడు. జమీందారు మెచ్చానోయ్ నీ బలానికి అన్నాడు.

"పట్టాభిరాముడూ! నీవు ఏమేమి తింటున్నావు" అన్నాడు జమీందారు.

'ఏమున్నదండీ! గోంగూర, గుమ్మడికాయలు" అన్నాడు మనపట్టాభి.

'అయితే వాటిరెంటికి పన్నులేదోయ్ నేటినుండి నీ పేరుతో' అన్నారు జమీందారుగారు.

పట్టాభిరామయ్య బొటన వ్రేళ్ళవెంట రక్తం చిమ్మిర్చింది. ఇంటికి చేరి మంచంపట్టి మూడు నెలల అనంతరం మరణించాడు.

నరునికంటికి నల్లరాయి బ్రద్దలగుతుంది. రాజాగారి దృష్టితగిలి మరణించాడని అనుకొంటారు నేటికీ !

## కులాశ్రయం

మన ఆంధ్రదేశంలో కొందరు ఒక్కకులాన్ని ఆశ్రయించి వారిని స్తుతిస్తూ తమవృత్తిని పోషించుకొంటూ వుండేవారు.

బ్రాహ్మణులను ఆశ్రయించుకొని, విప్రవినోదులుండేవారు. వారివృత్తిని వారిపేరే చెప్పుచున్నది. వారు బ్రాహ్మణాధికత్యను ఉగ్గడిస్తూ కనికట్టు, గారడివిద్యలు కొన్ని చేసి వారివల్ల పారితోషికము పొందుచూ జీవించేవారు.

వైశ్యులను వీరముష్టులు స్తుతిస్తారు. ఇక్కడకు వచ్చేవారు. పెడనలో వున్నారు. వైశ్యుల వివాహాది శుభకార్యాలకు వారికి ఇవ్వవలసిన మామూళ్ళు ఇస్తుంటారు. వీరికి కన్యకాపరమేశ్వరి వైశ్యుల కులదేవత, ఆ దేవతా పీఠము పెనుగొండలో వున్నది.

భట్రాజులు, సంస్కృతాంధ్రములను బాగుగా చదువుకొని చాటుపద్యాలను కంఠస్తం చేసి, కమ్మవారిని స్తుతిస్తూ వుండేవారు. వీరికి కొన్ని గ్రామాలు మిరాసీకూడా వుండేది. అనగా కమ్మవారింట భోజనం చేస్తూ, ఇంటింటికి

వార్షికం కుంచెడో అడ్డెడో ధాన్యం ప్రతిసంవత్సరం పోగు చేసుకొంటూ శుభకార్యాలలో దీవిస్తూ వుండేవారు. బ్రాహ్మణులకు వలెనే వీరికీనీ వివాహసమయములో సంభావన ముట్టుతూవుండేది. 'భట్టు శుభముగోరు బ్రాహ్మణుండు చావుగోరు' అని అంటూ వుండేవారు. యజమాని చస్తే బ్రాహ్మణునకు– పురోహితునకు అధికంగా ముట్టుతుంది. కనుక అతడు చావేకోరును. మేము అశుభానికి రాముకనుక మేము శుభాన్నే కోరెదమనేవారు.

ఈ గ్రామానికి భట్లపెనుమర్రు భట్రాజు ఈ దరశేషం రాజు మిరాసీదారు. ఆయన అనంతరం ఆయనకుమారుడు రామరాజుకూడా వస్తూండేవాడు.

భట్రాజులు దసరాకు మామూలుపద్ధతిని ఇలా ప్రస్తుతించేవారు.

సీ॥ శ్రీకటక్కర్నాట సింహాసనంబున
నెల్లగా రావెళ్ళ మల్లఘనుడు
ఆది గర్భేశ్వరుండతి కృపాభరతుండు
పెమ్మసాని కులుండు తిమ్మఘనుడు
రాజాధిరాజులు రమ్మని మన్నింప
పెంపొందెను కొడాలి పేరినీడు
తప్పనాడఁడు మాట తగు లక్షలకునైన
బొప్పన హరినీడు బుధులు పొగడ
బంగాళ నేపాళ పాండ్య భూములయందు
బొగడొందె లింగము పుల్లఘనుడు

గీ॥ నెరయగా రాజ్యభారంబు నిర్వహించి
శత్రులు జయించి పణ్యంబు సంతరించి
హితులుఁ బోషించి వైభవోన్నతిని గాంచి
యందలంబులఁ బాలకీ లందినారు
కమ్మ చౌదరు లత్యంత ఘనులు వీరు.

భట్రాజుల వలెనే, పిచ్చుకగుంటల వాళ్ళు కమ్మ వారిని ఆశ్రయించుకొని వారి గోత్రాలను చెప్పుచూ వాయిద్యం వాయిస్తూ యాచించేవారు.

రౌంజులవారు (రుంజలనివాడుక) విశ్వ బ్రాహ్మణులపై ఆధారపడినట్టివారు. వీరు రౌంజుల అను వాయిద్యముల సహాయమున విశ్వకర్మ పురాణము గానముచేయుదురు. వీరు నేటికినీ వస్తూ నేవున్నారిక్కడకు.

సయ్యాంవారు (సమయవాళ్ళు) పద్మసాలీలపై ఆధారపడి జీవించే ఒక ప్రత్యేక తెగ. వీరు సంవత్సరాని కొకసారి పద్మసాలీలున్న గ్రామాలకు వచ్చి, వారికి అతిథులుగా వుండేవారు.

వీరు మద్దెలలు, నగారా, మొదలైన వాద్యముల సహాయముతో 'పద్మసాలీల' మూలపురుషుడగు మార్కండేయ పురాణమును గానము చేసెడివారు.

ఒక గుర్రంపై నగారా పెట్టి దాన్ని వాయించుతూ, పతాకమును పుచ్చుకొని, స్త్రీ పురుషులు కలసివచ్చేవారు.

గొల్లలను ఆశ్రయించుకొని సుద్దులు చెప్పువారు కొమ్ములవాళ్ళున్నారు. వీరు, వారి అశుభ సమయములందు కొమ్ములూదుతూ, రాత్రిళ్ళు కాటమరాజుకథ, కృష్ణలీలలు చెప్పేదరు.

గొల్లలకు వేరే కులదేవత కలదు. దొడ్డిగంగ అను దేవతను వారు కొలుస్తారు.

మాలమాదిగలను ఆశ్రయించుకొని మాష్టీలుండేవారు.

## విద్య - వీధిబడి

సంఘం మారాలంటే మానవుడు మారాలి. అతని ఆలోచనలు, ఆశలు, ఆశయాలు, ఆవేదనలు, ఆరాధ్య దైవాలు దాని ననుసరించి వుంటవి.

ఇటువంటివి జరగాలంటే చిన్నతనమునుండీ శిక్షణ జరగాలి.

మన ప్రాచీన సంఘనాయకులు ఈ సంగతులను గమనించే కులవర్ణాది ప్రాతిపదికలపై మానవునకు మానవునకు మధ్య భేదమును కల్పించే పద్ధతిని విద్యను కల్పించారు. కర్మసిద్ధాంతాన్ని తెచ్చారు. పూర్వజన్మలోని పాపపుణ్యాలే ఉచ్ఛనీచజాతులకు కారణమన్నారు. మానవులలో సమతను కోరడం కర్మసిద్ధాంతానికి భిన్నం.

ఇంతేగాక అణగద్రొక్కబడిన వారిని విద్యకు దూరం చేశారు. ఎందుచేతనంటే విద్యావంతులలో నూతన భావాలు రేకెత్తవచ్చు. అందువల్ల విద్య కొందరికే పరిమితమైనది. ఆ విద్యకూడ నూతన ఆలోచనలు రేకెత్తేదిగా ఉండకూడదు.

పాత విశ్వాసాలకు పరిమితమైనది. ప్రాచీనులు ఈ సంగతి గమనించబట్టే రెండువేల సంవత్సరాలుగా పాత పంథాలో నిల్చింది సంఘం.

ఈ గ్రామంలో మూడు వీధిబడులుండేవి. జయరామ పంతులు, (ప్రతాప నరసింహం తండ్రి) రామబ్రహ్మం పంతులు (కృష్ణయ్యపంతులు తండ్రి) లక్ష్మీనరసింహం పంతులు (ఉద్దండం పంతులు తండ్రి.)

ఓం నమః శివాయః, సిధం నమః.

అనే ప్రార్థనతో ప్రారంభం, విద్యయొక్క పరమార్థం అదని. ప్రహ్లాదుడు, చక్రహస్తుని ప్రకటించు చదువు చదువు అన్నట్లుగ.

వీధిబడు లనునవి సాధారణముగా పెద్దఇండ్ల వసారా అరుగులమీద ఉండెడివి. ఐదవయేట అక్షరాభ్యాసం. కొంచెం ధనవంతులు అక్షరాభ్యాసానికి పంతులకు నూతన వస్త్రములు కాని రొక్కంగాని ఇచ్చేవారు. పిల్లలకు కొబ్బరి ముక్కలు దొరుకుచుండేవి. ముందు గుంటఓనమాలు దిద్దించెడివారు. ఐదుబడులు వచ్చినవారికి గుణితము ప్రారంభించెడి వారు. తరువాత ఒకట్లు, పిమ్మట ఎక్కాలు, ప్రతిదినము పిల్లలందరిచేత ఏకకాలమునందు చెప్పునట్లు చేసెడివారు. గుణితము వచ్చిన వారిచే పెద్దబాలశిక్ష అనే పుస్తకములోని అమ్మ మాట, అన్న పాలు, అన్న పదములను చదివించెడివారు.

ప్రతిదినము ఉదయం 6 గంటలకు పిల్లలు బడికి హాజరు కావలెను. అప్పుడు పంతులు బెత్తం చేతపెట్టుకొని మొద

టగా వచ్చిన వానిచేతిలో బెత్తముతో శ్రీ అని వ్రాసేవాడు. రెండవవాని చేతిలో చుక్క అని బెత్తముతో ఉంచేవాడు. మూడవవానికి దెబ్బ అని నెమ్మదిగా అరచేతిమీద వడ్డించేవాడు. అక్కడనుండి వరుసగా రెండు మూడు వరుసల దెబ్బలు పడేవి. పెద్దబాలశిక్షతోపాటు, సుమతీ శతకము, దాశరథీ శతకము మొదలగు శతకములను కంఠస్థం చేయించెడివారు. కొందరను ఆంధ్రనామ సంగ్రహము, అమరము చదివించెడివారు.

తస్సేరు అనగా తూముధాన్యమునకైతే పుట్టిధాన్యమెంత అని. వరహావడ్డు అనగా రూపాయికెంత ధాన్యమైతే పుట్టి యెంతఅని. ఈ విధమైన లెక్కలను చెప్పేవారు.

కాపీ వ్రాయించేవారు. అక్షరాలు చాల గుండ్రంగా ఉండేవి. పిల్లల దస్తూరినిబట్టి ఫలానా సంతులు దగ్గర చదివినట్లుగా గుర్తించేవారు. చక్కని దస్తూరి, రాగచ్ఛాయగా చదవటం ముఖ్యం.

సాయంకాలం కాగానే పిల్లలనందరిని ఒక చోట చేర్చి 'సరస్వతీ నమస్తుభ్యం వరదే కామరూపిణీ' అని సరస్వతి ప్రార్థన అయిన తర్వాత 'దీపం జ్యోతి పరబ్రహ్మం, దీపం జ్యోతి పరాయణాం, దీపేణ హరతే పాపం' అనే శ్లోకం చెప్పి వారందరిచేత చెప్పించి ఇండ్లకు పొమ్మనేవారు.

ప్రతి అమావాస్యకు సెలవు. అందుచేత దానిని ఆట విడుపు అనేవారు.

## శిక్షా విధానం

ఈ శిక్ష చాల దారుణంగా ఉండేది. పాఠములు సరిగా చదువని పిల్లలను, అల్లరిచేయువారిని పంతులు పేము బెత్తముతో గాని కొరడాతో గాని కొట్టుచుండెడివారు. పిల్లవాడు బడికిరాక మారాం చేసినా బడినుండి పారిపోయినా వాని కాలికి గొలుసుతో బండకట్టి మోయించెడివారు. ఎక్కువ అల్లరిచేయువారికి కోదండము. అనగా దూలమునకు తాడుకట్టి దానిని పట్టుకొని వ్రేలాడునట్లుచేసి, నేలమీద పిల్లవాడు దూకకుండా ఘంటములను గుచ్చెడివారు. అన్నిటిలోకి ఇది అతి దారుణమైనది. సామాన్య తప్పిదములకు గోడకుర్చీ మామూలు శిక్ష. గుంజీలుకూడా తీయించెడివారు.

ఆ రోజులలో పంతులుకు పిల్లవాడి తాహతును బట్టి నగదుగానో, ధాన్యముగానో పంతులుకు ముట్టెడిది.

వినాయక చవితి, దసరా పండుగలకు పిల్లలకు ప్రత్యేకం పద్యాలు నేర్పెడివారు. దసరా రోజులలో పిల్లలు విల్లంబులు, బుక్కాయి, హనుమంతుని బొమ్మ చేత ధరించి పిల్లలు బంధువుల తాలూకు గ్రామములకు కాలినడకను వెళ్ళి దసరా పద్యములను చదివెడివారు. పంతులు బడిలో పిల్లలనందరిని వెంటతీసుకొని గ్రామములో ధనార్జన చేసెడివాడు.

దసరా పద్యములలో ముందు పోతనగారి నారాయణ శతకములోని 'ధరసింహాసనమై నభంబు, గొడుగై' అన్న పద్యంతో ప్రారంభించి 'అయ్యవారికి చాలు ఐదు వరహాలు' పిల్లవాండ్రకు చాలు పప్పు బెల్లాలు అని, అల్లుండ్రమాగాము

అలిగి తెమ్మనగ, కూతుంద్రమూగాము కొసరి ఇమ్మనగ, రేపురా మాపురా మళ్ళీ రమ్మనక, ఏడాదికొకసారి మేము వచ్చేము' అనే పదములను పిల్లలందరు కలసి పాడి చివరకు జయీభి జయభవ దిగ్విజయభవ అనేడివారు.

యజమాని పంతులుకు శక్తి కొద్ది రొక్కమిచ్చి పిల్లలకు కొబ్బరికాయ లిచ్చేవాడు.

ఆ రోజులలో కొండపల్లి పీచుకాగితములు, గద్ద కలములు, రెల్లుకలములు వాడుకలో నుండెడివి. కొందరు తాటి ఆకులమీద ఘంటములతో వ్రాసెడివారు. అప్పుడు కొయ్యపలకలు, శుద్ధబలపములు వాడుకలో ఉండెడివి. ఆ కొయ్య పలకలకు కాకరాకు పసరు, చిక్కుడాకు పసరు రాసి ఎండబెట్టిన వానిమీద వ్రాసిన అక్షరములు స్ఫుటముగా నుండెడివి.

ఆ మూడు వీధి బడులతర్వాత చిలకలపూడి నాగభూషణం, ఘంటసాల పేరరాజుగార్ల వీధిబడులు వెలసినవి.

వీధిబడులుపోయి, ఇంగ్లీషు చదువులు వచ్చినవి. ఆ ఇంగ్లీషుని గురించి ఇలా గమనించండి.

"అగ్రకులాలవారిని మొదట మార్చింది ఇంగ్లీషే. ఆంగ్లం ప్రపంచాన్నంతా ఒకచోటకు తెచ్చింది. నిజం చెప్ప వలసివస్తే మనలో పశువులుగా వున్నవారిని మనుష్యులను గాను, మనుష్యులగా వున్నవారిని, పశువులుగా చేసింది ఆ భాషే" శ్రీ పాద సుబ్రహ్మణ్య శాస్త్రిగారు.

## పండుగలు

పండుగలంటే ఎక్కడలేని శోభ వస్తుంది. అలుకు ముగ్గులతో పసుపుకుంకాలతో, పచ్చతోరణాలతో, ఇళ్ళన్నీ కలకలలాడుతూ ఉంటాయి. నగలతో, దాపుడు పంచెలతో ఆబాల గోపాలం ఆనందంలో ఉంటారు.

ఎటువంటి కష్టంలో ఉన్నా కొంచెం ఉపశాంతి కలిగిస్తుంది పండుగ. ఇంతేకాదు. ఎటువంటి కటిక దరిద్రుడికైనా కడుపు నిండిస్తుంది పండుగ. ఎట్టి లోభిచేతనైనా పట్టి దానం చేయిస్తుంది పండుగ. ఎటువంటి కఠినచిత్తునిలోనైనా,కనికరం కలిగిస్తుంది పండుగ. వేయేల? అందరిలోను సహనాన్ని నెల కొల్పి, ఉత్సాహం ఉదయింపచేసి,సంతోషసాగరంలో ముంచి తేలుస్తుంది పండుగ.

పండుగలలో ఇంత ఆనందం అనుభవించుటకు విశేషం లేకపోలేదు. నేటివరకు మనకు క్రియారూపమున, దేశ చరిత్రను, దేశ గౌరవమును ధ్యానించుకొంటున్నాము. పండుగలంటే సజీవములైన చరిత్రలు.

ఒక జాతియొక్క విజ్ఞానాన్ని, నాగరికతను,మతాన్ని, ఆచారాలను తెలుసుకోవాలంటే ఎంతచదివినా ఎరుకపడదు. ఆ సమాజమే గ్రంథరూపేణా నిలిచిఉన్నది.

మనజాతి చరిత్రంతా ప్రతి సంవత్సరం జ్ఞాపకం వచ్చేటట్లుగా, మనపూర్వులు ఏర్పాటు చేసినవే పండుగలు.

అచ్చు యంత్రాలులేని ఆ రోజుల్లో, గ్రంథాలు అందరకూ అందుబాటులో ఉండుట అసంభవమని మన పూర్వ

లకు తెలుసు. పుస్తకాలద్వారా ప్రజలందరకు విద్యనేర్పుట కష్టసాధ్యమైన కార్యమనికూడా వారు కనుగొన్నారు. కాబట్టి జనసామాన్యానికి విద్య నేర్పుటకు విషయాలు శాశ్వతంగా జ్ఞాపకముండే పద్ధతులను ఏర్పాట్లు చేశారు. పుస్తకాలు నశించవచ్చు. పద్ధతులుమాత్రం సంఘం ఉన్నంతవరకు ఉంటూనేఉంటవి. పుస్తకాల్లో విషయాలు క్రియారూపాన జరుపబడినప్పుడే జ్ఞాపకముండును. ప్రతి సంవత్సరం ఒకసారి జ్ఞాపకం వచ్చేటట్లుగా మన పూర్వులు ఏర్పాటు చేసిరి. ఇవే మన పండుగలు.

చైత్రం మొదలు ఫాల్గుణంవరకు ఒకయుగాన్ని జ్ఞాపకం చేసుకొంటున్నాం. ప్రభవ మొదలు అక్షయవరకు కాలాన్ని అనుదినము లెక్కిస్తున్నాం. ఆకాశములోని గ్రహగతులను గమనిస్తున్నాం. గ్రంథాలతో పనిలేకుండానే తొలకరి ఎప్పుడో తెలుసుకొంటున్నాం. మనకు ప్రత్యక్షమైన రూఢి శిక్షణ లభిస్తున్నప్పుడు పుస్తకాలకై పాకులాడటం ఎందుకు?

ఈప్రత్యక్షశిక్షణ మన పండుగలతో లభిస్తున్నది. చైత్రమాసం వచ్చిందనగానే సంవత్సరాదిపండుగ చేసుకొంటున్నాం. అనంతరం అరుంధతీదేవిని పూజించి పాతివ్రత్య మహిమను కొనియాడుతున్నాం. శ్రీరామనవమి దినమున సీతాకల్యాణం చేసి, రామరాజ్యాన్ని జ్ఞాపకం చేసుకొంటున్నాము. హనుమజ్జయంతి చేసి బ్రహ్మచర్యములోని గొప్పను గురిస్తున్నాం.

మృగశిరా ప్రవేశమనగానే తొలకరి అన్నమాట. తొలకరి అంటే వ్యవసాయము ప్రారంభం. ఈ వ్యవసాయ ప్రారంభానికే 'ఏరువాక' అని పేరు. ఏరు అనగా నాగలి. వాక అనగా దున్నుట. అంటే దుక్కి యొక్క ప్రారంభ మన్న మాట. ఈ ప్రారంభం జ్యేష్ఠ శుద్ధపౌర్ణమి రోజున జరుగును.

ఏరువాకకు ఇతరపండుగలకు వ్యత్యాయమేమంటే ఇతర పండుగులకు మతమే ప్రాతిపదికగా ఉంటుంది. ఇది కేవలం ఐహికమైనది.

ఏరువాకనాడు ఎద్దులను కడిగి కొమ్ములకు రంగులు పూసి గజ్జెలు గంటలు, అద్దాల కుచ్చులుకట్టి అన్నివిధాలా అలంకరిస్తారు.

ఈ పండుగ వ్యవసాయానికి ప్రారంభం. కనుక దానికి అవసరమైన పాలేళ్ళను (జీతగాళ్ళను) కుదుర్చుకొని వారిని రైతు తీసుకొని తన ఇంటనే ఆ దినమున భోజనం పెట్టును.

తర్వాత నాగలి ఎటు పన్నాలో, ఎటు దున్నాలో, ఎవరు దున్నాలో, ఎప్పుడు దున్నాలో బ్రాహ్మణుని అడిగి రైతు ఆ విధంగా చేయును.

ఆ సుముహూర్తమునకు ఎడ్లను బాగాకడిగి కాళ్ళకు గజ్జెలు, మెడలో గంటలు, మువ్వలు, ముఖమున మంచి సిగ మారు, కుచ్చులు, నడుమునకు పట్టెడ, కొమ్ములకు రంగులు వేసి, ఈ విధంగా అలంకరించిన తర్వాత, కాపు పడుచువచ్చి ముఖమునకు, కాళ్ళకు పసుపురాసి కుంకుమబొట్లు పెట్టి

పూజించుదురు. అట్లాగే నాగలికి, గొడిక, మేడికి, ములుగర్రకు, గొడ్డలికి, పసుపూ కుంకుమ రాసి పూజించును. ఎడ్లకు, గోశేసుకు, ఇతర పరికరాలను రాపిమండలు కట్తారు. ఎడ్లకు నవధాన్యాలు పెట్తారు.

అటు తర్వాత రైతు పూజించి కొబ్బరికాయు కొట్తాడు. వచ్చినవారికి చుట్టుపట్ల వారికి వడపప్పు బెల్లం పంచి పెట్తాడు.

రైతూ, తనవాళ్ళు, గంధము, బొట్టు పెట్టుకొని అది వరకే ధరించిన నూతన వస్త్రాలతో ఏరువాక సాగును.

ప్రతివారు తమతమ వృత్తులకు అవసరమైన పనిముట్లను ఆయా పండుగ రోజుల్లో పూజించటం మన దేశంలో ఆచారం. అదే విధముగ రైతు తన జీవనాధారములను ఎడ్లను, పరికరాలను పూజించి వ్యవసాయం చేయసాగిస్తాడు.

ఇదీ అడుగంటింది నేడు. ఎందుకంటే ఆ నమ్మకాలు పోయినవి. విఘ్నేశ్వరుని పూజిస్తే పండదని, ఎరువులే పంటను ఆధారమని, ఎటు తిరిగివస్తుంటం, ఎవరు దున్నుటం ఇదంతా పిచ్చినమ్మకమని అనుకొన్న తర్వాత ఎలా చేస్తారు పండుగ ?

వైశాఖంలో పరశురాముని స్మరించి, పగవట్టు తీర్చుతున్నాం. నృసింహ జయంతి జరిపి ఆయన దిగ్విజయాన్ని తలచి రాక్షసత్వాన్ని రూపుమాపుతున్నాం. బుద్ధజయంతి జరిపి లోకకల్యాణకరమగు అహింసా వ్రతాన్ని స్వీకరిస్తున్నాం.

ఆషాఢములో విష్ణువు ఏకాదశి చేసుకొని చాతుర్మాస్యం ఆరంభిస్తున్నాము.

శ్రావణంలో నాగపంచమి, జన్మాష్టమి, పూర్ణిమ చేసుకొని ఉపవాసాలు ఉండి ఆరోగ్యాన్ని కాపాడు కొంటున్నాం.

భాద్రపదములో వినాయక చవితి, ఋషిపంచమి, వామన జయంతి మొదలగు సస్యదేవతారాధన చేస్తున్నాం.

ఆశ్వయుజంలో దేవీనవరాత్రములు జరిపి విజయ దశమి రోజున శమీపూజ చేస్తున్నాం. నరకచతుర్దశినాడు లోకకంటకుడగు నరకుని అస్తమయానికి ఆనందించి అమావా స్యరోజున దీపావళి పండుగ చేస్తున్నాం.

కార్తీక మాసంలో దీపాలు వెలిగించుకొని ప్రకృతిని జయిస్తున్నాం.

(పంటలుపండు ఋతువగు శరదృతువునందు మిడతల నశింపజేయుటకై ఈ దీపాలుకూడ తోడ్పడును. దీపావళి పండుగనాడు దీపాలు వెలిగించుట, మందులు కాల్చుటవల్ల కూడా మిడతలు నశిస్తవి)

మార్గశిరములో కాలభైరవ అష్టమి, దత్తాత్రేయ జయంతి చేస్తున్నాం.

పుష్యమిలో మకరసంక్రాంతి పండుగ చేస్తున్నాం. సంక్రాంతి, పండుగలన్నింటిలోకి పెద్దపండుగ. దీనికి ఐహికం గాను, పారమార్థికంగాను, సమన్వయాలు చాలా ఉన్నాయి. పారమార్థిక చింత కలవారు తమ పితృదేవతలకు గతులు గల్పించటానికి యోగ్యమైనదిగా భావిస్తారు.

మాఘములో వసంత పంచమి, రథ సప్తమి, భీష్మాష్టమి, మహాశివరాత్రి పండుగలుగా జరుగును. అందులో శివరాత్రి అతివైభవముగా జరుగును.

ఒక్క సంవత్సరంలో ఎన్ని చరిత్రలో నడిచిపోయెను. ఎంతో ఔన్నత్యాన్ని గురించి తలంచుకొంటిమి! ఎంత విజ్ఞానాన్ని కలిగించుకొన్నామో!

మన పండుగలలో ఉత్సవాలు చేసుకొంటున్నాం. ఉత్సవమంటే కథయొక్క అభినయమన్నమాట. పండుగ అంటే పప్పుపరమాన్నములు కాదు.

పండుగ దేశకళ్యాణమునకై చేయబడుతుంది. మన ప్రాచీనకాలములోని రీతి, నీతి తెలుసుకోవాలంటే పండుగలే మనకు పరమ ప్రమాణాలు. అవి జరుపునంతకాలము ప్రాచీన భారతీయ చరిత్ర మననుంచి నశించదు. నేటి పండుగలు జ్ఞానంతో పాటింపబడక పోయినప్పటికి అవి సాధిమూలకములు. తెలిసినను, తెలియకపోయినను ఆచరణలో ఒక్కటే గదా!

నవనాగరికత వచ్చిన తరువాత పండుగలంటే మోజు తగ్గింది.

ఆ సంఘ ఆనాగరికత అంతరిస్తున్నది. అందుకనే పూర్వంవలె పండుగలంటే ఆనందంలేదు.

పాత విలువలు, పాతనాగరికత, పోతున్నది. క్రొత్త విలువలు క్రొత్తనాగరికత, క్రొత్తసంఘం ఏర్పడుతున్నది వీరి ఆలోచనలు వేరు. అందువల్లనే పండుగలు పిల్లలకే పరిమితమైనవి నేడు.

## బుక్కావారు

• ఇప్పుడు గెల్లి రామారావుగారి బట్టలకొట్టు పట్టు వీరివి రెండిళ్ళుండేవి. బుక్కా రామబ్రహ్మంది ఒక యిల్లు, బుక్కా కాశమ్మది ఒక యిల్లు. వీరు పసుపు, కుంకుమ, బుక్కా, కప్పు, ఖర్జూరాలు, అద్దాలు, అగరుపత్తులు మున్నగు అలంకరణ వస్తువులు అమ్మేవారు. జడకుప్పెలు, బాజీ బంధులు కట్టేవారు. ఆనాటి ఫ్యాన్సీషాపు అది. కర క్కాయసిర, కొండపల్లి కాగితం కూడా అమ్మేవారు.

## చేతినిండా పని

ఆనాడు అనగా అరవై యేడ్ల క్రితం స్త్రీలకు చేతినిండా పని. వడ్లు దంచడం, వండటం, వార్చటం వడ్డించటం, ఏకులు వడకటం ఒకపనేమిటి అన్నిపనులు వారే విసుగు విరామం లేకుండా చేసుకునేవారు. పిండి విసరినా, వడ్లుదంపినా, ఏకులు వడకినా అంతా ఆటాపాట, ఆప్యాయతతో ఆనందంతో చేయి మనసు కలిస్తే సుఖముగాక ఏమున్నది? సుఖముఎందు లో ఉన్నది? పనిలో ఉన్నది. విశ్రాంతిలో లేదు. పనిముద్దు భాగ్యంముద్దు అన్నారు.

---

• బుక్కా మామయ్యను గురించి ఒకకథ వుండేది. అతను తెల్ల వారగనే కాలకృత్యాలను తీర్చుకోవటానికి వెళ్ళివచ్చి తనపనిలో నిమ గ్నమై ఎవరికి కనబడేవాడు కాడు.ఎవరన్నా ఇంట్లో కూర్చున్న మనిషిని ఏమిటిరా బుక్కా మామయ్యలాగాను అనేమాట పుట్టింది.ఆ బుక్కావారు నేడు ఎవరూ లేరు.

నేడు చాలామందికి పనిసనుష్యంలు. పనిపాటలు తక్కువ, అనవసరపు ఆలోచనలు ఎక్కువ. జీవితంలో మాధుర్యం లేదు, మందహాసం లేదు, సరసంలేదు, సరాగం లేదు.

విడి వడ్డ జీవితాలు, ఒంటరి కాపరాలు, ఎవ్వరికివారే యమునాతీరే.

## ఆర్థిక విధానము నాడూ-నేడు

ఆనాడు స్త్రీ పురుషులంతా పాటుపడ్డవారే. పురుషుడు అన్నంకొరకు పాటుపడితే, స్త్రీ బట్టకొరకు కష్టపడేది. అతడాహారం, ఆమెబట్ట; అన్నవస్త్రాలకై ఇద్దరూ శ్రమపడ్డారు. అది ఆనాటి గ్రామ ఆర్థికవ్యవస్థ.

పూర్వపు ఆర్థిక విధానములో ధనప్రసక్తి లేనేలేదు. అది వస్తుమార్పిడిమీద ఆధారపడినది. దీనిలో స్వయం పోషకత్వంవున్నది. ఏ గ్రామానికి అవసరమైన వస్తువులు ఆ గ్రామములోనే అందుబాటులో వుండేవి. దీనికి ప్రపంచంతో సంబంధం లేదు. ఏ వూరికి ఆవూరే.

అందుచేత రాజెవరో, రంగప్పెవరో తెలియదు. రాజులుమారినా మొన్నటివరకు ఈ గ్రామ వ్యవస్థ మారలేదు.

ప్రతి పనీ వంశపారంపర్యంగా చేయటమే. అందుచేతనే, కులవృత్తికి సాటిలేదనే సంగతి ఏర్పడింది.

కులధర్మమే ధర్మముగాని వేరే ధర్మములేదు. గ్రామంవిడిచి ఒక వస్తువుకొరకు వెళ్ళేపనిలేదు.

వెళ్ళితే బంధువుల గ్రామానికో, తీర్థయాత్రకో తప్పితే.

అందుచేత కులము, స్థలమునుంచి, మనవారు ఆలోచించిందిలేదు.

కులధర్మము వ్యక్తి స్వాతంత్ర్యానికి గొడ్డలిపెట్టు.

ఆంగ్లభాషాభ్యాసంవల్ల, పరిశ్రమలవల్ల అదంతా నశించినది.

మన పల్లెలు నిత్యకళ్యాణం పచ్చతోరణంగా వుండేవని కొందరు మురిసిపోతారు.

అంబేద్కరు ఇలా అన్నాడు.

A sink of localism, a den of ignrorance, narrow-mindedness and commuualism.

ఇది సంఘప్రాథమిక దశను తెలుపుతుంది. వ్యవసాయము కుటీర పరిశ్రమలు ఆధారంగా జీవించే కాలానికి చెందింది.

పారిశ్రామిక విప్లవం వచ్చిన తర్వాత ఇది ఎలా నిలుస్తుంది?

పూర్వము తరతమ భేదాలున్నప్పటికీ, అది కర్మ ఫలమని, ఈశ్వరుడు సృష్టించాడని విశ్వసించారు. అందుచేత ఎన్నికుల భేదాలున్నా, వావి వరుసలతో పిలుచుకొంటూ అన్యోన్యంగా అవంతంగా జీవించారు.

ఇంగ్లాండులోను అంతే అంటున్నాడొక ఆంగ్లేయుడు.

In medieval society the unequalities are as great as they are now, but they were stereotyped and accepted by almost everybody as orgamsed by God. There did not therefore cause much envy, or much conflict between different classes.

ఇంతేగాదు, పూర్వం వర్ణధర్మములు సైతము రాజ ధర్మములుగా వుండినందున, విధిలేక, భయపడవలసి వచ్చింది. ఇప్పుడు అందర మానవులకు ఒకటే శిక్ష, మను స్మృతిపోయి, అంబేద్కరు స్మృతివచ్చింది. హెచ్చుతగ్గులు జన్మతః పాటించే అవసరం అడుగంటింది.

నాటి ఆర్థికవిధానములో అక్రమానికి అవకాశమే లేదు. అందరు నీతిగానే బ్రతకక తప్పదు.

నేడు అవసరాలు అధికమైనవి. నాణెము వాడుకవల్ల ధనాపేక్ష పెరిగింది. దానిద్వారా నేడు సుఖాలు పొంద వచ్చుననే ఆపేక్ష పెరిగింది.

ఈనాటి ఈ లోకంలో బాధలన్నిటికీ మూలం ఆర్థికం. పూర్వకర్మకాదు, ప్రారబ్ధము కాదు. ఆర్థికదుస్థితి పోగొట్టుకొనుటకు పడరాని పాట్లు పడుతున్నారు.

పూర్వము భుజబలం, తర్వాత విద్యయందు ప్రతిష్ఠ, నేడు ధనమందు గౌరవము. ధనముంటే అన్నీ లభిస్తవి. పూర్వం అటువంటి అవకాశమే లేదు.

సాంఘిక దాస్యం పోయింది. స్వాతంత్ర్యం పెరిగింది. సాంఘిక సమానత్వం రాకపోయినా, సాంఘిక దాస్యం పోయింది.

ఈ ధనాపేక్షను, కంట్రోలు చేయటానికే, సోష లిజం, కమ్యూనిజం, ప్రజాస్వామ్య సోషలిజమం అని నినా దాలు బయలుదేరినవి.

## ధరవరలు

1808లో కుంఫిణీవారు వెండినాణెములను ముద్రిం చారు. అప్పటినుండి రూపాయలు అమల్లోకి వచ్చినవిగాని, అందుబాటులోకి రాలేదు.

పల్లెటూళ్ళల్లోకి బాగాప్రాకింది, ఇరవయ్యో శతాబ్దం లోనే. అంతవరకు వస్తు మార్పిడే.

పండిన పంటలను కొనేవారులేక పెంటప్రోగుల్లో నూరు సంవత్సరాలక్రితం పోసినట్లు చెప్పేవారు పెద్దలు.

మిరపకాయలు, ధనియాలు అలాగే చేశారట.

ఆనాడు పాలు పెరుగు అమ్మటం పరువుతక్కువగా భావించేవారు. ఎవరూ అమ్మేవారు కారు.

నేడు కర్వేపాకునుంచి అమ్మటమే. అమ్మని వస్తువు లేదు. కొననిదీ లేదు. మానవసంబంధంపోయి, ధనసంబంధం ఏర్పడింది.

బెజవాడ వకీలగు పెద్దిభొట్ల వీరయ్యగారు ఆంధ్రపత్రి కలో ఇట్లు ప్రకటించెను.

'ఇప్పటికి ౬౦ సంవత్సరములకుపూర్వం (౧౮౬౦లో) మచిలీపట్టణములో నుండి ధరలు తెలియగల కాగితమొకటి నేను చూడ తటస్థించినది...౧౮౬౦లో బందరులోజరిగిన ఒక వివాహమన్పుడుంచబడిన జాబితా సంగతులిందు తెలియ జేయుచున్నాను.

| వస్తువు | ధర రు.అ.పై. | పరిమాణము |
|---|---|---|
| బియ్యము | ౧-౦-౦ | ౩౨ సేర్లు |
| కందులు | " | ౩౧ " |
| పెసలు | " | ౨౨ " |
| మినుములు | " | ౧౯ " |
| మిరప | ౧-౬-౦ | మణుగు |
| నెయ్యి | ౪-౨-౦ | " |
| ఆముదం | ౧-౦-౦ | ౪ వీసెలు |
| నూనె | " | " |
| చింతపండు | ౦-౧౩-౬ | మణుగు |
| బెల్లం | ౦-౧౧-౮ | " |
| వసుపు | ౧-౦-౦ | ౫ వీసెలు |
| మెంతులు | " | ౪౦ సేర్లు |
| జీలకఱ్ఱ | " | ౬ ,, |
| కొబ్బరికాయలు | ౦-౩-౦ | ౧౦ కాయలు |
| సొరకాయలు | ౦-౨-౦ | ౩ ,, |
| కట్టెలు | ౦-౩-౦ | ౧౫౦ మడకఱ్ఱలు |
| విస్తళ్ళు | ౦-౧-౪ | వంద |
| తమలపాకులు | ౧-౬-౦ | ౧౦౦౦ |
| దోసకాయలు | ౦-౨-౦ | మణుగు |
| వంకాయలు | ౦-౨-౦ | ,, |
| ఇంగువ | ౦-౦-౧౦ | తులం |
| అటుకులు | ౧-౦-౦ | ౧౬ సేర్లు |
| చేటలు | ౦-౧-౬ | ౪ |
| తాటిఆకుబుట్టలు | ౦-౦-౩ | ౬ |

1894లో మొట్టమొదటగా సెటిల్‌మెంటు కాలమున ధర గరిసె రు. 1_0_9 పైసలు.

1902_3లలో పుట్టిధాన్యం రు. 25/_లు. 1902 లగాయతు 1918 వరకు ధర పెరుగుతూ తగ్గుతూ వచ్చింది.

1914లో యుద్ధం ప్రారంభమైనందున ధాన్యం ధర పెరుగుతూ వచ్చింది. 1919_20 పుట్టి రు. 120/_,140/ _ ప్రాంతమున ఉండెను. 1930లో ఆర్థిక మాంద్యమున, ధర పుట్టి రు. 25/- లకు తగ్గింది.

దీనికి కారణం 1913 నకరెన్సీ 120 కోట్లు. 1920లో 282 కోట్లవరకు పెరిగింది. అందుచేత ధరలుకూడా పెరిగినవి.

1918లో ప్రపంచ సంగ్రామము ఆగిపోయినందున 1920 జనవరినుండి 1930 ఫిబ్రవరి వరకు 130 కోట్లు కరెన్సీ తగ్గించారు. అందుచేత ధరలు తగ్గాయి. 1930 ఆర్థిక మాంద్యమున రైతులు చాల నష్టపడ్డారు. 5 లక్షల 2 వేల 9 వందల పదిహేను ఎకరాలు పోగొట్టుకొన్నారు.

ధరలు పెరిగినప్పుడు ప్రభుత్వం కంట్రోలు చేస్తుంది గాని తగ్గినప్పుడు కంట్రోలు చేయదు. అందుచేత రెండు విధాల రైతాంగానికి నష్టం.

1921, 1937, 1965_66లలో కంట్రోళ్ళు ధాన్యానికి ప్రభుత్వం పెట్టింది.

ఇతర వస్తువులకు పెట్టినా అమలు జరపలేక పోతున్నది. అందువల్ల రైతాంగానికి దెబ్బ.

నేడు ధరలు విపరీతంగా పెరిగినవి. దీనికి కారణము, నోట్లు పెరుగుదల, వస్తువులు తరుగుదల.

1950_51 లో. 1971, 06 కొత్తనోట్లు.
1950. 60లో. 2700 33 "

పదార్థాలు సమృద్ధిగావుంటే ధరలు పెరగవు.

రూపాయలు, అర్ధ రూపాయలు, పావలాలు, అణా, అర్ధణా, కాని మొదలగునవి తీసివేసి 1957లో దశాంశపద్ధతి అమల్లో పెట్టింది ప్రభుత్వం. దీనివల్ల, 50 పైసలు 25 పైసలు, 10 పైసలు, 5 పైసలు, 3, 2, 1, పైసలు వచ్చినవి. నయా పైసల పద్ధతి, అలాగే తూకంలో వీశెషోయి కిలో, అలాగే మైలుపోయి కిలోమీటరు.

హైద్రాబాద్ ధరవరలు 1965 నవంబరు 15

శ్రీ కె. జయప్రకాశ్ రామ్ అండ్ కంపెనీ వారివద్ద నేటి మధ్యాహ్నం ఒంటిగంట వరకుగల ధరవరలు ఈ క్రిందివిధంగా ఉన్నవి.

100 కి॥ గ్రా॥

| | |
|---|---|
| తెల్లజొన్నలు | 76_00 82_00 |
| పచ్చజొన్నలు | 59_00 61_90 |
| చప్పిటి జొన్నలు | 63_00 65_00 |
| పసుపు | 110_00 135_00 |
| కందులు | 90_00 95_00 |
| ఎర్రకందులు | 89_00 90_00 |
| పెసలు | 90_00 94_00 |
| మినుములు | 75_00 80_00 |

| | | |
|---|---|---|
| శనగలు | 164_00 | 165_00 |
| వులవలు | 64_00 | 65_00 |
| బెల్లం | 45_00 | 65_00 |
| తైదులు | 63_00 | 64_50 |
| సజ్జలు | 60_00 | 66_00 |
| మొక్కజొన్నలు | 54_00 | 55-50 |
| కుసుమలు | 106_00 | 110_00 |
| నువ్వులు | 175_00 | 210_00 |
| ప్రత్తిగింజలు | 75_00 | 77_00 |
| పెద్ద కందిపప్పు | 129_00 | 135_00 |
| చిన్న కందిపప్పు | 116_00 | 122_00 |
| సిరి శనగపప్పు | 110_00 | 127_00 |
| ధనియాలు | 230_00 | 260_00 |
| చిన్న ఇలాచి కాయ | 110_00 | 115_00 |
| మిర్చి | 230_00 | 260_00 |
| చింతపండు | 170_00 | 240_09 |
| ఉల్లి గడ్డలు | 25_00 | 23_00 |
| గోధుమలు | 115_00 | 135 |
| ఎర్రగోధుమలు | 115_00 | 120_00 |
| మొక్కగోధుమలు | 110_00 | 121_00 |
| ఇలాచి పలుకులు (పెద్దవి) | 160_00 | 173_00 |
| ఆముదాలు | 108_00 | 115 00 |
| మినపపప్పు | 100_00 | 107_00 |
| పెసరపప్పు | 124_00 | 126_00 |

## సౌందర్యపిపాస సన్నగిల్లింది

మన పూర్వులంతా కళాభిరుచి గలవారే. దేవాలయాలు, ప్రాసాదాలు; గృహాలు, ఆభరణాలు, పాత్రలు, గృహోపకరణాలు, వస్త్రాలు, ఆట వస్తువులు, అవి యివి అననేల మన కళాదేవతయొక్క కరకమలం స్పృశించని వస్తువే లేదు.

సైన్సుద్వారా యంత్రాలు వచ్చినవి. యంత్రాల వల్ల చేతి వృత్తులు సన్నగిల్లినాయి. హస్తకళ అంతా అంతరించింది. శిల్పం నశించింది.

రైళ్ళు వచ్చిన తర్వాత రాకపోకలు హెచ్చి అన్నిటా సంప్రదాయం సన్నగిల్లి కొత్తదనము, మిశ్రమ తత్వము పెరిగింది. అంతకుముందు ఏ ప్రాంతానికి ఆ ప్రాంతం, కట్టుబొట్లు, గృహ సామగ్రిలో తమ ప్రత్యేకతను, కళా సంపదను నిలుపుకొంటూ వుండేవి. అవన్నీ ఇరవై శతాబ్ద ప్రథమభాగంలో సన్నగిల్లినవి. తర తరాలగా వంశపారం పర్యంగా వచ్చే కళానైపుణ్యం, మతప్రభావం నశించింది. ప్రతి విషయంలోను, సౌందర్యభావము నశించి, ప్రయోజన భావము పెరిగింది. సాదాతనాన్ని మెచ్చుకోవటంవల్ల యంత్రాలవల్ల తయారయ్యే వస్తుసంపద రాసాగింది.

సౌందర్య పిపాస వ్యవసాయ నాగరికతకు సంబంధించినది.

పారిశ్రామిక నాగరికతలో మనం కాలుపెట్టాము. అందువల్ల సౌందర్యాన్వేషణ తగ్గిప్రయోజనదృష్టి పెరిగింది. ఇది సహజము.

నాగరికత పెరిగినకొద్దీ, జీవితం క్లిష్టమగుతుంది అందు వల్ల బ్రతుకే భారమగుతుంది. జీవితావసర వస్తువులకై తహతహ లాడడతారు.

## పాశ్చాత్య నాగరికతా ప్రభావము

* మనమంతా పాశ్చాత్య నాగరికతవల్ల భ్రష్టువై పోతున్నామని కొందరు పూర్వాచార పరాయణులు వాపోతూవుంటారు.

మానవుడెప్పుడూ మారుతూనే వుంటాడు. మారటం సహజం.

పూర్వం మనం దేశసంబంధీకులముగానే వుండే వారము. నేడు కాలసంబంధీకుల మయ్యాము. అందువల్ల అధిక మార్పులకు కారణమైనది.

ఈ సందర్భంలో ఆచార్య మామిడిపూడి వెంకట రంగయ్యగారి అభిప్రాయం గమనించ తగినది.

"ఏ దేశంలోని మానవులూ పూర్తిగా స్వయంకృషి చేతనే వారి జీవిత విధానాన్ని, సంస్కృతిని నిర్మించుకున్న వారుకారు. ఇతర దేశాల సంస్కృతి యొక్క ప్రభావం ప్రతిదేశపు సంస్కృతిలో కనుపిస్తూఉంది. ప్రయాణ సౌక ర్యాలు ఎక్కువగాలేని ప్రాచీన కాలంలోకూడా ఒక ప్రాంతంలోనివారు ఇంకొక ప్రాంతంలోకి రావడం, వచ్చి నప్పుడు వారి ఆచారాలను సంప్రదాయాలను సంస్కృతినీ

---

* దిగవల్లి శివరావుగారి మన ఆంధ్రత్వంలోని పాశ్చాత్య నాగరికతా ప్రభావము ఆధారంగా.

తెచ్చి, ఇతర ప్రాంతాలలో ప్రవేశపెట్టడం జరుగుతూ వచ్చింది. మనదేశంలో వృద్ధిగాంచిన హిందూ బౌద్ధ సంస్కృతులు ఆగ్నేయ ఏషియా దేశాలన్నిటిలోను, చైనా జపాన్ మొదలైన దేశాలలోను ప్రవేశించి ఆ దేశాల సంస్కృతులను మార్చినందుకు మనం ఎంతో గర్విస్తున్నాం. కాని పశ్చిమ ఏషియాదేశాల సంస్కృతి, గ్రీకుల సంస్కృతి మన సంస్కృతిపై ప్రభావం వహించాయి, అనే విషయాన్ని సాధారణంగా మనం మరచిపోతూ ఉంటాం. ఇది సరియైన దృక్పథంకాదు. ఈలాంటి సంకుచిత భావాలకు లోబడకుండా చరిత్ర రచన సాగుటకు రచయితలలో ప్రాపంచిక దృష్టి అవసరం అవుతూఉంది. మనదేశంలో వృద్ధి పొందినట్టి సంస్కృతి శుద్ధమైన ఆర్య సంస్కృతి కాదనియు, శుద్ధమైన అనార్య సంస్కృతి కాదనియు, అది అన్నిజాతులవారి పరస్పర సంపర్క సంబంధాలచేత ఏర్పడ్డ మిశ్రిత సంస్కృతి అనియు మనం అంగీకరిస్తున్నట్లే ప్రపంచంలోని సంస్కృతులన్నీ మిశ్రితములనీ, మానవజాతి నాగరికతను గాంచుటలో అన్ని జాతులవారు తోడ్పడ్డారని చరిత్ర రచయితలు గ్రహించవలసి ఉంది. ప్రతి దేశ చరిత్రయు ప్రపంచ చరిత్రలో ఒక అంతర్భాగం అనే భావంతో చరిత్రరచన జరగవలెను."

• చరిత్ర చేస్తున్న హెచ్చరికలు. పుట 24.

గత నూరు ఏండ్లలో గుర్తుపట్టరాని విధంగా మనం మారిపోయాం. నానా విధాలైన మన జుట్టుముడులు ఎగిరి పోయి ఇంగ్లీషువారి క్రాపులు వచ్చినవి. బొందుల అంగీలు పోయి నానా రకాలైన షర్టులు వచ్చినవి. స్త్రీల ఆభర

ణాలలోకూడ చాల మార్పులు వచ్చినవి. బులాకీ, పగడాల దండలు, కాలి కడియములు అంతరించినవి. బంగారపు గొలుసు, గాజులు మున్నగు నాజూకు ఆభరణములు వచ్చినవి. రవికెలలో, చీరె కట్టుటలో నాజూకు తనం హెచ్చింది.

మన ఆహార పానీయాలలోకూడ చాల మార్పు వచ్చినది. బంగాళా దుంపలకూర, సాంబారు, కొళంబు మొదలగు వంటకంబులేగాక ఇడ్లీ, ఉప్మా, కాఫీ, టీ, నానురొట్టె, బిస్కట్లు, చాక్లెట్లు ఊరూరా వ్యాపించినవి. సోడా, లైమ్ జ్యూస్, ఐస్‌క్రీమ్ మొదలైన పానీయములు ప్రవేశించినవి.

పూర్వం పల్లెలలో లేని పూటకూటిఇండ్లు నేడు ఇక్కడ వెలసినవి. కాఫీ హోటళ్లు, బడ్డీలు పట్టణములలోవలె నేడు ఎన్నో గలవు. వైశ్యుల వీథంతా కేవలం పట్టణ నాగరికతకు ప్రసిద్ధిగాంచినది.

పూర్వపు వీధి బడులుపోయి ఎలిమెంటరీ స్కూళ్ళు, హైస్కూళ్ళు వచ్చినవి. పూర్వపు తాటాకులమీద ఘంటములతో వ్రాయుట పోయి నేడు కాగితములు, సిరా, వ్రాత పుస్తకములు, అచ్చు పుస్తకములు అంతటా వ్యాపించినవి.

వినోదములందు ఆనాటి చెడుగుడు, గోడుబిళ్ళ, ఉప్పుపట్టె మొదలగు ఆటలకు బదులుగా కబాడీ, ఖోఖో, వాలీబాల్ ఫుట్‌బాల్, బాడ్మింటన్, బేస్‌బాల్, రింగ్ టెన్నిస్ మొదలగు ఆటలు వచ్చినవి.

పూర్వపు బుర్రకథలు, తోలుబొమ్మలకు బదులుగా నాటకములు, సినిమాలు వచ్చినవి.

సన్నాయిమేళం సన్నగిల్లి, బాంఢుమేళం బలిసింది.

ఆనాటి పురాణ శ్రవణముపోయి వార్తాపత్రికలు రేడియోలు వచ్చినవి.

పూర్వపు అవ్వలు చేసే గృహవైద్యము, ఆనువంశిక ఆయుర్వేద వైద్యులు, వ్రణచికిత్సచేసే మంగలివాండ్రు పోయి మంత్రసానులు, డాక్టర్లు వచ్చిరి.

పూర్వకాలపు నాటు పశువైద్యులుపోయి శాస్త్రీయముగా చదివిన పశువైద్యులు వచ్చిరి. ఆస్పత్రులు వెలసినవి.

పూర్వకాలమునాటి కులపెద్దల తీర్పులు పంచాయతీలు పోయి, ప్రభుత్వంవారి సివిల్, క్రిమినల్ న్యాయవిచారణ పద్ధతులు వచ్చినవి.

ఇక వ్యవసాయరంగంలో ప్రకృతిపై ఆధారవడటంపోయి నదులకు ఆనకట్టలు కట్టబడి, కాలువలు త్రవ్వబడి, దేశమంతట నదీజలములు ప్రవహింపజేయబడి, ఊసరక్షేత్రములు సహితము వరిపండు దివ్యక్షేత్రములుగ మార్చబడి, వివిధములైన పంటలు పండించబడుచున్నవి.

కలరా, స్ఫోటకము మొదలగు వ్యాధులు నవీనవైద్య శాస్త్రంద్వారా అరికట్టబడినందున జనాభావృద్ధి రెండింతలు, మూడింతలు అభివృద్ధి అయినది.

పూర్వం సంతానానికై పడేపాట్లు నేడు సంతాన నిరోధానికై పడుతున్నారు.

పూర్వం దూరగ్రామాలకు మనుష్యులద్వారా వర్తమానా లందించేవారు. నేడు తంతి, తపాల, ఫోనులు వెలసినవి.

ఆనాటి విశ్వాసం అంతరించి, నేడు హేతుజ్ఞానం హెచ్చింది.

## స్త్రీల స్థితి

ఆనాటి స్త్రీల స్థితి అధ్వాన్నముగ వుండేది. పురుషులు పెట్టు బాధలటుంచి, అత్త, కోడళ్ళను పెట్టే బాధలు చెప్పతరము కాదు. అత్తా ఒకరింటి కోడలే అన్న ఇంగితముండేదికాదు.

కొన్ని సామెతలు చెప్పుతవి ఆనాటి సంగతి సందర్భాలు.

ఔనంటానికి కాదనటానికి అత్తకుగాని కోడలకేమి అధికారం వున్నది?

అత్తా సీ గుడ్డ తొలిగిందన్నా తప్పే, తొలగలేదన్నా తప్పే.

అత్తలేని కోడలు అతి వుత్తమరాలు. కోడలులేని అత్త అతి గుణవంతురాలు. కొడుకు బాగుండాలి కోడలు ముండామొయ్యాలి.

కోడలు బానిసకంటే నికృష్టురాలు. కోడరికం అంటే కోసిపెట్టటమన్నమాట. అత్తమీద కోడరికం కత్తిమీద సాము. అత్త ఆనాడు చేతిలో కాస్త చమురువేస్తే అది పాపట్లో రాసుకునేది కోడలు. అత్త అన్నం పెట్టినప్పుడే తినాలి. అందరు తిన్న తర్వాత మాడుచెక్కలు మంచినీళ్ళు.

ఆడబిడ్డ అధికారాలకు అంతూపొంతూ వుండేదికాదు. అత్త కోడలపైన చేసే అత్యాచారాలు సక్కుభాయి నాట

కంలో కళ్ళకు కట్టినట్లు చిత్రింపబడినవి. అత్తలందరు అటు వంటివారు కాకపోయినా, అధికంగా అటువంటివారే!

వాన కురుస్తుంటే ఇంట్లోనుంచి బైటకు చాట నెత్తిన వేసుకొని తిరిగేవారు స్త్రీలు.

మండుటెండలోకూడా చెప్పులు తొడగరాదు, గడప దాటరాదు.

స్నానం చేసేటప్పుడు, గాజులమోత వినపడకుండా గుడ్డలు కట్టుకొని చేసేవారు.

పురుషులకు కనపడరాదు. భర్తకు కూడా పగలు కని పించరాదు.

ఒక ఝాము నిద్రపోయేవారేమో. అత్తకు మరీ పని యెక్కువ. తెల్లారగట్టలేచి మజ్జిగ చెయ్యాలి. నిద్రపోయే వరకూ అన్నీ చూచుకోవాలి. గృహానికి యజమానురాలు గదా! పెట్టే కంచం, కడిగే కంచం. అమావాస్య రోజున రాటం పెట్టరాదు. దూదేకుకోవాలి.

ఆనాడు స్త్రీలు అధికంగా కజ్జాలాడుకొనేవారు. బజారున పడి చేతులుచాస్తూ ఒకరినొకరు దుమ్మెత్తి పోసుకొనేవారు.

ఈ పోట్లాటలు అనవసరమైనవి. గాలితో పోట్లాడి నట్లే. ఉదయం పనిపాటలైన తర్వాత భోజనానంతరంసాగేది ఝా పోట్లాట. పోట్లాడి అలసిపోయేవారంటే అతిశయోక్తి కాదు.

ఇది ఒక్క ఘంటసాలలోనే కాదు; యావద్భారత భూమిలోను జరిగిన సంగతి కనుక ఇది భారతయుద్ధం!

నేను ఆ పోట్లాటలు తగ్గాయి. వేరువేరు కాపురాల వల్ల, అత్తా కోడళ్ళ తగాదాలే లేవు!

స్త్రీలు, సమానహక్కులు, బాధ్యతలు కొరకు కృషి చేస్తున్నారు. అయినా స్త్రీలకు పురుషదాస్యం పోలేదు.

అసలు పురుషులకే మానసిక స్వాతంత్ర్యంరాలేదు!

ఎదగాలి మానవులింకా!

## సాంఘిక రంగం

ప్రతి సంఘంలోను తరతమభేదం కనిపిస్తుంది. అలాటి భేదంలేని సంఘం ప్రపంచంలో యెక్కడలేని మాట వాస్తవమే.

మన ఆధ్యాత్మిక దేశంలో ఒకరు పుట్టగానే గారు, మరొకరు గాడు.

దేనినిబట్టి ఈ భేదాలను నిర్ణయించడం? వయస్సా? విద్యా? పుట్టుకా? వృత్తా? ధనమా?

స్త్రీ పురుషులలో తరతమ భేదాలు! కొన్ని సంఘాలలో వర్ణవ్యవస్థలు, మరికొన్నిటిలో వర్గవ్యవస్థలు ఏర్పడినవి. ఈ తరతమ భేదాలకు సంబంధించిన రంగమే సాంఘిక రంగం. దీనిలో జరిగిన మార్పులు చరిత్రగ్రంథాలలో వివరించటం అవసరమేనంటారు ఆచార్య మామిడిపూడి వెంకట రంగయ్యగారు. "ఇంతేకాదు, మానవజీవితంలో అన్ని కాలాలలో అన్ని దేశాలలో సమత్వ అసమత్వ భావాల మధ్య సంఘర్షణ జరుగుతూనే ఉంటుంది. ఒకవిధమైన సంఘర్షణ తొలగినా, దానిస్థానే ఇంకొక విధమైనది ఏర్పడుతూనే ఉంది.

సంఘర్షణే లేకుంటే చరిత్రే ఉండదు. మానవస్వభావం ద్వంద్వోపేతం. అనుభవంమూలంగా మనకు తెలుస్తూనే ఉంది." చరిత్ర చేస్తున్న హెచ్చరికలు. పుట 18.

ఏమున్నది? మనదేశంలో వర్ణవ్యవస్థ, ఐరోపాలో, వర్గ వ్యవస్థ. ఏదో ఒక వ్యవస్థలేని లేదంటారు. నిజమే !

వర్గ వ్యవస్థ ధన సంబంధమైనది. అది నిరంతరం మారుతూవుంటుంది. వర్ణవ్యవస్థ మారదు పైగా దీన్ని ఈశ్వరుడు నియమించాడని, పూర్వజన్మ కర్మఫలితమని ఒక బూటకపు రచన.

దీనికే ధర్మశాస్త్రమని పేరు. నేతిబీరకాయలో నేయి యెంతున్నదో, మన ధర్మశాస్త్రాలలో అంత ధర్మమున్నది.

పురుషుడు వ్రాసిన స్మృతులు, శాసనములు, గ్రంథములు స్త్రీలకు అనుకూలముగ నుండునని భావించటం స్వభావానికి వ్యతిరేకం. అలాగే బ్రాహ్మణుడు వ్రాసినవి, బ్రాహ్మణే తరులకు వ్యతిరేకంగా ఉన్నాయని భావించటం న్యాయమే.

వర్ణ వ్యవస్థ బ్రాహ్మణుని పూజ్యునిగాను, శూద్రుని నీచునిగాను వర్ణిస్తూవచ్చింది.

మన వర్ణవ్యవస్థ వేలాది సంవత్సరాలనుండి తిరుగు లేని హృదయ రహితమైన శాసనం. ప్రపంచంలోని తతిమ్మా సాంఘిక వ్యవస్థలు ఆర్థిక సంబధమైనవి. ఇది ఈశ్వర నిర్మిత మని చెప్పబడినది. పైగా ధర్మమని.

ధర్మశాస్త్రము లనబడే వర్ణశాస్త్రములు చట్టాల వలె న్యాయానికిగాని, గొప్ప తత్వమార్గానికిగాని చెందినవి గావు ప్రకులమువారి ప్రయోజనానికి పన్నిన పన్నుగడలు.

మన సాంఘిక పునాదులు వర్ణాశ్రమబద్ధములు. మన ఆలోచనలు అంతే. మన ఆచారాలు సమ్మకాలు అంతే. మన మనుగడ గుడ్డిగానమ్మి, అనాలోచితంగా, గొర్రె దాటుగా పోవటానికి వుద్యమించినంతగా, తర్కించి, నచ్చిన దానివైపు పోగలశక్తి కలదిగాలేదు.

దీని కంతకు కారణం మన గ్రంథాలే. మన గ్రంథాలన్నిటా ధర్మము, ధర్మము అని ధర్మ సంస్థాపనమని వర్ణ ధర్మములపేర మానవధర్మము నాశనము చేయటం జరిగింది.

పాశ్చాత్యదేశాలలో హక్కులు బాధ్యతలూ రెండూ కలవు. అందుచేతనే అక్కడ విప్లవాలు కలిగినవి. అక్కడ దైవము కొందరిని అధికులుగాను, మరి కొందరిని నీచులుగాను పుట్టించినట్లు చెప్పలేదు. అక్కడవున్న హెచ్చుతగ్గులు ఆర్థికాలు. ఆర్థికదుస్థితిపోతే అవి పోతవి.

ఇక్కడవి ఆర్థిక సంబంధాలు కావు, గుణ సంబంధాలు కావు; జన్మ సంబంధాలు. అందువల్ల ఈ దేశంలో గుణోత్కర్షకు తావే లేకపోయింది.

'దుశ్శీలోపి ద్విజోపూజ్యో, నతు శూద్రో జితేంద్రియః' అన్నారు గదా!

ఈ పుణ్యభూమిలో కొందరే ఉపదేశకులుగా జన్మించుతారు. మరికొందరు పరిపాలకులుగా. వారు బ్రాహ్మణ క్షత్రియులు.

వర్ణ వ్యవస్థ మొదట ఆర్యులకీ దస్యులకీగల రంగు భేదంతో ప్రారంభమై, అనంతరం బ్రాహ్మణక్షత్రియ వైశ్య వర్ణములు ప్రధానంగాగల మూడువర్ణములు ఏర్పడి పిమ్మట

'శూద్ర' అనే నాలుగవ వర్ణం ఏర్పడింది. పై మూడు వర్ణాలవారు ఆర్యులు. వారు ద్విజులు. నాల్గవ జాతివారు ఆర్యేతరులు, దస్యులు, ద్రావిడులు.

ఆర్యులు పాలకులు, ద్రావిడులు పాలితులు. అందు చేత పాలక పాలితభేదం మనుస్మృతిలోను, ఇతర ధర్మ గ్రంథాలలోను కనపడుతుంది.

మనుస్మృతి అనంతరం వచ్చిన నిషాదులనే పంచము లన్నారు.

ఈ విధంగా వర్ణ ధర్మాలన్నీ, సాంఘిక ఆర్థిక రాజకీయ కారణాలచే ఏర్పడినవికాని ఈశ్వర సృష్టి కాదు.

అందు చేతనే అన్నాడు వివేకానంద స్వామి.

Oh butchers! no religion on earth preaches that dignity of man in such a lofty strain as Hinduism, and no religion on earh treads upon the necks of the poor and low in such a fasion as Hinduism

మనం ఆలోచనలలో అధికులమే! ఆచరణలో అల్పులము అన్నాడు వివేకానందస్వామి. అందుచేతనే మనం తత్వ బోధకులమయ్యాము. మన ఆలోచనలకు ఆచరణకు పెద్ద అఘాతం ఏర్పడింది.

మన తత్వశాస్త్రం ఒకటి చెప్పుతుంది, మన ధర్మ శాస్త్రం మరొకటి. మనకు మత స్వాతంత్ర్యమున్నది, కాని సాంఘిక స్వాతంత్ర్యం శూన్యం.

పారమార్థికానికి వ్యవహారానికి ఇంత పార్థక్యాన్ని తెచ్చిపెట్టింది, స్వార్థపరులగు పురోహితులు, పూజారులు.

మన దేశంలోనేగాదు, ప్రపంచమంతటా రాజులుకాదు పరిపాలన చేసినది; పీఠాధిపతులు, పూజారులు, పురోహితులు.

'ఏ దేశ చరిత్రచూచినా
ఏమున్నది గర్వకారణం?
నరజాతి చరిత్ర సమస్తం
పరపీడన పరాయణత్వం.' —శ్రీ శ్రీ

ఆంగ్ల పరిపాలనలో కులవిచక్షణ, కులాన్నిబట్టి శిక్ష పోయినది. నేడు అస్పృశ్యత పాటించటం నేరం!

రాష్ట్రీయ స్వయంసేవక దళము; జనసంఘము నేడు మళ్ళా మనుధర్మాన్ని నిలబెట్టాలని చేసేవి వ్యర్థ ప్రయత్నాలే!

ఈ సందర్భంలో స్వామి రామతీర్థ మన స్మృతులను గురించి చెప్పినసంగతి గమనించ తగినది. "కులదేహభ్రాంతి కక్షలు అపరిమితంగా పెరిగి పేర్ల దేహభ్రాంతులు మొదలైన వాటితో కూడిన ఒక పెద్ద పెంటదిబ్బతో ఆత్మను పూడ్చి పెట్టాం. (శృతి- ఆత్మను గురించిన వేదజ్ఞానము చనిపోయిన అక్షరమైనది.) స్మృతి - పూర్వాచారాలను గురించిన ధర్మశాస్త్రాలు, నిరంకుశ రాక్షసాధికారిణి అయ్యింది. స్మృతి ఆత్మను అజ్ఞానంచేత ఆచ్ఛాదంచేసింది. ఒకరీవిధంగా అన్నారు. "వ్యాకరణం భాషకు కట్టిన గోరీ." వ్యాకరణాన్ని కాపాడటానికి పాటుపడితే భాష చచ్చిపోతుంది. ఈ విధంగా కఠినమైన ధర్మాలు, ఆచారాలు, కర్మకాండలు జాతియొక్క బలాన్ని నాశనం చేస్తాయి. కొన్నాళ్ళవరకు, ఇవి జాతి అనే మొక్కను కాపాడడానికి సహాయపడినవి. కాని తరువాత

మారకందువల్ల ఇవి జాతి అభ్యుదయానికి కుఠాగారాలైనవి. జాతి జీవనాన్ని నాశనం చేశాయి. ప్రియమైన మానవులారా! జ్ఞాపకముంచుకోండి! ఈ ధర్మాలు, స్మృతులు మీ కొరకై నిర్మింపబడినవి. మీరు వాటికొరకై నిర్మింపబడలేదు. నిత్యమైన సత్యాన్ని బ్రహ్మాండంలో వ్యాపింపచెయ్యండి! కాని మీ నిత్యావసరాలకు మాత్రం స్మృతుల నుపయోగించండి. స్మృతి సాంప్రదాయం మీకు చెంకనివ్వండి. మీరు స్మృతి సాంప్రదాయానికి బద్ధులు కాకండి. భారతదేశంలో నదీ శయ్యలు మారిపోయినవి. అవి సుక్షేత్రాలగుచున్నవి; భారతదేశమే నవ్య స్వరూపధారణ చేసింది! ప్రభుత్వం మారింది. భాష మారింది. అన్నీ మారిపోతున్నవి. మారిపోక నేల? మహా ప్రావాహికమైన ఈ ప్రపంచంలో, చనిపోయిన, గతాచార్యులను నిలబెట్టడానికి ఇంకా మీరు ప్రయత్నం చేస్తారెందుకు? మీరెంతటి దుఃఖపరిస్థితులో నున్నారు? ముందుకు పోదామని వెనక్కు చూస్తున్నవాడి లాగ యున్నారు. ఇలాంటివాడు ప్రతి అడుగులో పడిపోవలసిందే!"

## న్యాయ విచారణ - శిక్ష

పూర్వకాలములో న్యాయవిచారణకు, శిక్షకు మానవ ధర్మశాస్త్రమనే మనుస్మృతి ఆధారం. నేతిబీరకాయలో నేయి యెంతున్నదో ఈ మనుధర్మ శాస్త్రములో అంత ధర్మమున్నది. దీనిలో వర్ణాలనుబట్టి శిక్షగాని, తప్పునుబట్టి దండనా విధానము గాదు.

'బ్రాహ్మణో నహంతవ్యః' ఎంత ఘోర నేరముచేసినా బ్రాహ్మణునికి మరణశిక్ష లేనేలేదు. ఒకే నేరము బ్రాహ్మణుడు చేస్తే, తక్కువ శిక్ష, శూద్రుడు చేస్తే అధిక శిక్ష.

స్మృతి వ్రాసినవాడు బ్రాహ్మణుడు. అలాగే ఇంగ్లీషు వారు వారి స్మృతులలో ఆంగ్లేయులను విచారించి శిక్షించ టానికి భారతీయుల కధికారం లేదన్నారు. వారు పాలకులు భారతీయులు పాలితులుగద !

గ్రామాలలో పెత్తందార్లు విచారణ కర్తలుగావుండే వారు; అబద్ధమాడుటకు జంకేవారు నేరస్థులు. ఆనాడు నీతీ నిజాయతీ యెక్కువగానే వుండేవి. సూర్యచంద్రులే సాక్షులు అనుకొనేవారు. ఒకరిసొమ్ము తింటే వారింట్లో కుక్కై పుట్టి తీర్చుకోవాలనే విశ్వాసముండేది. ఈనాటి కుతర్కము, కూట సాక్ష్యములు వుండేవికావు.

గ్రామమునకు పెత్తందారులవలె ప్రతికులానికి కుల పెద్దలుండేవారు. కులంలోనివారు తప్పుచేస్తే, కులతప్పు, జరి మానా చెల్లించేవరకూ నీరు, నిప్పు పుట్టనిచ్చేవారుకారు; వెలిపెట్టేవారు.

పద్మశాలీలలో పెద్దశెట్లు తీర్పుచెప్పేవారు. మాలలో పెద్దమాలలుండేవారు వారే తీర్పరులు. ఎరుకలలో ఒక విచిత్ర మైన న్యాయపద్ధతి వుండేది ఎవరైనా దోషం చెయ్యలే దంటే సలసల కాగేనూనెలో చెయ్యి పెట్టమనేవారు. ఇది మరీ ఘోరం !

ఆనాటి తప్పులధికంగా వ్యభిచారం, తక్కువ జాతు లతో భోజనం చేయుటం, దొంగతనం మొదలగునవి.

ఇందుకు శిక్ష ఆరు దండాలో, బాంపకోయ్యో, ఏదో వేసేవారు.

ఈ గ్రామానికి ఆఖరు పెద్దలు—గోగ్రేపాటి బాల కృష్ణయ్య, వేమూరి వెంకన్న (పెద్దకాపు), యీ చలమన్న, యీ పెద్దయ్య, యీ రామన్న, వఝ్లమూడి రామస్వామి గారలు.

తప్పు చేసినవారికి జరిమానా వేయటమో, మందలించటమో జరిగేది.

## హెచ్చుతగ్గులు

నేడు ధర్మం నశించిందని చాలామంది ఘోషిస్తున్నారు. పూర్వం ధర్మంపేర యెంత అధర్మం జరిగిందో ఎరుగరా? దేవునిపేర, మతముపేర, ధర్మంపేర అధర్మమెంతో జరిగింది!

మాల మాదిగలను అన్ని కులాలవారు నీచంగా చూచేవారు. కుక్కలుకన్న, పందులుకన్న పరమనీచులుగా వీరు పరిగణింపబడేవారు. వీరిని అంటుకొంటే పాపం! ఇంతే కాదు, చెప్పరానివారు! వీరిని తలిస్తేనే తప్పెడుపాపం తగులు తుందనుకొనేవారు! అందుచేత వీరు చెప్పరానివారయ్యారు. వీరు నడిబజారులలో చెప్పులు తొడుగుకొని నడవరాదు. బ్రాహ్మణ ఇంటిముందుగా పోరాదు. పశువుల కుపయోగ పడే చెరువులలోకూడ నీరు తీసుకొని పోరాదు! విశ్వేశ్వర స్వామికి ప్రత్నామ్నాయ ధర్మకర్తగా వుండిన వేమూరి చంద్రయ్యగారు, ఆళ్ళ వెంకమ్మ చెరువులో అంటరానివారు

నీళ్ళు తీసుకొని పోతూంటే ధర్మమం ప్రబలుతున్నదని వారి కుండలనన్నిటిని పగులగొట్టాడు !

విశ్వబ్రాహ్మణులను అందరికంటే తక్కువగా చూచే వారు. వారిఅన్న మెవరును తినెడివారుకారు.

గ్రామపెద్దలు రెడ్డిగం వేసుకొని నడివీధిలో కూర్చుంటే ఆడవాళ్ళు గడప దాటరాదు. అంటరానివాళ్ళు చెప్పులు చేతబట్టుకొని వదిగి వదిగి పోయేవారు.

ఇక కమ్మ, కాపు మొదలగు కులాలవారికికూడ పురోహితులు, గురప్ప, చలమన్న, ఇత్యాదులు పెట్టేవారే కాని, చలమయ్య, అని పెట్టేవారు కారు. అయ్య అని పిల వటం అధర్మంకదా!

కమ్మవారు, నమస్కారం! అనరాదు!వారు శూద్రులు! సంస్కృతం పలకరాదు! మనుస్మృతి ఒప్పదు. 'శూద్రమ క్షర సంయుక్తం, దూరతః పరివర్జయేత్!' చదువుకున్న శూద్రుని దూరంగా వుంచమన్నది! అందుచేత వారింట కలం సిరాబుడ్డివుంటే ఇంకా బ్రాహ్మడి బ్రతుకేమిటన్నారు! మా వూరి కరణం తారక బ్రహ్మం. జానకి రాముడిగారి పిచ్చయ్య కొడుకుకుకూడా ఇంగ్లీషుచదువా? అన్నాడు నిడు మోలు పేర్రాజుగారు 1913లో !

కాని కార్డుమీాద వ్రాసినందుకు ముక్కుని పుచ్చు కొనేవారు! నోటు వ్రాసినందుకు మూడణాలు. ఈ మాదిరిగా వ్రాతవల్ల బ్రతికే బాపనయ్యలనోట్లో రాయకొట్టాడు ఇంగ్లీషువాడు; అందరకు చదువుకొనే అవకాశం కలిగించి.

అందుకనే కొందరు బ్రాహ్మణ కవులకు ఆంగ్లేయులంటే అంతద్వేషం!

కాని ఆంగ్లేయులేగదా! బ్రాహ్మణేతరులకు కన్ను తెరపించింది! Europeons are our eye openers అంటారు తాపీ ధర్మారావుగారు.

'ఆ అప్రాచ్యులువచ్చి దేశాన్ని భ్రష్టం చేశారంటారు,' విశ్వనాధవారు!

ఔను! నిజం! ఒకరికి లాభం! మరొకరికి నష్టం!

నియోగులకు నామాంతమందు రాజు శబ్దముండేది. సుబ్బరాజు, పేర్రాజు, ఘంటసాల వారికి పరిచయమే.

మళ్ళీ వారిలో ఎన్నో శాఖలు! ఒకరి అన్నం ఒకరు తినకూడదు! కుండలే మన కులదేవతలు! మనది కుండల మతం!! నన్ను ముట్టుకోకనే మతం!!! అన్నాడు వివేకానందుడు.

ఈ పూర్వపు గొడవంతా యెందుకనే వారులేక పోలేదు. మనం గతంలోనే జీవిస్తున్నాము! ఈ వెనుక చూపుపోతేగాని మనజాతికి భవిష్యత్తులేదు.

ప్రస్తుతం తీరవలసిన ముఖ్యమైన అవసరం అగ్రవర్ణాలనే వారితోపాటు అణగ ద్రొక్కబడిన కులాలకు విద్యనేర్పి, బాగా శిక్షణ కలిగించి, వారిలో స్వేచ్ఛాశక్తిని జొనిపి, వారిని సత్య నిస్స్వార్ధ శక్తి పూరితులను చేయడమే.

ఈ పరిపూర్ణ విద్య శిల్పాది విద్యలనుకూడా ప్రసాదిస్తుంది.

అనేక కారణాలవల్ల బ్రిటీషు ప్రభుత్వం మనకు అభినంద నీయమైనది. కులాలను పోగొట్టడంలో అది యెక్కువ కృషి చేసింది. అందరకు విద్యనేర్పింది అదే.

అసలు ఆంగ్లేయుల రాకవల్లనే భారత భూమిలో పునరుజ్జీవన ప్రారంభమైనది. వారి దమననీతిని విస్మరించం, కాని వారు ప్రత్యక్షంగాను, పరోక్షంగాను మనలో జాగృతిని కలిగించారు. ఆంగ్లభాషా బోధనవల్ల, పాశ్చాత్య స్వేచ్ఛావాదన వాయువులు విస్తరిల్లి, మనలో జాగృతిని, కలిగించినవి. అందువల్లనే, మనలో మానసిక వికాసము రాజకీయ చైతన్యము కలిగి, వారి రాజకియ వ్యవస్థ పద్ధతినే, మనంస్వాతంత్ర్యం సంపాదించుకోవడానికి వీలయ్యింది.

మనం రాజకీయ స్వాతంత్ర్యం సాధించుకొన్నంతనే పౌరులమధ్య, జాతిమత కులవర్ణ భేదాలను చేయరాదన్న ప్రధాన ప్రాతిపదికపై మనరాజ్యాంగ విధానం రూపొందింది. హిందూ ధర్మశాస్త్రాల క్రోడీకరణ కలిగిందికూడా. పేరుకు ఇది క్రోడీకరణమాత్రమే. నిజానికిది మను ధర్మశాస్త్రానికి స్వస్తిచెప్పి దాని స్థానే నూతన ధర్మశాస్త్రాన్ని రచించడం జరిగింది.

జాతి కుల విభేదాలను కాపాడుతూ వచ్చిన ఆర్థిక సాంఘిక వ్యవస్థల పునాదులు క్రమంగా కదిలిపోతున్నాయి. అందువల్ల ఈ తరంలో కాకపోయినా వచ్చేతరంలోనైనా ఈ విభేదాలు పూర్తిగా కనపడకుండా పోగలవు.

## బాలకృష్ణమ్మగారి బాట

ఇప్పటికీ పల్లెటూరి పెత్తనవారులు కొందరు అణగ త్రొక్కబడిన జాతులవారిని హింసించటం, అగౌరవముగ చూడటం తమ గొప్పతనానికి గుర్తుగా భావిస్తున్నారు. కాని ఆనాటి మా గ్రామపెద్ద బాలకృష్ణమ్మగారి తత్వం అటు వంటిది కాదు. సంప్రదాయ బద్ధంగాను, సంకుచితంగాను వుండే ఆ కాలంలో ఆయనయెంతో ఉదారముతోను, విశాల హృదయముతోను మెలగెను.

ఆయన ముందున్న కాపు పెద్దలు,విశ్వబ్రాహ్మణులను శుభాశుభ సమయాలలో నాలుగు గుంజల పందిరి వేయ నిచ్చేడి వారు కారు. గోడకు సున్నము గొట్టనిచ్చేడి వారు కారు. ఆ కాలములో కొన్ని కులాల వారిని వివాహ సమ యంలో పాలకీ యెక్కి వూరేగ నిచ్చేడి వారుకారు.

బాలకృష్ణమ్మగారు తల యెగగట్టిన తర్వాత అవన్నీ పోయినవి. అందరు మానవులు ఒక్కటే అన్నాడా యన. కుల విచక్షణ గమనించక, శక్తి, ఉత్సాహము గల వారందరు ఊరేగింపు చేసుకొనుటకు ఆయన ప్రోత్స హించాడు. ఎరుకల జాతి వారినికూడ గోచి పెట్టు కొనుట మాని పంచికట్టుకొన వలసినదిగ హెచ్చరించాడు.

ఆయనమాట, మర్యాదలలో అన్ని కులముల వారిని ఉచిత రీతిని చూచెను. మాటా మన్ననలో ఆయన బాటే నేటికీనిలిచి వున్నది. అందు చేతనే ఈ గ్రామంలో ఇతరకులము లవారు యెట్టి యిబ్బందులు లేక హాయిగా వానపు ప్రజలవలె

మెలగుట కవకాశం వుండుట వల్ల, పలు గ్రామాలనుండి, పద్మశాలీలు, పాటకపు జనము యిక్కడకు వచ్చి సుఖ శాంతులతో కాపురం చేస్తున్నారు.

"వెనుక చూచిన కార్యమేమోయ్
మంచిగత మున కొంచెమే నోయ్
మందగించక ముందు అడుగెయ్
వెనక పడితే వెనకే నోయ్" గురజాడ

## నేటి పరిస్థితి

నేటి పరిస్థితి చాలా అయోమయంగా వున్నది. దీనికి కారణం ఏమిటి?

పూర్వపు విలువలన్నీ మారి పోతున్నవి నూతన విలువలు ఏర్పడ లేదు.

సాహిత్యంలోను, ఆలోచనలోను, సాంఘికంగాను, రాజకీయాలలోను విలువలు మారుతున్నవి. పండితుల ప్రాబల్యం తగ్గి, మూక మాట చలామణి వస్తున్న రోజులివి. రాజులుపోయి ప్రజాస్వామ్యం పేరిట జరుగుతున్నది, పరి పాలన.

పూర్వపు అగ్రజన్ముడు పోయి, నాడు అణగత్రొక్క బడిన, అట్టడుగున వున్న శ్రామికుడు, జాతికి జీవనాధారుడు, పైకి వస్తున్నాడు.

ఇంతే కాదు మతానికి, విజ్ఞానశాస్త్రనికి, పూర్వా చార పరాయణులకు, సంఘ సంస్కర్తలకు మధ్య ఘర్షణ జరుగుతున్నది.

విద్య బ్రాహ్మణుల సొత్తనీ, వాణిజ్యం వైశ్యులదనేది పోయింది.

పూర్వపు ఆర్థిక విధానపు పునాదులు పోయి, నూతన ఆర్థిక విధానపు తరగతులు ఏర్పడుతున్నవి. పారిశ్రామికులు, కార్మికులు, న్యాయవాదులు, ఉపాధ్యాయులు, సైంటిస్టులు మొదలగు బుద్ధి జీవులు వస్తున్నారు.

అందుచేత ఈ సంధి యుగంలో అంతా తారుమారే. కొంత కాలానికి గాని కుదుట బడదు.

మనుధర్మం చెల్లు బడికాకుండా ఎందుకు పోయింది? ఆ ఆర్థిక విధానం పోయింది. కనుక నూతన శాస్త్రం, నూతన ధర్మం, నూతన సమాజం రానున్నది!

"ఎల్లలోకము ఒక్క యిల్లై
వర్ణ భేదము లెల్ల కల్లై
వేలనెరుగని ప్రేమ బంధము
వేడుకలు కురియు:"

"మతములన్నీ మాసిపోవును
జ్ఞానమొక్కటె నిలచి వెలుగును,
అంత స్వర్గ సుఖములన్నీ
యవని విలసిల్లున్"

గురజాడ

# అనుబంధం

## సుబేదారు బ్రహ్మయ్యగారు

ఆజానుబాహువు, స్ఫురద్రూపి, వీరత్వముట్టిపడే గాంభీర్యం, నిమ్మకాయలను నిలుపగల నిండైన మీసకట్టుగల నిండైన విగ్రహం కలవాడు సుబేదారు గొట్టిపాటి బ్రహ్మయ్యగారు.

ఆవాయుద్ధములో పాల్గొనెను. ధర్మనిష్ఠ గలవాడు, గొప్ప భక్తుడు.

మద్రాసు రాజధానినుండి 19 పటాలపు ఉద్యోగులను యేరి విక్టోరియా రాణిగారి దర్శనార్థము పంపబడినవారిలో ఒకడు. ఆంగ్లదేశమునకు వెళ్ళినప్పుడు, ఈయనకు విక్టోరియా రాణి పతకము బహూకరింపబడెను.

ఒకసారి పింఛను తీసుకొనిని వెళ్ళినపుడు, డిప్యూటి కలెక్టరు కుర్చీయిచ్చి మర్యాద చేయనందుకు, కలెక్టరుకు తెలిపి, డిప్యూటి కలెక్టరుచేత క్షమాపణ చెప్పించుకొన్న పౌరుషవంతుడు, ఆత్మగౌరవము గలవాడు.

ఈ శక్తిపూజా దురంధరుడు 1897లో పరమపదించెను.

## వేమూరి వెంకటరత్నంగారు

బాలకృష్ణమ్మగారు ఘనత గాంచి, గ్రామానికి పరువు ప్రతిష్ఠలు తెచ్చినట్లే, ఆంధ్ర దేశానికి కూడలి అయిన బెజ

వాడలో వర్తకంచేస్తూ వన్నెవాసిగల ఆయన, వాణిజ్యాన్ని వివిధ విధాల విన్నాణంగా విస్తరింప చేయుటే గాక, తాను పుట్టిన ప్రదేశానికి, మెట్టిన వానికి, సంఘానికి పేరు తెచ్చిన పురుషుడు.

పడుచుతనాన్ని, పైకాన్ని పదిలపరచినవాడే, 'మనిషి.' అనేవాడు. వ్యాపారం చేస్తూ కూడ అసత్య మాడనివాడు మృదు వాక్కులచే అందరి మన్నలగొన్న సౌమ్య మూర్తి.

ఆయన గొప్ప ముసద్ది మంచి లెఖ్ఖవాడు. నల్ల వెంకటరత్నంవంటి లెఖ్ఖవాడు, నల్లవాళ్ళలో లేడని నానుడి పుట్టింది. ఆయన కమీషను కొట్టులో తరిఫీదు పొందినవారికి ట్రైనింగు అయినంత విలువ వుండేది ఆయన బితా వ్రాసే పద్ధతి వరవడి అయ్యింది వర్తక లోకానికి. కొట్టు పెట్టే ప్రతివారు ఆయనచేత దస్త్రం పెట్టించుకొనేవారు.

మంచి సలహాదారు. ఆయనవద్ద సలహాల కొరకు అనేకులు అనుదినము వస్తూవుండేవారు.

ఆయన సమకాలికులగు ముస్తాబాదు కాపురస్తుడగు కడియాల చంద్రయ్య, సిద్ధాంతం వాడగు అడ్డుమిల్లి సూర్యనారాయణ, నూజెళ్ళ నివాసి పర్వతనేని మల్లికార్జునుడు, బొమ్ములూరి వాసి లింగం నాగభూషణం, కౌతరం కాపురస్తుడు కానూరి చలపతియ్యగారలు మొదలగు దిగ్గంతులంతా సంప్రదింపుకు వస్తూవుండేవారు. ఆనాటి పేరుగలవారంతా ఆయనకు మిత్రులే.

పక్కా వ్యవహర్త. వర్తకుల తగాదాలు అన్నీ ఆయన పరిష్కరించేవాడు. బందరులోని తాడేపల్లి వారి తగాదా, రాయపూడిలోని మల్లెలవారి వ్యవహారం మొదలగునవి పరిష్కారంచేసి ప్రఖ్యాతి గాంచెను.

గొప్ప కంట్రాక్టరు. బందరు, హైద్రాబాదు రోడ్లేగాక కృష్ణా బ్రిడ్జి మొదలగు లక్షల మొత్తంగల పెద్దపెద్ద కంట్రాక్టులేగాక, టోలుగేట్లు, సారాడిపోలు ఆయనే పాడేవాడు.

మంచి ఆరిందా. ఆ కాలంలో ఆరిందాకొట్లు (కమీషన్ కొట్లు) గొప్ప దివాణాన్ని మించివుండేది. అనేకమంది గుమస్తాలు, కాటావాళ్లే గాక, వేలాది వ్యాపారముతో లక్ష్మి పలుకుతూవుండేది యెప్పుడూ. వారి పలుకుబడి అధికం. డబ్బు పుట్టని ఆ రోజుల్లో రైతులు మంచికీ చెడ్డకూ ఈ కొట్లలోనే వాడుకొని తమ పంట తోలేవారు. ఉద్యోగులకు ఇదే ఆశ్రయం. ఇంతేకాదు. గొప్పగొప్ప జమీందారులు కూడా తమ ముప్పులు బాపుకొనుటకు వీరిని ఆశ్రయించక తప్పేదికాదు. అట్టికొట్లు ఆయన చేతిలో అధికంగా వుండేవి. కమీషను మినహా ఒక్క పైసాకూడా పుచ్చుకొనెడివాడు కాడు. ఆరిందాలని ఆనాటి ప్రఖ్యాతులు, తర్వాత కమీషన్ ఏజంటులై నేడు దళారు లనబడు చున్నారు. నాటికి నేటికి అంత వ్యత్యాసం!

అనేక నూతనవ్యాపారాలు ఆరంభించిన ధీశాలి ఆయనకు ముందు బెజవాడలో చిన్న రైసుమిల్లులుండేవి. బర్మా వెళ్ళి లక్షలార్జించిన కొవ్వూరు బసివిరెడ్డిగారే అక్కడ గల

బియ్యపుఫ్యాక్టరీలనుచూచి ఆంధ్రదేశములో మొట్టమొదట స్థాపించెను. ఆయనతో కలిసిన నాటినుండి స్వదేశీ రైస్‌మిల్లు అని గొప్ప మిల్లును పెట్టెను. బోట్ల సర్వీసు, కిర్సనాయిల్ యేజన్సీ మొదలగు పెక్కు టక్కులకు తన ప్రతిభ ప్రసరింప జేసి వాణిజ్యంలో వన్నెకాంచెను. మేనేజిమెంటులో మొన గాడు. రైసుమిల్లుల మేనేజిమెంటులో ఆయన నూతన పద్ధతులు ప్రవేశపెట్టి ప్రఖ్యాతుడయ్యెను ఆయనకు ముందు అందరు గుమాస్తాలుగానే ఉండేవారు. అందులో ఒకరిని మేనేజరను ఏర్పాటు చేసింది ఆయనే.

అనేకమంది నూతనపురుషులను వ్యాపారంలోకి ఆయన దింపెను. అడ్డుమిల్లి వారిని, చాపరాల వీరయ్యగారిని, ముందలపు వెంకట్రాయుడుగారిని భాగస్వాములుగా చేసుకొని వారికి లబ్ధప్రతిష్ఠ గలిగించెను.

ఆయనకు ముందు నెప్పల్లి మొదలగు గ్రామస్థులగు కమ్మవారు వ్యాపారం చేయగా వైశ్యులంతా కట్టుకట్టి వారి వ్యాపారాన్ని అరికట్టి వారిని యిళ్ళకుపంపిరి. వెంకటరత్నం గారు వచ్చినతర్వాత వారి ఆటలేమీ సాగలేదు. కారణం ఆయన ప్రతిభేగాక, ఆయన ఒకవ్యక్తిగాగాక సంఘంగా వాణిజ్యంచేసి, పెద్దపెద్ద వ్యాపారాలు అనేకం చేయుటకు ప్రముఖుల నందరిని కూడ కట్టుటే.

ప్రభుత్వంలో పలుకుబడి వుండేది. జిల్లాలోని ఆఫీసరు లంతా ఆయన అంటే అధికంగా గౌరవించేవారు. వారికి కావలసిన సాయసంపత్తులన్నీ ఆయన చేసెడివాడు. ఆయన మాట మన్నించ బడేది. గొప్ప వ్యవసాయదారు- రాయన

పాడులో 350 యకరాలు దరఖాస్తు మీద సంపాదించెను. ఆయన గొప్ప దాతగాకూడా ప్రఖ్యాతుడు. ఏదైనా చందాకు బయలు దేరితే మొట్ట మొదటగా ఆయన వద్దకే వచ్చుట రివాజు. ఆయన అనేక వ్యక్తులకు కూడ ఆర్థికంగా సహాయం చేసెను. హేమాద్రి వెంకటప్పయ్య మొదలగు వారు నేటికి దీపం పెట్టుకొని మొక్కుకుంటారు.

ఆంధ్ర దేశంలో వర్తకులందరు ధర్మ ఖర్చుక్రిందతీసిన మొత్తాన్ని కన్యకా పరమేశ్వరికి అర్పించుట రివాజు. వెంకట రత్నంగారు ధర్మ ఖర్చు కమ్మవిద్యార్థి సహాయ సంఘానికి ఇచ్చుటకు ఏర్పాటు చేసెను. కమ్మవారి కొట్లన్నీ అలాగే అనుసరించెను. వైశ్యులు దావా వేస్తామని బెదరించారు అక్క డక్కడ. ఆయన యీ ఆర్భాటాలకు అదిరేవాడా?

ఇటుల కమ్మవారి కొట్లతాలూకు కన్యకాపరమేశ్వరికి యిప్పించ కుండా చేయుటేగాక త స్వగ్రామములో తాను ధర్మ కర్తగా వున్న శ్రీ విశ్వేశ్వరస్వామి వారికి శివరాత్రికి జరుగు ఉత్సవమునకు వార్షికములు ఏర్పాటు చేసిన పలుకు బడిదారు. నాటినుండి వర్తకులు కట్టడిప్రకారం నేటికి యిచ్చు చుండుట గణనీయము. ఆకాలములో జమీందారీ దురంతాలు అరికట్టుటకు తన సర్వస్వము అర్పించిన కడియాల చంద్రయ్య గారు కర్షక బంధువుగా ప్రఖ్యాతుడు. గన్నవరం కాపురస్తు డగు వెలివల వెంకటరత్నంగారు భూవసతి గలిగి గవర్నమెం టులో ప్రఖ్యాతుడు. వెంకటరత్నం గారు వర్తకుడుగా విఖ్యా తుడు.

ప్రఖ్యాతులైన ముళ్ళపూడి రాయుడు, కారంచేడు కుప్పుస్వామిగారి కుటుంబం, మల్లెల వారు మొదలగు వారు ఆయనను అధిక ఆదరాభిమానాలతో చూచెడి వారు. ఆయన్ని ఎంతో గౌరవంగా చూచే ప్రముఖుల్లో ఒకరైన, కమ్మ విద్యార్థి సంఘ భవన నిర్మాణములో (గంజికోట భవనం) కోవెల మూడి గోపాలకృష్ణయ్య గారికి కుడిభుజంగా వున్న ఇరుగుల పాటి గంగయ్యగారు చెప్పెడిమాట ఆశ్చర్యంగా కన్పట్టును. ఆనాటి ఆయన ప్రతిష్ఠ అట్టిది. ఆయనే కాదు. వెంకటరత్నంగారి గొప్ప తనాన్ని గురించి కాంగ్రెసు ప్రముఖుడగు కాకుమాని లక్ష్మయ్యగారు కూడ యెన్నో కథలు చెప్పుచుండేవాడు.

ఈ ప్రాంతాల్లో బెజవాడ వస్తే కమ్మవారిలో ప్రముఖులధికంగా గవర్నరుపేటలో మొట్టమొదటిగా కట్టబడిన వారి మేడలోనే బస. ఆయనా అంతే. ఎక్కడకు వెళ్ళినా ప్రముఖులచే ఆహ్వానింప బడెడివాడు. ఆతిథ్యం యిచ్చుటలోను, పొందుటలోను ఆయన అసమానుడు.

ఆయన కమ్మసంఘ ప్రతిష్ఠ పెంచెను. ఆయనకు ముందు బెజవాడలో కమ్మవారికి పలుకుబడి లేకపోవుటే గాక మాటలోను మన్ననలోను, గౌరవం బ్రాహ్మణుల్లో తక్కువ. ఆయన అడుగు పెట్టిన పిమ్మటే అది అభివృద్ధి అయినది. కోవెల మూడి గోపాల కృష్ణయ్యగారు ప్రాక్టీసు పెట్టి ప్రాముఖ్యం చెందిన తర్వాత కమ్మవారు బ్రాహ్మణులతో సమాన ప్రతిపత్తిని సంపాదించారు. ఇదంతా వీరుభయుల ప్రాపకానే. పెద్దలు పోయేటప్పుడు అంత్యసందేశ మిచ్చుట

జరుగును. బాలకృష్ణమ్మగారు మరణ కాలమందు నా సంపాదనంతా ప్రజావశీకరణే అని తన కుమారునితో చెప్పెను. ఆయన శిష్యుడగు గొర్రెపాటి వెంకయ్యగారు ఆ మంత్రాన్ని చేపట్టి ప్రజావశీకరణ సంపాదించి పెత్తనదారు అని ప్రఖ్యాతి గాంచాడు. వెంకటరత్నంగారు తన అంత్య సందేశం, తన తండ్రిచే ఆరంభించబడిన వర్తకం వదిలి పెట్టవద్దని యిచ్చెను.

నేడు బెజవాడలో కమ్మవారనేకం వ్యాపారాలు చేస్తున్నారు. బెజవాడలోవలె కమ్మవారి పలుకుబడి గల పట్నం అరుదు. దీనికంతకు మూలపురుషులు వేమూరి వెంకన్న, కోవెలమూడి వెంకన్నగార్లే. వారిచే నాటబడిన బీజము వెంకటరత్నంగారి కాలములో వృక్షమై నేడు ఫల పుష్ప శోభితమైనది. లోకంలో అనేకులు పెరుగుతారు. తన పెంపు ప్రజలకు ఉపయోగం కలిగించెడివారు ధన్యులు. అట్టివాడే మన వెంకటరత్నంగారు.

## వానపాముల లక్ష్మీనారాయణగారు

విశ్వబ్రాహ్మణులలో ఈయన ప్రఖ్యాతుడు. విశ్వబ్రాహ్మణసంఘోద్ధరణకై పూనుకొన్న వడ్డె నిరంజనశాస్త్రి, కొండిపర్తి వీరభద్రాచార్యులు గారలు మొదలగు ప్రముఖులతో సన్నిహిత సంబంధముండి సంఘాభివృద్ధికి పాటుపడిన వారిలో లక్ష్మీనారాయణగారొకరు.

ఈయన ఘంటసాలలో ప్రముఖుడుగానే గుర్తింపబడ్డాడు. పంచాయతీ బోర్డులో పది సంవత్సరముల పాటు



వేమూరి వెంకటరత్నంగారు



వానపాముల లక్ష్మీనారాయణగారు

సభ్యుడుగా వుండెను. ధర్మగోటక సంఘానికి ప్రథమకార్య దర్శి, కాంగ్రెసు భక్తుడు. గ్రామంలో అన్నిరంగాలలోను తాను ప్రవేశించి గ్రామాభివృద్ధికై పాటుబడ్డ శ్రేయోభిలాషి, ఆధునికుడు, మంచి మనస్సు, వ్యవహర్త.

ఈయన అన్నగారి కుమారుడు భ్రమరాచార్యులకు విద్యాబుద్ధులు చెప్పించి పెంచి పెద్దచేసెను. ఆయన హైస్కూలులో ఆదర్శమైన ఉపాధ్యాయుడుగా పరిగణింపబడ్డాడు. నేడు విశ్వబ్రాహ్మణ సంఘాభివృద్ధికై పాటుపడువారిలో ఆయనొకడు.

లక్ష్మీనారాయణ అన్నగారగు సుబ్బారాయుడుగారు గోటకం ఆక్రమించటానికి వచ్చిన జమీందారుగారి మనుష్యులను పెద్దబాడెతతో నరుకుతానన్న ధర్మవీరుడు.

## సంగీత విద్వాంసులు

చల్లపల్లి సీతారామయ్యశాస్త్రి, సుబ్బయ్యశాస్త్రి గారలు జగత్ప్రసిద్ధులు,సంగీత విద్వచ్ఛ్రేష్ఠులును పెదకళ్లేపల్లి వాసులగు బ్రహ్మశ్రీ సుసర్ల దక్షిణామూర్తి శాస్త్రి గారివద్ద సంగీతవిద్య నభ్యసించిరి. వీరి శిష్యులలో పెక్కురు గాయకులును సంగీతబోధకులునై సంగీతవిద్యను ఆంధ్రదేశమున వ్యాపింపచేసిరి.

గాయక సార్వభౌములగు పారుపల్లి రామకృష్ణయ్య గారు, చల్లపల్లివారు ఏకకాలమున దక్షిణామూర్తి శాస్త్రి గారివద్ద విద్యాభ్యాసము చేసినవారే.

సీతారామయ్యగారు గంభీరగాత్ర సంపన్నులు, ఫిడేలు వాద్య నిపుణులు.

సుబ్బయ్యగారు వీణలో విఖ్యాతులు.

వీరుభయులు జంత్రగాత్రనిపుణులు, చల్లపల్లి సంస్థాన గాయకులు.

వీరు గద్వాల, ఆత్మకూరు, వనపర్తి సంస్థానములలో గొప్ప బహుమతులను గాంచి ఖ్యాతినొందిరి. వీరికి వార్షికము లుండెడివి.

సంగీత పరిజ్ఞాన మున్నప్పటికీ గాత్రమాధుర్యము లేక పోతే ప్రయోజనము లేదు, ఈ రెండూ కూడినప్పుడే శోభ. ఈ రెండును సుబ్బయ్యగారికి బాగా అలవడినవి.

ఈయన గాత్రమెంత హృద్యమై, శ్రావ్యమై యొప్పెడిదో, హృదయమంత నిర్మలమైనది. ఈయన గాన విశారదత్వానికి మూలభూతమైనది గాత్రసంపదే. ఈయన తాన పద్ధతి సత్సంప్రదాయబద్ధమైనది. ఆబాలగోపాలము విని ఆనందించేవారు.

"ఇతని బాణిలో "చోళ దేశపు ఛాయలుండేవి." గౌరీ మనోహారిలో బ్రోవ సమయము" ముఖారిలో "క్షీణమై తిరిగి జన్మించెనో" అన్న కృతులు వీరిసొమ్ము. "నిర్దోషా మధ్యమా మతః" అను లక్షణభూతులు; రంజక, అనుకార, సంజ్ఞారులు" అంటున్నారు" ఆంధ్రగాయకుల చరిత్రకారులు.

సుబ్బయ్యగారు ఆనందభైరవిలో అసమానులు.



చల్లపల్లి పంచనదేశ్వరశాస్త్రి, పురుషోత్తమశాస్త్రిగారలు

సీతారామయ్యగారు మంచి లౌక్యులు, మంచి మాటకారి. మాటలచేత అన్నగారు, మాధుర్యముచేత తమ్ముడుగారు మెప్పించేవారు.

వీరిద్దరివద్దను ఈ గ్రామములోని నాయీబ్రాహ్మణులు చాలామంది గాత్రము, నాదస్వరము నేర్చుకొనిరి. నేర్చుకొన్నవారిలో చినముత్తేవి ఆంజనేయులు, సుబ్బయ్య, ముక్కోటి వెంకటదాసు ప్రసిద్ధులు.

గోగ్రెపాటి వెంకయ్య వీరివద్ద సంగీతము నేర్చుకోవాలని వచ్చి మధ్యలో మానాడు. ఆయనకు సంగీతముమాత్రము రాలేదుగాని సంగీతం వెంకయ్య అనే పేరుమాత్రం వచ్చింది.

పువ్వుల మనోరమణి వీరివద్ద సంగీతవిద్య అభ్యసించి హరికథలు చెప్పటలో ప్రసిద్ధిగాంచినది.

సుబ్బయ్యగారి మనుమడు కృష్ణమూర్తిగారు రేడియో ఆర్టిస్టుగా ప్రసిద్ధుడు.

చల్లపల్లి జగన్నాథంగారి కుమారులు పురుషోత్తమశాస్త్రి, పంచనదేశ్వరశాస్త్రిగారలు. ఇరువురు సుసర్ల వారి శిష్యులే. పంచనాదంగారు వాయులీనం (ఫిడేలు)లో వీను మిగిలారు. వారు పెక్కు బహుమానాలను పొందిన జంత్రగాత్రజ్ఞులు.

పురుషోత్తంగారు గాత్రజ్ఞులు.

వీ రిరువురు, వనపర్తి, గద్వాల, మైసూరు మొదలగు సంస్థానములలో గౌరవింపబడ్డారు.

కాకినాడ సరస్వతీ గానసభలో కచ్చేరి చేశారు.

పంచనదేశ్వరశాస్త్రిగారు, సుప్రసిద్ధ సంగీత విద్వాంసుల కచ్చేరీలలో ఫిడేలు వాయించి ప్రసిద్ధి గాంచారు.

వీరికి ప్రక్క వాయిద్యం వాయించుటకన్న 'సోలో' కచ్చేరి చేయటం యిష్టం.

వీరిరువురు తమ గురువులగు శ్రీ సుసర్ల దక్షిణామూర్తిగారి ఆరాధనోత్సవాలు బందరులో చేస్తూ వుండెడివారు.

పురుషోత్తమ శాస్త్రిగారు 79 వ ఏట 1966 అక్టోబరు 15 న బందరులో కీర్తిశేషులయ్యారు. వీరి సోదరు లంతకు ముందే పరమపదం గాంచారు.

## చింతలపాటి లక్ష్మీపతిశాస్త్రిగారు

వీరు రామన్నగారికుమారుడు. సంస్కృతము బాగుగ అభ్యసించినవారు, వేదాంతములోను, తర్కములోను గొప్ప పండితులు.

కొంతకాలము అత్తవారి గ్రామమగు ఏలూరు తాలూకా కొవ్వలిలో సంస్కృత పాఠశాల నెలకొల్పి ఖ్యాతిగాంచిరి.

అనంతరము ఘంటసాలవచ్చి, ఇక్కడ కొందరకు సంస్కృతము చెప్పిరి.

వీరు గ్రామంలో అందరిచేతను మాన్యతగాంచిన మహానీయులు, ఉదారహృదయులు.

## పిశుపాటి వేంకటరత్న సిద్ధాంతిగారు

ఈయన జగన్నాథంగారి కుమారుడు. సిద్ధాంతిగా ప్రసిద్ధుడు. కూచిపూడి అగ్రహార వాస్తవ్యులగు భాగవతుల రామలింగ శాస్త్రిగారివద్ద జ్యోతిషము, వాస్తు, జాతకము బాగుగ అభ్యసించెను.

1927 నుంచి పంచాంగమును ప్రచురిస్తూ ప్రసిద్ధి గాంచిరి.

వ్యక్తిగతముగా గుణశీలవంతుడు. ఈయన యెడల ఘంటసాల పాలెం, దేవరకోట గ్రామములలో ఆదరాభిమానము అధికముగా వుండెడివి.

చుట్టుప్రక్కల గ్రామములనుండి అనేకులు ప్రతిదినము ఆయనవద్దకు వస్తూ వుండెడివారు ముహూర్తము చూచుకొనిగాని మనమేమీ పని చేయము గద!

దృక్ సిద్ధాంతాన్ని గురించి సర్వధారిలో సభలలో ఉపన్యసించి ప్రస్తుతిగాంచారు.

అష్టగ్రహ కూటమివల్ల అరిష్టములేమియు జరగవని పత్రికలకు వ్రాసి ప్రజల భయసందేహములను నివృత్తి చేసిరి.

వీరు 1965 జూనులో పరమపదించిరి. వీరి కుమారులు గుణశీలవంతులైన విద్యావంతులు.

## తుమ్మలచర్ల వెంకటసుబ్బయ్య సిద్ధాంతిగారు
1905-2-2 - 1965-3-1

శనివారపుపేట, శ్రీ వాత్స్య డిండిమ భట్టార వెంకటాచార్యులుగారివద్ద ఈయన స్కంధత్రయం-జాతకముహూర్త సిద్ధాంతభాగాలు చదివాడు.

1928నుంచి పిసుపాటి వెంకటరత్నం సిద్ధాంతిగారితో కలసి పంచాంగము ప్రకటించిరి.

ఈయన మంచి స్ఫురద్రూపి, మాటకారి. బ్రాహ్మణేతరులలో, అందులో పద్మశాలీలలో సిద్ధాంతభాగము నేర్చినవారు అరుదు. అందుచేత ఈయన అనేకచోట్ల గౌరవింపబడుట జరిగినది.

1935.లో సువర్ణ కంకణ సింహ తలాటకములు బహుమతి గాంచాడు.

1939లో చీరాలలో మకరకుండలములచే గౌరవించిరి.

గొల్లప్రోలులో 1943 లో సువర్ణ గండపెండేరము ధరింపజేసి 42 జతల ఎడ్లబండ్ల చే ఊరేగించిరి.

ఆంధ్ర ద్రావిడ కేరళ మహారాష్ట్ర ఒరిస్సాప్రాంతాలు పంచాంగమునకు చందాలిచ్చెడివారు.

సేలంలో గజారోహణ చేశారు. రాజమండ్రిలో భట్టరు జ్యోతిర్విద్యాలయము 1952, 1962 వరకు నడిపిరి.



గొట్టిపాటి బ్రహ్మయ్యగారు

## గొట్టిపాటి బ్రహ్మయ్యగారు

జగమెరిగిన బ్రాహ్మణుడు. దేశానికి గ్రామానికికూడ ఆయనచేసి ప్రసిద్ధము.

ఆంధ్ర రాష్ట్ర కాంగ్రెసు శెక్రటరిగా అధ్యక్షుడుగా ఆయన చేసినసేవ అనితరము.

కాంగ్రెసువారిలో 'అన్న' అని అందరు ఆప్యాయతతో పిలిచే గౌరవం కలదు. ఆయనకంటే పెద్దవాడగు కాళేశ్వరరావుగారే ' బ్రహ్మయ్యన్నా ! ' అనినోటారా ఆప్యాయతతో పిలిచెడివాడు. అంతకంటే కావలసినదేమున్నది ?

దేశ దాస్య విమోచనకై బ్రిటీషుసింహంతో పోరాడి పలుసార్లు శ్రీ కృష్ణ జన్మస్థానానికి అరిగిన ధీరుడు.

బందరులో బ్రహ్మయ్యగారిషష్టి పూర్తి ఉత్సవము బ్రహ్మాండముగ జరిగెను.

ఆయన షష్టి పూర్తిని పురస్కరించుకొని కృష్ణాజిల్లా కాంగ్రెసు సంఘము అరవై అయిదువేలు వసూలు చేసి పట్టాభి భవనముపై 'బ్రహ్మయ్య షష్టిపూర్తి హాలు' నిర్మించి శాశ్వత కీర్తిప్రతిష్టల నిలిపింది.

ఇది బ్రహ్మయ్యగారియెడల జిల్లా వాసులకుగల ఆదరాభిమానములకు చిరస్మర ణీయమైన చిహ్నము

నేడు ఆయన పెద్దలకు పెద్దగా ప్రసిద్ధుడు – శాసన మండలి అధ్యక్షుడు.

ఆయన ఏకార్యం సాధించినా, ఏ గౌరవం గాంచినా, తాను రైతుననేభావం విడవనాడక పోవుటేగాక, అవన్నీ రైతు లోకానికే చెందుననే భావించును.

ఇటీవల ఆయన రచించిన, కాలచక్రం మన కర్తవ్యం, జాతి వెలుగులు, ఆయనకీర్తి ప్రతిష్టలను ఇనుమడింప చేయగలవు.

ఆదర్శ రైతుసేవకుడు గొట్టిపాటి

వెంకటసుబ్బయ్యగారు ఆంధ్రదేశంలో ప్రథమశ్రేణికి చెందిన రైతునాయకులు మూడు దశాబ్దాలుగా ఆయన రైతాంగ సమస్యలలో విశేషకృషి చేస్తున్నసంగతి సర్వజన విదితం.

జమీందారీ వ్యతిరేకోద్యమం నాటినుండి, నేటివరకు ఆయన యెన్నో రైతు ఉద్యమాలకు నాయకత్వం వహించి రైతులోకపు శ్రేయానికి అహర్నిశలు పోరాడుతున్నాడు.

స్వాతంత్ర్యోద్యమంలో ఆయన అనేకసార్లు కారాగృహాని కరిగెను.

కర్షకోద్యమములో ఆయన యెన్నో కష్టాలను ఎదుర్కొన్నాడు. ఎన్ని యిబ్బందులు ఎదురైనా,ఆయన చలించకుండా మేరు నగధీరుడై, రైతునాయకుడుగా ప్రకాశిస్తున్నాడు.

ఆయన 1950 లో కృష్ణాజిల్లాబోర్డు ఉపాధ్యక్షుడుగా, కృషీకార్ లోకపార్టీ ఉపాధ్యక్షుడుగా, ఆంధ్రదేశ స్వాతంత్ర



గొ|రెపాటి వెంకట సుబ్బయ్యగారు
కిసాన్‌సమ్మేళన అధ్యక్షుడు

పార్టీ ప్రధమాధ్యక్షుడుగా, ప్రజాసేవారంగంలో ప్రధానపాత్ర నిర్వహించి వున్నాడు.

ఇటీవల ఆంధ్రరైతాంగాన్ని తీవ్రంగా కలవరపరచిన అదనపుభూమిశిస్తు చట్టానికి వ్యతిరేకంగా సాగిన సత్యాగ్రహ సమరంలో నాయకత్వం వహించి, రైతాంగ శక్తిని ద్విగుణీకృతం చేశాడు. త్యాగమే లక్ష్యంగా, సేవయే పరమావధిగా జీవితాన్ని అంకితం చేసిన ఉత్తమ రైతు నాయకుడు వెంకటసుబ్బయ్యగారు.

కర్షకోద్యమ నిర్మాత ఆచార్యరంగా గారిలా వ్రాశారు.

"అందరూ శాసనసభలు, మంత్రిమండలి, జిల్లా బోర్డుపై పెత్తనాలకేగాక, కాంగ్రెసు సంఘాల పెత్తనముల కొరకే పట్టుదల వహించుచున్న యీ దినాలలో, స్వంత ధనము, శ్రమ, శ్రద్ధ అంతయు నెంతగానో వినియోగించు చున్నారు; విసుగు విరామము లేకుండా రైతు గొర్రెపాటి. రైతు కాంగ్రెసు అధ్యక్షులై, ఆంధ్ర దేశమందంతటా అందిన ప్రజాసేవకు లందరిచే, వివిధ సమితుల నిర్మించుకొంటూ, నిల్పుకొంటూ ఈ సేవావిధానమందెంత బాధకలదో, ఆశా భంగములు కల్గుచున్నవో, ఆయనకే ఎరుక!! అన్నిటికీ ఓర్చు కొంటున్నారు; తమ నిర్మాణ కార్యక్రమాన్ని అభివృద్ధి మార్గాన సాగించుచున్నారు.

ఆహారసమస్య నెదుర్కొనుటకై, "ఆహార సలహా సంఘాల" నిర్మాణమందెంతో కృషి చేసిరి. రైతాంగానికి న్యాయమగు ధాన్యపు ధరల సంపాదించుటకై కష్టించుచునే

యున్నారు. ఆ సందర్భంలో ఉత్పత్తిదారుల సభలను నడుపుచున్నారు.

"రైతాంగ ప్రజలకు పాట పద్యములు అవసరము. రైతాంగోద్యమమునకు రాజకీయాశయములు కలవు. వాటిని ప్రజాసామాన్యమునకు సులభముగా అందజేయుటకు గీతము లెంతేని యుక్తము. కనుకనే "రైతుభజనావళి"ని రెండు మారులు నూతన లక్షణాలతో ప్రకటించియున్నారు రైతు గోష్ఠి రెపాటి.

వారు కార్యకర్తలు కారు, చురుకైన ప్రచారకులును కారు. ఐతే వారియందు మూర్తీభవించియున్న పట్టుదల, కార్యశూరత, సేవాపరతంత్రత ఆదర్శప్రాయమైనవి.

ఇంతటి మాంధాత రైతుఉద్యమానికి దొరికినందుకు భారత రైతాంగము అదృష్టవంతులు. వారు కుడిభుజమని చెప్పుకో గల్గుచున్నందులకు మా దంపతులం అదృష్టవంతులం. ఆంధ్రులలో యింతటి కార్యదీక్షాపరు లున్నందుకు గర్వపడదాం!"

## ఉప్పల వెంకటేశ్వర్లుగారు

ఇది విజ్ఞాన యుగము. నేడు మన కెందరో వైజ్ఞానికులు అవసరము. వెంకటేశ్వర్లుగారు ఈ గ్రామాన ఆధునికముగా ఆంగ్లవిద్య అభ్యసించిన ప్రముఖులలో ప్రసిద్ధుడు.

స్వయంకృషిచే అభివృద్ధి గాంచినవాడు. ఈయన యం. ఐ. టి. డిగ్రీ పొందెను. ప్రస్తుతం బొంబాయి అణుశక్తి కార్యాలయములో రిసెర్చి ఆఫీసరుగా పని చేస్తున్నాడు.



ఉప్పల వెంకటేశ్వర్లుగారి సన్మాన సభ

## ఉప్పల వెంకటేశ్వర్లుగారి సన్మానసభ

కుర్చీలో కూర్చున్నవారు ఎడమనుంచి: తుమ్మల వెంకట్రామయ్య, గొర్రెపాటి లీలాకృష్ణయ్య, ఈ బాపనయ్య, ఈ వెంకటేశ్వర్లు, ఈ వెంకటసుబ్బయ్య, ఉప్పల వెంకటేశ్వర్లు, గొట్టిపాటి బ్రహ్మయ్య, పిడపాటి లక్ష్మీనారాయణ, వేమూరి వెంకయ్య, గొర్రెపాటి వెంకట్రామయ్య. గొర్రెపాటి బ్రహ్మయ్య, ఈ వెంకటేశ్వర్లుగారలు.

క్రింద కూర్చున్నవారిలో మధ్యకూర్చున్నది: వేమూరి వెంకట్రామయ్యగారు.

శాస్త్రపరిశోధనా తృష్ణకలవాడు. నిరంతరం యేదో తెలుసుకోవాలనే గాఢాభిలాషే ఈయన అభివృద్ధికి కారణమైనది.

విమానాలు, రాడారులకు సంబంధించిన సాంకేతిక విషయాలలో విజ్ఞుడు.

ప్రభుత్వంవారు రెండుసార్లు విదేశములకు పంపినది. అమెరికా, ఇంగ్లాండు, ఫ్రాన్సు వెళ్ళినప్పుడు 1957_9_5 న ఆయన విదేశపర్యటన జయప్రదము కావలెనని ఆశించి ఘంటసాలలో టీ పార్టీ యిచ్చి పంపుట జరిగినది. ఈయన అప్పుడు ఎనిమిది మాసములు ఆయా దేశములలో పరిశోధనలు గమనించి వచ్చెను.

1963 జూన్ నెలలో ఇండియా తరఫున ఇటలీలో జరిగిన అణుశాస్త్ర పరిశోధకుల సమావేశములో పాల్గొనెను. ఈయనకు మంచి భవిష్యత్తు కలదు.

## వేమూరి వెంకట్రామయ్యగారు

ఏమిటి ఈ వెంకట్రామయ్యగారు, రచయితా? నాయకుడా? కార్యకర్తా? ప్రచారకుడా? అంటే అవేమీ కానే కావు.

ఈయన సరసుడు, సహృదయుడు, ఉదార స్వభావుడు, గుణగ్రహణ పారీణుడు, మంచిని పెంచే మంచిమనిషి.

తెరముందు నిలబడటానికి ఆరు తపడతారు కొందరు, తెర వెనుక నిలబడి హంగుచేస్తారు మరికొందరు.

మొదటివర్గంవారే ప్రజలదృష్టిని ఆకర్షించి వారి మన్ననలను పొందుతారు. కాని వీరికి అండగా నిలబడి పెంచి పెద్దచేసి ఆనందించే వెంకట్రామయ్యగారు ద్వితీయ శ్రేణికి చెందినవాడు. పరులను పెంచడమే పరమలక్ష్యంగా పెట్టుకున్న ప్రవృత్తి జన్మతః కలవాడాయన.

ఘంటసాల పుస్తక భాండాగారాధిపతిగా వుండి, భాండాగారములోని గ్రంథాలన్నిటిని చదివిన జిజ్ఞాసువు.

పాఠకుల నెందరినో మంచిగ్రంథాలు చదవ ప్రోత్సహించి, మంచి అభిరుచులను కలిగించిన సంస్కారి.

అనేక యువకులకు ఉత్సాహ ప్రోత్సాహములిచ్చి, వారిని అభివృద్ధిమార్గాన పెట్టిన గుణవంతుడు.

ప్రపంచంలో ఏ కార్యం సాధించాలన్నా, మనుష్యులకు ఉత్సాహం కలిగించాలి, వారికి ప్రోత్సాహం కలిగించాలి.

ఎక్కడ ఏ మాత్రం గుణం కనిపించినా, ప్రశంసించాలి; ప్రశంసంటే పొగడ్త కాదు. పొగడ్త పెదవులమీద నుంచి వచ్చేది, హృదయంనుంచి వచ్చేది ప్రశంస. మానవులలో మంచిగుణాలను పురికొల్పేది ప్రశంస వల్లనే.

అనాథ శరణాలయాలను స్థాపించనక్కరలేదు; ఒక్క సానుభూతి వాక్యం, ఒక్క కారుణ్యమయిన వీక్షణం, ఒక్క చిరునవ్వు చాలు.

రచనలుదేనికి? మానవులలో మార్పు తీసుకొని రావటానికి. రచనలు చేయకుండానే ఆయన మానవాళిలో మార్పు తెస్తున్నాడు; Builder of men,

'మనిషిలో మంచితనం
ఎన్నటికీ పోని ధనం.'

ఈ ధనాన్ని సంపాదించాలి మానవుడై పుట్టినందుకు. ఇది తరగని ధనం, హరించని ధనం! ఇతరుల కిచ్చినకొద్దీ పెరిగేది. ఇటువంటి ధనవంతు డీయన.

మాటేగదా! మంచి తెచ్చినా, చెడ్డ తెచ్చినా. పన్నెత్తి పరుషము పలుకని సరసుడు. పెద్దలయెడల భక్తి, పిన్నల యెడల వాత్సల్యము గల గుణసంపన్నుడు, స్నేహశీలి.

ఈయన మంచి విమర్శకుడు, మంచిని యెంచే సహృదయుడు.

ఆంధ్ర హిందీభాషలలో అధికకృషి చేసినవాడు.

గాంధిమహాత్ముడు పెదవి కదిపితే, అదే వేదవాక్కు, గాలి సోకితే అదే స్వర్గధామం. ఆయన పాదధూళి శిరస్సున దాల్చి పునీతులయ్యేవారు. దర్శనభాగ్యంచే నరులు నారాయణులయ్యేవారు. గాంధీజీ రోజులు అలా చెల్లి పోయాయి.

అటువంటి మహాత్ముని గురించిన హిందీ గ్రంథాన్ని, 'బాపూజీ బాట'గా అనువదించాడు. బాలసాహిత్యంలో ఒక సుగంధ పుష్పమది.

"ఈ గ్రంథమును చదివి యే ఒక్క బాలికా, బాలకుడైనా, తన జీవితమును సరిదిద్దుకోగలిగితే నా కృషి సఫలమైనట్లెంచుకొందును." అనే ఈయన వాక్యం ఈయన గుణాన్ని తెలుపును.

## రచయితలు

రావూరి చలమయ్య మంచి పండితుడు, కవి. ఆయన దరిద్రుడు. బలభద్ర అనే ఇంటిపేరుగల వైశ్యుల ఇంటికి పోగాకుకు వెళ్ళగా అక్కడ ఒక బ్రాహ్మణకవికి అధిక సన్మానము చేయుచు, శూద్రకవికి ఒక తునకపొగాకు పారవేయరా అని వైశ్యుడనగా, తన కుటుంబము ఆ వైశ్య కుటుంబము అంతరించవలెనని పద్యము చెప్పెనట! అవిరెండు అంతరించినవని అనుకొనేవారు.

నిడుమోలు సీతారామయ్యగారు బి. ఎ, ఎల్. టి. బందరు హిందూహైస్కూలులో ఉపాధ్యాయుడుగావుంటూ, పన్నులు- వానిధర్మములు రచించిన రచయిత. ప్రాతినిధ్యము లేనిది పన్నులు వేయరాదని ఈ గ్రంథ సారాంశము.

ఘంటసాల వెంకటరమణయ్యగారు ఉపాధ్యాయ వృత్తిలో వుంటూ,మానసబోధ శతకము మొదలగు రచనలు చేసిన శతకకవి.

ఘంటసాల వెంకట్రామయ్యగారు జగత్ప్రసిద్ధులగు చెళ్ళపిళ్ళ వేంకటశాస్త్రిగారి శిష్యుడు. వేటూరి ప్రభాకర శాస్త్రిగారి బావమరది. వీరిద్దరు జంటకవులు. వేంకటశాస్త్రి గారివద్ద చదువుచున్నప్పుడే గోపాలశతకము చెప్పెను. విద్యార్థిదశలోనే స్వర్గస్థుడగుట దురదృష్టము

పిసుపాటి సుబ్రహ్మణ్యశాస్త్రిగారు, వేంకటశాస్త్రి గారి శిష్యుడు. కమ్మని కవిత్వము చెప్పుటలోను, శ్రావ్యముగా చదువుటలోను, నిపుణుడు. మూకపంచ

విశతిని మధురముగ అనువదించి రసజ్ఞుల మెప్పుగాంచిరి. సుబ్రహ్మణ్య విజయమనుపేర, ఈ గ్రామమందలి సుబ్రహ్మణ్యేశ్వరస్వామి ప్రతిష్ఠను గురించి రచించిరి.

వీరిప్పటికీ సజీవులు. మతిభ్రమణము కలుగుట ఆయనకే గాక, ఆంధ్ర శారదకు నష్టమే కలిగినదనవచ్చును.

వేమూరి రత్నయ్యగారు మంచి వ్యవహర్తేగాక గ్రంథకర్తకూడ. ఈయన మానసశతకము, కొన్ని భక్తి కీర్తనలు, దేవరకోట రాజ్యరమ, హిందూధర్మ రహస్యము, మొదలగు రచనలు చేసిరి. ఈయనరచనలలో హిందూధర్మ రహస్యము గొప్పది. సుప్రసిద్ధ విమర్శకులు కట్టమంచి రామలింగారెడ్డిగారు దీనికి పీఠికవ్రాసి మరింతఖ్యాతి కలిగించిరి.

## జీవిత చరిత్రలకు జీవంపోసిన గొట్టిపాటి

"వెంకటసుబ్బయ్యగారిలో సహజంగావున్న రచనా ప్రతిభకు స్వర్గీయ కొత్తా శ్రీరామశాస్త్రిగారి గురుత్వం, ముట్నూరి కృష్ణారావుగారి ప్రభావం మరి కొంత దోహదం కలిగించి ఆంధ్రదేశంలో ఒకమంచి గద్య రచయితగా గణుతికెక్కించాయి. చిన్నచిన్న వాక్యాలతో పండిత పామరులను మెప్పించే పరిపుష్టమయిన శైలి ఆయనది. ధారాశుద్ధి కలిగిన మంచి వచన రచన ఆయన చేసేది.

తెలుగు సాహిత్యక్షేత్రంలో రకరకాలయిన పంటలను పండించిన కృషీవలుడు. ఆయన తొలిరోజుల్లో రచించిన అనువాద గ్రంథం 'గీతాభూమిక' సుబ్బయ్యగారి ఆధ్యాత్మిక

అభిరుచికి తార్కాణం. 'భట్టుమూర్తి రామరాజ భూషణుడా?' వారి పరిశోధనా పటిమకు పతాక. పూర్వ విమర్శకుల వాదాన్ని పూర్వపక్షం చేసి, భట్టుమూర్తి, రామరాజ భూషణులు విభిన్నులని సూటిగా ప్రమాణీకరించే గొప్ప విమర్శనా గ్రంథం అది. 'హంపీ పిలుపు' చరిత్ర సాహిత్యముల సమ్మేళనం. నవ్వులు పువ్వులు, గాంధీతాత, ప్రహ్లాదుడు వంటి పుస్తకాలు వ్రాసి మన బాలసాహిత్యానికికూడ కొంత వికాసం కలిగించారు. ఘంటసాల చరిత్ర పెద్దల ప్రశంసల నందుకున్నది. దిగ్గతులయిన కొందరు సమకాలిక తెలుగు కథా రచయితలను, వారి అమూల్య రచనలను 'అక్షరాభిషేకము' ద్వారా చక్కటి సమీక్షలు చేశారు. మన తెలుగు కథావాఙ్మయ దిఙ్మండలంపై ప్రముఖ తారలవలె మెరిసే యీ ప్రసిద్ధ కథకుల కథాసాహిత్యాన్ని చాల లోతుగా విమర్శించి, వారందరికి వెంకటసుబ్బయ్యగారు అక్షరమయిన అభిషేకము చేయుట గమనార్హము. స్మృతి పురాణేతిహాసాలలో అక్షరలక్షలు చేయు ప్రవచనాలను అవసరమగు విధముగా ప్రవచించి పాఠకుల మనస్సులకు ఉత్తేజం ఉత్పన్నం చేస్తారు. రచయితలను ఈయన వేరే దృక్పథంతో చూస్తారు. కథారచనలో రసజ్ఞత, శిల్పం, అభ్యుదయం, విశ్వజనీనతలను వలవేసి మరీ గాలిస్తారు. వాటిని మనముందు పెట్టి మనకు అవధిలేని ఆనందాన్ని అందిస్తారు.

ఆయన తెలుగు భాషామతల్లికి సమర్పించిన హారంలో కోలికిపూస యనదగినది శరద్దర్శనం. శరత్ సాహిత్యాన్నంతటినీ తరచి యీ 'శరద్దర్శనం' ద్వారా విశ్వరూప సంద

ర్శనం చేయించారంటే అతిశయోక్తిగాని అసత్యంగాని కాదు. ఆ విధంగా నవలకు నవజీవనం పోసిన నవలా సామ్రాట్టుయొక్క కరుణా కాతర హృదయాన్ని ఎక్సరే తీసి మూలపదార్థాల నన్నింటిని ఆమూలాగ్రంగా దర్శనంచేయించిన దయా మానవతా దార్శనికులు వెంకటసుబ్బయ్యగారు. వ్యక్తిత్వంలో శరత్‌కు చాలా సన్నిహితులా అన్నట్లుంటుంది సుబ్బయ్యగారి ప్రవృత్తి. ఆయనవలె యీయన అర్ద్రహృదయుడు, ప్రేమ మూర్తి. 'Above all in man, there is no greater truth than this'. అనేదే శరత్‌బాబు విశ్వాసం. ఈయనకుకూడ మానవునిలోని మానవతపై నిశ్చితమయిన మొక్కవోని అదే విశ్వాసం. మధుకరమువలె కృషిచేసి 'శరద్దర్శనం' అనే మధుకలశాన్ని ఆంధ్రదేశానికి అందించిన వెంకటసుబ్బయ్యగారు ఎంతయినా అభినందనీయులు. ఈ కోవలోకివచ్చే బృహద్గ్రంథమే 'చలం' కూడ. చలం జీవితాన్ని, సాహిత్యాన్ని, నిశితంగా పరిశీలించడం జరిగింది యీ పుస్తకంలో. అసిధారావ్రతంలాంటి ఈ రచనలోకూడ సుబ్బయ్యగారు ఎంతో కృతకృత్యులయ్యారని చెప్పవచ్చు.

వారి అమ్మాయి స్వర్గీయ, సుగుణ ఆత్మశాంతికి వ్రాసిన 'వేదన' పఠితల గుండెలను కరిగించే కరుణాత్మకమయిన కావ్యం.

మాటా – మన్నన అనే పుస్తకంలో, లౌకిక వ్యవహారాలలోగాని మన దైనందిన జీవితంలోగాని సంభాషణా ప్రయోజనా ప్రాముఖ్యాలు, సంభాషణలలో లోపాలు చూపి చక్కని సంభాషణ నేర్చుకొని సంఘంలో గౌరవాన్నిపొందు

టకూ మంచి సూచనలు చేశారు. ఈ రకమయిన రచనలలో వారి 'మధురజీవనం' మకుటాయమానం. దానిలో మానవుడు ఆలోచించడం మాట్లాడడంకంటె ఆదర్శంగా జీవించడం నేర్చుకోవాలి అని చెప్పారు. అందులో ఆరోగ్య విధులు లగాయతు ఆధ్యాత్మిక చింతవరకు, ప్రకృతినుండి పరమాత్మవరకు, వ్యక్తిజీవనం మొదలు సంఘజీవనం వరకు ఆయన తడవని లౌకిక, అలౌకిక విషయంలేదు. జీవితంలో ఆయన పొందిన అనుభవాలతో ప్రాచీన అధునాతన భావాలను రంగరించి మనస్సుకు అందించిన మధురాతి మధురమయిన పాయసంలాంటిది ఆ రచన. ఈ మధ్య ఆ గ్రంథం చదివిన ఒక మిత్రుడు దాని వుదాత్తతను చెప్పలేక చెప్పుచుయిది 'కురళ్', వేమనపద్యాలకోవకువచ్చే గ్రంథమని,అందులోని ప్రతివాక్యాన్ని తన దైనందిన జీవితానికి అన్వయం చేసుకుంటున్నానని, అది తన జీవన విధానానికి ఒక గొప్ప నిఘంటువువలె వుపకరిస్తున్నదని అన్నాడు.ఆ గ్రంథాన్ని చదివిన వారికి యిందులో అతిశయోక్తి ఎంతమాత్రం లేదని తేటతెల్లమవుతుంది.

ఆ తరువాత తెలుగు సారస్వతంలో ముఖ్యంగా చెప్పుకోతగ్గవి ఆయన జీవిత చరిత్రలు. జీవిత చరిత్రలకు జీవంపోసిన ప్రముఖ రచయిత సుబ్బయ్యగారు. తెలుగులో ఈయన వ్రాసినన్ని జీవితచరిత్రలు బహుశః ఏ రచయిత వ్రాసి యుండలేదేమో !

ప్రజానాయకుడు ప్రకాశం, ప్రజల మన్ననల నెంతగానో పొందింది. శరత్ జీవితం ఆంధ్ర పాఠకలోకం అభి



ఊరేగింపులో సన్మానితులు.

# స న్మా న ము

మునిమాణిక్యం నరసింహారావు, గొర్రెపాటి వెంకటసుబ్బయ్యగారలకు తెలుగు భాషాసమితి వారు కాంతం, సరోజినీదేవి చరిత్రలకు బహూమతి ప్రదానంచేసిన సందర్భాన్ని పురస్కరించుకుని 1951-2-18 న కాటూరి వెంకటేశ్వరావుగారి అధ్యక్షతన సన్మానసభ జరిగింది. ఆ సందర్భములో ఊరేగింపు అనంతరం ఫొటో.

ఎడమనుంచి గొర్రెపాటి వెంకటసుబ్బయ్య, గొట్టిపాటి బ్రహ్మయ్య, మునిమాణిక్యం నరసింహారావు, గొర్రెపాటి వెంకటసుబ్బయ్య, తుమ్మల సీతారామమూర్తి, దోనేపూడి సీతారామయ్య, వేమూరి పరమేశ్వరుడు ఈ వెంకట నరసింహారావుగాలలు.

ధానాన్ని ఎంతగానో చూరగొంది. ఆచార్య రంగా, రైతు నాయకులయిన రంగాగారి జీవితంతోబాటు ఆంధ్రదేశం యొక్క వివిధ ఉద్యమాల స్వరూపం కళ్ళకు కడుతుంది. మన రైతుపెద్దలో మన తెలుగునాడులో అగ్రశ్రేణి నాయకులు, కాంగ్రెసు పెద్దలు అయిన శ్రీ గొట్టిపాటి బ్రహ్మయ్యగారి వ్యక్తిత్వం, ఆయన ఆదర్శజీవితం, గ్రామ రాజకీయాల నుండి దేశ రాజకీయాలవరకు అమేయమయిన, ఆయనపాత్ర ఎంతో బాగా చిత్రీకరించారు. సరోజినీదేవి జీవితచరిత్ర పరేసరి. తెలుగుభాషాసమితి వారిచే మెప్పించి బహుమానం పొందింది. సరోజినీనాయుడు వాఙ్మరివలెనే సుబ్బయ్యగారి ఈ రచన రసరంజితం. ఆ తరువాత వచ్చిన దేశోద్ధారక చరిత్ర, పూజ్య బాపూజీచే విశ్వదాత బిరుదుగాంచిన కాశీనాధుని నాగేశ్వరరావు పంతులుగారి దివ్యచరిత్రను వివరంగా తెలియ జేస్తూ వివిధరంగాలలో ఆయన బహుముఖసేవను ప్రస్తు తించారు. ఇంక మొన్నమొన్న వ్రాసిన — డాక్టర్ సి. ఆర్. రెడ్డి, చరిత్ర ఆంధ్ర సాహిత్య ఎకాడమీ వారిచే వశం చేసుకొని పారితోషికాన్ని పొందింది.

డెబ్భైయో పడిలోపడ్డా యింకా సుబ్బయ్యగారు స్టూడెంటు మాస్తరుగా నోటుబుక్కు జేబులో పెట్టుకుని కొత్త కొత్త విషయాలు నోటుచేసుకొంటూ వుంటారు. విజ్ఞానం సంపాదించుకోవాలనే ఆయన జిజ్ఞాసను ప్రత్యేకంగా పేర్కొనాలి. ఆంధ్రదేశంలో అన్ని మండలాల్లోను ఆయనకు సారస్వత మిత్రులున్నారు. ఆ మిత్రుల పరివారమంతా ఆయ నకు ఆత్మబంధువులే. ఆయన ఎవరి యింటికివస్తే ఆ ఇంట్లో

పసిపిల్లల నుండి పండు ముదుసళ్ళవరకు పండుగలా ఫీలవు తారు.

వెంకట సుబ్బయ్యగారు ఆ మధ్య ఎవరో అన్నట్లు ఒక సంచార గ్రంథాలయం. ఆంగ్ల, వంగ, హిందీ, సంస్కృత భాషలతో బాగా పరిచయం గలదు. ఆయన ఒక గొప్ప వక్తగాక పోవచ్చును గాని, నలుగురు కూర్చున్న గోష్ఠిలో చక్కని సంభాషణ చేయగలరు. ప్రచండ మయిన వాదనలు చేయలేరేమో గాని, ప్రసన్నమయిన విషయ విచారణలు చేయగలరు. తమకు సన్నిహితులయిన ప్రతివారిని కులమత భేదములులేక వారి వరుసలతో పిలుస్తూ సంభాషణలో సున్నిత హాస్యాన్ని మేళవిస్తూ పూలచెండులు విసిరినట్లు మాటలు విసురుతూ అందర్నీ ఆనందపరుస్తూ వుంటారు. ఆయన సాన్నిధ్యం నిండు పూర్ణిమా జ్యోత్స్న. ఒక్కసారి ఆయన పరిచయాన్ని చవి చూచినవారు ఇంక ఆయన్ని వదలలేరు. అంతమంది ఆయన ఆప్యాయతను చూరగొంటూవుంటే అసూయకూడ కలుగుతూ వుంటుంది అప్పుడప్పుడు. ఆయనలో స్వార్థం లేశంచు కాగడావేసి గాలిం చినా కనిపించదు. అత్యంత శ్రమచేసి వ్రాసిన ఆయన ప్రతి పుస్తకం నిస్వార్థంగానే అంకితం చేశారు, తనకు నచ్చిన వ్యక్తికి. ఈ విషయంలో బమ్మెర పోతన ఆదర్శం ఆయనకు.

"Goodness must be joined with knowledge, mere goodness is not of much use as I have found in life." అన్నారు, మనజాతి పిత ఒకపర్యాయం.

ఈ మాట మన గొర్రెపాటి వారికి చక్కగా అన్వయం అవుతుంది. విజ్ఞానం వివేకం చెట్టాపట్టాలు పట్టుకొని ఆయనలో పుంజీభవించాయి. అమృతంతో నిండిన ఆయన హృదయం పైవాటికితోడై ఒక అపూర్వ వ్యక్తినిగా మలచింది ఆయన్ని."

— వేగుంట కనకరామ బ్రహ్మంగారు. (సాహితి)

కనకరామబ్రహ్మంగారికి అలా కనిపించాను కాబోలు. ఆయన సంస్కారం అటువంటిది.

'ఆస్థయా స్వాస్థయా విద్యా మేధయా కిం ప్రయోజనమ్?
తావుభౌ యది నోవేచ్ఛ మేధయా కిం ప్రయోజనమ్?'

ఆస్థ అనగా మనః పూర్తిగా అన్నాహారాలనుకూడా మాని, యిందులో నెగ్గి తీరాలనే పట్టుదల, స్వాస్థ అనగా జరుగుబాటు, యివిరెండూ వుంటే, బుద్ధితో అవసరమే లేదు. ఈ రెండు లేకపోతే బుద్ధి యెంతవున్నా నిష్ప్రయోజనమే అన్న మాట.

పెద్ద లిచ్చిపోయిన కొంచ్రకాస్త వున్నది, జరుగుబాటుకి. ఓపికావున్నది కావలసినంత. విద్యమాత్రం అల్పమే.

అందుచేతనే అంటూవుంటాను; నాలో దక్షతకన్న దీక్ష అధికమని.

అందుచేతనే వ్రాయగలిగాను.

నాకు చిన్నప్పటినుంచి మహాపురుషుల చరిత్రలంటే ఇష్టం. అందుచేత 1916లో అనుకొన్నాను పెద్దవాడనైన పిమ్మట మహాపురుషుల చరిత్రలు వ్రాయాలని, గ్రంథ ప్రకటన సంస్థ ఒకటిపెట్టాలని.

గ్రంథాలైతే వ్రాశాను కాని, ప్రచురణాలయం పెట్టలేకపోయాను.

అయినప్పటికీ మా అల్లుడు బొందలపాటి శివరామకృష్ణగారు దేశికవితామండలి స్థాపించి నా కోర్కె నెరవేర్చాడు.

ఆ సంస్థ లేకపోతే నాకిన్ని గ్రంథాలు వ్రాసే అవకాశం కలిగేదే కాదు.

నావలెనే మరి కొందరకు అటువంటి అవకాశాన్ని కలుగజేసి ఆయన ఆంధ్రభాషకు సేవ చేశాడు.

ఆయన ప్రచురణకర్త, మంచి అనువాదకుడు. శరత్ రచనలన్నీ అనువదించి, శరత్ ని తెలుగు వాడనేటట్లు చేశాడు.

దేశికవితామండలి అంటే శరత్ సాహిత్యం, శరత్ సాహిత్యమంటే దేశికవితామండలి అనే నానుడి కలిగింది.

అట్టి ప్రచురణకర్త, అనువాదకుడు, అనుంగు అల్లుడు, ఆకస్మికముగా అస్తమించటం (1965. 6. 20.) అందరకు తీరని లోటు.



"తెల్లనివాఁడు, మిక్కిలియుఁ దెల్లని వల్వలవాఁడు, వెన్నెలల్
చల్లెడు నవ్వువాఁడు, కడుఁజల్లని చూపులవాఁడుఁ, దాల్మితోఁ
ట్రిల్లని మాటవాఁడు, రసరేఖలలో నడయాడువాఁడు నేఁ
డెల్లెడనిండెనే వెలుఁగులే తనువై శివరామకృష్ణుఁడై."

దేవరకొండ చిన్నికృష్ణశర్మగారు

## వేమూరి వెంకట నరసింహారావుగారు

ఘంటసాల ఆధునిక ఆంగ్ల విద్యావంతులలో ప్రథమ పట్టభద్రుడు. ఆంధ్ర విశ్వవిద్యాలయ వక్తృత్వపోటీలో విజయం గాంచిన వక్త. రాజకీయాలలో ప్రవేశం గలవాడు. కళాశాలలో నేగాక, రచనా వ్యాసంగంలో కూడ ఆర్థికవిజ్ఞానం అభిమానశాస్త్రం. జర్నలిజంలోని మెళుకువుల నెరిగినవాడు.

ఆంధ్రప్రభ సబ్ ఎడిటర్‌గా చాలకాల ముండెను.

ఆంధ్రప్రభలో భూస్వామ్య సంస్కరణల ఆవశ్యకతను గురించి అందుకు సంబంధించిన విషయాలను చర్చిస్తూ వ్రాసిన వ్యాసాలనే 'భూస్వామ్య సంస్కరణల'ను పేర 1956లో ప్రకటించెను,

ఆంధ్రప్రభలో, ధనకనక వస్తువాహనములని వ్రాసిన వ్యాసపరంపరే 'అర్థిక విజ్ఞానం' పేర 1957లో ప్రచురించెను. ఇంకా అనేక వ్యాసములను ఆంధ్రప్రభలో ప్రచురించెను.

తెలుగు స్వతంత్రలో గౌరీశంకర్ అనేపేరుతో 'శిఖరాలు' అనే శీర్షికతో షుమారు అయిదు సంవత్సరాలు వారం వారం ఈయన వ్రాసిన వ్యాసాలు; సమగ్ర రాజకీయ పరిజ్ఞానం, చైతన్యవంతమైన సాంఘిక దృక్పథం, నిష్పాక్షికమైన దృష్టి కలిగి తెలుగునాటి మేధావుల మన్నలకు పాత్రమైనవి.

విజ్ఞాన్వేషి; రచయితలో చిత్తశుద్ధి వున్నది. ఎంతటి క్లిష్టవిషయమైనా, అరటిపండు వలిచి అరచేతిలో పెట్టినట్లు చెప్పగల నేర్పు, నరసింహారావుగారికి వెన్నతో పెట్టిన విద్య.

నేడు విజయవాడనుండి వెలువడే ఆంధ్రపత్రికకు అసిస్టెంటు ఎడిటరు.

శంభుప్రసాద్‌గారి అభిమాన పాత్రుడు. ఇటీవల మన దేశంనుంచి పత్రికా ప్రతినిధుల తరఫున అమెరికా వెళ్ళినవారిలో ఒకరు. ఆంధ్రపత్రిక తరఫున ఈయన వెళ్లెను

## వర్ధిష్ణువులు

పండిత చింతలపాటి లక్ష్మీనరసింహశాస్త్రిగారు, కవిగా, వ్యాసరచయితగా, రేడియో ప్రసంగ కర్తగా ఆంధ్రులకు పరిచయుడు. ఈయన స్నేహలత అనే ఖండకావ్యాన్ని, విన్నపము, అనే శతకాన్ని రచించాడు.

గొర్రెపాటి వెంకటసుబ్బయ్యగారు బి. ఏ. ఈయనకు సాహిత్యమందును రాజకీయాలందును అభిమానం. తెలుసుకోవాలని, తెలపాలని, అభిలాష గలవాడు. వాహిని, హంస, మహిళోదయ పత్రికలలో ఈయన వ్యాసములను ప్రకటించెను. 'వీరేశలింగంగారి దృష్టిలో స్త్రీ' అనే యీయన వ్యాసములు గ్రంథంగా రానున్నది. మరచిపోతూన్న వీరేశలింగం గారిని మళ్ళా స్మరణకు తెస్తున్నందుకు అభినందనీయుడు.

తుమ్మలచర్ల రంగనాయకులుగారు, ఆంధ్రము, గురువుల వద్ద నేర్చిన యువకుడు. నశించిపోతూవున్న పురాణ ఫక్కీని శ్రావ్యముగ పురాణకాలక్షేపము చేయగల సాంప్రదాయకుడు, వినయభూషణుడు.

జియ్యరుదాసుగారు, హరిజనోద్యమానికి అంకితుడు. హరిజన హాస్టలు స్థాపించి కొంతకాలం నడిపెను. Depressed class organiserగా, District social welfare commitee మెంబరుగా వుండి సాంఘికసేవ చేసెను.

జిల్లాబోర్డు మెంబరుగా వుండిన ప్రజాసేవకుడు.

కళావంతులు

ప్రాచీనకాలములో వీరిని దేవదాసీ లనెడివారు. వీరు దేవాలయములలో తమ భరతనాట్యమును దైవసన్నిధిని ప్రదర్శించెడివారు. వీరికి మాన్యము లుండెడివి. భుక్తిముక్తి సాధనముగా యీ విద్య వుండెడిది.

ఇక్కడ పువ్వుల వారుండేవారు. పువ్వుల వారెక్కడ వున్నప్పటికి ఇక్కడనుంచి వెళ్ళిన వారేనంటారు.

ఈ పువ్వులవారు నాట్యకళలోను, సంగీతకళలోను, మృదంగ వాద్యములోను. వైద్య విద్యయందును,వంద్రంగం లోను ఆరితేరినవారు. హరికథకులుగా కూడా అందే వేసిన చేతులే.

కృష్ణహరి, శోభనాద్రి, సోమమ్మ, సూర్యకాంతం భామా కలాపంలో బాగు బాగు అనిపించుకున్నారు. రెండు మేళాలుండేవి.

పువ్వుల పురుషోత్తం, నారాయణం, హనుమాళ్ళుగారలు గాత్రంలోను, ఫిడేలులోను నిపుణులే. సూర్యకాంతం సుతులు వేరు వీరి సోదరీమణులు సుందరం, మధురం, చంద్రకళ అను వారు కూడ నృత్యాభినయనములలో బాగుబాగు అనిపించుకున్న భాగ్యశాలురు.

పాము నాట్యముకాని, పాములవాని కథ కాని నాట్యమాడుట 'మోడి' నర్తన మందురు. నర్తకి శరీరమును వెనుకకువంచి భూమిపై చేతులను ఆనించి నోసలు భూమికి తగులునట్లు శిరస్సు నేలకు అంటించుట మొగ్గ వాలుట.

పూర్వము నర్తకిలు ముగ్గవాలి నొసటితో రూపా యలనెత్తెడివారు. కనురెప్పలతో సూదులు మొదలైనవి తీసెడివారు. ఇట్లా బహు చమత్కారమైన ప్రదర్శనలు చేసెడివారు.

గణేశంగారు, భామాకలాపం, గొల్లకలాపం_ మృదంగం, హాస్యము చెప్పటలోను ప్రవీణుడు. ఈయన కుమారుడే వరకోటిగారు.

సర్వేసు, భగవంతం, వెంకటాద్రి, సీతాపతి ఈ నలుగురు సంగీత విద్వాసులు గరిడీలుపెట్టి విద్య నేర్పెడివారు.

వీరి అనంతరం వెంకటస్వామి, వీరాస్వామి సంగీత విద్వాంసులు.

వీరిలో వీరాస్వామి ఇక్కడ పద్మశాలీలకు నాటకములు నేర్పిన గురువు.

నారాయణ, భీముడు మృదంగంలో నిపుణులు.

మనోరమణి బాలాజిదాసుగారి శిష్యురాలు, హరికథలు చెప్పటలో ప్రవీణురాలు.

పువ్వుల వరకోటిగారు ప్రసిద్ధులగు గాన విద్యా విశారదులవద్ద వాయులీనం_ ఫిడేలు, నేర్చుకొని దేశంలో మంచి కీర్తిని సంపాదించెను. 'సోలో' కచ్చేరీలు చేయటంలోను గణ్యత గాంచెను.

ఫిడేలుమీద 'నాగస్వరము', 'ఇంగ్లీషు బ్యాండు' యింకా ఇతర అనుకరణములను వాయించగలడు.

అయినప్పటికీ కర్నాటక సంగీతమందే అభిమానం.

వెక్కుచోట్ల సన్మానములను పొందెను.

అంగలూరులో వుంటున్నప్పటికీ జన్మస్థలమంటే అభిమానం అధికం.

1965లో ఈ విద్వాంసునకు జన్మస్థలముగు ఘంటసాలలో సన్మానముచేసి, 1116లతో సత్కరించుట జరిగినది.

భాగవతము లాడుట

పూర్వము యీనాటి నాటకములు లేవు. యక్షగానము లుండెడివి. ఇవి సంగీతనృత్యము లన్నమాట. సంగీతము, నృత్యము వాటిలో ప్రధానము. వీటిని వీధినాటకములని కూడా అనెదరు. వీధులలో ప్రదర్శించెదరు గనుక యీ పేరు వచ్చినది.

తంజావూరు నాయకరాజుల కాలములో విస్తారముగా యీ నాటకములు రచింపబడి ప్రదర్శింప బడెడివి.

ఈ గ్రామమునకు నాలుగు మైళ్ళలోవున్న మొవ్వ, క్షేత్రయ్య జన్మస్థానము. ఆయన పదములు అభినయనమునకై వెలసినవి. ఏడుమైళ్ళ దూరములో ప్రాచీనాంధ్ర రాజధాని శ్రీకాకుళము గలదు. అచట నారాయణ తీర్థులవారు తరంగములను రచించిరి. మొవ్వకు రెండుమైళ్ళ సమీపమున ఆంధ్రుల నాట్యకళా క్షేత్రమైన కూచిపూడి కలదు. ఈ అగ్రహారికు లందరు నాట్యములో తరతరాలనుండి ప్రవీణులు, అందుచేతనే కూచిపూడిలో కుక్కమొరిగినా సంగీతమే అనెడి నాముడి. యక్షగాన ప్రదర్శన, భామాకలాపము, గొల్లలాపము వీరికి వెన్నతో పెట్టిన విద్యలు.

వీరే కళావంతులకు భరతాచార్యులు. ఇక్కడి నర్తకిలు మేళము కట్టుటేగాక, మండపేట కళావంతువలె భాగవతములలో స్త్రీ పాత్రలు ధరించి సంగీతసాహిత్యములలోను, నృత్యాభినయములలోను ప్రసిద్ధిగాంచిరి.

వీరును కూచిపూడి వారివలె గ్రామాంతరం వెళ్ళి వారివలనే నిపుణులుగా వుండిరి.

ఈ సమాజములో కేవలం యీ పువ్వుల వంశము నకు చెందిన స్త్రీ పురుషులేగాక, యీ గ్రామ బ్రాహ్మణులు కూడ నుండెడివారు.

పువ్వుల సూర్యకాంతం; లీలావతి, చంద్రమతి, ఉషా కన్య వేసి మెప్పించెడిది. వెంకటగిరి, దేవగిరి గారలూ, విఖ్యాతురాండ్రే.

వీరాస్వామి, హిరణ్యకశ్యపుడు మొదలగు పాత్రలను ధరించి హర్షింప చేసెడివాడు.

ఘంటసాల రామయ్య నారదుడు పాత్రాభినయములో ప్రసిద్ధిగాంచెను.

పువ్వుల పిచ్చయ్య హాస్యగాడు. కడుపుబ్బ నవ్వించెడువాడు. ఆ నాటి హాస్యము మోటే. ఈ సమాజము షుమారు 80 ఏళ్ళ నాటిది.

## సుజనరంజనీ థియేటరు

1879వ సంవత్సరంలో ఆంధ్రదేశాన, పూనా, ధార్వాడ నాటక కంపెనీలవారు నాటకాలు వేశారు. అందులో ధార్వాడవారి నాటకాలు ఆంధ్రుల నధికంగా ఆకర్షించాయి.

1881లో బందరు రామనాయుడు పేటలో హిందూ థియేటరు ఏర్పడింది.

అనంతరం మరికొన్ని ఏర్పడినవి. అలా బందరులో ఏర్పడినవాటిలో బాలభారత సంఘమునకు చిట్టూరి నర సింహారావుగారు మేనేజరు. ఆయన మంచి సర్దాపురుషుడు. తన సంపదంతా వెచ్చించిన రసిక శిఖామణి. ఆయనది ఘంటసాల మాతా మహస్థానము. అటుపిమ్మట అత్తవారి గ్రామము.

అందువల్ల ఆయన ప్రోత్సాహముచే ఇక్కడ సుజన రంజనీ థియేటరు 1908 న ఏర్పడెను. అదినాటక కంపె నీలకాలం. ఊరూరున తర్వాత వెలసినవి.

ఈ సమాజములో గ్రామములో ప్రఖ్యాతమైన ప్రతి కుటుంబంలోనివారు సభ్యులుగా చేరిరి. దీనికి మేనేజరు వేమూరి అప్పన్నగారి కుమారుడు వెంకట్రామయ్యగారు. మంచి పకడబందీగా ఈయన ఈ సమాజాన్ని నడిపెను. దీనికి పెద్దహాలు, ఇప్పటి విశ్వేశ్వర పఠనమందిర స్థానమున వుండెడిది

ఆ కాలములో గురజనాయుడని ప్రసిద్ధిగాంచిన నర సింహారావు నాయుడుగారు గురువు. ఆయన మంచి కట్టు దిట్ట ముగా నేర్పెను.

సత్యహరిశ్చంద్ర, సారంగధర, గయోపాఖ్యానము, రుక్మాంగద, నరకాసుర వధ, వేణీసింహారము, మొదలగు నాటకములను మనోహరముగా ఆడెడివారు.

ఈ థియేటరుకు వేమూరి ఆనందయ్యగారు ఆయువు పట్టు. ఆయన వస్తుతః స్ఫురద్రూపి, ఒడ్డు పొడుగుగల ఉన్నతమైన ఆకారము గలవాడు. అపస్వరములేకుండా మాధుర్యముగా పద్యము, పాట, వచనము అన్నిటిలోను వినిపించుకున్నవాడు.

అన్నిటిలోను ప్రధానపాత్రే. రాజువేషము ఆయనే. హరిశ్చంద్రలో, హరిశ్చంద్రుడు, రుక్మాంగదలో రుక్మాంగదుడు, గయోపాఖ్యానములో ధర్మరాజు.

అనంతరం స్త్రీ వేషధారి, మొవ్వ నరసయ్యగారు. ఇందులో ఈయన నిపుణుడు.

పిసుపాటి సుబ్బయ్యగారు, భీమ, నరకాసుర పాత్రలలో గురువుకుతగిన శిష్యుడనిపించుకొనెను.

పిసుపాటి వెంకటనారాయణగారు అర్జునుడు, మొదలగు తర్వాత ప్రధానపాత్రలను ధరించెడివారు. ఈయన కంఠంలో ఒక విధమైన జీరవుండి ఒకవింత మాధుర్యం కలిగించేది.

కొండ రామలింగంగారు, వశిష్టుడుగాను, వజ్రకంఠుడుగాను ప్రసిద్ధుడు. అందులో వజ్రకంఠ వేషం మరి ఒప్పెడిది.

తుమ్మలచర్ల వెంకట నరసింహంగారు, సత్యకీర్తి మొదలగుపాత్రలు ధరిస్తూ సంభాషణలో సరసుడుగా ప్రసిద్ధుడు.

ఘంటసాల వీరాచార్యులు, అంది బసవలింగం మొదలగువారు చిన్నచిన్న స్త్రీ పాత్రలు ధరించెడివారు.

గోరేపాటి వెంకయ్యగారు పాండురాజు, బఫూన; కడుపుబ్బ నవ్వించెడివాడు.

వీరు బందరు, కళ్ళేపల్లి, వెల్లటూరు, మొదలగు ఇతరచోట్ల కూడ నాటకములు వేసి, ఖ్యాతిగాంచారు.

ప్రాంప్టు చేయుటలో నిట్టాలక్ష్మయ్య, మైనరు వేమూరి వెంకయ్యగారలు దిట్టలు.

ఈ హాల్లో పెడననాటక సమాజము, కొంకేపూడి గురునాథంగారిది పెక్కు నాటకాలనువేసి పేరు పొందినది.

ఈ హాలులో సుప్రసిద్ధ గాన విద్వాంసురాలగు బెంగుళూరు నాగరత్నంగారుకూడా కచేరి చేసి శ్రోతలను ఆనందాంబుధిలో ముంచినది.

ఈ సమాజము గ్రామములో నవ నాగరికతకు నాంది వచనము పలికినది.

## జలధీశ్వర నాటకసమాజము

**1932 - 35**

దీని మేనేజరు కొండపల్లి చిట్టెన్నగారి కుమారుడు వెంకయ్యగారు. ఆయన దీనికొరకు సర్దాగా కొంత ఖర్చు పెట్టెను. దీనిహాలు తూర్పువైపు రామమందిరమునకు ఉత్తర మునవుండెను. ఇది 1932న స్థాపింపబడినది. పట్టాభిఅనే శ్రీపతి పట్టాభిరామయ్యగారు గురువు.

దీనిలో మొవ్వ నరసయ్య, పారుపల్లి సత్యనారాయణ గారలు నెలసరి జీతాలతోవుండి స్త్రీ పాత్రలు ధరించే వారు.

వీరు, విజయనగర సామ్రాజ్య పతనము, చింతామణి, కనకతార, కృష్ణలీలలు, శారంగధర మొదలగు నాటకములు ప్రదర్శించెడివారు.

వేమూరి ఆనందయ్య, ఈ వెంకట్రాయులు, పరమేశ్వరుడు, నాగయ్య, అయినపూడి రామయ్య, ఈసుబ్బన్న గారికుమార్డు రామయ్యగారలు ముఖ్యులు.

యర్రబోయిన రామకోటి, వేమూరి బ్రహ్మయ్య గారలు స్త్రీ పాత్రలు ధరించేవారు.

వేమూరి నాగయ్యగారు సహజంగా హాస్య చతురుడు. ఆయన చింతామణి నాటకములో సుబ్బిశెట్టివేసి, కడుపుబ్బ నవ్వించేవాడు.

వేమూరి వెంకటరత్నంగారు బఫూన్.

## రామమోహన థియేటర్

ఇది 1928_34 వరకు వున్నది. దీనికి గురువు వేమూరి నాగయ్యగారు. వేమూరి అక్కమ్మగారింటివద్ద దీనిహాలు.

పాటిబండ్ల వెంకటేశ్వరరావు, చల్లపల్లి దక్షిణామూర్తి శాస్త్రిగారలు హార్మోనిస్టులు.

పాండవ ఉద్యోగము, చింతామణి, బొబ్బిలి, రంగూన్ రౌడి, మధుసేవ, వరవిక్రయం, పాదుకా పట్టాభిషేకం, విజయనగర సామ్రాజ్య పతనము, మొదలగునవి ప్రదర్శించెడి వారు.

ఈ గ్రామంలోనేగాక, శ్రీకాకుళం, క్రాప, మంత్రిపాలెం మొదలగు చోట్లకూడ, ప్రదర్శించి, ప్రశంసలను పొంది.

ఈ సమాజములో, వేమూరి నాగయ్య, గొర్రెపాటి బ్రహ్మయ్య, వేమూరి లక్ష్మయ్యగారలు ప్రముఖులు. బ్రహ్మయ్యగారు, పాండవ ఉద్యోగంలో కర్ణుడు, చింతామణిలో దామోదరుడు, బొబ్బిలో పాపారాయుడు, పాదుకలో దశరధుడు, మధుసేనలో రంగడు, యిలా ప్రతి నాటకములోను ప్రధానపాత్ర వహించి మెప్పించెడివాడు.

వేమూరి లక్ష్మయ్యగారి గాత్రం చాలా మంచిది. గొర్రెపాటి వెంకటేశ్వర్లుగారు దుర్యోధనుడు, రంగారాయుడు, భరతుడు మొదలగు పాత్రలలో ప్రసిద్ధుడు.

వేమూరి వెంకటరత్నంగారు, హైదరజంగ్ పాత్ర, రంగడు, గొప్పగ నటించి పేరనిపించుకొనెను.

రామవిలాస సభ

ఈ కాలములోని పార్టీల ననుసరించి యిది ఏర్పడింది దీనికి నెమలికంటి హనుమంతరావు గురువు, హార్మోని వాయించేవాడుకూడ.

తుమ్మల వెంకట్రామయ్య, గొర్రెపాటి పుండరీకాక్షుడు, అయినపూడి నరసయ్యగారలు ప్రముఖులు.

దీనికి కొండపల్లి చౌదరి, అయినపూడి సీతారామయ్య వరుసగా మేనేజరులు.

కాళిదాసు, తులాభారం, సారంగధర, లవకుశ, ఆడే వారు.

ఈ కంపెనీలు రెండు పోటీలుపడి ఒకేరోజున ఆడి నష్టం పొందేవి.

వేమూరి వెంకట్రామయ్యగారు ప్రాంప్టరు.

## భావనాఋషి నాట్యమండలి

**1925 _ 1934**

ఇది కేవలం పద్మశాలీల సమాజము. యార్లగడ్డ పద్మశాలీలు నాటకాలాడుట చూచి వీరికి వారివలె నాటకాలాడాలని సంకల్పం కలిగింది. అందువల్ల పువ్వుల వీరాస్వామి గారిని రావించి, ఆయనవద్ద వీధినాటకాలు బాగా కట్టుదిట్టముగా మూడు సంవత్సరాలు నేర్చుకొనిరి.

చిట్టూరు గ్రామకాపురస్థుడు ముక్కామల వెంకట్రామయ్యగారు నాటకకవి, అభినయములోను ప్రసిద్ధుడు. ఆయన వద్దకూడ వీరు అభ్యసించిరి.

వీరిలా శ్రద్ధతో హరిశ్చంద్ర, రామనాటకము, ప్రహ్లాద, మార్కండేయ, సావిత్రి, శశిరేఖాపరిణయము, సిరియాళ, మొదలగు నాటకములను అభ్యసించి ప్రసిద్ధి గాంచిరి.

ఇవన్నీ వీధినాటకములు అనగా యక్షగానములు.

కేతన సీతారామస్వామిగారు సూత్రధారుడు. అనగా యిప్పటి సినిమాలో డైరెక్టరువంటివాడు. నాటకమంతా యీయనకు కంఠస్థమైవుండాలి. సందర్భానుసారముగా మాటలు, ఛణుకులు చెప్పగలిగి వుండాలి. మంచిగాత్రం, అనుభవము వుండాలి.

తుమ్మలచర్ల వెంకటరత్నంగారు, మంచి గాత్రజ్ఞుడు, స్ఫురద్రూపి. ప్రతి నాటకములోను రాజుపాత్రధారి. సుజనరంజన థియేటరులోని ఆనందయ్యగారివంటి నటుడు.

తుమ్మలచర్ల వెంకటగోపాలంగారు, వీరరస ప్రదర్శనములో ఘటికుడు. హిరణ్యకశ్యపుడు, విశ్వామిత్రాది పాత్రలకు పెట్టిందిపేరు.

స్త్రీ పాత్రలు తుమ్మలచర్ల వెంకటరెడ్డి, సుబ్రహ్మణ్యం గారలు వేసి, ప్రేక్షకుల ప్రశంసలను పొందేవారు. తుమ్మల వెంకటాద్రిగారు నారదాది పాత్రలను వహించెడివాడు.

కొసనం నాగలింగం హాస్యచతురుడు.

ఈ సమాజంవారికి కావలసిన అన్ని హంగులువున్నవి. అనేక ప్రాంతాల ప్రదర్శించి కూచిపూడివారివలె ప్రశంసలను పొందిరి.

ప్రఖ్యాత కూచిపూడి సూత్రధారుడగు చింతా వెంకట్రామయ్యగారు, వీరి ప్రదర్శనముగాంచి, కష్టపడి నేర్చుకొన్నారు, వృద్ధిలోకి రాగలరని ఆశీర్వదించారు.

హారిశ్చంద్రలో, వేదాంతంవారిలో రామకృష్ణయ్య గారు, చింతావారిలో బొక్కా సీతారామయ్యగారు, హారిశ్చంద్ర పాత్ర వహించి మెప్పుగాంచినవారు.

తుమ్మలచర్ల వెంకటరత్నంగారి హారిశ్చంద్ర పాత్ర వారికి తీసిపోయేదికాదని విజ్ఞులనెడివారు.

వీరు కూచిపూడి వారివలె ఉత్సవాలకు వార్షికముగా వెళ్ళి ప్రదర్శన లిచ్చెడివారు. గురజ, భట్టిప్రోలు, కోడూరు వరుసగా పెక్కు సంవత్సరాలు ఆడి ప్రఖ్యాతిగాంచిరి. ప్రథమంలో నాటకమునకు రు 25/ అటు తర్వాత రు 100/ రు 116/లు పుచ్చుకొనెడివారు.

ఈ సమాజము కూచిపూడివారికేమీ తక్కువ కాదని ప్రశంసించి నందిగామలో రాళ్ళబండి యజ్ఞయ్యగారి అధ్యక్ష్యమున, కోకా కృష్ణమూర్తిగారి అధ్యక్షతను భట్టిప్రోలులోను మెడల్సును పొందినది.

పదిసంవత్సరములు ఈ సమాజము వారు కలసిమెలసి చక్కగా ప్రదర్శనము లిచ్చిరి.

అనంతరము రెండు సమాజములుగా చీలి కొంత కాలము వేరు వేరుగా ప్రదర్శనములిచ్చిరి.

కూచిపూడివారు కొన్ని శతాబ్దములనుండి, అభినయమును ఇహపర సాధనముగా నిర్వహించుచు ఆంధ్రావనికేగాక భరతఖండమునకే కీర్తితెచ్చు చున్నారు.

వారినడకే నాట్యము, పలుకే పాట, వారికి వారేసాటి.

ఈ భావనాఋషి నాట్యమండలి, తమ కులమునకు, స్థలమునకు ప్రశస్తి తెచ్చినది.

కొన్ని ముఖ్య తేదీలు

1802 పర్మనెంటు సెటిల్మెంటు
1815 సుబ్రహ్మణ్యేశ్వరస్వామి ఆలయ నిర్మాణము
1722 చిత్రభాను సంవత్సరపు వరదలు
1743 బందరు నోబుల్ హైస్కూల్
1755 కృష్ణ ఆనకట్ట
1855 బందరు హిందూ హైస్కూల్
1755_11_1 విక్టోరియారాణి ప్రకటన
1860 శ్రీ విశ్వేశ్వరస్వామి ఆలయ నిర్మాణము
1860 మొదటి సెటిల్మెంటు
1863 బందరు కాలువ
1864_11_1 బందరు ఉప్పెన
1870 మొదటి జనాభా
1870 మరకాల తగాయిదా
1871 పీసబడి
1873 పరగణావ్యాజ్యం
1876 నందన కరువు
1878 ధాత కరువు
1879 పగ్గంకేసు
1885_9_1 ప్రాథమిక బాలుర పాఠశాల.
1889 బాలకృష్ణమ్మగారు, జలధీశ్వరస్వామి పవలింపు సేవకై మేడకట్టించుట.
1897_3_15 బెజవాడ రైలు

1897 భీమనదీ ఛానల్ క్రింద సాగు.
1899 గోటకం కేసు
1902 కృష్ణాపత్రిక ప్రారంభం
1902 బ్రాంచి పోస్టాఫీసు
1903 కృష్ణ వరదలు
1905 దివితాలూకా ఏర్పాటు
1905 విశ్వేశ్వరాలయ పునరుద్ధరణ
1906 అలెగ్జాండర్ రే స్థూపమును త్రవ్వి రిపోర్టును ప్రకటించుట
1908_2_4 బందరు రైలు
1909 చల్లపల్లిలో సబ్ రిజిస్ట్రారు ఆఫీసు
1910 బందరు జాతీయ కళాశాల
1913 ప్రాథమిక బాలికా పాఠశాల
1914 శ్రీ రామమోహన గ్రంథాలయం
1917 యువకులు విద్యాభ్యాసం మాని రాజకీయాలలో ప్రవేశించుట
1918_4_18 పంచాయతీ బోర్డు
1919_12_19 శ్రీ జలధీశ్వర సహకారసంఘం
1920_10_10 దివితాలూకా కాంగ్రెసు సభ
1920 అక్టోబరులో కాళీపెట్టెలు పంపుట
1921_7_22 ధర్మగోటక సంఘం
1921_12_12 పంచాయతీ సభ
1922 సతుల దిబ్బచట్టా
1923 బోయీల కట్టవద్ద చట్టా

1924_8-10 దేశోద్ధారక నాగేశ్వరరావు ఖద్దరు సంఘం
1924_4_20 మహాత్మాగాంధీ ఘంటసాల రాక.
1925_5_16 గాలివాన
1925_12_3 గ్రామసంఘం
1926 రూరల్ డిస్పెన్సరీ
1926_11_16 గాలివాన
1928 చుండూరివారి సత్రం
1928 కోట దిబ్బలవద్ద బౌద్ధశిల్పాలు బయటపడుట
1929 జలధీశ్వరాలయ ముఖ మండపము
1930_2_1. 14వ కృష్ణాజిల్లా సహకారసభ
1930_2_8 నల్ల జెండాల ప్రదర్శన
1930 ఉప్పు సత్యాగ్రహం
1930 డిశంబరు ప్రాథమిక పాఠశాల పత్రిక ప్రచురణ
1930_31 అన్నపూర్ణాంబాలయ నిర్మాణము
1932_12_3 షష్ఠికి గుడిబైట హరిజనులతో పూజ
1933_3_23 స్త్రీ వాలంటీర్ల అరెస్టు
1933_11_19 హరిజన దేవాలయ ప్రవేశం
1934 చల్లపల్లి హైస్కూల్
1934 గోటక ఆక్రమణను ఎదుర్కొనుట
1935 పంచాయతీ సర్వే
1935 పులిగడ్డ అక్విడక్టు; తూర్పు కాలువ
1942 క్విట్ ఇండియా ఉద్యమం

1942 చిలకలపూడి డ్రాప్
1946 మాధ్యమిక పాఠశాల
1946_7_6 ఉత్పత్తి కొనుగోలుదార్ల సంఘం
1947_8_15 స్వాతంత్ర్య ప్రకటన
1948 ప్రస్తుత లైబ్రరీ బిల్డింగ్
1949 మహాత్మాగాంధీ జిల్లా పరిషత్ ఉన్నత పాఠశాల
1949 దేవరకోట సంస్థానంరద్దు
1949_12_10 రెగ్యులర్ డిస్పెన్సరీ
1950 చిలకలపూడి ఛానల్
1950_4_19 హైస్కూలు నూతనభవన ప్రవేశం
1952 కొడాలివరకు మెటల్ రోడ్డు
1953_10_1 ఆంధ్రరాష్ట్రం
1953 డిశంబరు తెలుగువిద్యార్థి
1955 భీమనదీ ఛానల్ పైన వంతెనలు
1955 ఘంటసాల ఛానల్
1956 సబ్ పోస్టాఫీసు
1956_11_1 ఆంధ్రప్రదేశ్
1958_7_26 విశాల సహకార పరపతిసంఘం
1959_7_4 లోకల్ లైబ్రరీ
1959 ప్రభుత్వ విత్తన ఉత్పత్తిక్షేత్రము
1960 విద్యుద్దీపములు
1960_1_3 టెలిగ్రామ్
1961 లైబ్రరీ బిల్డింగ్ పై అంతస్థు

1962_11_7 టెలిఫోన్
1962_11_27 వృత్తి విద్యావ్యవసాయ పాఠశాల
1964_12_3 భూమి తనఖా బ్యాంకు
1965_5_8 ప్రాంతీయ పశుగణాభివృద్ధి కేంద్రము

ఈ గ్రంథరచన కుపయోగపడిన గ్రంథములు

## BIBLIOGRAPHY


1 విశ్వేశ్వర ప్రతిష్ఠాపన
2 ప్రాచీనాంధ్ర నౌకా జీవనచరిత్రము
3 నేతపరిశ్రమ
4 శ్రీమంతు
5 ప్రాచీనాంధ్ర దేశము
6 ఆంధ్రదేశ కథా సంగ్రహము
7 ఆంధ్రసాహిత్య పరిషత్పత్రికలు
8 బౌద్ధయుగము
9 భారతి, ఆంధ్రపత్రికలు, ఇతర వ్యాసములు
10 ఫాహియాన్ భారతయాత్ర
11 ప్రాచీనాంధ్ర వాణిజ్య వైభవము
12 హిందువుల ఆధిక్యము
13 ఆంధ్రుల చరిత్ర
14 ఆంధ్ర విజ్ఞాన సర్వస్వము
15 సాంబ నిఘంటువు
16 కమ్మవారి చరిత్ర
17 చారిత్రిక విషయములు

18 కవుతరం చరిత్ర
19 నానారాజన్య విఖ్యాత జనచరిత్ర
20 దేవరకోట సంస్థానచరిత్ర
21 బుద్ధజయంతి మహోత్సవ సంచిక
22 మన ఆంధ్రత్వము
23 చరిత్ర చేస్తున్న హెచ్చరికలు
24 సాంప్రదాయక విజ్ఞానం
25 ఆంధ్రుల సాంఘికచరిత్ర
26 గొట్టిపాటి బ్రహ్మయ్యగారి స్మృతులు
27 Ancient India described by Ptolemy. M.C.Trindel
28 Yarles Markapolo
29 Juhras
30 Indian Antiquary
31 History of Andhras
32 Ancient History of the:Deccan
33 Topographical lists of Antiqucries
34 Andhra Coins of S. I. Elliat
35 Early History of India
36 Ancient Indian Numismatics
37 The coins of Ancient India. Cunningham
38 Epigraphia Indica
39 Indian Architecture
40 Buddhist remains in Andhra
41 Burge's Archaeological survey of South India
42 Asia Major
43 Annual report of the Archaeological Dt. s. c.
44 L. C. R
45 Historical Inscriptions of South India
46 Inscriptions of the Madras Presidency
47 Krishna District Manual

ఆంగ్ల విద్యాధికులు

పూర్వకాలపు పట్టభద్రులు

1 గొట్టిపాటి సుబ్రహ్మణ్యేశ్వరస్వామి, బి.ఎ.
2 ఘంటసాల శేషయ్య, బి.ఎ
3 నిడుమోలు సీతారామయ్య, బి ఏ; యల్. టి.

ఆధునిక పట్టభద్రులు (బి. ఏ; బి. యస్. సి; బి. కామ్)

1 వేమూరి వెంకట నరసింహారావు, బి.ఎ.
2 అయినపూడి వెంకటనారాయణ, బి. కామ్.
3 పిశుపాటి వెంకట రామశర్మ, బి.ఎ.
4 ఘంటసాల బాలకృష్ణమూర్తి, ,,
5 వేమూరి కృష్ణమూర్తి ,,
6 వేమూరి సీతారామయ్య, ,,
7 గొట్టిపాటి వీర రాఘవేంద్రరావు, ,,
8 గొర్రెపాటి వెంకటసుబ్బయ్య, ,,
9 తుమ్మల రామమోహనరావు, ,,
10 వీర్ల సుబ్బారావు, ,,
11 పంది పుల్లయ్య, ,,
12 గెల్లి గోపాలరావు ,,
13 గొర్రెపాటి వెంకటకృష్ణారావు, ,,
14 వేమూరి రామకృష్ణప్రసాద్, ,,
15 గొర్రెపాటి వెంకటేశ్వరరావు, ,,
16 చల్లపల్లి సీతారామశాస్త్రి, బి. యస్. సి.

17 కాకర్లమూడి చార్లెస్, బి. ఎ.
18 పిసుపాటి జగన్నాధరావు, బి. కామ్.
19 గొర్రెపాటి చంద్రశేఖరరావు, బి ఎ.
20 గొర్రెపాటి రంగనాధబాబు, బి. యస్. సి.
21 పిసుపాటి నాగభూషణం, బి. కామ్
22 నూతక్కి వెంకటేశ్వరరావు, బి. యస్. సి.
23 తూములూరి రాధాకృష్ణమూర్తి, ,,
24 పిసుపాటి సచ్చిదానందమూర్తి, బి.ఎ.
25 చల్లపల్లి రాధాకృష్ణమూర్తి బి. యస్. సి.
26 చింతలపాటి బాలసుందరమూర్తి, ,,
27 తుమ్మల గోపాలకృష్ణ. ,,
28 ఘట్టి సుబ్రహ్మణ్యశాస్త్రి, బి. కామ్.
29 పిసుపాటి సీతారామశర్మ, బి. యస్. సి. ఆనర్స్.
30 మల్లంపాటి బాలకిశోర్, బి. కామ్.
31 దివి శ్రీనివాసాచార్యులు బి. యస్. సి.
32 పొట్లూరి రాజయ్య ,,
33 వడ్లమూడి వెంకట కృష్ణారావు ,,

బి. ఇ.డి. డిగ్రీ పొందినవారు

1 బండి వెంకటరత్నం
2 మూల్పూరి చెన్నారావు
3 వేమూరి జగపతిరామయ్య
4 ఎన్నిగళ్ళ వెంకటరత్నం

5 దోనేపూడి వెంకటరత్నం
6 పంది వెంకటేశ్వర్లు
7 వేమూరి సుదర్శనరావు
8 తుమ్మల రాధాకృష్ణయ్య
9 వేమూరి విశాల
10 వేమూరి సీతమ్మ

యల్. యం. ఇ. & యల్. సి. ఇ.

1 నల్లూరి రంగారావు, యల్. యం. ఇ.
2 వేమూరి రామకోటయ్య, యల్. సి. ఇ.

యమ్. యస్. సి. డిగ్రీ పొందినవారు

1. పిసుపాటి వెంకటసుబ్బారావు
2. పిసుపాటి రాధాకృష్ణమూర్తి
3. పిసుపాటి జగన్నాధరావు

యమ్. ఏ. డిగ్రీ పొందినవారు

1. చల్లపల్లి హనుమంతురావు
2. వేమూరి వెంకటరత్నప్రసాద్
3. పిసుపాటి లీలాకృష్ణమూర్తి
4. గెల్లి రామమోహనరావు
5. బొందలపాటి శివాజీరావు

యల్. యల్. బి. డిగ్రీ పొందినవారు

1. గొర్రెపాటి రామచంద్రరావు, యమ్. ఏ; యల్. యల్. బి.

ఇంజినీరింగులో డిగ్రీ పొందినవారు

1. ఉప్పల వెంకటేశ్వర్లు, బి. ఏ. యమ్. ఐ. టి.
2. పిశుపాటి వెంకటేశ్వరరావు, బి. ఇ.
3. పువ్వుల భీమేశ్వరరావు, బి. ఇ.
4. వడ్లమూడి ఉమామహేశ్వరరావు, బి. ఇ.
5. గొర్రెపాటి రంగనాథబాబు, బి. ఇ.

మెడిసిన్‌లో డిగ్రీ పొందినవారు

1. యార్లగడ్డ యశోధర, యం. బి. బి. యస్.
2. యార్లగడ్డ యుధిష్టరనీడు, యం. యస్.
3. పిశుపాటి సీతారామయ్య, యం. బి. బి. యస్.
4. గొర్రెపాటి శ్రీనివాసరావు, యం. బి. బి. యస్.

బి. వి. యస్. సి. లో డిగ్రీ పొందినవారు

1. గొర్రెపాటి బసవేశ్వరరావు.

ఈ గ్రంథ ముద్రణకు విరాళము లిచ్చినవారు

| | | |
|---|---|---|
| 1 | గొట్టిపాటి బ్రహ్మయ్యగారు | రు. 250 |
| 2 | దోనేపూడి సీతారామయ్యగారు | 200 |
| 3 | గొర్రెపాటి వెంకటసుబ్బయ్యగారు<br>కిసాన్‌సమ్మేళన అధ్యక్షులు | 100 |
| 4 | ఈ బుల్లెయ్య చౌదరిగారు | 116 |
| 5 | ఈ పరమేశ్వరరావుగారు | 100 |
| 6 | వేమూరి సాంబమూర్తిగారు | 100 |
| 7 | ఘంటసాల జ్ఞానోదయ వీవర్సు సొసైటి | 100 |
| 8 | వేమూరి వెంకట్రామయ్యగారు | 100 |
| 9 | వేమూరి వెంకట కుటుంబరావుగారు | 50 |
| 10 | గొర్రెపాటి వెంకటనారాయణ సోదరులు | 50 |
| 11 | వేమూరి పేరయ్యగారు | 25 |
| 12 | భండి లక్ష్మీనారాయణగారు | „ |
| 13 | కోకే బసవ కోటిలింగంగారు | „ |
| 15 | వేమూరి వెంకయ్యగారికుమార్డు<br>వెంకటేశ్వర్లుగారు | „ |
| 15 | తుమ్మల వెంకట్రామయ్యగారు | „ |
| 16 | సుబ్రహ్మణ్యేశ్వర రైసుమిల్లు | „ |
| 17 | గొర్రెపాటి వెంకటకృష్ణయ్యగారు | „ |
| 18 | గొర్రెపాటి లీలాకృష్ణయ్యగారు | „ |

19 గొర్రెపాటి వీరరాఘవయ్యగారి కుమారుడు
వెంకటసుబ్బయ్యగారు 25
20 గొర్రెపాటి వెంకటేశ్వర్లుగారు ”
21 గొర్రెపాటి వెంకట్రామయ్యగారు “
22 తుమ్మల వెంకట్రామయ్యగారు ”
23 వేమూరి వెంకటేశ్వరరావుగారు ”
24 వేమూరి పరాత్పరరావుగారు ”
25 గొర్రెపాటి బాపనయ్యగారు 20
26 తుమ్మల వెంకటకృష్ణయ్యగారు 15
27 తుమ్మల రాధాకృష్ణయ్యగారు ”
28 ఘంటసాల బాలకృష్ణయ్యగారు ”
29 వేమూరి శ్రీకృష్ణమూర్తిగారు ”
30 గొర్రెపాటి సుబ్రహ్మణ్యంగారు
సీతారామయ్యగారు ”
31 గొర్రెపాటి లక్ష్మీనారాయణగారు ”
32 గొర్రెపాటి నరసింహారావుగారు 10
33 గొర్రెపాటి పాపారావుగారు ”
34 బండి వెంకటరత్నంగారు ”
35 వడ్లమూడి రంగారావుగారు ”
36 ఘంటసాల వెంకటేశ్వరరావుగారు ”
37 వేమూరి గోపాలకృష్ణగారు ”

| | | |
|---|---|---|
| 38 | కొండపల్లి రంగారావుగారు | 10 |
| 39 | కొల్లూరి మధుసూదనరావుగారు | ,, |
| 40 | వేమూరి సుదర్శనరావుగారు | ,, |
| 41 | సంకా సాంబశివరావుగారు | ,, |
| 42 | చుండూరి వెంకటేశ్వర్లుగారు | ,, |
| 43 | గెల్లి పిచ్చయ్యగారు | ,, |

